ॐ

# స్త్రీల పాటలు.

## మూడవ భాగము.



ప్రకాశకు[illegible]

నందిరాజు చలపతిరావుగారు

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

వెల రు 1.



1922

# స్త్రీల పాటలు.

## మూడవ భాగము.

ప్రకాశకులు

నందిరాజు చలపతిరావుగారు

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

వెల రు 1.



1922

శ్రీరస్తు.

# స్త్రీలపాటలు—మూడవభాగము.

## విషయసూచిక.

### దైవప్రార్థనాదికములు.



### పెద్దపాటలు.

నోములకథలు-

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః

25 సంవత్సరముల క్రిందట స్త్రీలు పాడుకొనుట కను కూలములగు పాటలను ప్రచురింపవలయునని తలపెట్టి మేము సమకూర్చిన పాటలనేకములు 3 భాగములుగా ముద్రించినా రము. అప్పటినుండియు మఱికొన్ని ముఖ్యములైన పాటలు మా దగ్గిరకు వచ్చుచున్నవి. కాని యవి ఒక భాగముగా ముద్రించ దగినన్ని లేకుండుట చేత కొంతకాలమును, ప్రపంచమునల్లకల్లోల ములాపి, కాకితము ప్రియముచేసి, ఆంధ్ర వాఙ్మయ ప్రచారమున కంతరాయము గలుగించిన మహాయుద్ధమువలన కొంత కాల మును వానిని ప్రచురింపకుంటిమి. ఈలోగా కొందఱు గుజలీ ముద్రాపకులు మేము ప్రచురించిన భాగములలో కొన్ని కొన్ని భాగములను విడివిడిగా ముద్రించిరి. అందు ప్రాచీనములేవియో మేము స్వయముగ రచించిన వేవియో గుర్తెఱుంగక యన్నియు బ్రచురించినారు. గ్రంథకర్తయనుమతిలేనిదే యట్టివి చేయ రాదు. ఈ భాగములో కొన్నిపాటలు సంపూర్ణముగా, కొన్ని చాలవఱకు, కొన్ని విస్తార సంస్కారయుతముగా మేమే వ్రాసి ప్రచురించినవి యున్నవి. గుజలీ ముద్రాపకులు, కడవు కక్కూ ర్తికై పుస్తకవ్యాపారము చేయు సామాన్యజనులు, మమ్మనడిగి గాని యట్టి సాహసమునకు జొరకుందురుగాక! కావున మేము ప్రచురించిన మూడవ భాగమును, నాలుగవ భాగముగా ముద్రిం చినారము.

ఈభాగమున, స్త్రీలకు నిత్యకృత్యములగు పాటలను, వేంక టేశ్వర దీపారాధన పాటలను చేర్చినారము. ఇప్పుడు సనాతన

మాతమేమైన కొంచెమున్నదనిన, అది యింటనే, గృహలక్ష్ముల యొడనే యున్నది. వారేవాస్తవముగా భారతభూమి కర్మభూమి యను మాట నిప్పటికి సార్థకము చేయుచున్నవారు

భారతకులాంగనలారా! ఈవ్రతములను ఒక్కసారి ఉచ్చారణ సౌష్ఠవముగలవారిచేత చెప్పించుకొని, మీరే వ్రతాచరణము జేసికొనుడు. విఘ్నేశ్వరపూజ గూడ స్త్రీలపాటలు రెండవభాగమున జేర్చబడియున్నవి. ఈభాగమున విస్తారముగా స్త్రీలువట్టునోములు చేర్చడమైనది. ఇంకను స్త్రీలునోచుకొను చిట్టిచిట్టి నోములనేకములు, నాలుగవభాగమున ముద్రింపబడినవి.

ఈసారి స్త్రీలపాటలు చక్కగా ముద్రింపబడి, మనోహముగా బైండు చేయబడినవి. ఇవి ప్రతియింటను తాండవమాడుచు సనాతన ధర్మపునః ప్రతిష్ఠాపన కార్యమున కుపయోగించుగాక !

ఓం తత్ సత్.

ఏలూరు.
ది 1-3-1922

సజ్జన విధేయుడు,
నందిరాజు చలపతిరావు.

శ్రీరస్తు.

# స్త్రీలపాటలు-మూడవభాగము.

శ్రీ పరమాత్మనే నమః.

శ్రీ శుభమస్తు- అవిఘ్నమస్తు.

పరమహంసపూజిత విశిష్టగుణప్రతిబద్ధరాగయై।
యాపృథివీధరాత్మజ సురావళి మెచ్చ కళత్రవ్వరింపగా।
నేపుననామె కేళిలు గ్రహియించిన యిందుకళావతంసుడు
దీపిత పుష్కలార్థముల దేల్చుమిముంగలిదోషహారియై॥

ఉ॥ శ్రీమదుమామహేశ్వరులు-చిన్మయరూపులు సత్కటాక్షవీ
క్షామృతవృష్టిభక్త సుజ-నాళిపయింవెదజల్లుచుం గడుం।
బ్రేమమెలర్పనేలుమహి-భృత్కులదీపములైనవారు మ।
మ్మోమయుచుమంత్రముగాపుత స-ముచ్ఛ్రితకాంక్షిత కార్యసిద్ధులన్॥

## 1 కృష్ణస్తుతి, ఝంఝూటిరాగము-ఆదితాళము.

శ్రీలామణిజన-పాలాభవభయ, వేలానతసుర-పాలాసుశీలా॥
రామాకలుష విరామాజగదభి। రామాఘనసుఖ ధామాసుధామా॥ శ్రీలా॥
ధీరామహిమ గభీరామహితవి। చారాసదవన సారావతారా॥ శ్రీలా॥
గోపాలకకుల దీపాయితఖల। పాపాసురహర చాపాధిరోపా॥ శ్రీలా॥
శృంగారసురుచిరాంగాపరసభు। జంగాధిపపద పాంగానుషంగా॥ శ్రీలా॥

## 2 ఆపద్బాంధవునిమీద కాంభోజి-త్రిపుట.

ఎంతవేడినమాపై నేలరాదయరాదు ఏమినేరముచెపుమా॥
సంతసమునమాస్వామియనుచునిన్ను శరణుజొచ్చినవెనుకశ్రమపెట్టదగునో॥ ఎం॥
చింతలువదలి మాచిత్తములనునీదు చెంతఁజేర్చితిమిరా।
పంతముమాను మోబ్రహ్మమునివినుఁదక్కనంతరంగమువ్యాదుఁడన్యుడెవ్వడు॥
ఆపద్బాంధవుఁడవునమ్మి నాదరింపుమటన్న గోపముసేయకురా।
పాపిపునీవేయన్ప్రార్థించుచుండఁగమాపయినీకిటువుఱపాఱునివిమేరా॥ ఎం॥
దోసకారులిట్లు ఘోషింపుచుండ విశ్వాసముసుంచవేరా।
దోసములనుబాపు దొరనీవైయుండఁగ వాసిగవానినివారింపనేరవే॥ ఎంత॥

నీవేదిక్కని మేము శరణమ్మియుండఁగఁ గావఁదలంపవేరా।
కావనిదొసల నో కారుణ్యమయమమ్మ నేనాఁడు చేకొని యెలమిఁ బ్రోవఁగ
వేర్పు॥ ఎంత॥

### 3 కమాజురాగము-ఆదితాళము.

ప॥ వేగరారాయిందు భోగిభోగశయన॥
అ॥ జాగుజేసెవదేరజలనిధిగంభీరధీర వేగ॥
చ॥ పంకజచరణ నేనింక నోర్వగజాల।
శంక సేయక నావంక కిటు రారశౌరి॥ వేగ॥
శ్యామసుందరాకారస్వామిపరాకేల।
నీమముతోడుత నేనిన్నె నమ్మియున్నవాఁడ॥ వేగ॥
దంతిభూధరవాసయెంతో నమ్మియున్నానా।
చింతదీర్పరాదా సాంతారంగశుభాంగ॥ వేగ॥

### 4 కమాజురాగము-ఆటతాళము.

ప॥ నను బ్రోవర శ్రీమన్నారాయణ వేగ॥
అ॥ నిను శరణమ్మితి నీలవర్ణ వేగ॥నను॥
చ॥ అనుదినమును నాకనులపండుగుగాను!
కనఁగొను టెన్నఁడో గరుడగమన వేగ॥నను॥
మునిజనవరసాహృదయకమలమందు।
సదయుఁడవని నిన్నె చాలనమ్మితి వేగ॥నను॥
కాంచినగరమందు గరుణతో నెలకొన్న।
చంచల నిభచేల జాగుమేల వేగ॥నను॥

### 5 కమాజురాగము-ఆదితాళము.

ప॥ గతినీవనినమ్మితిసీతాపతి।
అ॥ పతితపావననామభక్తకుముదసోమ॥ గతి॥
చ॥ కపటచిత్తునికాకాసురునిగాచినట్టి।
కృపగలదొరవనికోరివేడితినా॥ గతి॥
పగవానితమ్మునిబట్టముగట్టిన।
అగణితకల్యాణసుగుణసాగరనా॥ గతి॥
సారంగశైలనివాసశ్రీశయుత।
కూరిమితో నిన్నె కొలిచియున్నానా॥ గతి॥

## 6 శ్రీరాగము-ఆదితాళము.

ప॥ రఘువీరా రావదేరా।
అ॥ అఘమారా యనుపమశూరా॥రఘు॥
చ॥ చిన్నియన్నా చేరరావా।
నాకన్నులకరువెల్ల దీరరయా॥రఘు॥
నీరదశరీరనిన్నే।
కోరియున్నా గురిగమున్నేరయా॥రఘు॥
కుంజరాభూధరవిహారా।
పదకంజములెనమ్మినా రారయా॥రఘు॥

## త్యాగయ్యగారి కృతులు.

## 7 భైరవిరాగము-రూపకతాళము.

ప॥ ఉపచారిముజేసేవా రున్నారని మరువకురా॥
అ॥ కృపగావలెనని నే కీర్తని బలుకుచునుండగ॥
వాకిట నేపదిలము గావా। తాత్మజుడున్నాడని
శ్రీకరులగు నీతమ్ములు। జేరియున్నారని
యేకాంతమున సుజానకి। యేపడియున్నదని
శ్రీకాంతపరులెవ్వరు। శ్రీత్యాగరాజవినుత॥ ఉ॥

## 8 బిలహరిరాగము-అటతాళము.

ప॥ దొరకునా యిటువంటిసేవ॥
అ॥ దొరకునాయల్పతపమొనరించిన భూదేవతలకునైన సురులకైన॥
తుంబురునారదులు సుగుణ సంకీర్తనముల నాలాపముజేయగా।
అంబరీషముఖ్యులు నామము జేయుచు జాడాలు పైజల్లగా।
బింబాధరలగు సురవరవిరిబోణులు నాట్యములాడగ।
అంబుజభవపాకారులు లిరుగడల నన్వయబిరుదావళిని పొగడ।
అంబరవాసచేలులు కరకంకణంబులు ఘల్లనివిసరగ।
మణిహారంబులుగదలగ యూచెఘణితల్పంబున నెలకొన్నవారిని కనుగొన॥
మరకతమణిసన్నిభదేహంబున మెరుగుకనకచేలము శోభిల్లగ।
చరణయుగ నఖావళి కాంతులు చెందుకపిల్లల నేజేరా।
వరనూపురములో వెలుగగ గనిరాజవజ్రపుభూషణము మెరయా।
యురమున ముత్యాహారములు మెరయ నుచితమైన మకరకుండలమ్ములు।

చిరునవ్వులుగలవదనంబులుముంగురులందపుకపోలముముద్దులగురియగా
దివ్యఫాలమ్మున తిలకము మెరసే దివిలావణ్యనిధికనగొన॥ దొ॥
తామసగుణరహితమునులకుపొగడ తరముగాకనిత్యమరచి।
శ్రీమత్కాంచనకోట్లపైని చెలఁగొందగొలువుండగ।
కామితఫలదాయకి యాసీతాకాంతునికని యుప్పొంగగా।
రామబ్రహ్మతనయుడౌ త్యాగ రాజనుతునితో పాడుచుమాచగా।
రామునిజగదోద్ధాముని సురరిపుభీముని చిన్మయారూపుని।
పూర్ణకాముని త్రిగుణాతీతుని సద్గుణధాముని కనులారమదిగొన॥ దొ॥

## 9 నాగవరాళిరాగము- ఆదితాళము.

ప॥ నగుమోముగనలేని నాజాడదెలిసి రఘువరనబ్రోవరాదానీ॥
అ॥ నగరాజధరనీదుపరివారలెల్ల వగబోధనచేసేవారలుగారె।
అటులుండదురా న॥
ఖగరాజనీయానతి వినివేగచనలేదో।
ఖగనానిలకుబహుదూరంబనినాదో।
జగమేలేపరమాత్మ యెవరితో మొరలిడుదు।
వగచూపకుతాళను నన్నేలుకోరా త్యాగరాజనుతనీ॥ న॥

## 10 తోడిరాగము-రూపకతాళము.

ప॥ వినువినాసుఖముగాన నీరజనయనా॥
అ॥ మనసుకెంతో ఆనందమై పులకరించగ॥
రూపముప్రతాపము సరససల్లాపముగల॥ ని॥
కరుణారసపరిపూర్ణ వరదమృదువాక్కుగల॥ ని॥
రాగరసికరాగరహిత త్యాగరాజభాగధేయ॥ ని॥

## 11 సురటరాగము- రూపకతాళము.

ప॥ భజనపరులకేలగలుగు దండపాణిభయము రామ॥
అ॥ అజరుద్రసురేశులకై యాస్థానమొసగు రామ॥
అండకోట్లునిండిల కోదండపాణ్ణిముఖమున।
హృత్పుండరీకమునుజూపి పూజసల్పుచు।
నిందుప్రేమతో కరంగు నిష్కారణములకువరదా।
దండపాణిదాసుడైన త్యాగరాజసేయరామ॥ భ॥

# రాఘవకల్యాణము.

హరువిల్లువిరవను । ఆరామచంద్రులువచ్చినారు
సీతామహాదేవితో శ్రీరాములచెలువమ్ము । చెలియలందరుజెప్పర
మన్మథునికన్నమరి హరిహరాదులకన్న ।
అతడుచంద్రునికన్నఅతిరూపుకలవాడడే ।
రమణీయలావణ్యము । శౌర్యపరాక్రమంబులతోడను
శ్రీరామచంద్రులుక్షీరాబ్ధిశయనులై । భువినిజన్మించినారు
ఆదిలక్ష్మివోలెటి । సీతనీవర్ధాంగివౌదువమ్మ
అతడునీవిభుడుగా నడుగుకొనుదైవాల । అతిహర్షణములచేత
ఆపల్కులనువినుచుఅతివఆనందమున । హర్షించుచూడాచెను
అందుచూ చొందుచూ విరహాగ్నినొందుచూ । నప్పటప్పటినుద్దులు
వినుకొనుచునన్నుకొనుచువిరహాగ్నియొక్కడై । తనుతానుమరచిపోయి
మేడదిగియటుయిటుమేకొనిజూచుచు ।
పొలుపుగాశ్రీరామునులపాడయైనగానకుండ ।
శృంగారవనమునకు చెలులతోగూడుకొని । తరుణులుతానేగెను
చిలుకలుపలుకగా కోయిలలుకుయ్యగా । హంసలందందాడగా
ఆచెలియయందుండి వినజాలకా । వినియూ మనజాలకా
ఇంతిబయలుచూచియేమేమికోరాయనుచు । భ్రమతోడమరుగునుండె
చిలుకలు హంసలు పలుమారుజలక్రీడ । లాడుచున్నవిచూడుమా
చిలుకలకాహారమిడకుండనుండిన । పలుకనేరకయుండును.
కోయిలస్వరములుకుదియించిపట్టితే । నాదమ్ము లేకయుండు
అనిచెలుపల్కగానట్టిట్టెతలయూచి । ఇట్లుచేయగగూడునా
చెలుకువింటివాడుచేవగలవాడని । చెప్ప గావింటివినుము
సన్నజాజులశయ్యసైయుంచు పవళించి । తలకొనుచుతల్లడించి
పవళించితనలోన బాధలుపడుచును । తారుమారుగపలుకును
ఇంతికిఅణిముత్యపుపేరులా । ఇంతికిసన్నంపుపేరులారు
పొనుపువిరులెల్లమిసమిసలుతగ్గిండె । కాకుండెనీమేనను
యిసుకతిన్నెలమీదను యింతితా । పలుమారుపవళింపుచు
వైలుచూచిబ్రమసిపరగంగ తనలోన । తామరలగానుదోడగా
ఇంతయుగ్రముతోడను యీసూర్య । రశ్మిల్లకాయగాను

ఇందేలపూఁబోన్పు యీగతిగానమర్చిరీ । చెలులారయింతమత్సరమేటికే
రవిరశ్మికాదోయమ్మా । రమణీయమగు వెన్నెలా
నీఁడుపున్న మాచందురుఁడు । పండు వెన్నెలగాసెను
నన్నింతవేచేటియామన్మథునిబట్టి । సంకెళ్ళవేయింతమా
యీచందురునీబట్టియిఁపొందరోహిణికి । పట్టిబలవంతాను పట్టప్పగించండి
అనగానెచెలులంతశైత్యోపచారానకు ।
పన్నీరుచల్లిరిబాలకనితెచ్చిరి అమృతంపుఫలములను ॥
కరములడ్డములొగ్గుచు మేలైనవస్తువులు । కన్నెత్తిచూడకుండ
శ్రీరామసుద్దులు యేమనివింటిమో । ఆరాముజాడమ్మా
తెండుచుక్కల్లార నీరేజనాభుని । గొండినాకిపుడు వేగ
మింటనేమీరుఅంటివుండగైతి । అందందనానాథుని
వెదకితీసికురండి వేడుకలూజేతు । వెళ్ళిపొండిపుడువేగ
పక్షిజాతుల్లారమీరు నాపరమాత్ము గనిపించిరా ।
మీవంటిరెక్కలూ నాకేలలేవయో । ఎగిరిపోయిచూతును
నీలమేఘము చెప్పవే నీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ గొనుమంచునూ
తుమ్మెదారో చెప్పవేనీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ । గొనుమంచును
ఆదిదేవుడ చెప్పవేనీవేగి । కలియుగశ్రీరాముని
మారువిల్లువిరిచినన్ । వరియించిపెళ్ళాడగా
ఆకాశఅంతరిక్ష భూకాంతరములతో గూడుచు
మీశక్తులన్నియిచ్చి మేలుగాశ్రీరామమూర్తినేలి
ఆరాముతో చెప్పడీ మారువిల్లు । విలయముగవిరచును
నన్నువరియించివేగ పెండ్లాడి । నాయార్తిదీర్చమనుచు
అష్టదిగ్గజములారా మీరతివి । కాధారమైయుండుడీ
కలికిచిలుకా చెప్పవే । కాకుత్స్థవిభునితోడ
మారునివిల్లువిరిచి ఆరామచంద్రులు । తన్నుపెళ్ళాడగాను
రతికాంతరో చెప్పవే మా । రజీవవిభునితోను
మారువిల్లువిరచి ఆరామచంద్రులు । నన్నుపెళ్ళాడగాను
అనిసీతతల్లపోయగా నంతట । నరుణోదయంబాయెను.
అకుక్కుటములుగూసె అకమలములువిరిసె అర్కుండుదయించెను।
స్వయంవరములు చాటి పరగున శుభరేఖలంపించగా।

ఇనతేజులౌబాలు లిద్దరువచ్చిరీ సూర్యవంశపురాజులు।
కోటియసురులగెలిచియు కౌశికునియాగంబు నటులగాచీ।
అహల్యశాపంబాపిహరువిల్లు । జూడంగ వచ్చినారు
ఉదయకాలముకోలనిలో । సంధ్యనీమములు దీర్చుకొని
అర్కుడుదయమ్ము అయనోలేదని । ఆశ్చర్యపడుచుండిరి।
ఆబాలురాజాచినా । అప్పటిబట్టితినకూ
అందంది చెక్కిలినొక్కుదునో । యనుచు ఆనందమగుచున్నదీ
ఆకౌశికుంతోడనూ । ఆరామలక్ష్మణులు
తమయిష్టనీమములు తీర్చుకొని । యాకొలువుకూటానికేవచ్చిరీ
ఆరామలక్ష్మణులకు । ఆజనకుడెదురునడచీ
శీఘ్రముగ శ్రీపాదపద్మములు । కడిగితాసింహాసనాలిచ్చెను
కౌసల్యసుతులకపుడు జనకుండు । గంధమక్షంతలిచ్చి
కట్టవగా కానిచ్చెబ । హుమానములు జేసెను
సంతోషమునజనకుడు రాముంతో । భాషింపుచూనుండగా
జగతిరాజులెల్ల చెక్కుటాచెయిబూని చింతించియిట్లనిరీ
మేటిరాజులకెల్లనే యుచ్చైస్థ్సవేరు పడజూపకా
చిరుతబాలురకిట్లు సింహాసనాలియ్య । సిరియెంతదొడ్డదనిరీ
ఆకౌశసంపన్నుడే । ఆజానబాహుడీతడు
ధిక్కరించున్నాడు రాజులందరిని । చుక్కలచంద్రుడేమో
ఆతనియాకారానికి రాజులు । అరికాలునేబోలరు
అనిరాజులందరను తమతమమదిలోను । తలపోసియిట్లనిరీ
ఇతనిరూపముగని జనకుడు । ఇయ్యవచ్చునుకన్యను
అనిరాజులందరు తమతమమనములోన । తలబోయుచుండిరీ
కార్యమ్ముచేతనయితే । ఖండించఫత్రుధనసు
కార్యముగాకున్న కడువేగపోవలెను । గాండీవమెడనెను
పరమాత్మపలుకులకును జనకుండు । పరమానందముననను
తనయిష్టదైవములనుతలచుకొని । యావిల్లుతలిగించుకొనివచ్చెను
వెయ్యిన్ని యేనూరుజనమెత్తి । తెచ్చినారపుడువారు
శ్రీరామదేవరా ముందరయుంచితే । చిరినవ్వుతోబలికిరి
చివుకవిల్లాఇదీ మీరుయేమూనిపోగడెదరు
పిడికిటఅందుకుని విల్లువిరవంగ । యివియెంతహద్దునాకు
జాచిరాలక్ష్మన్నా । నుదతిజానకీదేవినీ

రూపలావణ్యములు సరిగానుయుప్రమను । శీఘ్రివజూచిరమ్మా
దేశేరియుప్పకున్న సౌమిత్రిదినమెల్ల । వ్యర్థముగను
అలిరియుప్పాకున్న జన్మమెల్ల । వృధాజూచిరాలక్ష్మణా
జూచిరమ్మాలక్ష్మణా । అనువతిజానకీదేవినిపుడు
భూమిలోబుట్టినా భూకాంతచూచి । పరుగునరమ్మాసెను
నడుమునన్నముజూడుమీ ఆయింతి । చిన పాదముజూడుమీ
చిన్నపాదముజూడుమీ అయింతి । కన్నులంజూడుమయ్యా
జూచిరమ్మాలక్ష్మణా ఆసుందరిరూపమంత చక్కగా
కడువేగిరముయేగి । కదలిరమ్మనిబలికెను
అనితన్నుబంపినా ప్రాపాదమని మొక్కుచు।
జనకూనిమందిరంబులకేగి । సౌమిత్రి జనులందరుమెచ్చగా
రామునితలపురియేగి । జనకుడుబ్రితివాలజా బెట్టంపెను
వాకిలిద్వారపాలకులతో నాతండు । రాణివాసముజొచ్చెను
శృంగారవతికన్యకూ । చెలియలుశృంగార మమర జేసి
బంగారుసింహాసనమ్మీద । సీతాంగననునిచిరి
సౌమిత్రిరాక లెరిగి । ఆచెలియలాసీతకిట్లనిచెప్పిరి
నిండుపున్నమచంద్రుని । పోలేటిరాముతమ్ముడు నినుజూడవచ్చినారు
ఆసీతవినిపొంగుచునవ్వుచు । నవరత్న సింహాసమున
ఒప్పుచునుండగాను । లక్ష్మణు లక్షణమ్ములుజూచెను
సోమకళబోలేటిసీత । పాదపద్మములుజూచీ
తగుననుచుసంతోషచిత్తాన పొంగుచు । చదురులోకతెంచెను
చూచివస్తినిదేవరా । మీనువతి జానకిదేవినిపుడు
హరిహరాదులుపొగడ । మాకలవిగాదయ్యా అబ్రిహ్మకయినగాని
జూచివస్తివలక్ష్మణా । మనసువతి జానకిదేవినిపుడు
అనుమానంలేకవిరవనా యీవిల్లు । అదినాకు నిజముచెప్పు
అన్నరాఘవజూస్తిని । మీచేతిజానకిదేవినిపుడు
హరిహరాదులుపొగడ । మాకలవిగాదయ్యా అబ్రిహ్మకయినగాని
అనితమ్ముడుపలుకగా । రాములు కనుసంజ్ఞ జేసి యపుడు
అంగుష్టమునలీలనందుకుని । యావిల్లువిట్టించె శ్రీరాములు
పెళ్ళుపెళ్ళుమనగను । యీమూడులోకాలవారలెల్ల
చూడచిత్రముగాను । శ్రీరామునివిరచిరి
దుందుభులుమ్రోయుగా । సురులందరు పొగడగను

# స్త్రీలపాటలు-మూడవభాగము.

నానావిధమ్ముల పుష్పాలవానలు । రాముపయికురిపించిరి
యిన్నివిధములను రాముణ్ని । జనకుడు కొనియాడగా
కమలనేత్రియనియేటి । సీతాంగనను దెచ్చి శ్రీరాములకునిచ్చెను
ఎల్లుండిలగ్నమనుచు । శ్రీరామచంద్రుల పెండ్లియనుచు
కడమవారిపెండ్లిండ్లు యిక్కడనె కాగలవు । కాంతలతో రమ్మనెను
శ్రీరామచంద్రులకు । మాసీతాంగనను యిస్తును
అతనితమ్ముడులక్ష్మణా । దేవరకు ఊర్మిళను నేనిస్తును
భరతశత్రుఘ్నులకును । భరతునికి మాళవి నేనిస్తును
కడపారపుకాంత శ్రుతకీర్తిని దెచ్చి । శత్రుఘ్నునికి యిస్తును
ఒక్కలగ్నమందున । మీసుతులు నలుగురికి కళ్యాణము
కాంతలానలుగురిని కన్యధారాబోతు । గయికొనిరక్షించుమి
అప్పుడుశుభలేఖలు । అయోధ్యపురికంపగా
తనలేఖచదువుకుని తనయులపరాక్రమువిని । తలయూచిహర్షించెను
దశరధులువచ్చి యపుడు । దేవులతో యిట్లనియెను
సుతులకల్యాణమ్మని సతులనుదోడ్కొని । జనకపట్టమువచ్చెను
దేవతలువచ్చినారు । దేవదేవుని పెండ్లికనుచు
మహామునీశ్వరులంత పొగడుతువచ్చిరి । మహాత్ముని పెండ్లికనుచు
గౌరిపార్వతివచ్చెను । కలకంఠునితో కలసి
లోకలక్ష్మివచ్చె శ్రీరాముపెండ్లికని । లోకమంతా వెలుగగా
అరుంధతీదేవివచ్చె అనసూయ । అహల్యదేవివచ్చె
దేవతాస్త్రీలంత చెలువమ్ముచేయుచు । దేవుణ్ణిచూడగవచ్చి
సాటికితడొకడేయని చిత్తమున । చాలంగనుప్పొంగుచు
విల్లువిరచినరాముడు ఇహపరాకర్త్రిముజూడ । జనులెల్ల మెచ్చగాను
సంపెంగతయిలమునను తరుణులు । సంపతుల శిరసంటిరి
గంధమ్ములుదెచ్చిరి కాంతలందరును । పన్నీటజలకమార్చి
నాతికురులుచిక్కుదీసి ఒకచెలియు । నేర్పుతో జడలల్లెను
పట్టుచీరలుదెచ్చియూ ఒకచెలియు । పణతులకుగట్టించెను
ఆభరణములుసొమ్ములు అతివలకు । అందముగ అలంకరించిరి
అతివలనుదోడుకొని ఆకాంతలందరు । అతివేగమునవచ్చిరి
మేటిపుటికలనుంచియూ నల్గురను । జలదారలనునుంచిరి
ఆరామచంద్రులకాళ్లుకడిగి తానూ । కన్యధారయుబోసెను
కాంతలనలుగూరినీ జనకుడు । ధారబోసీ యిచ్చెను

తెరచీరడీసితే శ్రీరాముల జూచి । దేవితానుప్పొంగెను
మంగళసూత్రమ్ములు దెచ్చి । రామచంద్రులు వేడుకతో
నవ్వుచు శ్రీరామచంద్రులు । సీతమెడను గట్టెను
ఆణిముత్యపు బ్రాలను । ఆ రామచంద్రులు వేడుకతో
నవ్వుచు శ్రీరామచంద్రులు । తాను సీతశిరమున బోసెను
చిటికెన్న బట్టుకని సీతతో । శ్రీరాములు
వైవాహికపువేదికకు చనదెంచి । దేవితో గూర్చుండెను
సప్తపాదమ్ములప్పుడు తొక్కించి । అరుంధతిని జూపించిరీ
మూడోరోజున పాకెన్న జేసి । నాగవల్లీ దీర్చిరి
బంగారు పళ్లెరములో తమరపుడు । పాలు నెయ్యి బోసియు
సీతహస్తముంచీ జనకుడు । శ్రీరాముకప్పగించె
బాలహస్తమ్ముముంచీ జనకుడు । పణతులకునొప్పగించి
రాజుకప్పగించె జనకుడు । రమణులను తానప్పుడు
దశరథులు పొంగుచును జనకునితో । సంతోషమున బల్కెను
కల్యాణమున నేడు కాంతను యిప్పుడు । ఘనముగా మాకిస్తిరి
సంతోషింపబాయెను మేమిప్పుడు । పురికి వేగా బోవలె
కాంతను నలుగురిని పంపుడీ । మీరిపుడు అయోధ్యపోవలెను
అని రాజు యడుగగాను జనకుడు । కన్నీరు దెచ్చుకొనుచు
తన సతితోను తరుణులను పంపుదునని । వేడుకతో జెప్పెను
కౌగిటజేర్చుకొని తనతల్లి కన్నీరు దెచ్చుకొనుచు
కాంతలా నలుగురికి వడిబియ్యము బెట్టి । కౌసల్యకొప్పగించె
భేరిరవములు మ్రోయగా దశరథులు । చేడెలను దోడుకొనుచు
కాంతలతో పుత్రులతో । అయోధ్యకు వచ్చెను
పరశురాముని శాపముగచుకొని । పట్నానికేతెంచెను
యింతిని తొడలపయి నుంచుకొని । కురులు సన్నగా దువ్వుతు
అలకబంతులు జుట్టియు కస్తూరి । తిలకమప్పుడు దిద్దెను
నాతికి నయనముల కన్నంపు । కాటుక తేదీర్చెను
దేవికి శృంగారము తాను । నేర్పుతో జేయుచు
అంతట శ్రీరాములు తనసతితో గూడి । సంతోషమున నుండెను
అంతట ఒక్కనాడు । ఆ రామచంద్రులు వేడుకతో
నవ్వుచు శ్రీరామచంద్రులు అద్దమ్ము । నాతి చూడుమనెను
ఆ చీయద్దములోపల ఆ దేవిత । తనరూపు తెలియలేక

యెంతమాయలుగలవు శ్రీరామచంద్రుడాలు । పరసతినితేరగు నా
చేసుగాకుండగాను పరసతిని । యిందులోనిలిపినావా
యేకపత్నీవ్రతుడవని మాకండ్రియిచ్చెను । మామలారాయెరుగడాయె
యెంతమాయలుగలవయ్యా ఓరామచంద్రుడ మీకిప్పుడు
చాలుచాలురారామ మీతో చిన్నెహంబు । సరసంబువిరసమాయె
అనిసీతపలుకగాను శ్రీరామచంద్రులు । నవ్వుకొనుమా
ఓ సీతముద్దరాలనిపొగడ నదనలోను । నవ్వుచు యిట్లాగెను
పతిలేనిసతినిజూచి ఓసీ వాడలోను । కోపిస్తివి
పతిజూపితేఅలక బాయునే నీవిపుడు । పద్మాక్షిరొచెప్పవే
నిలువుటద్దముదెచ్చియు రామచంద్రులు । సీతచిటికెనపైని
అతివమనమిష్టమున్న ఈ రామునిజూడగాను ।
పతిలేనిసతిజూపించగనే జానకినవ్వెను
సీతచిటికెనబట్టియు శ్రీరామచంద్రులు । చూడగాను
యిద్దరిరూపులు యిందు అందము । ముకురరీతిగనుండెను
వారియొవ్వరు రఘువరా । వివరముగదెలుపుమనెను
అనిసీతయడుగగా చిరునవ్వునవ్వుచు । శ్రీరాములిట్లనిరీ
శ్రీరాముడు సీతా నీవు నాలోను । యెరుగవటవే
సీతముద్దాయాని వదిలోన తెలుసుకుని । నవ్వుచుతానిలచెను
పతిమాటలకు సతియును సిగ్గుపడె । శిరసువంచుకునిలచెను
సిగ్గుబడినిలచున్న సతినిగాంచియు । శ్రీరాములుబలికిరీ
నీకునాకుభేదమా ఓసీత । యింక నీకుతగదు
నన్నుగూడినీవు సంతోషమున । రాజ్యమేలుమీ యీపట్టమున
రాఘువులకళ్యాణము యెవరయిన । పాడినా విన్నగాని
అష్టయిశ్వర్యములిచ్చి సంపదలిచ్చు । ఈరాజ్యపదవిచ్చును
కన్యలెవ్వరుపాడినా వరక । కల్యాణమానను చును
శ్రీరాములాసీత పరగనైనతినము । తానిచ్చిరక్షించును॥

# ధ ర్మ రా జు జూ ద ము.

శ్రీమంతులైయుండ్రి శూరులైయుండ్రి ।
సామంతులైయుండ్రి సరసులైయుండ్రి ।
సత్యమ్ముదప్పరే ధర్మనందనులు । పుత్రులు పౌత్రులు భ్రాతలు ప్రజలు
కోటి వేలయేండ్లు రాజ్యములు సేయ । అంతట నరసింహదేవు ప్రార్థించ
మేడలు మహాలు లేమంచి సావిళ్ళు । మాణిక్యమయమైన సింహాసనమున
ఆచోట నిలిచిరే ధర్మనందనులు । తల్లికి కడసారి గారాబు పట్టి
చావుపుట్టుక దెలియు సహదేవుడుండే । పాడివస్త్రముగట్టడేతడివస్త్రమెగాని
అంతట తన అన్న డాయంగవచ్చి । విన్నపము ధర్మజులు వినియాదరించు
వింబిలీ కార్యములు చేయబోకయ్యా । అపకుమి జూదములు వోడబోకయ్యా
ఓ యన్న యెటులయిన నామాట వినుము । పతులు చూడగ మనసతి చెరనుబడగ
ఈడ్చుకు బోగురు సుమ్మి ఎల్లరాజులలో । అనియిట్లు సహదేవుడాడంగ వినుచు
చిరునవ్వు నవ్వెరే తా ధర్మజులు । చిన్నవాడవు నీవు యేమెరుగుదువు
పాటివారు బిలచితే వెళ్ళంగ మాన । హస్తినాపురములో అంగళ్ళలోను
ప్రిథమమేనడచినవి బళ్ళారిబళ్ళు । కొమ్ములగట్టినవి కోటి ఏనుగులు
అవియన్ని నడచెనే హస్తినాపురము । కుంచెలు గట్టినవి గుర్రాలు అన్నీ
అవియన్ని నడచెనే హస్తినాపురము । తలలంటి వుంచేటి తరుణులందరును
వారెల్ల నడిచిరే హస్తినాపురము । నీళ్ళోసి పెంచేటి చెలతలందరును
వారెల్ల నడచిరే హస్తినాపురము । ఉ సిపెంచేటి యువిదలందరును
వారెల్ల నడచిరే హస్తినాపురము । పాలిచ్చి పెంచిన పణతులందరును
యేవురు గురపరసగు రాణులకెక్కి । యేవురు వేసేటి హారములు వేసి
యేవురు బట్టేటి గొడుగులు బట్టి । యేవురు బట్టేటి ఆయుధములు బట్టి
ధర్మరాజేతెంచె హస్తినాపురము । అల్లంత ధర్మజుల రాకలు జూచి
యెదురులేచి వెళ్ళె ఆ రాజయ్యపుడు । సింహాసనము వేసి కూర్చుండబెట్టి
లోహాసనం మీద కాళ్ళుంగడిగించి । పచ్చివిపోకలు పండుటాకులును
భమిడిపళ్ళేరాల తాంబూలమిచ్చె । ఆ హస్తినాపురములో అంగళ్ళలోను
పలకయూ సారయూ పెలయూ దెప్పించి । ఈవల వేయించె సింహాసనమ్ము
సింహాసనం మీద ధర్మరాజుండే । లోహాసనం మీద రాజు కూర్చుండి
వరసల్లాప జూదమ్ము వరుసనాడి । క్రమ్మర పాచికలు కడు చేతనంది
మరుసల జూదమ్ము వరుసతో వాడ । ధర్మరాజుకు బెక్కు నకమ్ము సేదు

రాజాచేతజిక్కబలపమ్మునేడు । అస్తినాపురములో అంగళ్ళలోను
తనచేతిపాచికలుతనుచేతికిచ్చె । తావెళ్ళిపెద్దమ్మనగరికేతెంచె
అతివనప్పుడుగాంచిఅతిభక్తితోను , సాష్టాంగదండనమస్కారములుజేసి
చేతులుమోడుచుకొని చేసెవిన్నపము । ధర్మరాజాతోనుజూదమ్ములాడి
ఆడితినినేనుకలలెల్లరోడి। వస్తినేనేడునిమశరణమ్ముజేడ
అనియిట్లురారాజుఆడంగవినుచు । చిరునవ్వుతోలికజ్యేష్ఠమహాదేవి
ధర్మరాజాతోనుజూదమ్ములాడ । వద్దనుచునీకొకరైనచెప్పనేలేదా
అప్పుడేజెప్పరాయెల్లవారల్ల। ధర్మజాడుదేవుండు ధర్మజానుతండ్రి
అటుగాకధర్మజాలు శరధిగాదనుచు । అయినానుతననేర్పుచేసెదననుచు
క్షీరాబ్ధికడకేగ చెల్లలనువేడా । అల్లంతటనుఅక్క రాకల్లుజూచి
గుండెఝల్లుమనియె మహాలక్ష్మికపుడు । యెవ్వరినిచెరచగావచ్చెనోయక్క
పొట్టకుదాలవె పెట్టెడుబెల్లు । అరచేతికలహంబు వెంటకొనివచ్చె
యెవ్వరినిపొందనువచ్చెనోయక్క । అల్లంతతనుఅక్క రాకలుజూచీ
ఎదురలేచీవెళ్ళీ మహాలక్ష్మియపుడు । వలగొనిముమ్మారుప్రదక్షిణముజేసి
సాష్టాంగ దండనమస్కారములుజేసీ । చేతులుమడుచుకొని చేసెవిన్నపమూ
యేమివోయక్క నీవొచ్చినపనులు । అనతిమ్మనుచుపలికెమహాలక్ష్మి
యనియిట్లుమహాలక్ష్మి యడుగగానపుడు । యిట్లనిబలికెనేజ్యేష్ఠమహాదేవీ
రారాజాధర్మజాలుజూదమ్మునాడ । ఓడెనురారాజావరుసతోడతను
తనరాజ్యములునోడి తనకడకువచ్చె । శరణుజొచ్చినవాని చెడగొట్టుటకును
మనసువొప్పదునాకు మహాలక్ష్మివినుమీ । అబ్రహ్మవిప్రులు చేసేటివేడ్క
రాజసూయయాగమ్ము చేసినవాడు । వీధివీధులుగట్టి విస్తర్లువెయ్య
ఆయజ్ఞశాలలోపలికిబోతి । కూతుర్లుతానును కుడబోవవంగా
ఆకులువేసుకుని మేముకూర్చుండ । కూతుర్ళతోజూచి కోపించెభీముండు
ఆడదానవునీవుయిదినీతిగాదు । మగవారిలోకుడువ పాటిలేదనుచు
ఆకులుదీయించిపారవేయించె । అభిముకిస్తినేశాపమ్మునేను
చాటలోపలవడ్లు చెరపిన్నవాడు । నాడునినుగొలుతునని పలికితీ నేను
కుంచమ్ముఓరగాపెట్టిన్నవాడు । నాడునినుగొలుతునని పలికితిననెను
అరికాలునవుగింజతిడవన్నివాడు । నాడునినుగొలుతునని పలికితిననెన
నాటికార్యమునేడు సమకూడెననుచు । నిన్నువేడగవస్తి చెల్లెలాకావు
సౌభాగ్యదీర్ఘవే నలినాయతాక్షి । యేమెమహాలక్ష్మి యేమెనాచెలియ
నీవేగిధర్మనందనులనేపాసి । రారాజానుపొందవె రమణిరోనీవు
అనియిట్ల తమఅక్క అడుగగానప్రుడు । ఇట్లనిపలికెనే మహాలక్ష్మితాను

అలికివిడచిననగడపదాటడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేను
దివ్వెలేనిగృహము చూడడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
వాల్చినరోకలి దాటడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
యింటముగ్గులేక నడువడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
నీరాడులేనింట నిలువడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
పురాడులేనింట కుడువడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
అపమిగిలినజలకము లాడడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
కట్టివిడచినవస్త్రములు కట్టడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
పానమీదచంపనంబలడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
సభలోనుపక్షమ్ము పలుకడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
పాళ్ళల్లోభేదమ్ము పంచడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
జట్టీపెండ్లిండ్లు చెయ్యడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
మునిమాపుముందారు దువ్వడే రాజా । నేధర్మనందనుని యెడబాయిలేన
ముత్తయిదుని ముండని తిట్టడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
వడిలోనపుష్పములు కొయ్యడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
ముడివడ్లుముని పళ్ళు కొరుకడే రాజా । నేధర్మనందనుని యెడబాయలేన
అలికివిడిచినగడపదాటినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
దివ్వెలేనిగృహము చూచినావాడు । ఆపాపకర్ముని నేబొందలేన
దూలములేనింట మూరినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
నట్టింటచిట్టూరుమట్టినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
అపమిగిలినజలకములాడినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
కట్టివిడచినవస్త్రముకట్టినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
పానమీదచంపనంబడినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
నీరాడులేనింట నిలచినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
పురాడులేనింట నిలచినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
సభలోనుపక్షమ్ముపలికినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
పాళ్ళల్లోభేదంబుపంచినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
మునివడ్లు మునిపళ్ళుకొరికినవాడు । ఆపాపకర్ముని నేబొందలేన
అనియిటులన్నమాలక్ష్మిపలుకగానపుడు। అగ్రహము చేసె నేజ్యేష్ఠమహాదేవి
లక్ష్మివచ్చిరారాజు పొందుటాదెలసి । శకుని చేతి పాచికలు సందిళ్ళబడెను
హస్తినాపురములో అంగళ్ళలోను । పలకయు సాగె నిలువెల్ల దెప్పించి
ఈవలవేయించె సింహాసనమ్ము । సింహాసనముమీద రాజు కూర్చుండె

సింహాసనముమీద ధర్మరాజుండి । వరసలజూదమ్మువరుసతోనాడి
కమ్మరపాచికలు కదుచేతనాడ । రాజుచేతికిజిక్కె కనకమ్మునేడు
ధర్మరాజునుజిక్కె బలపమ్మునేడు । ఆస్తినాపురములోఅంగళ్ళలోను
ప్రథముముననడచినవి బళ్లాసుబళ్ళు । ధర్మజానిబాసెను ధర్మంబునే
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । తలలంటిపెంచిన తరుణులందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । నీళ్ళోసిపెంచిన సెలతలందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । పాలిచ్చిపెంచేటి పణతులందరిని
తప్పలేకధర్మజాలు తమరోడిరపుడు । ఉగ్గోసిపెంచిన యువిదలందరిని
తప్పకనుధర్మజాలు తమరోడిరపుడు । ఏవురుయెక్కినా అశ్వాలనోడె
ఏవురువేసిన హారములనోడె । ఏవురుపట్టిన ఆయుధములోడె
ఏవురుగట్టినవస్త్రములనోడె । ఏవురుకిల్లాలు పాంచాలినోడె
సింహాసనముమీద రాజుగూర్చుండి । ప్రాతికామ్ములను బిలువనంపించి
గాంధారినిబిలువరే పాంచాలినితేను । కర్ణునిబిలువరే పాంచాలినితేను
చందానబిలువరే పాంచాలినితేను । అన్నకెదురుగవచ్చి అతిభక్తితోను
చేతులుముడుచుకొని చేసెవిన్నపము । గాంధారియీపనులు కావుమాచేత
చందానుయీపనులుసరిపడవుననెను । కర్ణుండుయీపనులు కారాదుయనెను
యిందరిపలుకులు యిట్లుపలుకగను । కోపముతోపలికెనే నారాజపుడు
యేమోయిగాంధార నీవోయికొమార । పోయిపాంచాలిని దోడుకొనిరాగా
ధర్మరాజుగట్టినా వస్త్రములుగట్టి । ధర్మరాజువేసినా హారములువేసి
ధర్మరాజుబట్టినా ఆయుధములుబట్టి । ధర్మరాజెక్కిన అశ్వాన్నియెక్కి
హాస్తినాపురముకు వెళ్ళినాడపుడు । అల్లంతట గాంధారు రాకల్లజూచి
యెదురుగేచీవెళ్ళి పాంచాలియపుడు । యేమోయిగాంధారనీవోయికొమారా
జూదంపుసాలలో వార్తలేమయ్య । మాయన్నగెలిచెను మీరాజవోడె
ముఖ్యముగపాంచాలి నిన్నురమ్మనిరి । వదినగారినిసుమీ పరసతినిసుమ్మీ
వదినగారవుకావు వరుసలేలేవు । నిక్కముగపాంచాలి నిన్నుపమనెను.
తలలంటిపసుపూసి జాలాల్లముసచి । అంగుష్టవాంధిని వ్యాగాయనెను
అన్నకెదురుగవెళ్ళి అతిభక్తితోను । చేతులుముడుచుకొనిచేసెవిన్నపము
పాంచాలిమహాదేవి రాలేదుయనెను । యేమోయిగుశ్యానుడ నీవేగికుమారా
జూదంపుశాలలోవార్తలేమియ్యా । మాయన్నగెలిచెను మీరాజవోడె
నిక్కముగపాంచాలినిన్నురమ్మనెను । వదినగారినిసుమ్మి పరసతినిసుమ్మి
వావిదప్పగరాదు వరపుత్రినిసుమా । వదినగారవుకావు వరుసలు లేవు
నిక్కముగపాంచాలి నీవురావేగ । తలలంటిపసుపూసి జాలాల్లముసిచి

అంగుష్ఠవారధినిరారాదుయునెను । వెండికాగులతోను వెన్నెఱ్ఱగాచి
తమిడికాగులతోను చన్నీళ్లుదెచ్చి । వెన్నీళ్లుచన్నీళ్లు సమముగాతోరిపి
పాపకర్ముడుబోసెపాంచాలిమీద । పాంచాలిశిఖబట్టి దుశ్శాసనుడీడ్చి
ముత్యాలవాలీలు ముందరాబడెను । మట్టుకోగాబోవమూకలోదోసి
రొమ్ముదూరగనిలుచున్న పాంచాలిజూచి । మూగిమూకాల్లరె మూగియిట్లనిరి
కూడిమూకాలెల్లకూడుకొనిరపుడు । మూడుకేల గుర్రాలుమూడుకేలమూక
మూడుకేలఆవులాపాడిగలవారు । నాల్గువేలగుర్రాలు నాల్గువేలమూక
నాలుగువేలయావులాపాడిగలవారు । అయిదుకేలగుర్రాలు ఐదువేలమూక
అయిదువేలయావులాపాడిగలవారు । ఆరువేలగుర్రాలు ఆరువేలమూక
ఆరువేలయావులపాడిగలవారు । అక్షౌహిణీఆరువేలబలము
దయగలధర్మరాజాలుయెందుండిరో । బింకముగలభీముడుశేషపాళిజమున
కవలవారిద్దరుకారువారైరో । అనిచెప్పిదుఃఖించెపాంచాలియపుడు
తొయ్యలిఅపర్ణకాలవాకిటకి । పదుగురుజూడగాభంగంబుగాను
ఏవురుపురుషులతోడగూడుకొని । గుఱ్ఱాలపాలలుబాగుజేసేను
తొయ్యలిఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగమ్ముజేయరా
మేడలుమహలులుమల్లెపావుర్ను । సరిసునకయొక్కవేసఖియవాతోడ
నీయొక్కతోడలపైసుధేష్ణయొక్క । సరిమంచమెక్కరాతల్లిగాంధారి
తొయ్యరాఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగమ్ముజెయరా
కుండలోపీకూడుతినవికాకుల్లు । ఉక్కనీవురాజ్యంబునేలితివటర
గాజామెరిసితేనుకనకంబుయవున । పూసమెరసితేనుపుష్యరాగమవున
మాణిక్యమునలుపైనమసికుండయగున । గాడిదయెంతగజమానటోరి
కాలువలెన్నయినకలసిపారినను । గంగానదితోటిపాటియగునట్రి
ఏరుఱౌయెన్నయానరుయెత్తిపొంగితేను । సముద్రముతోసరియానచవిటిఋట్టలు
పాములమనితమురుపడగలెత్తితే । శేషునితోసరిగావునచెదుగుపురుగులెల్ల
పక్షులమనితమనువృక్షమెక్కినను । గరుత్మంతునితోసరియగునసకలపక్షులును
కోతులమనితమరుకొమ్మలెక్కినను । హనుమంతునితోసరియగునఆకోతులెల్ల
కరణాలమనితమరు కవిలిబట్టినను । శ్రీరామునితోసరియగునస్పష్టికరణాలు
రాజాలమనితమరురథ్యకెక్కినను । ధర్మరాజుతోసరియగున కలరాజులెల్ల
భూచక్రపాలకులు సవ్యపాండ్రిలును । మారాజకుంతికొమాళ్లతోసరిరా
తొయ్యరాఅపర్ణకాలవాకిటికి । పదుగురుజూడగాభంగంబుజెయరా
కృష్ణకేకృష్ణకేకృష్ణమ్మశరణు । కృష్ణుడాదివునాకుసహాయముగమ్మి
క్షీరాబ్ధిలోపలాసరిపాన్పుపైని । శ్రీలక్ష్మితోడను జూదమ్ములాడి

ఆడేటిపాచికలు ఆటునిశ్చయించి । అక్షయమనివేసె అప్పుడుపాచికలు
ఆడవలెనోడవలెగెలువవలెగాని । అక్షయమనియేటివికలవేపాచికలు
మనకులగోత్రజ మనభర్తరాలు । మనవామమే గాని మగువదన్నటి॥
పగవారుతనుబట్టి బాధింపగాను । అక్షయమనివే స్త్రీ అతిపరోనేడు
తూర్పునబడ్డవీలోంబడిజలకోట్లు । పడమరాబడ్డవీ పదికోలకోట్లు
ఉత్తరమునబడ్డవీపూళ్ళంతపాడవు । దక్షిణమునబడ్డవీతాళ్ళంతపాడవు
కాళ్ళన్నివిరగను గోళ్ళన్నిమణగ । ఓపలేకవారుకూర్చుండబడిరి.
ఏమినోమునో స్త్రీకేపాంచాలినీవు । ఈసభజూడగా ఇందరిలోను
పాండుగకుంతెమ్మచలిమెత్కుకెయ్య । భీముడుంపిడికాడు పోకలందియ్య
అర్జునుడుఅరచేతుల అకులందియ్య । కవలిద్దరుగూడి ఉల్లభమాబట్టి
విష్ణుశాస్త్రింతనో స్త్రీవివినుడిమీరిపుడు । బాహ్మాం పీథుల పణతులందరును
భావించిగట్టరే పట్టుచీరేలు । వెలమవారీయిండ్ల వెలదులందరు
అంచుదీర్చిగట్టిరే అంచుచీరెలును । పట్టుచీరెలురెండు పట్టుకొనివచ్చి
కుదిలముగదాచుమని పలికెనారాజా । పెట్టరనివారికిపెద్దలకునెల్లా
కట్టదగువారికి కళవుదీరగను । పత్తుతైచీరెలేకుండచెంబుకట్టగను·
హస్తినాపురమున అంగళ్ళలోను ।యూగివీనవి పట్టుచీరెలును
అమ్మగీతలకురుంఒ ముడుచుకొమ్మనెను । తనుతోక్కుమన్నరారాజతోడను
తొడలుచీరించకా తలముడువననెను । నాకినుఖబట్టినదుశ్శాసనునిచేతులను
తోరణాలుగుచ్చకతలముడువననెను । ధర్మజునితో జూదమ్ముఆడితిగాని
తనతోటిజూదమ్ముఆడుచ నిబలికె । పాంచాలితోటిఆడెదననుచు
ఉల్లాసమునునుండెరాజులరాజ । హస్తినాపురములోఅంగళ్ళలోను
పలకయూనుసారెయూను తెప్పించిరపుడు । ఈవలవేయించెసింహాసనమ్ము
ఆవలవేయించెకూర్మాసనమ్ము । సింహాసనముమీదరాజుగూర్చుండి
కూర్మాసనముమీదపాంచాలియుండె । పాపకర్మునిముఖముతోజూదననుకు
నడుమునవేయించెగండభేరమ్ము । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళతోసెపాచికలు । ఒక్కపలకకువస్త్రములుగెలచె॥
తనపలకగెలుచుకొనితలఒద్దుకొనెను । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళతోసెపాచికలు । రెండోపలకకుహారాలుగెలచె
తనపలకగెలుచుకొనితలవద్దుకొనెను । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళతోసెపాచికలు । మూడోపలకకుఆయుధములుగెలచె
తనపలకగెలుచుకొనితలఒద్దుకొనెను । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళతోసెపాచికలు । నాలుగోపలకకుగొడుగులనుగెలచె

తనపలకగెలుచుకొనితలవడ్డుకొనెను । రారాజుతనచేతవేసెపాచికలు
పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు। రారాజుతచేతవేసెపాచికలు
అయిదవపలకకు అందరినిగెలచె । తనపలకగెలుచుకొని తలఒడ్డుకొనెను
రారాజుతనచేతవేసెపాచికలు । పాంచాలితనకాళ్ళ దన్నెపాచికలు
ఆరవపలకకే రాజ్యాలుగెలచె । తనపలకగెలుచుకొని తలఒడ్డుకొనెను
రారాజుతనచేతవేసెపాచికలు । పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు
ఏడవపలకకాయేవురినిగెలచె । తనపలకగెలుచుకొని తలఒడ్డుకొనెను
రారాజుతనచేతవేసెపాచికలు । పాంచాలితనకాళ్ళద్రోచెపాచికలు
అంతలోనేవచ్చి అమాయుశకుని । ఆడవారితో జూదమ్ము ఆడితివనీవు
అటుగాకపాంచాలితోను యాడితివ । ఆడవారేకారఅతివలేకార
ఆడవారికియుగ్ని సహాయమేకాద । ఉడికేటిఅన్నములుతొణకజేసేరు
ముండేటిమంటకు మారుమసలేరు । కాలేటికొయవులు కాళ్ళదన్నేరు
అటుగాకపాంచాలితోనుయాడితివ । ఆడవారేగారఅనుఘలెగార
అటుగాకపాంచాలి పతివ్రతేగాద । అనియిట్లుఅశకునిఆమాటలకు
ఆటచాలించెనే రాజులరాజు । ఆమాటవినియపుడు ధృతరాష్ట్రుడొచ్చి
సభలోనుఆశ్చర్యమునతానుజూచి । ధృతరాష్ట్రుడప్పుడు కోపించిపలికె
ఇదియేమిజూదములు యిట్లుఆడుదురా । రావమ్మపాంచాలివరములిచ్చెదను
నీనేనరాజ్యములు నీవుగైకొనుము । పతులదీసుకనీ వుపదిలానవెళ్ళు
అనియిట్లుఆరాజుఆడుమాటలకు । ఆమాటధర్మజులు వినియాదరించె
ఆడవారివాజ్యంబు ఏలంగతగునా । పతిగూడివనములకు పోయెదననుచు
పాంచాలికోరనే వరులనేగురిని । తప్పకను ధృతరాష్ట్రుడు గాంధారితోను
పతులనుకూడుకొని పాంచాలితాను । అరణ్యవాసముకుఅతివేగజనెను
పండ్రెండుయేండ్లును పదిలమునమండె । అజ్ఞాతవాసమునకతివేగవచ్చి
విరటుపట్నముజొచ్చి వీరశేఖరులు । ధర్మరాజుజూదమ్ముపాడినవిన్న
అష్టఆయుశ్వర్యములు ఆరాజాయిచ్చు । సంపూర్ణవిజయంబు సంతోషమబ్బు

---

# 14 కీచకవధ.

శ్రీమంతులయి యుందురి । శూరులయి యుందురి
సామంతులయి యుంద్రు । సరసులయి యుందురి
సజ్జనులయి యుందురి । సుమతులయి యుందురి
ధర్మంబు తప్పడె తాను ధర్మజాలు । తన పాలి సర్వంబు తగిలి పడగొట్టి
తలచి ధరణిపుత్రోటి జూదమ్ములాడి । దుర్యోధనుడను వాడు పాపకర్ముండు
కల్పించి వాడొకటి కపటజూదమ్ము । మాయతల్లడి కాదు ఆడె జూదమ్ము
ధరణిశైతల్లడగాను ఓడె జూదమ్ము । కొలువెల్లి ఓడుచు గుర్రాలనోడె
అయిం వారినివోడె అందనాలోడె । సమరథులనోడె విష్ణుభక్తులనోడె
ఏనుగులనోడేను సానువులనోడె । ద్రౌపతిసహితముగ తమ్ములనునోడె
తనవానినిడగా తన భూము గోడె । అడవి పండ్రెండేండ్లు ఆహారములను
పన్నెండు యేండ్ల పన్నిదము ఉండీ । యేడాది అజ్ఞాతవాసమ్ము జేయ
విరటుని గొలచిరే వీరకేకులు । కులధర్మము తప్పి కొలచె ధర్మజాలు
నాట్యగురువై యుండెనగర అర్జునుడు । వంటకొరకై యుండె నౌ నరభీముండు
గుర్రములు కాతునని కొలచె నకులుండు । గోవులను గాతునని కొలచె సహదేవుడు
ఈ పనులు తమకు శృంగారమున జేయ । కోరి విరటుల దేవి గొలచె పాంచాలి
ఈ రూపు ఈ రేఖ ఈ చక్కదనము । ఎమ్మండి యీ యూరి కేతెస్తివమ్మ
మొగవారు జూపితే మనసు నిలుపుదురా । చూడ దౌ కృష్ణుడు మాడదానిన్ను
చూచిన కృష్ణుడు చూడకంటేను । కాకయినుము కుయ్యాగమునరుసా చెప్పుమా
నిప్పు జెవలంటు నా నీవు రొయుగవా । సముద్రము కడముట్టనీదు నా యొడ్డు
గంధర్వులేవురు కలరు నా పతులు । వారేవురైనాను లేరు యిచ్చటను
రొయుగక అంటినే రొయిలనాగ నేను । తప్పులేదేమిటికి చంద్రముఖి యనుచు
అనుచు విరటుల దేవి ఆదరింపుచును । నీవు చేయు పనులు చెలతరో యేవి
ఆనతివ్వనుచును అతివ బల్కగను । చెడె పాంచాలి తా జెప్పంగ దొడగ
ఎంగిళ్ళు ముట్టను సంగతికి రాను । పాదంబులొత్తుటకు పడతి నే నోప
బాలలంగుళ్ళునైన నొత్త నేరాము । అంగనలు పనులైన నా చేత గావు
ఇంత రుఘుడి యిగ నేల యీ మాటలేల । అతివ వీసనాను అరమరలు యేల
అప్పచెల్లెళ్ళ వలె భావింతు నేను । అనుచు విరటుల దేవి ఆదరింపగను
కోరి విరటుని దేవి గొలచె పాంచాలి । కొన్నాళ్ళు యీ రీతి గొలచి యుండగను
తిరుముళ్ళ గజముల తీయగలవాడు । మద మత్సరముతోటి మత్స్యపతి మరది
వచ్చి వాకిట నిలచె వలకీచకుండు.। కుంతి కోడల జూచి గునిసె మర్దనుడు

కుంతికోడలను జూచి మోహించె బలుడు । చింతలదిక్కుచు సింహబలుడు నే
అక్క నీదగ్గర నిలుచున్నచేడె । దానిపూర్వపూరు దానికేరవర
దానిమగడెవ్వరో చెప్పవు నాతో । అమ్మరో యేరాజు కూతురే నాతి
చెయ్యవలసినపనులు చేయనా నీకు । వెలదికస్తురినామమలదగ జూచి
మేలుముత్యముసరులు మెడవేయ్యజూచి అక్క చెప్పవె యికయెవరామె నాతో
ఈచీరకు ఈవొళ్ళు ఇట్లున్నవిధము । ఏయన్న నీకేల దానిమాటలు
కవిడిబొమ్మవుగదే పరికించిచూడ । కుగువరో నీవొళ్ళు మయిలలెక్కడివె
పుట్టరా ఆడపుట్టుకలు నీతోడ । ఇట్టిదోషపుపలుకు లెట్లుపలికితివి
రాముసతిగోరియు రావణుడుచెడెను । చెడ్డమాటలన్ని చెప్పంగదోషగా
పరస్త్రీపరధనము సంబరముగాదు । లేర తెల్లడిగాను యేలచెడియెదవు
అక్క నీవద్దన నిలుచున్నచేడె । హంసనడకలదాని అడుగులనుబోలు
పద్మదళములుదాని పాదములబోలు । పోకబోదెలుదాని పిక్కలనుబోలు
అరటిబోదెలుదాని పెందొడలబోలు । కలబందబోలు నే కాంతపిరుదులు
వడ్డాణమమరినట్లున్న దానడుము । చెరుకుకోలలు దాని చేతులంబోలు
తమలపాకులుబోలు దానిహస్తములు । శంఖచక్రముల భుజములంబోలు
చక్రాకారములు కుచములంబోలు । పొద్దునసూర్యుడు ఉదయించినట్లు
పడతిదానిముఖము పద్మమునుబోలు । కలువరేకులుదాని కన్నులంబోలు
చేమరేకులుదాని చెక్కిళ్ళబోలు । సంపెంగపువుబోలు సొంపునాసికము
దంతములుదానిమ్మ గింజలనుబోలు । మల్లెమొగ్గలుదాని పలువరుసబోలు
పగడతీగెలబోలు దానిపెదవులను । కొదమతుమ్మెదబోలుదాని కురులనును
కొదమమ్మెదాని కొప్పునుబోలు । శశిముఖియాడుచు నాట్యమాడగను
అతివయాకారాన జలధిలోమునిగి । అంకుశంబైనట్టి ఆముసలిచేత
పట్టుబడియున్నను బ్రతుకుతెరవేమి । సర్వేశ్వరదేవి తాబొందకున్న
గారపండగుదాన్ని గడియించుకున్న । పాలతిబొందకనాకు పోవుప్రాణాలు
బ్రతుకనుమి అక్కనుమ పాదములబడెను । పాదములపైబడ్డ తమ్ముని మొత్తి
అక్కనచేర్చుకొని అతివయిట్లనెను । రారసింహబలుడ రాజరత్నంబా
ఏలసింహబలుడ యిటువంటిపనులు । నాతికై తిరుగుటమాని నాబుద్ధివినుము
ఆడదానిచిత్తము అరటాకుమెవ్వ । యెవ్వరేమన్నాను యముడుబాధించు
సర్వేశ్వరులువిన దండించునిన్ను । ఇల్లాలిగోరితే యిదిఒక్కనింద
పతివ్రతనుగోరితే పోవుప్రాణములు । గంధర్వులేవురు కలరుదానిపతులు
వారేవురైనాను వేరుయిచ్చుటను । వారువిడిచినిన్ను తలలుగొట్టుదురు
కుప్పాలతీగవలె పాలతులున్నారు । కుందనపుబొమ్మవలె కాంతలున్నారు

పొగడబొమ్మలవలె పణతులున్నారు । వజ్రంపుబొమ్మవలె వనితలున్నారు
అనగానుకీచకుడు అప్పుకిట్లనియె । నీరజాక్షివిబోలు నెలతేదిచెపుమ
నాకొలువువారంత నాకెందుకనెను । రరభాదులయినను రమణిసరిరాక
రెండరయినాయింతి గోరుబోలుదురె । చూడగూడదుతండ్రిదానిచెదవుసుమ్మి
ముట్టగూడదుతండ్రి మాటైనవుస్కు । ముందుఒకనాడునే ముచ్చటాడితె
వనితకోపించితే వణకితినినేను । అనియిట్లుతనఅక్క ఆడుమాటలను
తల్లడింపుచుదాని పాదములబడెను । నిలువవుప్రాణములు నిజముగానమ్మ
అనికీచకుడుబలుక అతివభీతిల్లి । తాకెన్ననీబుద్ధి కడమట్టదన్న
సురపేరుజెప్పి ఆసుదతినంపెను । అటామీదనీవొలసినట్లుండుమన్న
అక్కపలుకులువిని ఆసింహబలుడు । అధికసంభ్రమముతోను నగరికేతెంచె
మహారాజావచ్చెననిమంగళాహారతులు। ముత్యాలహారతులుముదమొప్పదెచ్చిరి
మగువలుదెచ్చిన మంగళహారతులు । ఉల్లమలరగజేసి ఊర్మికాసఖియు
సంపెంగతైలాన్న శిసొప్పనంటి । మంచితైలముతోనుమురినలుగుపెట్టి
సుగంధిగంధమునఅటకళ్లుగాచి । వెండికాగులతోను వేనీళ్లుగాచి
భమిడికాగులతోను చన్నీళ్లుతోడి । చన్నీళ్లువేణీళ్లుసమముగాతొలిపి
ముత్యాలముంతల మగువలందియ్య । పసిడిముంతలతోను పణతులందియ్య
మహిమతోమహారాజు మజ్జనమాడె । పగడాలముంతల పణతులందియ్య
మహిమతోమహారాజు మజ్జనమాడె । మెత్తివస్త్రములమేనుతళ్కొత్తి
పట్టువస్త్రంబులే కట్టదస్తురు । రత్నాలసొమ్ములే రాజామదికివి
హెచ్చైనచెవుల ముత్యాలపోగులును । అణిముత్యపుసరులు హారములువేసె
మకరమాణిక్యాలు అసింహబలుడు । గంధకస్తురి పరిమళద్రవ్యములు
బాగుగాధరియించె ఆసింహబలుడు । ఏడునిలువులధమిడి మేడలోపలను
బంగారుతెరికొళ్ళ పట్టెమంచంబు । పట్టిమంచముజాల్చి పాన్పమరించి
యిరుగడలతలగడలు యిమ్ముగనుంచి । నేత్రాలపట్టుపచ్చడమొప్పబరచి
తొడిమెలబూసినవి పారిజాతములు । ఆమంచిపానుపున ఆవిచాలబరచె
జాజొయిబూసినవి జాజిపువ్వులును । ఆమంచిపానుపున ఆవిచాలబరచి
మాపొయిబూసినవి మల్లెపువ్వులును । ఆమంచిపానుపున ఆవిచాలబరచి
పొన్నలుబొగడలేబొడ్డుమల్లెలును । ఆమంచిపానుపునఆవిచాలబరచి
నాలుదిక్కులకడవిస్తెవెలుగా । నవమపసిడిమహాలు చిలుకలగద్దె
కస్తూరిరొక్కకుడకగంధమొక్కకుడక । చాలవన్నెలనిండపోకలాకులును
చిన్నారిగొలుసులదీనున్నపుకాయ । గరటతోనుదకంబుచిలుకలవక్రి
సకలాభరణములు చాలపళ్ళెములా । యిన్నిపుంపిచెనె తమ్మివకెతాను

అడవిలోనలుడుదమయంతిబాసీ । దమయంతియిడుములనుబడినట్లుయుండే
ఆలాగుకన్నీరుఆరచేతబట్టి । యీచేతబొబ్బలకుఇకతెరవులేదు॥
ఒరలుదీసినగంధమెల్లదటచేడె । తానుదీస్తేగాని యొప్పదటతరుణి
ఈడీవుడుండగాకిచారమేలే । ధర్మజాలుయుండగా తలపోతలేలే
నేనీకనుండగా నేరమేమిటికి । వనితనీవద్దకు వచ్చితేవాడు
వచ్చేదననిచెప్పు వనితరోనీవు । ఆరాత్రిగడిపించి అటుతెల్లవారె
అబలయొక్కడికిబోకఅక్కడికెబొమ్మి । భానుదిక్కుఁజూచిపద్మములుజూచి
పట్నములోపలికిపాంచాలివచ్చె । గట్టిగాపట్టుదలపట్టె కీచకుడు
కాంతయున్నచోటికేతెంచియపుడు । వనితనినుచెఁబట్టి వచ్చితినేను
వనితరోనాయొడలు పణకినదియేమే । కలకంఠినీతోడ కలయవచ్చితే
కాంతరోనాకెంత కంపంబుబుట్టె । యువిదరోనీతోడనుండవచ్చితే
పణతినాకెంతభయమాయెనేమే । పసిడిబొమ్మవునీవుపరికించితేను
పణతినీతోడయిన స్త్రీలువున్నారే । ఇంతినీతోడయిన యింతులున్నారే
రమణిరోనీపతుల రప్పించకోవే । ఏవురుపతులునీ యొద్దలేకనీవు
పదివండిపతుల్గన పణతినాకెదుర । నీకుగేవారితో నీవుచెప్పకోవే
యిట్టిపలుకులుపలికె యేట్టికేబుద్ధి । రాజులకల్లను రాజునేనేను
వాడుకల్లాసమ్మి నేడనునిజము । నిన్నుగూడగపత్తు ఈరాత్రినేను
నిన్నుప్రేలాపించి నీవంతజేసీ । నేడుకస్తానంటె నేనమ్మలేనె
నమ్మకుండగనేల నామాటనీవు । గరియుపదేశంబు కొంగునీముడే
విన్నజంపుకవిందు నేడుఈరాత్రి । నాటకపుశాలలో నాట్యశాలలో
నాటకపుశాలలో రంగమధ్యమున । నినుజంపినీకాత్రి బొట్టెట్టుకందు
అనియిట్లుపాంచాలి యాడుమాటలకు । అధికసంభ్రమముతో ను నగరికేతెంచె
నమారాజవచ్చెనని మంగళహారతులు । ముత్యాలహారతులు మదికలుదెచ్చి
మగువలుదెచ్చిరా మంగళహారతులు । తెల్లంకపడిరాజా అవివరదన్న
రత్నసింహాసనము రత్నంపుగద్దె । రాజుకెసిరి పనసనీడ
సంపెంగతైలాన తిలసొప్పనంటి । సుగంధిగంధమున అటుకళ్లుదెచ్చి
కెండితాగులతోనుకేణీళ్లుగాచి । తమిడితాగులతోనుచన్నీళ్లుతోడి
చన్నీళ్లుకేణీళ్లు సమముగాజేసి । ముత్యాలముంగిలామగువలందియ్య
పగడాలముంగిలాపణతులందియ్య । మహిమతోమహారాజమజ్జనమాడె
మెత్తనివస్త్రములమేనతళ్లోత్తి । పట్టువస్త్రంబులెకట్టినిసురు
రత్నాలసొమ్ములేరాజుమరికెదిని । హెచ్చయినచెవులముత్యాలపోగులును
ఆణిముత్యపుసరలువానికేయమరె । మకరమాణిక్యాలఅసింహాబలుడు

గంధకస్తుపరిమెళదివ్యములు । బాగుగాధరియించెనసింహబలుడు
ఏడునిలువులభమిడిమేడలోపలను । సన్నబియ్యముమంచిచాయపప్పులను
కందపెండలముకాయగూరలును । సానబాలుపాయసముఆవులనెయ్యి
భక్తితోనారగించెనాసింహబలుడు । గంగజలములుదెచ్చిహస్తములుగడిగి
పచ్చివిపోకలేవండుటాకులును । పచ్చకర్పూరానతాంబూలమిచ్చె
తాంబూలమునువేసెసేనాపతిత్తమ్ముడు । ప్రొద్దుపుచ్చారేకపాలతితమ్ముడు
కీచకుడుపోయెకేళీవనములకు । దానిమ్మవనములేదబ్బవనములును
నారింజవనములేనిమ్మవనములును । చామంతివనములేజలధికాలువలు
భానువంకనుజూచిపద్మములజూచి । గ్రుంగేటిభానుడూ గ్రుంకుచున్నాడు
విల్లంబుబుచ్చుకొని మండపమ్మునను । మండలాపతికెదురుగమహినతోనిలచి
గ్రుంకకున్నానిన్ను కొట్టేదననెను । అనియిట్లుకీచకుడు ఆడుమాటలకు
సూర్యుడుమాచిట్లు శాపంబుబెట్టె । పావనుడ నీజీవ్వాపడునుయీరాత్రి
గడగడవణకుచు గ్రుంకెనుసూర్యుండు । పడమరభానుడుగ్రుంకెనంతట్లొ
ఆక్కడభీముండు వంటశాలలలోను । పావనుడనీవునాకుబంధుడవైతే
శాకపాకమ్ములతక్షణములోజేతు । అనియిట్లుభీముండు వంటచేయగను
వీరశేఖరులొచ్చి విస్తర్లువేసె । అవిరటుకొలువుల వారినందరినిపిలి
పజ్తివారికెల్ల వరగవడ్డించి । తాసారగించెకేభక్ష్యభోజ్యములు
సంతుష్టిగాగుడిచి సరయూనదినీర్ల । వాంఛతీరగత్రాగెవరుసభీముండు
పసుపుబూసిభమిడి చెంగుచీరగట్టి । అగుస్థములవీరమద్దులనుబెట్టి
గట్టిమట్టెలుబెట్టి కడియములుబెట్టి । పరగనాభీముకుపతకములువేసి
ఉరమున అవికెండుభరగొలంబెట్టి । కుచములమర్చెనే వాయునందనుడు
ద్రౌపదినితోడుకొని వెళ్ళెభీముండు । ఇదియేమిచోద్యమేచిత్రపుత్రిక
విరహానవినగోరి వీడేలచెడెనే । వీడిలక్ష్మిరాజ్యమునేలపాలాయె
భక్తితోతనసతి అకుచట్టెయ్య । వీడెమ్ముచేయూచు వేడుకలతోను
కలసిమచ్చట్లగాలు కాంతతోనుండ । అల్లంతటవచ్చేటి యాసింహబలుని
రాకలుజూచిరి రాజ్యాధిపతులు । సింహబలుడొచ్చెనని దీపంబులార్ప
వెలుగేల ఆర్పితివె వెలదిరోనీవు । అనియిట్లు కీచకుడుఆడుమాటలకు
మాయద్రౌపదిబల్కె మాయతోడుతను । దీపంబులుంతురా లోకంబులోను
రేపురుమొగులాలినయిరయుండనేను । దీపంబులుంతునాలోకంబులోను
చిర్వేలమ పిలిచె దేవెసేరాగ । బింబంబువోలునే దేవినీముఖము
వెలుగునమాణిక్యముదీప్తిలుచుండె । రేపారిమాణిక్యమురెయుండుచెపుమా
అనుచుదానీగొమ్ము ఆదుగటవేసి । బలుపుకుచా లశాపట్టెమంచంబు

తిరిగినయంతలో విమలాక్షిబలికె । మంచము విరిగి తేమరణమందుదురు
పురుషులకువీలుగాదు బుద్ధేమిచెప్పుము । మెల్ల నేగా యిబట్టి మెల్ల నేదీసి
చందమామనుబోలు సఖియనీ మోము । కళదప్పియున్న దేకాంతిరో నేడు
పగలుజూచితేచిగురుటాకులనుబోలు । మాపుజూచిన మద్దిమ్రాకులనుబోలు
ఆడకట్టుగాదనుచుఅనినిశ్చయించి । మనసులోపలచింత మరిదిగులుపడెను
ఆడదెబ్బగాదనుచుఅవరిపడితేవా । చెంపపెట్లూ బెట్టె తానుభీముండు
కదలకతన్నె నేకన్నూకిపడెను । ఆచితన్ని తెయూడె అదంతములును
భీముండుసింహబలుడు యుద్ధంబుసేయ । మూడులోకంబులు ముందరవణకె
గడగడభూదేవిఅప్పుడేవణకె । కాళ్లను వేళ్లను అన్నియునువిరచె
పొట్టచించీబురపిపొట్టలోపెట్టి । యువిదవీడీనెత్రుబొట్టెలోవ
అనిచెప్పిభీముడు అక్కడగదలి । ఒప్పేటిగుండములో స్నానములుచేసి
కాంతయొక్కడికిబోక నింటికిబొమ్ము । అనిచెప్పిభీముడు అక్కడవెడలి
తనకొలువుచోటికితానేగుదెంచె । అప్పుడుపాంచాలియక్కడవెడలి
కీచకులవీధిలోకేకవేసె । మీకీచకునిజంపగంధర్వులొచ్చి
యేరాజుజంపెనో చూతామురారె । రారేచూతామురాచవారల్లా
తమఅన్ననుజంపిందియీపాపకర్మి । తమఅన్నచిరప్రక్కను దీన్నెనిగట్టరే
అంతలోనేవచ్చిరి వానితమ్ములును । నూరుగురు కీచకులునిముసానవచ్చిరి
అంతటయీమాట వినివిరటరాజు । కంకయ్యతో జెప్పెకీచకునిచావు
ఈమాటరారాజువిన్నానుయపుడు మనపట్నముగెలుచుకొనిపోయెదరునమ్మ
యెవరికితెలియకుండకవాన్ని పంపించు । అనియిట్లుధనుజాలుఅనతియ్యగను
అట్లేనేయుమనెను ఆవిరాటూరాజు । అతనిప్రక్కనుదేవి ద్రౌపదనిగట్టి
ప్రేతభూములలోకి కొంచబోయిరిగ । ప్రేతభూములలోను పతివ్రతాతాను
అన్నహారములేక అడలుతుబలికె । ధర్మమ్ముదలిచేటి ధర్మజాలుతమురు
పతివ్రతపాంచాలినిజూచి పొండయ్య । గోవులనుగాసేటిగోపాలమీరు
పతివ్రతాపాంచాలినిజూచి పొండయ్యా । ఆవంటకాలలోఆభీముడుండ
ఆదేవిపలుకులుకర్ణములబడెను । కోపగించీలేచి తానుభీముండు
ఈగుర్రిడైతావెళ్ళె తెనభీముండు । నూరుగురుకీచకులనిముసానజంపి
నూరుగురకీచకుల నొక్కనిముసాన । అగ్నిహోత్రునికితానాహుతులుజేసె
లక్కటిళ్ళామెుర్రిక్కతీరనోయనుచు । సంతోషముననందెకవళాయతాను
స్నానంబుకేసుకనితరుణితావచ్చె । మొకలనుదాచుకొంద్రుమగలందరును
పాదములను దాచుకొందురుసఖియలందరును । యింటింటజాతర్లుకేతుమేతల్లి
ఈయేటిబిడ్డలు నీకేరకుమ్మి । పాంచాలిరాకజూచి సుదేష్ణయపుడు

సుధేష్ణకా పెద్దగా శోకింపదొణకె । విరటునింటికి నేడు రావంగనేల
వచ్చినదాని జాలిమోహించనేల । వీనిరాజ్యముశవముపాలాయె
యింక నెవ్వరిజంప నేతెంచినావె । యికనునీపురముకు జనుదెంచుమనెను
అనియిట్లుసుధేష్ణ యాడుమాటలకు । నేనేమిచేసితినె పెలతలరో నేడు
నీవల్లనేరమే నిజముగానమ్ము । దక్షిణగోవులకౌరిమిపట్టగను
తాబోయివిడిపించె తానుధర్మజులు । ఉత్తరాసగోవులు వురిమిగట్టగను
తాబోయివిడిపించె తానుఅర్జునులు । యేవ్వరుకానిమిట్లు మధ్యపాంచాలి
విరటుసాక్షిట్లోనుకొలువుగూర్చుండ । చూచివిరటులరాజసాష్టాంగమెరిగె
జూచివిరటులదేవి సాష్టాంగమెరిగె । చూచిపురజనులంత సాష్టాంగమెరిగె
సంతోషమునమండె ధర్మరాజపుడు । యీ కోటయొవ్వానపాడినావిన్నా .
ధర్మంబుగలదని ధర్మజులు అనిరి । నిత్యకల్యాణములు సత్యముగ గూడ॥

## 15 శాంతాకల్యాణము.

శ్రీరామమహిమంబు సృష్టిలోపల వెలయు భేరీలు మ్రోగుచుండె ।
సంతానములేదనితండ్రి చేసినతపస్సు ధరణిపై మ్రోగుచుండె ।
భరతసౌమిత్రియు నందముగా శ్రీలక్ష్మి రగాపలికెరచన ।
శాంతనుతెచ్చిరయా ఋషులుదెచ్చినరీతి జగతిలో మ్రోగుచుండె ।
శాంతనుపెంచెయా దశరథపుత్రికయనిరి ।
కౌసల్యకూతురు గారాలపట్టియనిరి ।
పసిడిబొమ్మల్లు కుందనపు తిలుపులనిరి ।
పదకోట్లమాణిక్యాలు ఆపణికిసొమ్ములనిరి ।
భమిడినీళ్ళమూంచిన జలతారు చీరలనిరి ।
పదికోట్లచెలికత్తెలు ఆపణతినిగొలుచుచుండె ।
చెలికత్తెలతో ఆశాంతఆడుచుండె
కూతురునిపరీక్షించి కుందనపు ప్రతిమఅనెను ।
బాలనుపరీక్షించి బంగారుబొమ్మ అనెను ।
మాతల్లిరమ్మని ఆరాజు తొడలనుంచె ।
ఆడిపత్తివమ్మ మేనెల్ల చెమటబట్టె ।
ముద్దుగనిలచెనుబాల మూడిసవరించుకొనెను ।
తండ్రిచాటునబాల కిలకిలనవ్వెను ।

పెళ్ళిప్రియముకాంతకు ప్రేమతో చేతామనెను ।
తనయపెళ్ళిచేయ తండ్రిమనస్సున దలచెను ।
పట్టిదీర్చిఆరాజు పణతులతో ఆడుమనెను ।
ప్రాణపతినిదలచి ప్రాణేశుడు వచ్చెవేగ ।
సతియెదురుగవచ్చి పతిపూజజేసెదేవి ।
హంసతూలికాశయ్య నారాజుకూర్చుండెను ।
కనకపళ్ళెములోన కర్పూరపువిడియమిచ్చె ।
కౌసల్యచేవిడియంబు ఘనమున అందుకొనెరాజు।
పరిమళవస్తువులు సతిపతులు స్వీకరించిరి।
సతినికౌగిటజేర్చుకొని సంతోషమున బలికెను।
కౌసల్యతో రాజు సుతపెళ్ళి చేతమనెను।
పతివాక్యములువిని పణతిఆనందపడెను।
మనవిగలదనిసతి మ్రొక్కినిలచి పలికె।
లక్షణంగలకాంత లక్ష్మినిమించి యున్నది।
శుభలక్షణమ్ములు గలవిభువరుజేర్చ వలెను।
సూర్యచంద్రులకన్న సుప్రకాశత మించియుండె।
వనములన్నితిరిగి దేవఋషిని తెస్తుననెను।
కళ్యాణకట్నాలు కాంతకుయెరిగింపుమా।
సంతాభరణాలు సుదతివర్ణింపదొడగె।
ఏబదికోట్లబంగారము ఆవెలదిసొమ్ములనెను।
నలభయికోట్లబంగారము సానతో సూత్రమనెను।
కోటిమాణిక్యాలు కొలికితో సూత్రమనెను
వెలలేనివేవేలు గజకంఠమాలలనెను ।
యింపైననీలాల సొంపైన సొమ్ములనెను ।
గోమేధికమ్ములు పలకసరుపేటలనెను ।
ఏబదికోట్లసరములు ముత్యాలహారమనెను ।
నలభయికోట్ల నెలబాలవంక చంద్రహారమనెను ।
దొడ్డదొడ్డముత్యాల సారంపుతొడుగులనెను ।
యింద్రనీలంపుసరులు జవనసాది గొలుసులనెను ।
శుద్ధసువర్ణపుసరులు సుదతిశృంగారమనెను ।
యెచ్చైనపచ్చలు మెడబన్న సరములనెను ।
అచ్చమాణిక్యాలు పచ్చలాపతకమనెను ।

కెంపాణిముత్యాలు కూడిగమ్మలనెను ।
ముద్దులుగొలుసులు పోచిలుఅందమనెను ।
కనకగాజులనడుమ ఘనకంకణములనెను ।
మొగలిపువ్వుకడియాలు మందర మురుగులనెను ।
సన్నంపుకెంపులు సందిటీదండలనెను ।
సన్నంపుకెంపులు జవనాడిపట్టెడనెను ।
సన్నంపుకెంపులు ముత్యాలహారమనెను ।
బాజిబందులుగట్టి పైనభుజకీర్తులనెను ।
అందమైనబావిలీలు అరివేణిరేఖలనెను ।
తమిడికొప్పుగొలుసులు జడచాలందుమనెను ।
నలభయికోట్లబంగారము రాగిడీబిళ్ళ లనెను ।
సూర్యచంద్రికాంతి చూపుగలవజ్రమనెను ।
చేరుచుక్కబొట్టు కరకోటివజ్రమనెను ।
పదికోట్లబంగారు పణతివడ్డాణమనెను ।
వన్నెగలనడుములు వజ్రాలుకట్టుమనెను ।
కనకకంఠమాల కడుమంచి పోద్యమనెను ।
పంచనవరత్నాల పాదాలఅందెలగెను ।
పాముపట్టంబున పాదల గొలుసులనెను ।
పాదఅంగుళ్యాల రంగైనమట్టెలనెను ।
కోటానకోట్లు బ్రిహ్మతోడుగులనెను ।
ఇంద్రిగోపలపట్టు యింపైన రవికెలనెను ।
చంద్రికాంతిపట్టు జడతాబందులనెను ।
పదికోట్లఏనుగులు పణతికిఅరణమనెను ।
అరవైకోట్లఅశ్వాలు అగివకు అరణమనెను ।
పచ్చలపల్లకీలు పణతికి అరణమనెను ।
అరవైకోట్ల అందలాలురాణువ శాంతకుఅరణమనెను ।
పదికోట్లపెట్టెలు పణతికి అరణమనెను ।
వెయ్యికోట్లచెంబులు కేయింతామనెను ।
రాజ్యంబులోసగము రాజ్యముశాంతకనెను ।
నీమమేటికిఅయోధ్యరమే అరణమనెను ।
వినుటమాత్రిమెగాని సవతులుగలిగుండగా ।
సవతులమీదను సుదతికి రాజ్యమేమియ్యగలము ।

ఒకటిరెంటామూడు ముగుదలవిమూడుకుంటి ।
యీమూడుజగములు ఏతెంచిపోషించెను ।
వలసికె స్త్రీవికసుక పణతినిపోషిస్త్రివి ।
ఆత్మగూడుకసతికి అతివయిట్లని పలికెను ।
లీలవినోదపుకాంతులు దేవినిమించుచుండె ।
నీదిరాజ్యముదేవునికృపను పాలించుచుండు ।
సుతులుంగలిగినరీతి కాకంటపతికెను
సుతులుంగలిగిమీదటసుతకుఒక రాజ్యమిస్తు
పతిపతులుభాషించు నెడతెల్లవారె।
అప్పుడుపరవాయిద్యంబులు చేయుచుందురు గోకులుకేగ।
బిలచిరాజ్యమంత్రినిసారాజా కాంతకాల్యాణముసెను
కదుసంభ్రమునఆరాజా గణపతినిపూజించెను
దేవకన్యలందరినిబిలచి దేవఋషి తేబంపెను
దేవఋషి తల్లివచ్చినతరువాత దశరథేశ్వరులు ఎదురొగ్గనిరి
మంగళస్నానాలు కాంతకు జలకమాడించిరి
చలువపువ్వులచీర సఖియకు తళ్కొత్తించిరి
దివ్యాంబరపుచీర దీప్తిల్లగట్టి
దివ్యాంబరపురవిక కాంతిల్లదొడగదేవి
దశరధులుఏతెంచి కాంతచేఫలమునుంచిరి
కాంతకొరికాలువున చెదరిజాచెరాజా
కోటిధనమును ఆరాజావిప్రులకు విడియంబోసంగ
దశరధులదేవిదమ్మని దేవదుందుభులుమ్రోయు
దేవతలుచేమొక్కి పలికెనపుడు
దేవఋషిపాదాలు దశరథేశులుగడగిరి
కౌశల్యదశరథులు కన్యధారోసిరప్పుడు
సురలెల్లదీవించి శుభసూత్రముగట్టిరి
ముత్యాల తలంబ్రాలు వనితపసుపు శిరసునసుంచిరి।
వజ్రాలతలంబ్రాలువనితపసుపు సిరస్సునసుంచిరి ।
మాణిక్యాల తలంబ్రాలు కాంతమహాలక్ష్మి తలబోసిరి,
పతిపతులుతలంబ్రాలు చెండుబంతాడిరప్పుడు।
పఖిసుతలంబ్రాలుపొయ్య సప్తమహాఋషులునవ్విరి।
తన సుతలంబ్రాలుపొయ్య తల్లులానందపడిరి।

దేవఋషిచెయ్యనుంచి యీపట్టిబాల యనెను।
మహారాజుపలుకులకు మహామునిశిరస్సాంచెను।
అంతలోవాల్మీకి కడువలపొంగిపలికెమదిలో ।
మహారాజతనయ మహాఋషులాదేవియనెను ।
కౌసల్యసుతజాణ తగుమీకు శాంతయనెను ।
అయిదుదినములపెండ్లి అతియుత్సాహముచేసిరి ।
పారిగందు గౌరిపోలన్నవారాదేవి।
నల్లపూసలు కుత్తిగంటునాతి మెడనుగట్టిరి ।
పందిళ్ళుమెరయగా పణతివివండాశించిరి ।
సకలదేవతులకెల్ల దశరథుడు కట్నాలిచ్చిరి ।
దశరథులకట్నాలు అందుకొని దేవతులిట్లనిరి ।
కీర్తిగలఋషి మేపలకితూతుగనంపించమనిరి ।
మళ్ళిపంపుదాము మాకేమీపలకవలదు ।
అంతలోవాల్మీకుడువలపొంగి పలికెమదిలో ।
ఋశ్యశృంగుడు శాంతను ఋషిపల్లెకుపంపమనెను ।
మళ్ళిపంపుదాము మహారాజానతెగవలెను ।
వాల్మీకి పలుకులకు వలపొంగుగాజామదిలో ।
యింతముసికివ్వగా మగువయెగవాయెమాకు ।
సంతానములేదన్న చింతేలవానప్పులోన ।
మహిమీదగలిగితె మాతల్లిభాగ్యమనెను ।
వినవయ్యావాల్మీకుడ వినయముచేయనేల।
అర్ధాంగసుతపంప అధికారమెవరిదనెను।
తాపంపదలచితె తనదేవియొప్పదనెను ।
సుతకొరకై పతిమమ్మునెదురాడునేమోను ।
అర్ధాంగినేఅడగ మాటదలిగరాదు ।
సుతమందిరములోపల మసలాడిపరగివలెను ।
ఋష్యశృంగుడు మానగరపతిపతిసిరమనెను ।
పుత్రికయింతాయె పుత్రుడుదయించెను ।
దేవలోకంజొచ్చి దేవతులసాధింపరాదు।
తండ్రిచాటునబాల తనయశిరస్సంచుకొనెను ।
చీనచీనాంబరాల సుతనేత్రములొత్తెను ।
వగపనేటికిఅమ్మ మళ్ళిపంపననెను ।

మూలధనమునీవు ముద్దుపాపవమ్మ ।
ధర్మకళలావునీవు మమ్ముగన్నతల్లివనెను ।
తనప్రాణవల్లభుని దండత్రిభాషింపగా ।
తప్పవేయకఆముని తప్పకసతినిజూచె ।
మునిఅభిమతము ఆరాజావిన్నవించె ।
కనకమేడఋషిని కడుశీఘ్రముననుంచవలెను ।
అంతలోవాల్మీకి వలపొందిపలికెమదిలో ।
సుతుపయిభోగములు వేడుకలుజూడవలెను ।
ప్రాణసతినితలతువని ప్రాణసఖుడువచ్చెవేగ ।
సతియెదురుగావచ్చి పతిపూజచేసెదేవి ।
హంసతూలికశయ్య ఆరాజుకూర్చుండెను ।
కనకపళ్ళెరాల కర్పూరపువిడియమిచ్చె ।
కౌసల్యచేవిడియము గగనముగ అందుకొనెరాజు ।
పరిమళవస్తువులు పతిసతులు స్వీకరించిరి ।
పతినికౌగిటజేర్చుకొని సంతోషమునబలికెను ।
సుతువేడుకలు చూడవలెననిపట్టెబాలసు ।
రాజాపణతినెట్టుగాతాను వనతపస్వికిప్రాణతెట్టగానేచుకను ।
అతివగూడి అతిరంతులేజేసెను ।
పంజరమ్ములజూపి జంములేఆరగించు ।
పతిసేవచెయ్య పణతియొంతికలదురాజ ।
పతివచనమునకు కౌసల్య మతిసమ్మతించదాయె ।
స్త్రీమర్మముచేత చిత్తమునస్పర్శించెఋషి ।
స్త్రీలవిలాసమున చిత్తమునస్పర్శించెఋషి ।
కౌసల్యకరముపట్టుకొని రాజా కాదునామాటవినుము ।
వగవనామాటను యెన్నడుమారుగొని పలుకవైతి ।
చనువుచేసినన్ను చవకచేసిపలికితివి ।
ఋషిస్త్రీసేవనములకుచనుదెంచినవనతపస్వినికావలేము ।
నాఋషిసేవకు ఋషిశాంతనుబంపితె పునయించుననిరిథ్రిములు ।
శుభస్యశీఘ్రము సుదతిఆనతియ్యవేగ ।
రాజేంద్రనీయాజ్ఞవిని యితనికియింతినిస్తి ।
లిపంచితెమా లేమిపలుకవలదు ।
వికలదేజీవి వారిముక్కా మాటవినుము ।

లలాటవిరుదముని ఉగ్రతపస్విసుమ్మి ।
ఋషిసంహారాలు మానాపతిని ప్రార్థించుదేవి ।
రంభశృంగారించిన నవరత్నమేడనుంచి ।
సతిని అనుమతిపలికి నదరులోకేగరాజా ।
దేవతలుపిలిపిలిపించి దేవఋషులే వెళ్ళిరి ।
సకలఫలములు దేవఋషి మేసనుంచిరి ।
సంపూర్ణజాఫలములు సతిపతులుదానమిచ్చిరి ।
కోటానకోట్లుబ్రహ్మసభకు వేగచేయించె ।
యత్నమామునీంద్రుల స ప్తమహాఋషులుఆరగించిరి ।
పంచభక్ష్యాన్నములుపెట్టి ఆరగింపబెట్టి ।
వింతవింతలువేసెలు నీటుగాశృంగారించిరి ।
భమిడితరగోళ్ళ అండజములువేసిరి ।
మేలిమితలగుడ్డలు మెరపుపెట్టెలుఅమర్చిరి ।
పూబోణులాబొమ్మన పుష్పజాతులుఅమర్చిరి ।
అండంపానుపున నవరత్నగొలుసులు అమర్చిరి ।
కనకకస్తూరిదీపాలు కడువేడ్కతోనుంచిరి ।
కర్పూరపుతాంబూలంతో కౌసల్యసుతనునగరికిపంపించెదేవి ।
దశరథులుఏతెంచి నవరత్నశయ్యటూచి ।
సుతసుందరమ్మనుజూడ వైకుంఠమనిరి ।
మునికాంతలేతెంచి ముదితకిట్లనిబలికిరి ।
కొడుకుచూచువిభుడువేగచనిరమ్మనిరి ।
కాంతలందరుగూడి కౌసల్యకిట్లులనిరి ।
మూర్ఖంగలఋషిమేడకు కూతురినంపించుమనిరి ।
తల్లిచాటుబాల తనశిరసువంచుకొనెను ।
చీనిచీనాంబరాల నుండినేత్రములార్తైను ।
కాటుకలుఅంటెననికన్నీరువతైతల్లి ।
రోదనంచేసితే ముఖమెల్ల చెదురునమ్మ ।
పుణ్యవతిముత్తైదువలు మహారాజా మీతండ్రిచూడగలిగ ।
అనిపల్కికౌసల్య శృంగారంచేయగల్గె ।
వరైశ్యాగరాబులు పన్నీటజలకమార్చెతల్లి ।
దివ్యాంబరపుచీర దీప్తిల్లగట్టెనుతటు ।
కాంబలపూలరవిక కాంతిల్లదొడగదేవి ।

పసిడిజిలుగులబాగయిన పట్టురవికదొడగిరి ।
పంచవరత్నాల బాగుగావలపోసిరి ।
వెరవిప్పనార్చి నెలబాలజడనల్లిరి ।
కురులుజక్కగాదువ్వి పారిజాతములుముడిచిరి ।
ముఖముకైవడిదీర్చి మొగమోహనాంగివనిరి ।
నుదుటతిలకమొప్పగాదీర్చి కొలుకులపన్నంపు కాటుకిడిరి ।
దొడదొడ్డతొడుగులు దేవికాంతకుదొడిగిరి ।
ఘనమైనతొడుగులు దేవికాంతకుదొడిగిరి ।
ఆకులుచుట్టితల్లి మడుపులేఅందిచ్చెను ।
సుతకుతాంబూలంబిచ్చిచూచి కౌసల్య పలికె।
సుతతాంబూలంచాయ సూర్యునిమించియుండె ।
యీముగియెంతపుణ్యాత్ముడో యీముగువను పొందగలిగె ।
కమలోద్భవుడు కనుదిష్టితగిలిసన్న ।
నీలాంజనముగని నిత్యతాంబూలముంచిరి ।
మేన మయిజారుకొంగున బంగారుముడిచికాంతకిచ్చె ।
పచ్చలపావాలు పట్టెపాదాలకిచ్చె ।
రంతుచేయకమ్మ రతికేళిగృహముకరుగు ।
మహాఋషిచిత్తాన మనస్సెరిగిమసలవమ్మ ।
వసంతఋతువునతపసికి మనసెరిగిమసలవమ్మ।
ఋషినీకుపతి యగుట నీజన్మసఫలమమ్మ ।
మాకల్లినిమ్ము పంపినందుకు మాకోర్కెలీడేర ।
పరమపతివ్రతవమ్మ పతిపూజచేయవమ్మ ।
కపుగలిమ్మనీవిభుడు గగనపడిఅడుగునమ్మ ।
వెల్లపాన్పుమీద విభుడెట్లు వినయమునకపుగలిమ్మ ।
సురటివిసుదుకునువిభుడు చిరునగవులునవ్వవమ్మ ।
పతినిమెప్పించుకొని రతికేళిమేలమాడు ।
హంసతూలికాశయ్య అతిసరసాలాడవమ్మ ।
పాదములొత్తవమ్మ పానములొత్తనీవు పతినిఒప్పించవమ్మ ।
ఈకాంతమువిషయము ఎవరికిఎరిగింపరాదు ।
మాతకుఎరిగింపవమ్మ మముగన్నతల్లివనెను ।
అడుగడుగుకుఅతల్లి సుతకునవరత్నాలోసి ।
సుతనుమేడలకంపి నిట్టూర్పుబుచ్చితల్లి ।

పట్టచాలకబక్క పణతియెట్లుతాళునా ।
తలచినేధరణిపతి తగునీకుచెల్లవనుచు ।
మహారాజాపలుకులకు మారాడవెరచితపుడు ।
శాంత అత్తింటికేగి శాంతముతోనుండి అచట ।
పసిడిగొలుసులతలుపు కుందనపుగడియవేసె ।
మహారాజసుత వెళ్ళి మహామునియెదుట నిలచె ।
అర్కుడుదయించెనని ఆమునిభ్రాంతిగొనెను ।
తేటచూపులయింతి ధరణిపైనిలచె నపుడు ।
సముద్రుడగుశాంతాపతి తనశయ్యతొడల గొనెను ।
వచ్చినోరాదోయని మదితల్లడించె విభుడు ।
చిరునవ్వులునవ్వుచు శృంగారవతిని బిలచె ।
పతియాజ్ఞపూజించి బన్నస్వరములు కదలగా ।
అడుగుఅడుగునసతికి అందెలుమ్రోయుగాను ।
హంసనడకలఆశాంతను అందుకొని తొడలనుంచె
కర్పూరతాంబూలంబు భక్తితోడనిచ్చె
సఖముకొఱకుచుపతికి స్నేహమున అందించెను ।
బన్నస్వరములపైట పతిజారదీయుచుండె ।
ఆభరణములన్నియు అటుతొలగదీయుచుండె ।
పరిమళమ్ములుపెక్కు భామపైవేయుచుండె ।
పరిమళమ్ముదరగా పణతిశిరస్సంచుకొనెను ।
తపస్సులన్నిమాని ధవళాయచేతిరివిమా ।
మమతతోనామనసునను మరియాదగానుగొనుమా ।
చిత్తమునవీకొరకు రాణివాసమునకొస్తి ।
శాంతావిలాసమునకు మహారాజానగరుకొస్తి ।
దేవతలుబొగడదేవి నినుపెళ్ళాడితి ।
పంచభక్ష్యపరమాన్నములు కౌసల్యవడ్డింప ఆరగిస్తి ।
ఋషిపల్లెఅనగాను యీసడింపేల యింతినీకు ।
కలికిచిలుకలకొలికి ప్రేమించిపలుకవాతో ।
విభునిప్రార్థనవిని యింతిశ్రమానలేచె ।
కౌసల్యంలికనరీతి శాంతతాపతియెదుటనిలచె ।
చాలపచ్చిపువ్వుల సురటిచాలగవిసరె మునిపతికి ।
అతివసురటిబట్టగా అత్మలోనవ్వుకొనెను ।

సుకరేలబట్టేవు సుదతినీచెయ్యి కందదటవె ।
నాకరముకందగా నీకరముకందదటవె ।
నీకరముకందితే కౌసల్యనినుజూచిఓర్వదనెను ।
అనుమనోచ్ఛకుంటు విభునితోడపైజేర్చుకొనెను ।
బంతులాడుదామని పతిబంతులందుకొనెను ।
బంతులేఅందుకొని పంజరమ్ములే అడ్డుకొనెను ।
దేవఋషిచెలి దగ్గరచేసి గరిషించె కాంతవిభుని ।
తనకర్పూరతాంబూలం యాకాంతపుక్కిళ్ళనుంచె ।
తెల్లవారగవచ్చె గేదిముఖకళలనింతనిచెప్పెను ।
అరుణోదయమాయెను తపస్సుమోసమొచ్చె ।
దశరథులకడకేగి తల్లడగదేవతులిట్లనిరి ।
తెలివిచాలనుఋషికి వేగుదెబ్బను సూవరా ।
శృంగారపుమోహాన చిక్కున్నాడు శీఘ్రనతేపుమనిరి ।
దేవతులపలుకులు దశరథులు నవ్వుకొనిరి ।
నాట్యకన్యలబెట్టి భృగరుమోగించెదవృను ।
తుంబురునారదులు పాడముగుభులుమోగ్రుగాను ।
అంతలోదేవఋషి అంతలోమేలుగాంచె ।
యెదుకొమ్ముపైబూనిన కాంతచెయి మెల్లంగదించె ।
ఋషివరా వికలనను మాతప్పగాయునునెను ।
మదినిపూరు దయబూని మన్నికరుణించమనెను ।
ఋష్యశృంగకాకలకు ఋషులుచేతులొగ్గిరంత ।
నవరత్నపీఠములు మహారాజె పరిపించిరి ।
అంతపుష్పవకములు తరుపులు దించిరి కొలనుకు ।
యేతెంతునని గొబ్బునవడిచెఋషిమహాఋషి ।
వెంటనే మహామునులు వారితోచనుదెంచిరి ।
అంతటమహారాజు మనములుతెలుసుకొనిరి ।
మూడుదినములుమునవెుప్ప మజ్జనముగావించుమ ।
యేండిదినారు ఋషినియమువతీరమ్ముమీద ।
ఏతెంచకాలాఅసంగతులేగాని గతిమాకుగావరాదు ।
అనుమవల్కుచువారు అంతతీరమునకు జనిరి ।
కౌమరొప్పగాఋషి కొలువులోకూర్చుండెను ।
కాలాగడియలు జపముశీఘ్రనతానుజేసి ।

ఋషిసతీతలఁపుతో మదిని సంతోచిత్తుడాయె ।
తల్లులేతెంచి బాలను పరీక్షించివారు ।
చెలువచేరులుచూచి వారిలోవారునవ్వుకొనిరి ।
మహాఋషిమక్కువలు మగువచెల్లించెన నెడు ।
వారిపలుకులువిని శాంతతనశిరస్వాంచుకొనెను
మాతల్లి సిగ్గేల నుమ్ము కరుణించవమ్మ ।
అల్లునికి గూతురికి ఆదేవితొట్టమార్చెను ।
పసిడితొట్టిలోను పణతిపవళింపపెట్టె ।
తల్లినిద్రించుమని తల్లిచేయూచి పాడెనపుడు ।
పరిమళమ్ములు పైజల్లుచుండెతల్లి ।
సురటిచేతబట్టి సుపుత్రివిసరుచుండె ।
నగరికియెప్పుడునరుగును పరమఋషి ।
నేత్రములుఁభావించి చెప్పుదుజాతు ।
వేడుకజామునాని పెన్నదుధర్మసంతానములకు ।
డాళలేనని మోహములజిక్కి మిగిలిమేడలోనుకల ।
హంసశయ్యపైని వేదఋషిగూర్చుండ వెంటిరమ్మనిపిలచెను ।
హారములుఁకదలగ హార్షమునసేవించుటకును ।
బన్నసరముపైట పతిజారదీయుచుండెను ।
యాభరణముఁన్నియును అటులతొలగతోయుచుండెను ।
పరిమెళమ్ములుపెక్కు పాలిళ్ళపైనలుగుచుండెను ।
పరిమళమ్ములు అందుగావించిపిఁస్వాంచుచు ।
తాశిరస్వాంచగాతపః శాంతవేడుకొనును ।
తాఁహారాలని గ్రక్కునశాంతనగాను ।
ఇంతివిరహాగ్ని పొంఁదవిభుడుదలపోయుచుండె ।
భానుడుగ్రుంకెను మహారాజా కొలువ్వచాలించివచ్చి ।
స్నానసంధ్యాలువార్చి సరగునఆరగించెశాంతాపతి ।
పంచభక్ష్యాన్నములు పళ్లెమునముంచగాను ।
ఆరగించుమనితల్లి అతివకు యిట్లనిపలికెను ।
విట్టతనముపహించుకొని దీక్షయొనిలుపవమ్మ ।
విట్టతనముఁ వహించుకొనిమూడును శాంతాభుజించెను ।
మేడకుపులిశాపుచేయించి సుతకశృంగారముచేయఁగలిగ ।
కైయ్యేరుగా బులపక్నటజలఁమార్చితల్లి ।

పంచనవరత్నాలు బాగుగజడవేసిరి ।
కురులునొప్పునవాల్చి నెలబాలజడలల్లిరి ।
కురులుచక్కగదువ్వి పారిజాతములుముడిచిరి ।
ముఖముకై వడిదీర్చి మొగకొమానాంగియనిరి ।
నుదుటతిలకమొప్పగదీర్చి కోలికలసన్నంపు కాటుకిడిరి ।
దొడ్డదొడ్డతొడుగులు తనయకాంతకిడిరి ।
తేజమయినతొడుగులు దేవికాంతకిడిరి ।
ఘనమయినతొడుగులు కౌసల్యనుతికాంత దేవితొడిగె ।
అక్షలుచుట్టియిచ్చి తల్లి మడుపులందించెను ।
సుదతితాంబూలముయిచ్చి చూచికౌసల్యపలికె ।
చదరపుంపగవిడియము నేర్పుతోచేయవమ్మ ।
అడుగుముందరిచేసి అతివగొబ్బుననడిచెను ।
మతమేడలోనడవగాజూచి తల్లులునవ్విరి ।
కొంతకాలముదాకి చెలులారబుషియింట వెరచుచుందురు ।
దాక్షిణ్యంపుటివమ్మపెద్ద యారముననుంచిరి ।
నేడుయేమొనందని పతిమతిని మెచ్చుకొంటు ।
మనకాంతకివియేమివింతవిపలికిరి రమునుమాచుచువిభుడు ।
వేగమెవెళ్ళమని కాంతలంపరు[illegible]షి కౌసల్యకిటనిరి ।
కౌసల్యవేగమెబుషిమేడకు కూతునంపించమనిరి ।
సమ్మతిని పతివ్రతములుచేయ ।
పువ్వులుమేడలువదలి పూబోణిఅతివనాకొరకు ।
ఆరగించను వెరస్త్రీవా నెలతవావిరహాగ్ని ।
బాధకోడితి నీసన్నిధినేనిప్పలేను ।
చలువపువ్వులవలువపై సతిమహామునివెళ్ళెను ।
అంతలోదశరథులు అర్ధాంగిమేడకొచ్చె ।
సతియెదురుగావచ్చి పతిపూజచేసెదేవి ।
హంసతూలికాశయ్య ఆరాజుకూర్చుండెను ।
కనకపళ్లేరాల కర్పూరవిడియమిచ్చి ।
కౌసల్యవిడియముగనముగ అందుకొనిరాజు ।
పరిమళవస్తువులు సతిపతులుస్వీకరించిరి
సతినికౌగిటచేర్చుకొని సంతోషమునబలికెను ।
మతవేళభోగములు వేడుకలు దప్పవలెను ।

బహుకాలతపసిద్ధిగములనించుచుండెను ।
మహాఋషిమహర్షులు మగువచెల్లించెనేడు ।
రాత్రింగల ఋషిని తనకమేడంచనంచనెను ।
తనకు వేడు ఋషిని నిలిపేటిమాత్రమునీవు గానరదు ।
మాత్రధారవల్లకడి మూర్తిమించుచుండె ।
శాంతికళ్యాణము జగతిపై మోగియుచుండె
ఇదియెవర వ్రాసినా చదివినా యెప్పుడుకళ్యాణముగను ॥

# 16 కామేశ్వరిపాట.

"వనవాడు పాంకోలను"

శివశివా దేవర శివనందికెక్కి । తరలెనే కైలాసగిరిపర్వతమునకు
పుణ్యతీర్థములాని పాలుపొందగాను । పుణ్యములు తగినన పొందగా త్రిమెక్కి
పురుషోత్తముని యందు బుద్ధి నేకుంచి । పుణ్యమై యుంపొందు పుడమిలోపలను
కామేశ్వరికల్పవృక్ష ఘనముగా జెప్పుదు । వనవాడ పాంకోలను
శుకపికశారికా బకపంక్తితోను । సరచిరమైనట్టి సుందరులతోను
ఫలపుష్పములనొప్పు పాదములతోను । కొచిగంతులుమైచు లేళ్ళగమితోను
మల్లెచేమంతులు మొల్లలతోను । వెల్లపరిశ్రీ[illegible]యున్న కరజాజులతోను
నల్లటిల్లిగున్న ద్రాక్షలతోను । యుల్లసమైనట్టి యయ్యాలతోను
అరటితోటలతోను వెనచతన్నట్టి । గంధపుతీవెల పొదగిళ్ళతోను
కలహంసలున్నట్టి కొలనలతోను । పాలుపొందు పర్ణశాలలపంక్తితోను
వలనొప్పు కపాయవస్త్రములతోను । చెలగ చుండెడి కేద మంత్రములతోను
నీలకృష్ణాంజననిచయములతోను । అజ్యధారులు గల్గు యజ్ఞాలతోను
పూర్ణమైలై వెంబొందుపురుషులతోను । కొలగుచుండెడి నైమిశారణ్యమందు
తురకణ్వదగుమైమిశారణ్యమందు । కపిల భార్గవ శాతాతపాల
కాణాదివాల్మీకి వసిష్ఠమైత్రేయ । పరాశర్యభాగ భద్రకర్ణాట
బాహుశ్యబాహ్లికాబాహురరాట । శాండిల్యభృగుగాత్రి మాండవ్యమండా
కౌండిన్యకాపాలకా గాణాపత్యా । వనవాడపాంకోలను
అతిశాంతముతో సహితమౌద్యైన । మూతనిలాకాదిఖ్యాతునిగాంచి
అడిగిరిమునులెల్ల ఆనందముగను । పృథివిలోను మునిగిరివాగుచువాల
ధనకనకవస్తువాహన శుభములను । ధాన్యాదివాడుకసు సంతానములను
కలుగజేసేశ్వర్య కదయొద్దియనిన । కలిగల్పుపంటెల్ల గలిగిపోవగను

చెప్పుమన్న సూతుడపుడు పలికె । మనవాడుపాలకొలను॥
వినుడిఓమునులార వీనులలరగను । వినుతికెక్కేటట్టు విస్తారముగను
సర్వజనులకు నెల్ల సౌఖ్యంబుగాను । బూర్వయుగంబందు పూజితమైన
పార్వతీకథలెల్ల బ్రణుతికెక్కగను । బ్రహ్మనారదుల సంవాదమేగల్గు
బ్రాహ్మణులకు హితవైన వాఖ్యానమొకటి । మనవాడుపాలకొలను
నిత్యమైవెలుగొందు సత్యలోకమున । ముత్యాలగద్దియను ముదముతో నుండి
వానితో పలుమారు వ్రాక్కుచ్చుచుండి । మునుదనమిగులవినయమునబొగడ
సనకాదులెల్లను సన్నుతింపగను । వారికథానాకు మరివర్ణింపుమనిన మన॥
నారదువిద్యావిశారదుగాంచి । పరమరహస్యమై బరగునీకథయు
విరివిగచెప్పెద వినుమని పలికె । మనవాడుపాలకొలను॥
దెలియుడీదేవశాశివనంది నెక్కి । దేవమార్గము బట్టిదివ్యమైనట్టి
దివ్యమై పెంపొందు రత్నములతోను । దివ్యమైనక్రీడాభవనములతోను
యక్షకిన్నరుల విమానములతోను । నక్షత్రపర్యంత శిఖరములతోను
పక్షులరొదగల్గు వృక్షములతోను । నాగకన్యలయొక్క నాట్యములతోను
బాగయినసురపొన్న పంక్తులతోను । బెదరిబాగుశేశ్యకదుపులతోను
సుదతులశోభనగణములతోను । మలయుచుదిరుగు దివ్యమునులతోను
నెమిళ్లతోగూడు మామిళ్లతోను । రామనామముబల్కు రాచిల్కతోను
చంపకాశోకపున్నాగములతోను । నుండునవరత్న రాసులతోను
విలసిల్లు విరజాజి మొగ్గలతోను । లలిమీరు తామరకొలనులతోను
నిర్మలిన్యమంగానట్టిహార్మ్యములతోను । ధర్మనిర్మితమయినబాణములతోను
వేదాంతములుబల్కువిద్వాంసులతోను । వాదులాడెడిసూరివర్గములతోను
కూడియున్నకులాచములకుసాగ । కదలిరికైలాస పర్వతమ్ములకును॥
ఇవామందుపోయిపోయియికపోయిపోయి । భోగవతికన్నెలావాగడగంటిదేవ
మూంకాళియొక్కరై మాధవియొక్కరై । అవసరమోహామునయెదురున్నవారు
విశ్వరేఖాన్నలా దివ్యకన్యకలు । బరచిచెప్పకరారవిశ్వేశ్వరారు॥ మ॥
అంతటాకైలాసగిరిపైకినేగి । హార్మ్యమధ్యమునందు ఘనమొప్పగాను
తామరలవాసనలతోడనుగూడి । ప్రేమందప్పెడిమనటి పొదలతోగూడి
వాక్రిమ్మకలహంసవితతితోగూడి । వీకరత్నాలతో విలసిల్లుచున్న
రాకేందుముఖులతో రంజిల్లుచుండ । మల్లెలతోగూడు మంటపమ్ములకు
మహాదేవిశివునితో మరివేగవచ్చి । ప్రమదులనుముట్టితాప్రార్థింపుచుండ
కనకనిత్యమైనట్టి గద్దియపైని । సురలుపూలవానలుగురియుచుండ
వందుందుభులుమ వాయింపుచునుండ । రంభపూర్వనినాట్యమాడుచునుండ

జంభారిస్తోత్రములు సలుపుచునుండ । జయజయధ్వనులతో జరుగుచునుండె
రయమున వింజామరలు వీచుచునుండె॥ మ॥
అంతటదేవికి దాహంబాయెను । ఆనచేతకూలాన తవ్విరి చెకొలను మ॥
ముత్యంపుకొలనాయె శ్రీపర్వతాన । వజ్రంపుచాయలదె కొలనుఉదకమ్ము
వజ్రంపుకొలనాయె శ్రీపర్వతాన । కస్తూరిచాయలదె కొలనిఉదకమ్ము
నీలంపుకొలనాయె శ్రీపర్వతాన । నీలంపుచాయలదె కొలనిఉదకమ్ము
పగడంపుకొలనాయె శ్రీపర్వతాన । పగడంపుచాయలదె కొలనిఉదకమ్ము
రత్నాలకొలనాయె శ్రీపర్వతాన । రత్నంపుచాయలదె కొలనిఉదకమ్ము
గంధంపుకొలనాయె శ్రీపర్వతాన । గంధంపుచాయలదె కొలనిఉదకమ్ము॥ మ॥
మంచిఆరగించె మూడుదోసిళ్లు । మంచకారగించె మూడుదోసిళ్లు
కొంచిఆరగించె యేడుదోసిళ్లు । కొంచకారగించె యేడుదోసిళ్లు
ఏడుదోసిళ్లకు ఏకగర్భమ్ము । యొక్కొక్కగర్భము తొమ్మిదిఘుడియలు॥ గా॥
చిరితొడలబుట్టింద చిరివేణితాను । చిరివేణితాగోర చిక్కుపుట్టమ్ము
పెందొడనుబుట్టింద పేర్వేణితాను । పేర్వేణితాగోర పెద్దరంగమ్ము
వీపునబుట్టెను వీరభద్రుండు । వీరభద్రుడుతాగోర వింజామరములు । మ॥
అరికాళ్ళబుట్టింద ఆసకమ్మతాను । ఆసకమ్మతాగోర యిసకల్లుపుట్ట
మడమలపుట్టింద మాంకాళితాను । మాంకాళితాగోర మంచివల్లెల్లు
ముణుకున్నబుట్టింద ముద్దరాలుతాను । ముద్దరాలుతాగోర ముత్యాలపేరు
కటియందుబుట్టింద కనకమ్మతాను । కనకమ్మతాగోర కమలపత్రములు
బొడ్డునబుట్టింద పోతన్నతాను । పోతన్నతాగోర బొందుగాళ్లల్లు
శిరమునబుట్టింద పేరిందేవితాను । పేరిందేవితాగోర పెక్కుజననమ్ము
జంఘానబుట్టింద జక్కులమ్మతాను । జక్కులమ్మతాగోర సన్నవలిపెమ్ము
కొనలందుబుట్టింద కొండవేణితాను । కొండవేణియగోర కొలకుల్లుట్ట
వెన్నునబుట్టింద యెన్నమ్మతాను । యెన్నమ్మతాగోర యెర్రబాణమ్ము
రొమ్మునబుట్టింద రత్నమ్మతాను । రత్నమ్మతాగోర రమ్యంపుపట్టు
చెక్కులబుట్టింద చేమంతితాను । చేమంతితాగోర చిత్రంపురవిక
కన్నులబుట్టిందెకలికిరామన్న । కామన్నతాగోర కనకాంబరాలు మన॥
ఏడుగురుఅక్కలుఆరుగురుచెల్లెలు । యెంతో మోహముతోనుతమ్ములిద్దరును
ప్రేమతోనానాటపెరుగుచునుండ । కామన్నఅందరిలోకలితామురసి
పెరుగుచుకామన్న పువుపాదలకెక్కె । పాదలనుపువ్వులావడినిండగోసె
యాపువ్వులు ఈశ్వరుని నేత్రములజల్లె॥ మ॥
కనుదృష్టిమధ్యమాయెకానరాదాయె । కానగాకాశివుడు కాపాడుచుండె

దోసెడురత్నాలు తాదోసితెచ్చి । యెరుకనుఅడిగితె కాదన్నతాను
సుతులనుఅడిగితెసుదతి కాదన్న । సుతులనుగ్రక్కున పెంపొందుచుంద్రుడు
వారంతమనసులో యేమికావీరు । పప్పుపంచదారలెల్లకోరేరు
ఉప్పుగావడపప్పు పళ్ళుకోరేరు॥ మ॥
వనముకోవెలగాని వాసంతమొకవె । వలరాచఅక్కలను రంగమ్మపాసగె
మునుగుచుతోలింటిమనుమాపుపొద్దు । శ్రీలక్ష్మిఅక్కలు శృంగారవతులు
శ్రీలక్ష్మిబాలలు శివునిపంపునను । శ్రీపురపట్నానికివచ్చినందరును
కోలవవలెకామేశ్వరినిజాలసేర్పరించి । పెట్టవలెచిత్రింపుసిరిపట్టచీర
మనముగొల్చురామునుహిమవెలసగను । ముందుగొలుచుదామనమొప్పగాను
అనిపల్కి-సఖులతో కైలాసనగరికి । మునుతూర్పుభాగమునసిర్మించెబ్రహ్మ
అరుదయినవారికిఅమృతంపుకోలను । ఆకోణముపశ్చిమున అమరినాకోలను
వెండిపుయ్యాలలతో వెలసినాకోలను । భమిడిపుయ్యాలలతో ప్రబలినకోలను
రత్నాలయుయ్యాలతో రంజిల్లుకోలను । పచ్చలుయ్యాలలతో ప్రబలున్నకోలను
వజ్రాలయుయ్యాలతో పనగైనకోలను॥ మనవాడు రాలకోలను॥
అంటిసీడలదాక అమరించెకోలను । దబ్బనీడలదాక దాపించెకోలను
యిప్పనీడలదాక యిమిడించెకోలను । పాటంతిప్పుల్లదాక పచ్చిందికోలను ॥
చిలుకలుచెలరేగిఆడేటికోలను । హంసప్రతినపికలునడిపించెకోలను
తుమ్మెదఝంకారాలు మోసినకోలను । రత్నాలతాపేస్పురాజిల్లుకోలను
మంచిముత్యము లోమహినొప్పుకోలను । చక్రవాకములతో చెన్నొందుకోలను
నామకుల్లలతో నాడెమయినకోలను । నీటివాసములునిండువున్నకోలను
తామరపువ్వులతోతరుచైనకోలను॥ మనవాడుసాలకోలను॥
చిటిచిట్టిముత్యాలకుంచ చేబట్టి । చీరవేశికోలనాడవేంచేయురమ్మ
పెదపెద్దముత్యాల కుంచచేబట్టి । చీరవేణికోలనాడవేంచేయురమ్మ
అనేకముత్యాలకుంచచేబట్టి । అపరమ్మకోలనాడవేంచేయురమ్మ
మారకతముత్యాలకుంచచేబట్టి । మాంకాళికోలనాడవేంచేయురమ్మ
ముదమొప్పరత్నాలకుంచచేబట్టి । ముదురాలుకోలనాడవేంచేయురమ్మ
కనకంపుకుంచయొకగమందుబట్టి । కనకంపుకోలనాడవేంచేయురమ్మ
జాజిమొగ్గలకుంచచేతనేబట్టి । కందువేణికోలనాడవే చేయురమ్మ మన॥
కోరిపగడపుకుంచచేతనేబట్టి । కంబువేణికోలనాడవేంచేయురమ్మ॥
యొరుపుధాతుకుంచచేతనేబట్టి । యెన్నెమ్మకోలనాడవేంచేయురమ్మ
రత్నాలదాపినకుంచచేబట్టి । రత్నంపుకోలనాడవేంచేయురమ్మ
చారడుముత్యాలకుంచచేబట్టి । చామంతికోలనాడవేంచేయురమ్మ

ముద్దపసుపులోప్ప చేత నేబట్టి । ముత్తయిదులకొలనాడ వేంచేయరమ్మ
కొట్టుపసుపులోప్ప చేత నేబట్టి । గొంతులు కొలనాడ వేంచేయరమ్మ
అనుపుపసులోప్ప చేత నేబట్టి । అక్కలూ కొలనాడ వేంచేయరమ్మ
చాకలి పసుపుతలు చంక బెట్టుకొని । చాకలియిసకమ్మ కొలనాడరమ్మ
మూకోటిదేవతలు కొలనాడారమ్మి । మునిరాజులందరు కొలనాడరండి
సందెన్న నారదుడ కొలనాడరండి । నాతులందరుగూడి కొలనాడరండి
వీరింట పేరంటాళ్లు కొలనాడరండి । వీరింట కామన్న కొలనాడిరమ్మ మన॥
కొట్టుపసుపాక చేతకుంకుమొక చేత । పెళ్ళిరేఅక్కల్లు కొలను విడనాడి
కట్టుకొన్న చీరెల్లు గట్టుకొన్న బెట్టె । వొకవంకకన్నెల్లు వాలలాడేరు మ॥
అందరు అక్కల్లలో మెలిగేటితమ్ముడు । పోతన్న తా వచ్చి ఘుడియలు వేసె
ఘుంటలఅఘుడియ ఘల్లునా వేసె । కెంపులఅఘుడియ కుదురుగా వేసె
పచ్చలఅఘుడియ పరుగునా వేసె । మనవాడు పాలకొలను॥
తూరుపు మాదికా కలితుమ్మిపువ్వల్లా । మా చేతపువ్వల్ల మీరు గొల్తురయ్యా
గిలిగిలిముత్యాలకొండ కాచాలా । ఈరాత్రివాకిళ్ళ పుంచరె ఘుడియా
దక్షిణా మాదివాకిలి తామరపువ్వల్లూ । మా చేతిపువ్వలూ గొల్తురయ్యా
గిలిగిముత్యాలకొండి కాచాలా । యీరాత్రివాకిళ్ళు పుంచారె ఘుడియా ॥మన॥
చాకలిమడతలు చక్కగా పరచి । ఏడుగురు అక్కలకొనాడ బెట్టె
పాదాల చక్కగా పసుపు రాసి । పరి మెళకుంకమ్ము పారాణి బెట్టె మ॥
వారింట అక్కల్లు యేమి కోరేరు । చలిమిడి పడిపప్పు చాలకోరేరు
బంగారు కలశకు పరిమెళమద్ది । బంగారు కళశకు ముత్యాలు అద్ది
బంగారు కలశలో పానకం బోసి । పట్టుచీర దెచ్చి పైనొప్పగప్పి
తమలపాకుల మీద కామన్న నుంచి । మల్లెపువ్వులను రెల్లుపువ్వలును
తంగేడు పువ్వల్లతోనుయీ కాముని పూజింత్రు । మహిసాక్షి గుగ్గిల ధూపమ్ము వేసి
బంగారు పళ్ళెములో పాలు నెయి బోసి । బంగారు కడియము పాలలో వేసి
వారింట అక్కలు కొలనాడరండి । వారింట పేరంటాళ్ళు కొలనాడరండి
వారింట దేవతలు కొలనాడరండి । వారింట కామన్న కొలనాడరమ్మ॥ మన॥

## స్నానకాలు,

గంగస్నానాన నెలకొన్నయట్టి । సాగరసంగంపు కాము కొలనాడామ్మి
కూర్మపుసానవా నెలకొన్నయట్టి । కూర్మగుండిక కాము కొలనాడరమ్మి
అరసావెల్లిస్నానావా నెలకొన్నయట్టి । అంచగొరు కాము కొలనాడరమ్మి మ॥
ముఖలింగస్నానావా నెలకొన్నయట్టి । జక్కుల కాము నీవు కొలనాడరమ్మి

జగన్నాథస్థానాన నెలకొన్నయట్టి। వేసాగుందిగలకామకోలనాదరమ్మా
గయాక్షేత్రపుస్థానాన నెలకొన్నయట్టి। గరుడవాహనకాముకోలనాదరమ్మా
కాశీపురస్థానకాన నెలకొన్నయట్టిగంగాభాగీరధికాముకోలనాదరమ్మా
ప్రియాగస్థానన నెలకొన్నయట్టి। పుణ్యతీర్థపుకాముకోలనాదరమ్మ
చిత్రకూటపుస్థానాన నెలకొన్నయట్టి। చిత్రింపుకామేశ్వరికోలనాదరమ్మ
ద్వారకాస్థానాన నెలకొన్నయట్టి। దూర్వగాకామేశ్వరికోలనాదరమ్మ
మధురాపుర స్థానాన నెలకొన్నయట్టి। మహాలక్ష్మికాముకోలనాదరమ్మ
హరిద్వారపుస్థానకాన నెలకొన్నయట్టి। అందలకామేశ్వరికోలనాదరమ్మ
ఉజ్జయినిస్థానన నెలకొనినయట్టి। పుత్రికామేశ్వరికోలనాదరమ్మ
గంగోత్రిస్థానన నెలకొననయట్టిగంగయమున। కోలనాదరమ్మ
కేదారిస్థానాన నెలకొనినయట్టి। కనకఘుంటలకాముకోలనాదరమ్మ।
గౌరిమయూరపుస్థానాన నెకొలనియట్టి।గురుతయినకామేశ్వరికోలనాద
బదరినారాయణస్థానాన నెలకొనినయట్టి।బంగారపుకామేశ్వరికోల
నాదరమ్మా
కుండలేశ్వరపుస్థానాన నెలకొనినయట్టి। కనకహారపుకాముకోలనాదరమ్మ
సోమనాథపుస్థానాన నెలకొనినయట్టి। సౌభాగ్యపుకామేశ్వరికోలనాదరమ్మ
నీలకంఠపుస్థానాన నెలకొనినయట్టి। నవరత్నాలకాముకోలనాదరమ్మ
భరద్వాజపుస్థానాన నెలకొనినయట్టి। భోగవతికాముకోలనాదరమ్మ
కురుక్షేత్రపుస్థానాన నెలకొనినయట్టి। కోమలికామేశ్వరికోలనాదరమ్మ
నర్మదాస్థానాన నెలకొనినయట్టి। నిర్మలకామేశ్వరికోలనాదరమ్మ
మహేశ్వరస్థానాన నెలకొనినయట్టి। మంగళకామేశ్వరికోలనాదరమ్మ
కైలాసస్థానాన నెలకొనిన యట్టి। కమలాంగజకాముకోలనాదరమ్మ॥మ॥
సింహాచలస్థానాన నెలకొనినయట్టి సంకాకొప్పులకామికోలనాదరమ్మ
పిఠాపురపుస్థానాన నెలకొనినయట్టి। పరమాహ్లాదపుకామకోలనాదరమ్మ
కోటిపల్లిస్థానాన నెలకొనినయట్టి। సప్తగోదావరి కామకోలనాదరమ్మ
రాజమహేంద్రపుస్థానాన నెలకొనినయట్టి। అఖండగోదావరికామకోలనాద
చెల్లూరిస్థానాన నెలకొనినయట్టి। ముత్యాలకామేశ్వరి కోలనాదరమ్మ
పేరూరుస్థానాన నెలకొనినయట్టి। పెంపొందుచున్న కామకోలనాదరమ్మ
బెజవాడస్థానాన నెలకొనినయట్టి। భీమాకామేశ్వరికోలనాదరమ్మ॥మన॥
కంచెల్లిస్థానాన నెలకొనినయట్టి। కంచుమేడలకామ కోలనాదరమ్మ
కాళహస్తీస్థానాన నెలకొన్నయట్టి। కంచుఘుంటలకాముకోలనాదరమ్మ
కాంచీపురస్థానాన నెలకొన్నయట్టి। తమలపాకులకామ కోలనాదరమ్మ

శ్రీరంగస్థానాన నెలకొన్నయట్టి । దివ్యకామేశ్వరి కొలనాడరమ్మి
కావేరిస్థానాన నెలకొన్నయట్టి । కళ్యాణకామేశ్వరి కొలనాడరమ్మి
కుంభకోణస్థానాన నెలకొన్నయట్టి । కనకాఘుంటకాము కొలనాడరమ్మి
చంద్రపుష్కరణిస్థానాన నెలకొన్నయట్టి । రామాగల్లికామకొలనాడరమ్మి
సుబ్రహ్మణ్యస్థానాన నెలకొన్నయట్టి । సౌభాగ్యపుకామేశ్వరికొలనాడరమ్మి
అనంతశయనస్థానాన నెలకొన్నయట్టి । ఆరామములకాము కొలనాడరమ్మి
దర్భశయనస్థానాన నెలకొన్నయట్టి । ధమ్మిళ్ళకామేశ్వరి కొలనాడరమ్మి
మనవాసాలశాంతీశ్వరస్థానాన నెలకొన్నయట్టి । శృంగారపుకామేశ్వరి
శ్రీశైలస్థానాన నెలకొన్నయట్టి । చిత్రమూకామేశ్వరి కొలనాడరమ్మి
భద్రాచలస్థానాన నెలకొన్నయట్టి । భద్రంపుకామేశ్వరి కొలనాడరమ్మి
ఈపూరస్థానాన నెలకొన్నయట్టి । వాడైనకామేశ్వరి కొలనాడరమ్మి॥మ॥
ముట్టరమ్మయీకొలను మూడువేల । చేపట్టరమ్మ యీకొలనుబదివేలు
రెట్టిరమ్మాఈకొలనూరయేడువేలాను । దించరమ్మాఈకొలనుదీర్ఘాయువౌను
ఈకరణిజేసిరి కామేశ్వరిపూజా నాగమ్మదేవతలు లేకమైదనరా
చేసినపూజలు శృంగారమొప్పి । ఘాచినకల్పకముపొంగుపుష్కరనగారగను
లోకములోజనులకు ప్రాకటంబుగను । లోకములోవిలసిల్లురూఢికెక్కినన
ఆయురారోగ్యములధనధాన్యములును । అష్టైశ్వర్యమందుసంతానములను
యిచ్చెననుచును జెప్పి బ్రహ్మసారదుతో । మానవాడుపాలకొలను॥
ఈకొలనుకొలిచినకాపుపేరేమి । కామన్నకల్పవృక్షమ్మ
ఈకొలనుగొలిచిన అతివపేరేమి । అతివపేరుశీతమ్మ అడానేర్చుదువా॥మ॥

# 17 సత్యభామసరసము.

వసుదేవదేవకీ వరపుత్రుడనగ । వతిశాంచుగోపికా వల్లభుచరిత్రి
అరవిందనాభుడికి అర్ధాంగిలక్ష్మి । సత్యభామాదేవి సరసముగనాడె
పిలిపించిచిరినవ్వు తిరుకు మొగమునకు । పసులాపతిచ్చెనేపరమాత్మదేవి
అలకలేపుయ్యరె అరుగులమీద । కులకలేకస్తూరి శ్రీఘంబుగాను
మున్నగాపనుపూడ్చి పన్నీరుచల్లి । కనకంపుగడపలా కస్తూరిజల్లి
ముత్యాలముగ్గులు పెట్టేటివారు । రత్నానరంగవల్లి రాసేటివారు
మాణిక్యము దివ్వె పెట్టేటివారు । మకరతోరణాలు కట్టేటివారు
మాత్రాన్నసున్నంబు ధవళించువారు । పచ్చాకుకుందిళ్ళు వేసేటివారు

పసుపుటాకులుదళ్ళు కట్టేటివారు । కట్టాణిపాచేరులు కట్టేటివారు
పాలుపైనపూతలూ పూసేటివారు । యెన్నికతెలనాకులిచ్చేటివారు
పచ్చనిపాదాలు వొత్తేటివారు । రత్నాల స్తంభాలుయొత్తేటివారు
కస్తూరివాసనలు కలిపేటివారు । చిప్పల్ల శ్రీగంధంతీసేటివారు
వారిజలోచనుడు వారిళ్ళకడకు । వలసగినముల వారు వచ్చుటయు నెరిగి
పచ్చంగవేసినా పందిళ్ళుమెరయ । నిలువుటద్దము దెచ్చి మెరుగుతుడిపించి
మేలయినకస్తూరి మెదిపేటివారు । యేడునిలువులభమిడి మేడలోపలను
భమిడితెరణిలోళ్ళదేపట్టెమంచమ్ము । హంసతూలికాపాన్పుపట్టుజాలరులు
అచ్చుతులగూర్చుండ నమరినపాన్పు । శృంగారరాయుడీచంగల్వపాన్పు
బంగారుజనపోతి పాన్పునపరచి పొన్నలుబొగడులు బొండుమల్లెలను
అమంచిపాన్పున అవిచాలపరచె పొద్దున్నపూచినాపొన్నపువ్వులను
అమంచిపాన్పున అవిచాలపరచి ఝామాయపూసినా జాజిపువ్వులను
అమంచిపాన్పున అవిచాలపరచి అప్పుడేపూసేయిఅచ్చమల్లెలను
అమంచిపాన్పున అవిచాలబరచె ఘడియలోపూసినవి కనకాంబరాలు
అమంచిపాన్పునంఅవిచాలబరచి నీళ్ళోయిపూశాయినీలాంబరాలు
అమంచిపాన్పనఅవిచాలబరచె । నాగలోకాననున్నసల్లకలువలను
అమంచిపానుపునయవిచాలబరచి । పొద్దోయిపూసేవిబొండుమల్లెల్లు
అమంచిపాన్పునయవిచాలబరచి । మధ్యాన్నయిపూసేది మంకెనపువులు
అమంచిపాన్పునఅవిచాలబరచి । ఝామాయెపూసేవిసన్నజాజులును
అమంచిపాన్పునఅవిచాలబరచి । తొడిమెలపూసినవి కేతకీపువ్వులు
అమంచిపాన్పునఅవిచాలబరచి । పందిళ్ళపూసేవి బంతిపువ్వులును
అమంచిపాన్పున అవిచాలబరచి । నిశ్యయూపూసేవినిత్యమల్లెలు
అమంచిపాన్పునఅవిచాలబరచి । జాజివిరజాజిసహస్రమల్లెలను
పారుజాతమ్ములుబాగుగాపూచె । ఘనముగా పూచినవిగన్నేరుపువులు
అమంచిపానుపున యవిచాలబరచి । బాగుగాపూసినవిచేమబంతిపువులు
అమంచిపాన్పునయవిచాలబరచి । పండిటపూసినవిసీతపురజాతములు
అమంచిపాన్పునయవిచాలబరచి । వాసనగలమంచిఅపువులు
అమంచిపాన్పునయవిచాలబరచి । ఘుమ్ముఘుమ్మనియేటిగులాబిపువులు
అమంచిపానపునయవిచాలబరచి । పరిమెళముగలమంచిపచ్చచామంతి
అమంచిపాన్పునఅవిచాలబరచి । యెన్నికయైనట్టియెర్రచామంతి
అమంచిపాన్పునయవిచాలబరచి । తేటైనరేకులతెల్లచామంతి
అమంచిపాన్పునయవిచాలబరచి । వరుసతోపూసినవివకుళపుష్పములు

యీమంచిపాన్పున యవిచాలబరచి । వట్టివేళ్ళ్యాసుకటి ముత్యాలసురటి
యీమంచిపాన్పున యవిచాలబరచి । పన్నీరుగులయట్టి భమిడికెప్పెలను
యీమంచిపాన్పున యవిచాలబరచి । పచ్చిపోకలుమంచిపండుటాకులును
యీమంచిపాన్పున యవిచాలబరచి । అత్తరువుపన్నీరుఅనురంగపరచి
చేడులకెల్లా పనులు చెప్పిచేయించి । చిరశృంగారంబు చేయంగదలచె
సంపెంగనూనెతో శిరసాప్పనంబు । జవ్వాజికస్తూరినలుగొప్పపెట్టి
గంధమాటకలులిడెకమలాక్షికపుడు । వెండిగాబులతోటివేణ్ణీళ్ళతోడి
భమిడగాబులతో టిచలినీళ్లతోడి । చలినీళ్లువేణ్ణీళ్ళసమముగాతోడి
ముత్యాలచెంబులతో ముపితలందియ్య । జలకంబులాడెనే సర్వేశ్వరీదేవి
పట్టువస్త్రము చేత దేవితలయొత్తె । హంసదూదిపాన్పున అవితలగడాలు
అమ్మతులుకూర్చొనుటకమనపాన్పు । శృంగారరాయలకుచంగల్వపాన్పు
కడువేగవేయించి యలరాచదేవి । గంధకస్తూరికర్పూరజవ్వాది
పన్నీరుచందనం బాగుగాజేసి । చేడియకుయీపనులు జెప్పిచేయించి
పచ్చిపసుపుపన్నీరు జలకంబులాడి । పచ్చపట్టుచీరబాగుగాకట్టి
నల్లపట్టురవికె నాతితాతొడిగి । అన్నిఅలంకారాలు అతివకుబెట్టి
గజదంతచిక్కుట్ల తలచిక్కుదీసి । మొగ్గపువ్వులెల్ల ముడివిగదువ్వి
పొగడపువ్వులన్ని బాగుగాదువ్వి । నీలంపువ్వులన్ని పాపిటలుతీసి
చెంపకొప్పునదుర్కి మైచామంతిపువ్వులు। ముగదపాపిటనడుమముత్యాలుకూర్చి
వెంగలిరేకులుదుర్కిమిమల్లెలనుదుర్కిమె । చుక్కబొట్టునునుమచక్కంగదీర్చి
చిటికనబొమ్మలు చెలియతాబెట్టె । బొబ్బరికాయలుపొందుతోబెట్టె
మూడువేలువిలగలముక్కెర యిబెట్టె । కుదితముత్యాలనత్తురబెట్టె
వాల్గువేల్వ్యలు వగలునానుమెడవేసె । పదివేలచేయుభద్రస్వరములువేసె
పణతితనపద్మాలభమికెవేట్టింది । వెయివేలువిలువగలఆహారంబు
కోటికల్వలువగల గొలుసుమెడవేసె । కొక్కంపుతారమ్మ కొప్పుపవరమ్మ
నానుసలిపదుగుపెట్టె కముగా యతాకి । తనకమ్మలనుపెట్టెనుపూగోకకపుడు
విడిముత్యాలు విడనేవలాలు । వుత్తండాలపేరె వొప్పతోబెట్టె
పడికెలుచెవేటిపాంజేబులుపెట్టె । పణతితనపద్మాలపట్టెడెట్టింది
నీలాలుస్థాపించు కీలుకడియములు । నవిరుక్మిణీదేవి కంకంబుపెట్టె
ఆరగించిరెళ్ళ అచ్యుతుడుదేవి । పచ్చన్నబాగాలు పుక్కటనుబోసి
పండుతెల్లనిఆకులు పికిటటుట్టి । పాల్దిపోయెనుచేమపొండువోవాదినా
ఋామపోయెను రెండుజాములయిపోయె । కేశవురాడాయెనీలవర్ణుడు
గోపస్త్రీలలతోటి కూడినవ్యాదమ । మరచెనేనామీద మక్కువలుఅన్ని

రాజీవలోచనుడు రాకతా జూచి । గడియగ్రిక్కున బెట్టి కంకణాలుకదల
అంతలోవచ్చెను కాంతకృష్ణుండు । గరుడవాహనమయిన గరుడాద్రినెక్కి
కొమరయినముత్యాల గొడుగులుబట్టి । బడిచెంబుదకముల పాదములుగడిగి
పనిచేయవచ్చిన పరిచారకులకు । బాగాలుయిప్పించిపంపి నారాత్రి
చామరలువిసరేటి సఖియలిద్దరకు । తాంబూలమిచ్చితా తావేసుకొనెను
తలుపుమేడలమీదయెవ్వరోగాని । పేరుచెప్పకమీరు రారాదయనెను
పేరులమీదనీకు ప్రేమాయెనేమో వనితరో గోపికావల్లభుడ నేను
గోపికుడనైతేను వ్రేపల్లెనుండు । ముద్దురాలా యెకడప ప్రద్యుమ్నుపొమ్మి
జలధరుడందురేచెలియనా పేరు । జలధరుడుఅయితేను జలములనిగేవా
నరహరియైనట్టినరసింహుడందురు । నాతనికేమిగావలె నయముతో చెప్ప
నరసింహమైతే మామానరక్షకుడు । వెంకటేశ్వర్లందురే వెలదినా పేరు
వెంకటేశ్వర్లయితెను తిరుపతియుండు గోవిందుడందురే గోపినా పేరు
గొండవో గొందివో నిన్ను నే నెరుగ । అచ్యుతుడు అందురే అతివనా పేరు
అచ్యుతుడవో మచ్చువో నిన్ను నే నెరుగ । బలభద్రుడందురే పణతినా పేరు
భావవో మరిదివో నిన్ను నే నెరుగ । శ్రీకృష్ణుడందురే చెలియనా పేరు
చీరవో రవికవో నిన్ను నే నెరుగ । చేదసములు పలుకచేతగాదేమొ
పద్మాక్షినీకాళ్లుపట్టెదాననెను । ఆమాటవినిసత్యభామతావేగ
పాన్పువదిగ్గనా దిగితీసెనాఘడియ । శయ్యపైకూర్చుండె శ్రీకృష్ణుడపుడు
ముత్యాలచెంగుతాముసుకులె దీసి । అలుకలేటికినీకు అంభోజగంధి
కోపమేటికినీకు కుసుమసుందరి । నామీదకోపమా నలినాక్షినీకు
కొంగమెత్తిచూడవే శుకవాణితన్ను । కేట్లనుపోయిరాక తడవుంటిగాని
కాంతనిన్నువిడిచి ఘడియుండగలనా । నామనసుయెరుగవా నళినాయతాక్షి
నీమనసుబ్రహ్మరుద్రాదులెరుగుదురు । మనసులోపలకల్లమనసులేనాక్షి
మాయదారివియని యెరుగుదుమేము । నిన్నుకమలాక్షిమావల్ల తప్పాయెగదింకా
తప్పులన్నిటికినిదయదయచూడవలెను । తప్పులన్నియుమాకవొప్పులే కావా
కమలాక్షితనవిభుని తలయెత్తిచూచె । చెక్కిళ్లకాటుకలు చక్రధరునకును
కస్తూరినలుపురేకమలాయతాక్షి । మెడలుపరిమిళమేమి వోకృష్ణచెప్పుమా
వలపుసూపు పరిమళము వోసిరజాక్షి । చీనిచీనాంబ్రాలు బరిపసుపులాయె
శ్రీకృష్ణనీవున్న చెలువేమిచెప్పుమా । వలతోటిపసుపులో వాలాడగాను
వోళ్ళంతపసుపాయె వోసత్యభామా । మాటమాటకుబొంకు లాడకనీవు
నూరుమాటలకల్ల వొకమాటబొంకువాడుజెప్పెన। మాటనేటికాడితివి
పరమాత్మనీపెదవి పగిలున్నదేమొ । దోరమామిడితేనె లారగించగనె పెదవి

గొల్లవారితల గొలిపెలిగరమ్మ । వారాడినపంతాలు ఈడేరనమ్మా
నేడుమాదైవమ్ము వారిగూడెనమ్మా । ఏమిచేయగవచ్చు యిపుడునాగతికి
మత్సరవాలుకొగుణం మానేతురమ్మ । అచ్చగామావేడుకలువచ్చుటయులేదు
రుక్మిణిపతియేమొ పోబోకుమనెను । తాలిమిసతియింట వుండకపోతె
యిచ్చోటకుమిమ్ము రావగరమ్మనిరి । పచ్చినుమింతవుడికించనేల
పద్మనాభునే పిలిపించవలెనా । నామీదభక్తిచాలనమ్మితినినళినాక్షి
నామీదప్రేమ నీకింతనిలోచలేదు । నేనెగదలోకద్రొక్కినపాము
మిట్టిపడ్డట్టు అంతకోపముతోను । ఆయింతిపోూండేగ అరచురలేని
మాటమ్ములోపలను అరచుపడితన్ను । నేటివున్నవిభుడితో నేడుమీబుద్ధంత
యేయింతియెరుగుఅనుచును గనులనీళ్లు । వో నేడ్చుచునుండెను నాసత్యయపుడు
తలవంచిపట్టుకొని సఖియుతానుండె । చెడెరో నీవద్ద చెలికత్తెలెల్ల
సఖియరో వారిప్పు లడగవేవారిని । చెలియలునీవును యొక్కటేగాదా
చెలియనీవద్ద తింగురులంచమ్మ । ముగుదరో నినుచూడకుండెనువాడు
ఒక్కనిమిషము ఒక్క యేడయితోచు । కమలాక్షిఅరఘడియకానరాకున్న
కాంతనాకన్నుల కట్టినట్టుండు । పువ్వులబోణిరో నీవుచెప్పినబుద్ధి
చిగురుబోణిరో నేనుయెవరికోసమ్మే । యింతపదార్థంబు చెప్పినీయింట పెడుదు
మునుపుమజ్జనభోజనంబులు నీయింట । యింకనిద్దలుకా సేవలంనీయింట
నీమాటముందరా నామాటవెనుకా । రుక్మిణిచెప్పినా నీవుచెప్పినను
వినుదునేరాధికా విననునేచెలియా । భామరో నీకునేపాలివాడానా
పద్మగంధిగోనన్ను యేలుకొమ్మనెను । పల్లెంచుచిన్నెలు యీపట్టపగులు
వన్నెలుమాటలు యెన్నడాడితివో । ఒకనాడురాధికాగృహములోపలను
శీతజలమాలవాలలాడున్నవాడు । చెప్పిపంపించినపనులు చేయరయితిరి
ఆవేళభామనేను వచ్చిందియెరుగ । యితిగితేమతండ్రి వసుదేవుడాన
ఒట్టుమీకున్నదా పురుషోత్తముడా । సత్యంబుమీకున్న చామర్లగంధీ
అగ్నిసతిఅయితేను అంటనివ్వనుగా । మిత్రిసతిఅయితేను పొందనివ్వనుగా
తయణాలకనకడకు రాకుండచేసి । తనకైనకాపురంలేకుండచేసి
యికవెక్కడిబ్రికుతుమన్నారుతనను । యెన్నడుఇరుగిళ్ళవెళ్ళనివాడవు
ఏపొద్దుయిరుగిళ్ళ ఏతెంచనేర్చితి । యెన్నడుకాపురం ఎరుగనాటింది
కాపురంకేనినాడుకాగలదేది । యీచీకటిరపికటిసొమ్ములన్ని
మేడలువడుగులు మల్లెసాలల్లు । పట్టుమంచముపరుపులివెక్కడివె
బరిచారికలువెల్ల నెవరుతెచ్చారు । యిన్నాళ్లుయెవరితో భోగించినావు
యిన్నాళ్ళుయెవరితో వతిరించినావె । యిన్నాళ్ళుయెవరితోకూడివున్నావె

వారిరూపూ పేరుచెప్పవేనాతో । శ్రీకృష్ణుచెప్పేను తెస్సతో వినుము
మాయదారివాడు మరితంత్రిగొట్టు । మరితంత్రిగొట్టయినటవటవవాడు
అబద్ధాలకోరు అకటకోటుండు । అకటికియినఅలుమటలవాడు
నల్లనివాడైన సుందరుడేవాడు । కళలుగలిగినవాడు కాంతిగలవాడు
భార్యలుగలవాడు పరమపావనుడు । ఉరువునశ్రీదేవినుంచుకున్నాడు
తిలకమ్మునబోలు అతనిపలువరస । అతనిచెక్కిలిమించుటద్దములుబోలు
మకరకుండలములు పెట్టినవాడు । పిల్లనగ్రోవిచేత బట్టుకున్నాడు
అతనిపద్మంబులు శంఖచక్రములు । అతనితో పోరాడ ఓపదుగమీకు
పంతపుగపసరులు అవుటనేసె          ందుకొరకేనోరు ముసుకొనియుంటి
నాతినీకేమైన యెదురాడినానా । చెలులుతైతో చనువుచేసెకృష్ణుండు
అంతలో చెలికతెలిట్లనిరపుడు । పోయిపాలకులవిభుని కొనితేరమ్మా
కొలువుతప్పినమాటనేటికతడితివి । ఇన్నాళ్ళుగానయి వినీతులమ్మా
సవతులమీదబ్రతుకు సఖి కరోతనిరి । నడివికెనిన్నవరు పిలిపించినారు
భూతాలవలెమీరు బుద్ధిచెప్పేరు । రాక్షసులవలెమీరు తగవుతీర్చేరు
మందలావులవలెమీరుమనవిచెప్పేరు।అతనిపాదుకునాపాదుగుయెంచూస్తావో
సత్రాజిత్తునగను లోకప్రఖ్యాతి । లోకప్రఖ్యాతైన ర జకూతుర్ని
గుణముయెరుగనివానిని తెచ్చుకుంటిని । పశులకాపరివేవొకైకారివేమొ
గొల్లబోయిడవగుచు యున్నవాడవు । ఆదియేలపొమ్మని అదిగొల్లబుద్ధి
యెఱ్ఱనివాడినిపాదుగుగలవాడివి । చక్కనివోవిభుని తెప్పించుకోనవె
గూర్పుంపతీరదే కుసుమాసికగంధి । గొల్లభామలయెదుట చూచుచున్నారు
సిగ్గునత లేచి శ్రీకృష్ణునపుడు । మురళిధరుడు వెంగపాలముందరనిలిచె
ప్రార్థించియాసత్యభామా తాలేచి । పీతాంబరచెంగుపిగులగాగొట్టె
పట్టంగతవిలిశిరసుతావొంచుకొనియె । యింతచేసినపతిమీద లేదుగోపమ్ము
గుండుపెట్టిగానిగోపికరో చూడు । కొండగొడుగట్టిగా గుండెంతబరువు
నీరుపట్టెగాని సెలతరో చూడు । నీరుమోసేవారికినీ కెంతపరువు
పాముపట్టెగాని పణతిరో చూడు । పాముమీదనునిద్ర పవ్వళించేరూ
చిల్లరకాదుసుమ శ్రీకృష్ణగుణము । చెల్లంగనొకభాష చేసిపంపించె
అప్పుడుసత్రాజిత్తు పంపేటివాడు । ఆడబడుమలబుద్ధి యేమనిజెప్పె
యేమనిచెప్పుదుకొంటె వినసఖ్యమారూ । మిమ్ముశిక్షింపుము నీవిన్నపముగాను
ఆట్లైశిక్షించుమని అచ్చుతుడుబలికి । కొట్టుమనిబంగారపు కోలవేలికిచ్చె
బంగారపుకోల తానుపార వేసుకుని । అక్కడఅయింత అట్టడైనిలచె
యెక్కువలుతక్కువలు ఏమిఅడితివో । పట్టుకొనివిభునికి పాదాలవొత్తె

కొడుకులకనుకోరవె కుసుమసిరిగంధి। మనువృత్తిరొత్తవేమనముసరిగంధి
సత్యభామసరసమ్ముపాడినావిన్న । సతిపతిదంపతులు రొుహబాయకుందురు
యీపాటయెవ్వరు పాడినాగాని । కొందిలో కైలాసం పొందుచున్నవారు

# 18 రుక్మిణి చిలుక రాయబారము.

పారిజాతపదంబైనపంచవన్నెలచిలుకరావే । నావిభునితోడితేవే
నన్నాడినట్టిమాటలన్నీ వింటివా ।
మేనమామకొడుకు కీర్తిగాతనుపంతమాడెను ।
తన్నేగాని పెండ్లియాడననుచు పట్టుబట్టెనే ।
విప్రునిబంపితి కబురుతెలియదాయె చిలుకరో ।
ఏవిధమ్మునైన తనవిభునితోడితేవే ।
భీష్మకకొమారుడు పంతముతో పట్టుబట్టె ।
శిశుపాలునకిచ్చి పెండ్లిచేతుననుచు బలికెనే ।
తాపెద్దకొడుకుకాని యెరుగనిలిచి బలికెను ।
తాబట్టినాకుందేటికి మూడేకాళ్ళనును ।
కమలనాభునిపొందు యెన్నడు కన్నులగందును ।
కరుణాకటాక్షులు యెన్నడుతన్ను మోహించునో ।
పరమదయాళుడువచ్చి తనయెదుటనిలచుని ।
కరుణతో నన్నుపెండ్లాడునా । గారవించునా
గౌరిదేవినితానుపూజించి నగరికిరాగాను ।
కనకరత్నమువలెతాళిపట్టెడగట్టెనా ।
మునులెల్లదీవించి ముత్యాలతలంబ్రాలుబోసెనా ।
సురలెల్లదీవించి మంగళసూత్రముగట్టెరా ।
ఘనులెల్లదీవించి కంకణమ్ము చేతగట్టెరా ।
విదర్భదేశమువారు విచిత్రముపడితిన్నజూతురా ।
సిగ్గుపాడిశిశుపాలుడు తనతలవంచునా।
వెరవకుమనిచెప్పి వెన్నుడునను చెట్టబట్టినా ।
రుక్మాంగునిపంతము నీన్నివడివానికెక్కనా ।
కరుణతో శౌరిపెండ్లాడునా ।
నగవకేవో యక్క వైకుంఠధారుల్నువచ్చును ।

వచ్చినక్షణములో మెచ్చినవరములు యిచ్చేవా ।
మెచ్చీనాకంజేలుగట్టేవా ।
అలాగేఆదిశేషులు మమ్మాదరించితె ।
ఘనమైననావజ్రాలాయందెలు కాళ్ళకుగట్టెను ।
ఎర్రనిముక్కుకి వెండిపమిడిపొదిగేను ।
పచ్చనిరెక్కలకు హెచ్చైనముత్యాలగుచ్చేను ।
పుట్టించిపట్టాభద్రులకిల్లాడసేయావె ।
ఇంకొక్కజన్మాన రాజాధిరాజాలపట్టివి ।
కొడుకులు కోడండ్లు అల్లుళ్ళు ఆడబిడ్డలు ।
మనమలు సకలసంపదలుకలుగాకోరవె ।
అదియేమెఓయక్క అందుకునె నాసిస్తినా ।
గట్టిగా వైకుంఠపురమందు తనకిల్లుగట్టవె ।
ఎన్నడు తన్నెడబాయకు । మనిచెప్పెను
అక్కరో జూడుమనిజెప్పి గోపురామెక్కెనూ ।
దిక్కులాదీములు నాలుగురాజ్యాలు జూచేను ।
దక్షిణభూమంత తప్పాకతలయెత్తిజూసేను ।
ద్వారకాపురమందు కనకగోపురాలజూచెను ।
అభిషేకపూజలు చేసేటివారినిజూచేసెను ।
నవ్వూచువచ్చేటి నల్లవారినిజూసెను ।
బాగుగవచ్చెటి పచ్చబిళ్ళనువారినిజూసెను ।
బలరాముడుమొదలగు ఘనమయినదొరలాలుజూసెను ।
ఆవెనుకవచ్చేటిద్వారపాలకులనుజూసెను ।
ఈవెనుకవచ్చేటి విప్రపాలకులనుజూసెను ।
ఎక్కువగుర్రాలు యేనుగులకదుపులుజూసెను ।
శృంగారవనములు శ్రీకృష్ణు పొగడజూసెను ।
వేగమెగోపురము దిగిచిలుక తావచ్చెను ।
ప్రదక్షిణములుజేసి పాదపద్మములకొరిగేను ।
వసుదేవనందనుడు వచ్చిరమణినిచేకొనును ।
చేరువలగ్నముర మ్యనికృష్ణునితోజెప్పెను ।
వేగమెగోపురము దిగిచిలుకతాచ్చేను ।
అక్కరో నాకింత వుక్కెరపెట్టవాజెప్పెను ।
నీనాటకధారుడూయేవంకవచ్చెనో జూచితి ।

చక్కెరబెట్టెను పుక్కెరబెట్టను చిలుకరో ।
చల్లన్నినాప్రాణనాథుణ్ని పొడగంటివా ।
అందేలుగట్టెను చిలుకారో । అరటిపండు పెట్టెద
అనందకృష్ణమ్మ ముచ్చటలన్నీ వింటివ ।
గంధముబూసేను పువ్వులుముడచేను చిలుకారో ।
పుండరీకాక్షులు యేవంకవొచ్చేరొ జెప్పవె ।
అక్కారొ జెప్పమని నేజెప్పి గోపురమెక్కితీ ।
దిక్కులుదీపులు నాలుగురాజ్యాలు జూచితీ ।
దక్షిణభూమితప్పక తలయెత్తిజూచితీ ।
ద్వారకాపురములో కనకగోపురమెక్కితీ ।
అభిషేకపూజాలు చేసేటివారి జూచితీ ।
నవ్వుచువచ్చె నల్లబిళ్ళవారిని జూచితీ ।
బారుగావచ్చేటి పచ్చబిళ్ళవారిని చూచితీ ।
బలరాముడే మొదలైన సమమైన దొరల చూచితీ ।
ఆవెనుకవచ్చేటి ద్వారపాలకులను చూచితీ ।
ఈవెనుకవచ్చేటి విప్రపాలకులను చూచితీ ।
శృంగారవనములు శ్రీకృష్ణునిపొగడగా చూచితీ ।
వేగమె గోపురముదిగి అక్కారొవచ్చితీ ।
వసుదేవనందనుడ వచ్చెరమణి చేకొనును ।
చేరువలగ్నము రమ్మని కృష్ణునితో జెప్పితీ ।
రూపించినీవిభుని రూపమంతా నేనుచెప్పెనూ ।
అలిచుకసాలియక భక్తితో గూర్చుండివినవమే ।
అందమయినా మంచినీలవర్ణుని శిఖపైని ।
పొందూగజుట్టేను పారిజాతపూలబంతులు ।
మంచికిరీటము మకరకుండలములుబెట్టేను ।
వెలలేనివజ్రాల పోగులుబెట్టెను ।
వెన్నుడుబావిలి ముత్యాలనీలాల పోగులునీటుగాను ।
కట్టెను పీతాంబరము వల్లెవాటుగా కృష్ణులు ।
అద్దంపుచెక్కిళ్ళు ముద్దులుగారును అక్కారో ।
కలువరేకులువంటి కన్నులతీరే అక్కారో ।
మన్మథునిచేతిసింగిణివిల్లే కనుబొమ్మలు ।
మందరత్నములవంటి బంతులతీరే పలువరుస ।

అరటిబోదెలవంటి చక్కనితొడలే అక్కరో ।
చెరుకుగోలలవంటి చక్కనితొడలె అక్కరో ।
ఎగుభుజమ్ములతీరు ఎంతవింతలగాదె అక్కరో
ఘుమఘుమమని యేటికుంకుమపరిమళముదీరి ।
సందిటిదండలు జతలతావేజాలుమెరయగా ।
పచ్చలకడియాలు ముందరముత్యాలమురుగులు ।
చిత్తజాదంద్రికి ముత్యాలకంఠము లందమాను ।
ఘంటలమొలత్రాడు జమిలిగంటలుమ్రోయగా ।
చందమామతోను సరసములాడుచుకదలెనూ
ఆడుచుపాడుచునిరువంక చామరలివ్వగా ।
ఆకులుపోకలు అతివలుమణచియియ్యగా ।
మణులందిగొలుపులో చిన్నారినవ్వులునవ్వుచు ।
వ్యాసవాదులకయిన వర్ణించిపొగడవశమటే ।
హరివాసుదేవుడో యెవ్వరోగాని తెలియదు ।
వాకన్నులకుజాడ వెన్నెలవలెనున్నాడు ।
రూపించినీవిభుని రూపమెంచమాతరమటే ।
చిలుకపలుకగ రుక్మిణిచూచి చిలుకాకిలకిలనవ్వెను ।
అక్కరో యిటువంటి మాటలకెవరయినప్రథమసేర ।
చెలికత్తెలందరు గుంపులుగూడుకునవ్వరా ।
కన్నవిన్నవారందరు కేకలువెయ్యరా ।
ననుగన్నతల్లి యిదినీకుబుద్ధిగాదమ్మరో ।
చిలుకరో యేమానిచెప్పదు యిక నేతాళలేను ।
శ్రీకృష్ణరాయులుకోటవాకిలి దాటివచ్చెరా ।
రుక్మాంగునినగరిలో విడుదులువిడుతుర ।
పప్పుపాలుఒప్పుగ కూరలునేతులు ।
అప్పాలుగావాడిభునికి వుల్పాలుదెత్తురా ।
అంతటగోపాలకృష్ణము వాకిటనిలచెను ।
కళ్యాణివగడాక నీప్రాణనాథుడువచ్చెను ।
ప్రతిములుతపములు పణతిరో నీకుచేకూడెను ।
వారిజనాభులుపనితరో నీసొమ్ములాయెను ।
కలకంఠుడునీగుణములు మెల్లగావచ్చెను ।
పీతాంగనా నా దుఅశోకవృక్షముక్రిందను

చింతింపుచుండగ హనుమంతరాయలువచ్చిరి ।
ఆనవాలుదెచ్చి ఆతివశోకముతామాన్పెను ।
ఆలాగే తనవిభుని తెచ్చి తనప్రాణమిస్తిని ।
చిలుకరమ్మని అక్కునముక్కునచేర్చెను ।
చిలుకారమ్మని భమిడిపంజరములోనుంచెను ।
చెరుకులుఫలములుదెచ్చి చిలుకకిచ్చెను ।
భీష్మకమహారాజు అంతఃపురములో కొచ్చెను ।
పేరంటాళ్ళెల్లార కన్యనుశృంగారించండి ।
సంపెంగతైలాన సాంపుతో శిగస్వు అంటిరి ।
గంధాముఅటకతిబెట్టి జలకమూలార్చిరి ।
పోగకన్నులమంచి తీరుగాకాటుకదీర్చిరి ।
తీరుగాకస్తూరి తిలకమునుదుటదీర్చిరి ।
ఘుమఘుమని యొటికుంకుమపరిమళములలదిరి ।
పసిడిపువ్వులచీరెములబోసి వేగగట్టిరి ।
చిత్రజాతల్లికి ముత్యాలరవికదొడగిరి ।
ముత్యాలముడిమీదరత్నాలరవ్వదాపిరి ।
ఎక్కువయినమంచియేడువారపుసొమ్ములుంచిరి ।
శృంగారించుకు రుక్మిణినోడుకుకదలిరి ।
గౌరిదేవిపూజఘనముగచేయ రుక్మిణీ ।
శ్రీకృష్ణమూర్తినివలచుచు పార్వతికిమ్రొక్కుచు ।
దేశాధిరాజులు చూడగకోవెలకు వెలదిపల్కె ।
గౌరిదేవినిదెచ్చికనకంబుగద్దెపైనుంచిరి ।
ప్రతిభతో దేవిని పూజింపదొణగెను ।
ఉ. నమ్మితినామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముబురాణదంపతుల మేలుభజింతుగదమ్మ మేటిపె
ద్దమ్మదయాంబురాశివిగదమ్మ హరిన్పతిసేయుమమ్మ నిన్
నమ్మినవారికెన్నటికి నాశములేదుగదమ్మ యీశ్వరీ.
ఆకూలుపోకలు రుక్మిణినోటబోసిరి ।
మల్లెలమెల్లలా రుక్మిణిదేవి పూజించెను ।
భక్తితో సాష్టాంగదండము గౌరికిబెట్టెను ।
తిరిగిమళ్ళునుకలరాజు నందరినిజూచుచు ।
శ్రీకృష్ణరాయలు కానరాకపోయె చిలుకరో ।

ఈక్షణముతప్పితె శిశుపాలుని పాలుఅగుదునే ।
అనిరుక్మిణితాను చింతించుచురాగాను ।
దేశాధిగాజులు చూచిమూర్ఛలుజెందిరి ।
పొంగుచును శిశుపాలుడు నవ్వుచునిలచేను ।
దేశాధిరాజులనువర్ణించ తరముగాదు ।
భీష్మకమహారాజు రుక్మాంగుడుజూచుచుండగా ।
శ్రీకృష్ణరాయలుయేతెంచి దేవినిగైకొనా ।
బంగారురథముపయిరుక్మిణినుంచ కదలెను ।
రథముజూచిశిశుపాలుడు తనతలవంచేను ।
శంఖముపూరించి శ్రీకృష్ణరాయలుకదలిరి ।
వెనుకముందరపదివేల రాజులుండ గాను ।
అందలచాలఅడుగులు బెట్టుచునడుచుచు ।
రాజులవాహనములు గుచ్చిరుక్మిణితో జెప్పుచు ।
కంచురథముయెక్కి కాంతరో మీయన్నవచ్చెనే ।
వాడిమీసమునేను గొరిగింపవలెనుజూడుమీ ।
వెండిరథముయెక్కి శిశుపాలుడువచ్చెజూడుమీ ।
దేశాధిరాజమాడగ వీడితలల్లువంతును ।
దశదిశలుగెలువలేక వారు నిలచిరి ।
అర్ధజముగొరుగగ రుక్మాంగులు తానడచెను ।
బలరాముడువచ్చి సేనలందరపారదోలెను ।
సభరాజులజూచి శిశుపాలుడుతానుబలికెను ।

## కీర్తనలు.

ఏమయ్యాసఖులారమిమునమ్మిజవరాలిగోలుపోతి॥
వాళ్ళామనుదెచ్చి నాకియ్యకున్నాను ప్రాణములునిలుపలేను॥
పతినిరాడీప్రాణధారణముకంటేను భూమిపైవ్రాలుటమేలా॥
నాసతినియెత్తుకనిపోవుచున్నాడు వీడెంతసామంతుడో దైవమా॥
చుట్టుకునిమీరుండ గొల్లవాడెచటుండి యెత్తుకనిపోయెనో॥
మితిలేనిగోపకాంతలుయుండగతాను శ్రీ వ్వాసేగోపాలుడు॥
కలకాలంబూని దొకపండుపండితె చిలుకవిధంబాయెను॥
ఏమయ్యాసఖులార మిమునమ్మి జవరాలిగోలుపోతి॥
అనిశిశుపాలుడు దుఃఖించుతుతానుమళ్లెను ।

అప్సరసలాడగ పువ్వుల వానగురిసేను ।
ద్వారకాపురమందు నగరివాకిటా నిలచిరి ।
ఎదురుసేసలుజల్లిరి హారతులు ఇచ్చిరి ।
రుక్మిణీదేవిని అంతఃపురములోనుంచి ।
దిక్కులవారిని దేవుల పెండ్లికి రమ్మనీ ।
ఎల్లుండిలగ్నమునకు శుభలేఖ వ్రాసిరి ।
శ్రీకంఠుడప్పుడు గౌరితో గూడివచ్చెను ।
పద్మసంభవుడు సరస్వతితో గూడివచ్చెను ।
చెలికత్తెలందరు వీణలు పుస్తకంబులు ।
కొల్లలుగా వెల్ల ధనములు బట్టుక వచ్చిరి ।
చక్కగ ద్వారకాపురమంత రాజులు నిండిరి ।
భీష్మకమహారాజు తనసతితో గూడవచ్చెను ।
అంతఃపురములో కాంతలందరు గూడుక ।
సంపెంగతైలాన సొంపుతో శిరస్సు అంటిరి ।
గంధము అటకలిపి పన్నీట జలకములార్చిరి ।
కురులు చిక్కులు దీసి పువ్వులు మల్లెలు ముడిచిరి ।
సోగకన్నులమంచి తీరయిన కాటుక దీర్చిరి ।
తీరయిన కస్తూరితిలకము నొసట దిద్దిరి ।
పట్టుపీతాంబరము మొలకు బోసివేగ గట్టిరి ।
వైభోగపు చెలికత్తెలు వైడూర్యపు రవిక తొడిగిరి ।
మాణిక్యాలముడిమీద రత్నాల రవ్వలు దాపిరి ।
ఎక్కువైన వడ్డాణము సొమ్ములుంచిరి ।
ఘనఘనమనియేటి కుంకుమపరిమళములలదిరి ।
గౌరిదేవిని దెచ్చి కనకంపుగద్దెపైనుంచిరి ।
ఆకులు పోకలు రుక్మిణి దోసిట బోసిరి ।
మల్లెలు మొల్లలు రుక్మిణి పూజింపుచుండెను ।
నాడు అచ్యుతుని విభునిగా నేను గోరితి ।
వేడుకల కూతుళ్ళనిమ్మని గౌరికి మ్రొక్కెను ।
నవ్వుచు సరస్వతి రుక్మిణితోడ బలికెను ।
విప్రునిబంపి మాకృష్ణుని చేరగొంటివి ।
అనివారు బలుకగ నవ్వుచు తలవంచెను ।
భీష్మకమహారాజు అంతఃపురములోకి వచ్చెను ।

కన్యనుదోడుకరమ్మని వారితో జెప్పెను ।
పజ్జాబ్రాలుబోసి కన్యను గంపలోనుంచిరి ।
భీష్మకమహారాజు తనసతిగూడినిలచెను ।
శ్రీకృష్ణమూర్తికి కాళ్ళుకడిగి ధారబోసెను ।
రుక్మిణీదేవిని ప్రీతిగా సమర్పించెను ।
అప్సరసలాడగ దుందుభులు మ్రోయగకృష్ణుడు ।
రుక్మిణీదేవిని కళ్యాణమాడె ఘనముగా ।
వచ్చినవారికి వరుసతో కట్నాలిచ్చిరి ।
సతులనుగూడుక సంతోషమునవారు వెళ్ళిరి ।
శిగ్గుపడిశిశుపాలుడు తన తలవంచెను ।
వెరవకుమనిచెప్పి గట్టిగ తనచెట్టపట్టెను ।
రుక్మాంగుడిపంతములన్ని వడిగాసాక్కెను ।
గుంపులుగూడుకు పేరంటాండ్రు సొంపుతో ।
పాడుతువచ్చి రోకళ్ళుచేతబట్టుకు ।
పంకజనాభులమీద సుంకులుచెరగిరి ।
అచ్చటనాగవల్లి యమరారజేసిరి ।
నాగవల్లి కుత్తిగంటు మెడనుగట్టిరి ।
తల్లికి దండ్రికి రుక్మిణీదేవి మ్రొక్కెను ।
కన్నీరుదెచ్చుకొని కౌగలించి వారుబలికిరి ।
కన్నతల్లివినీవు వగవాగనేటి కొమ్మారో ।
మేముధన్యులమయితిమి కృష్ణుడల్లుడుకాగాను ।
కన్నతల్లికిమ్రొక్కి కన్నీరుదెచ్చుకు వగచెను ।
కన్నతల్లి వినీవు వగవకె ధన్యులమయితిమి ।
అన్నిచెప్పికన్యకు తమరు తమపట్నముకువెళ్ళిరి ।
రుక్మిణిగూడుకు సంతోషమునయుండిరి ।
ఈపాటనెవ్వరయిన పాడినావ్రాసినను కృష్ణులా
అష్టఐశ్వర్యములు అష్టసంపదలు యిచ్చును ।
కన్యకలుయీపాట పాడిన విన్నవారికి ।
కళ్యాణమౌనని రుక్మిణితానుబలికెను॥

## 19 రుక్మిణీదేవి ముచ్చట.

ఆటకూటంబులోను । రుక్మిణినాటకపురాలలోను
పారిజాతపుష్పయ్యపై । రుక్మిణీవలించిరయో కృష్ణుడు
కలికిశ్రీగోపాలుడు । రుక్మిణికౌగిటచేర్చుకొనెను
మూగునకుచములనడుమను । ముత్యాలసరులుగుంపిసలాడగ
సిరులునాట్యముచేయగా । పైటచెరగుజీరాడగాను
కొలమితోడుగరుక్మిణి । తనవిభునివద్దనేకూడుండగా
సరసమునసాయింటికి । చొచ్చితారానేమిపనియున్నది
యిదియేడసవతితనకు । కోమలీయిదియెవ్వతెతనకును
యింతదుండిగతనములు । కోమలీయేయింటికేచెల్లును
ఏయింటికేచెల్లునేకోమలీ । యీయింటికేచెల్లును
పిలిచినాపలుకదమ్మా । దానిబడాయియేమొకాని
నిలిచిననిలువదమ్మ । దానిఅహంకారమేమొగాని
పంచినావంగదమ్మ । దానివయ్యారమేమొకాని
చూచినాచూడదమ్మ దానికండ్లు । మింటనేఅంటున్నవి
కొలమితోశ్రీకృష్ణుడు । దానికియింతచనువిచ్చినాడె
యేమిజాచీతలచెనే కోమలీ । అదియెంతసుందరమ్మా
పాలిట్ట్యజాచివలచె । దానిమంచిపలువరుసజూచివలచె
వలదితేవలచెగాని । విభునితనవశము జేసుకపోయెను
సత్యభామయుండుగాని । ఎన్నమాతనమేళ్ళకపకురాదు
చూడనైతేచిన్నది । అభామతంతమేఅటువంటిది
చెలువంపుకుందనములు । దానిమంచి చెక్కుటద్దములబోలు
చక్కరికంటిమిగుల । విధినమరిసఖియచిగురాకుబోణి
కొలకనవ్వులకృష్ణుడు । అతగాడిని మోహించకతీరదమ్మ
కలికిశ్రీగోపాలుడు । దానికౌగిటజేర్చుకొనెను
కురులునున్నగకురిమిరయ్యో । శిరసుపైగొప్పగా బెట్టితుమ్మ-
పొగసైనదానిసొదట । కస్తూరిపొగచక్కగదిద్దెను
అమగువచనుగవలపై । ప్రేమతో అందనేశ్రీగంధము
కోడివచ్చినవారికి । యింతేసికామములుగలిగెనమ్మ
జారస్త్రీలకుహితవుడై । అదిమొదలుజేరదేతనయింటికి

పుట్టుమొదలూదివమ్మరె । పశులతో బోయదైతిరిగినాడె
కొమరప్రాయపుస్త్రీలను । పట్టుకొనికోడిగంబులు చేయుచు
పలుగాకు తెల్లగూడి । ఆగొల్లపణతులను మరగినాడు
పదహారువేలస్త్రీలు । ఎనమండ్రుపట్టపుదేవులమ్మ
వారయిందరుచాలరే । యిప్పటివారకాంతలుచాలరే
ఎందరైననుచాలరే । పణతిగోవిందునికొటకు
నళినాక్షివినగదమ్మ । అదియైననాకైన తెలియరాదు
బాలప్రాయమునకైన । అదిమొదలు భావించితెలియరాదు
ఆతీరు వినగదమ్మ । తనవిభునిరాధాంగికొప్పగిస్తి
కౌగిటనున్నవిభుని । రాధాంగివచ్చితీసుకుపోయెను
పరుపుపైనున్నవిభుని । అదిరొంతపాపితీసుకుపోయెను
అట్టిచెట్టలుబట్టుకపోగాను । చూచుచుంటినికోమలి
ఆవేళతనదేహము । పరవశములైయుండెనేకోమలి
ఆయింతితనమీదను । ఆతియేమొతెచ్చిచల్లెనెమందులు
అచ్యుతుడుదానింటికి । పోయినప్పటివేళనుంచి
యింతిరోతనకన్నులనీళ్ళు । కుప్పలై కురిసినవి
కుప్పలైకురిసినీళ్ళు । కోమలీకురిసిపొర్లించినవి
తరుణిరోవగవకమ్మ । నీపోగకన్నులేరియెత్తివారు
మొన్నరాత్రివేళను । అతనిపాతున అరగించినఅన్నము
పెట్టినాయిష్టాన్నములు । ఆయింతిముట్టలేదేకోమలి
ముడువబోయినపువ్వులు । తనకంతయిచ్ఛలేదేకోమలి
పూయబోయినగంధము । తనకళ్ళుసున్నంబులైతోచును
పరుపుమీదపరుండబోగా । తనకింతబుద్ధిపుట్టదేకోమలి
అతివరోతాంబూలము । తనకెంతో అసహ్యమైతోచును
చూస్తివాఓకోమలీ । యిందొక్కమాటకలదుచెప్పెద
లక్షవేలాదేసెడి తనమెడను । పచ్చలాపతకముండె
అచ్యుతునికంఠమాలతగులుకొని । అదిచిక్కుబడియుండెను
అచిక్కుదీసితాను । పరుపుపైబెట్టుంటిని
ఎంతచలువేకోమలి । దానిముఖముచూచుచుసెలోలుడారె
చూచుచుసెలోలుడారె । దానిమెడనువేసెనేఅపతకము
నాదిగాదేపతకము । ఆసత్యభామదేఅపతకము
అచ్యుతునిపెండ్లినాడు । అల్లునికివారణమిచ్చినపతకము

అంతలోకే కోమలీ । అభాన అనగబంపెను కోమలీ
పతకంబు తీరుగాను । పతకంబు చేయింప వేసినాను
ఎల్లుండి యీ పాటికి నీవొచ్చి । కొంచుబోవే పతకము
అని యిట్లు ఆ యింతికి । ఆ యింతి ఒప్పగా చెప్పింపను
వారదుడు ఒక్కనాడు । పేరిమతో పువ్వు దెచ్చెను కోమలీ
తెచ్చి నీలావర్ణుడు । ఆపువ్వు తనకు యిచ్చెనె కోమలీ
యిచ్చి నీలావర్ణుడు । తనలోను తాను తాపంబొందెను
ఆవేళ అస్తగించి । ఆపారిజాత మేకొంచుపోయె
దాని కాళ్లు బట్టుకు । దాని పెరట నేసె నేల అ నెట్టును
ఇంద్రుడు మెచ్చడాయె । నాతండ్రి చంద్రుడు మెచ్చడాయె
జారుడికి తెచ్చిచ్చెనే । తమతండ్రి చోగుడికి తెచ్చిచ్చెనే
తండ్రేమి చేసెనమ్మా । తన్నిచ్చి తానె తెచ్చుకుంటిమి
రుక్మాంగుడన్న మాట । అది యెల్ల తాను కానాలాయెను
రెంత పొద్దూపోయినా । తనను విడచి యుండడే శ్రీకృష్ణుడు
అటువంటి శ్రీకృష్ణుడు । దానివంక లతగిలి పోయెనె కోమలి
ప్రేమ వచ్చెనె కోమలి । తనమీద ప్రేమ చాలించెగదవే
యశోద శ్రీకృష్ణుడు । తనతోను యెంత కూడి యుండునే
ఎంత కూడి యుండునే కోమలీ । ఏలాగు కూడుండునే
చెప్పవమ్మా రుక్మిణి । చెవులకు సంతోషమైయుండును
సరసంబులాడుచుండు । తనతోను సయ్యాటలాడుచుండు
కేళింపుచుమండునే । తనతోను క్రీడసల్పుచునుండును
అద్దంబు జూపుచుండు । తనకు తడు ఆకుమణచి యిచ్చును
ఆభరణములు సొమ్ములు । తనకు తడ అలంకరించుచునుండును
మాణిక్యాల కోలుకులు । తన మెడను చక్కగావేతు ముందు
తేజతో అరటిపండ్లు । తెప్పించి తన కారగింపు చుండు
కలియావది వెలభక్తితో । బంగారు వింజామరలు విసరును
ఏమి చెప్పకుందునే । కోవలీ విభుడు చేసిన మన్నన
మొన్న రాతిరి వేళను । అతని పొత్తున ఆరగించిన యన్నము
పెట్టినాయిష్టాన్నము । తానింతముట్టలేదే కోమలీ
చిలుక కూపద్యంబులు । తానింత చెప్పలేదే కోమలీ
చిలుకలు పలుకవాయె । కోమలీ అవిచిన్న బోయున్నవి
తాచిన్న బోయుండగా । కోమలీ అవిచిన్నబోయున్నవి

హంసలుఆడవాయె । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
రతిహంసపడుపదాయె । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
ఆటకూటంబులన్నీ కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
నాటకప్రశాలలన్నీ । కోమలీఅవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా । కోమలీ అవిచిన్నబోయున్నవి
అచ్యుతుడుకూర్చుండెడి । రత్నాలమేడచిన్నబోయెను
తాచిన్నబోయుండగా । కోమలీ అవిచిన్నబోయున్నవి
నారదుడు కూర్చుండెడి । భోజనప్రసాల చిన్నబోయెను
తాచిన్నబోయుండగా । కోమలీఅవిచిన్నబోయున్నవి
చిత్తరపుచవికెలోన । రత్నాలటూగుటుయ్యాలవుండు
యేవేళతనురిద్దరు । యెప్పుడువూగుచుందురుకోమలీ
నడుమలేనిరుక్మిణిశన్నతిను । చంకబెట్టుకుతిరుగునె
చంకబెట్టుకుతిరుగునే । శృంగారవనములను విహరించునే
మల్లెపూవులుకోయునే । నెలతరోమరులుకొల్పుమువల్కునే
వానిసరికేగినీవు నెలతరో । వర్ణించినాకష్టము
విభునిమనసుముద్రిప్పుచు । వేడ్కతో నాధుడోడ్కొని వేగమె
వచ్చినాపేరిములంది । గైకొమ్మువనితరోసౌఖ్యములను

## 20 శాంతగోవింద నామములు.

ప్రథమచరణముచివర గోవిందారామయనియు, రెండవ చరణము చివర గోవింద అనియు పాడవలెను.

పాలసముద్రముమీద గోవిందారామ భద్రాద్రిశయనులు గోవిందా। శేషశానపుమీద గోవిందారామ లక్ష్మితోపవళించె గోవిందా । ఆదిలక్ష్మి దేవి । శిరసుచక్రగబెట్టె । హస్తములుబట్టెను । రావణునిచరలన్ని । చరలాచ్చివున్నవని । అష్టదిక్పాలకులు । ఆదిదేవతులెల్ల । విష్ణుతో చెప్పిరి । చరలనుభవించియు । వారిచరలు విడిపింతునని । నోటివట్టపు చేడె । సీత

యీబుద్ధికో చెనా । మనభర్తలువారు । మరిక్లేశపడుతారు । మననామ
మేంగాని । మాయనామమెత్తకు । గర్భవరశంమీరు । యేగైనం వారి
భూమిమీగపుడుదు । భూమిమ్రావ పెరుగుదును । జనకునింటనుబుట్టి జాతకం
వ్రాయింతు । మరిప న్నెండేండ్లకు ।మిమ్మునకలతును । హరిచేత సెలవొంది।
ఆదిలక్ష్మిదేవి । అంతఃపురము వెడలి । తామరకొలనులో । తానుమజ్జనమాడి।
కన్నతల్లి వలెను । కమలములో ప్రవేశించె । నాడు రెండుగళ్ళు । సుదతు
లకుచాలవు । అంతటరావణుడు । నవకోటిలింగములు । కొమరొప్పపూజిం
చి । అప్పుడు రావణుడు । సేవకులబిలిపించి । పుష్పములు దెమ్మనెను । రా
క్షసులు యేగిరి । కొలనులోపలజొచ్చి । పువ్వులుకోసిరి । మొగ్గుడీ వరుల
య్య । నాసరసముట్టెరు । మాలోకిలోజొచ్చి । మిమ్ము సాధింతునన ।
రక్కసులు భీతులయి । రావణునితో జెప్పె । రావణుండు తనుకనియు । నవుక
లకానదలించె । పసిశిసజ్జాపట్టి । సరసు వద్దకొచ్చె । సుమములు కోసెను ।
యొక్కడీనరుడవుర । నాశిరసుముట్టితివి । నిన్నునీబలగముతో । తెగటార్తు
ననిబలికె । రావణుడుభీతిల్లి । భూమివంకా చూచె । ఆకాశమూ చూచె ।
యిదియేమి యక్షిణో । నాకుప్రత్యక్షమయి । నాతోను బలికింది । బలువా
రుచేతులును । బాహువులు లేవువూ । శోధించి చూతునని
సతికిఅందిచ్చె । శోధించిచూచితే । ఒకబాలకనుపించె । కనని పెంచనిబాల ।
కన్నులకుఆగపడెను । చేడెనుపెంచిరి । జాతకంవ్రాయించె । మండోదరి
పొంగి । రావణునితో జెప్ప । దశకంఠగను తెచ్చి । కన్యకను జూచెను । అ
బాలనునాకు । రెండవభార్యగా । పెళ్ళిచేయుమనెను । మండోదరిదేవి ।
అదరిపడితామండె । సురరాజసభకేగి । విప్రులనుబిలిపంప । వచ్చిరివిప్రు
లు । తివాసులుపరచిరి । బ్రాహ్మణులుగూర్చుండె । పంచాంగములు చూచె
లగ్నము నిగట్టిరి । కేల్లుముడిచివారు । ఒకప్రశ్నజూచిరి । అష్టమిశనివా
రం । అయిదుఘడియ లప్రొద్దెక్క । చిత్తనక్షత్రమున । సీతపుట్టినదినము ।
విచ్ఛత్తుఅయిపోను । చిన్నమెత్తునిలువదు । రాక్షసరాజొచ్చి । కనకరా
సులుపంచె । తరుణిసీ నేనిపుడు । కల్యాణమందుదును । అతివయిచ్చట
వుంటె । మాలంకపాడగును । అశివనుముట్టిన । అగడియ శిరసులగులు ।
జనకని యింటను । చేడిపెరుగవలెను । నిమిశంలోకుడు । జనకమహారాజు ।
అతివపుట్టినవెనుక । మరిమగురుడుకరు । ఆదివిష్ణునిసతి । అవుతారమెత్తిం
ది । అపుడుమండోదరి । విభీషణునిపిలిచి । మరదితో జెప్పెను । ఆదివిష్ణుని
సతి । అవుతారమెత్తింది । లంకపాడుఅగును । రాముసతిపుట్టింది । మన
లంకలోగొట్ట । మహాలక్ష్మిపుట్టింది । మందసంతెప్పించి । పట్టుచీరలుదెచ్చి।

ప్రక్కనపరచిరి । కళ్ళుపంచదార । పసిబాలకిచ్చిరి । ధూపములుదీపములా
నయినైవేద్యములుయిచ్చె । తల్లికిసమర్పించి । బాలునెత్తుకొని । పవళించ
బెట్టిరి । మండోదరీదేవి । చేతులెత్తిమ్రొక్కె । వెరిరావణుడునుమి । సం
తునిపాలెజాడుమనె । చల్లగారక్షించు । లంకరక్షించుమీ । అంతటవిప్రు
లు । వికవికనునవ్విరీ । లంకరక్షించుటకు । పన్నెండుయేండ్లకును । మగుడి
వచ్చునులక్ష్మి । తాళములువేసిరి । సముద్రమునవిడచిరి । సముద్రుడు మూ
డేళ్లు । చక్కంగపెంచెను । తనకు బరువైనట్లు । పాలసముద్రునకిచ్చె ।
యేడునెలలుఅతను । భామినిపెంచెను । పాలసముద్రుండంత । ఆదిశే
షునకిచ్చె । ఆదిశేషువఅంత । అందముగ పెంచెను । తనకు బరువైనట్లు ।
భూదేవికినిచ్చెను । భూదేవి పన్నెండేండ్లు । యిసుకతిన్నెనువుంచె । గురుపు
త్రుడనువాడు । గుణములుగలవాడు । తల్లినిదండ్రినీ । కావళ్ళవుంచుకుని
వనములను త్రిప్పుచు । ఫలములుపెట్టుచు । అరణ్యముమధ్యకుచేర । అంత
టవృద్ధులకు । దాహంబులాయెను । అనపకాయబుర్రతో । వుదకంబుముం
చగా । బుడబుడమనగాను । యేమిటోజంతువని । దశరథుడుబాణంవేశె ।
యెవ్వడోనరుడిప్పుడు । ప్రాణములుతీసెను । వాతల్లిదండ్రులకు । నేనొక్క
తనయుడిని । కళ్ళుయినలేనట్టి కబోదులువారు । తండ్రిదాహముగొనె । తీర్ప
గలేనైతి । మాతల్లిదాహము । మీరుతీర్పండయ్య । శాపంబులిత్తురు । అను
భవించుమని । సుమంతుడుశోకించె । మహారాజశోకించె । యింతపాపపు
వేట । యెన్నడూనెనెయుగ । బాణంబు తీయుమన । దశరథుడు తీసెను ।
సుమంతుడుత్రిప్పె । బుర్రతోటినీళ్ళు । రాజాచేతబట్టి । మాట్లాడకుండాను
దాహమునుయిచ్చాడు । చేతనూతడిముకొని । పుత్రుడూకాడనిరి । హారములు
పతకములు । అధికముగవున్నవి । నీవెవ్వరో చెప్పు । సుతుడుయేమాయెనని ।
వేటప్పగమనివేస్తి । సుతుడీల్గెనని చెప్పె । నీవెవ్వరనియడిగె । దశరథరా
జనెను । ముదుసలులు శోకింప । యినకు [illegible] డు వేడెను । రాజ్యమంతయుయిత్తు ।
రమణులనుయిస్తును । మిమ్ములనయిద్దరిని । కావళ్ళవుంచుకుని । వనములుత్రి
ప్పుచు । ఫలములుకోసిస్తు । అయోధ్యపట్నాని । వెంటబెట్టుకుపోదు ।
యెందరుఅయినను । నాసుతుడగుదురా । ఆదినారాయణుడు । నీగర్భమున
బుట్టు । అపుత్రపుత్రాయని । ప్రాణంబువిడుతువని భూసురుడు శాపంబిచ్చి ।
ప్రాణాలువదలిరి । దశరథుండంతట । సంస్కారములుచేసి । అయోధ్య
కువెళ్ళె । ఘంటానవ్రబతులు । భేరీమృదంగములు । రథచతుర్యగములు ।
యుక్తగంధర్వులు । యెదురుగారాగాను । ఆవలికిబంపించి । చిన్నతుచ్చు
కురాజా । అంతిపురికేతెంచి । దేవికౌసల్యతో । కడువేగముచెప్పె । మాకు

పిల్లలు లేవు । బాలుడు లేని వెల్తి । చంక బాలల చూచి । చిన్నపోయెను రాజా।
చిన్నబోయిన రాజా । చాపపై పవళించె । కౌసల్య మహాదేవి । పతికి పాదము
లొత్తె । సుమిత్రమహాదేవి । సురిటీలు వేసెను । అంతట మహారాజా కౌసల్య
తో బల్కె । యిన్ని రాజ్యములయిన । యేలితిని నేనయిన యిన్ని దేశంబు
లయిన । చూచితిని నేనయిన । పుత్రులు లేనట్టి । పుట్టుదరిద్రిన్నయితి పు
త్రులు జన్మించ । పుట్టగతి చూపించు । అప్పుడు కౌసల్య । మహారాజుతో యి
ట్లనియె । ఉత్తరపు భూమినీ ఋషివర్యుడున్నాడు । అచటకీ చనిదెంచు । పు
త్రులు గల్గుదురు । పుణ్యాలము అవుతాము । అంతట మహారాజా । ఉత్తరభూ
మికేగి । ఋషివరుని చూచి । ప్రదక్షిణ నమస్కారము జేసె । రాజును ఋషి
చూచి యెన్నడు రానివారు । రాను కారణమేమి । మా కోర్కెలడేరె ।
మాతో సుపండెను । అంతట మహారాజా । ఋషితోను బల్కెను । యిన్నిరా
జ్యములయిన । యేలితి నేనయిన । యిన్ని దేశములయిన । చూచితిని నేనయి
న । పుత్రులు లేనట్టి । పుట్టుదరిద్రిన్నయితి । పుత్రులు గలుగుటను । పుట్ట
గతి చూపమని । దక్షిణ భాగమందు । రాజఋషివున్నాడు । అచ్చటికి యే
గితె । పుత్రులు గల్గుదురు । పుణ్యాలు అవుతాము । అరువైయరువేల । సంవ
త్సరములు కచ్చట । లేక లేక వారికి । ఒక కన్య జన్మించు । ఆ బాలను పెం
చితె మీకు సుతులు కలుగు । యిత్తురో యివ్వరో । సంశయము గా బల్కె ।
మీవంటి వరికీ తప్పకయిత్తురనె । ఆ మాటలతోను । అతివేగ వెళ్ళెంపె । అం
తట దశరధుడు॥ అయోధ్య చేరెను । కౌసల్యసుమిత్రి । పతికి యెదురుగ వచ్చి
పాదంబులు కడిగిరి । సింహాసనం వేసి । క్షేమవార్తలు అడుగ । సతులతో ప
తిబల్కె । సతులారా మీకిపుడు । సమ్మతంబ యెవా । మాకు సమ్మతమనిరీ ।
అంతట మహారాజా । కైకనగరము జేర । కైకతో తా జెప్పె । అతివరో వింటివా
యీదినమందునా । వసిష్ఠ వాల్మీకులు । గౌతమ జమదగ్ని । అత్రి కశ్య
పులు । మహారుషులు చెప్పేరు । దక్షిణా దిశయందు । రాజఋషివున్నాడు ।
అచ్చటికి చనుదెంచిన । మనకు పుత్రులు కలుగుదురు । పుణ్యాలము అవుదుమనె ।
పతిమాటవిని కైక । అపరిపడితామండె । అంత కౌసల్యనగ । అతిపరాక్రి
మశాలి । కోరకొడుకుల గంటె । గొడ్రాలనయి వుందు । అధలించి రాజును ।
ఆ తరలికి తాబంపె । చిన్నబుచ్చుక రాజా। నగరిలోకేతెంచె । రాజతో కౌ
సల్య । అరళ్ళ బెట్టుకడి । అతిసన మీరిపుడు । బుజ్జగించి చేరి । ముద్దుగా అడ
గండి । వశిష్ఠ గౌతములు । కైకనగరు కు వచ్చ। అడిగిన ధనమిత్తు। అతివరో నీకి
పుడు । కోరిన ధనమిత్తు। కోరిన నగలిత్తు । కోరికలన్నియును దీర్తు ।
కోమలి నీకిపుడు । ఒక్కరికి అయినాము। పుత్రులు పుడితేను । రాజ్యమునకధి

పతులు । రాజుల్లుఅవుతారు । నన్నుపుట్టగరాదు । నాథుడా నీవిపుడు । నన్నుఅంటగరాదు । ప్రాణనాథాయనె । వశిష్టగౌతములు । వెకవెకనవ్వీరీ చిన్నబుచ్చుకురాజా । తననగరుకేతెంచె । నాకువశమూకాదు । నల్లరాయియిది । పాషాణమనిపల్కె । రాజుచేశినపుణ్యం । వ్రాశ్రఫలమిట్లుండె । మగువచేసినపుణ్యం । మరియుయుంచిదిఆనెను । అప్పుడుకౌసల్య । కైకనగరుకువచ్చె । చెల్లెలారమ్మనె । ముద్దుగుమ్మరావె । మూడవభార్యమరమ్మనె । అక్కమాటలువిని । కైకతామండిపడి । అక్కరోకౌసల్య । అతిపరాక్రిము శాలి । కోరికోమకులగంటె । గొడ్రాలవయివుందు । పట్నంపునీవేలు । కానిసను అయివుందు । అపలించి కౌసల్యను । అవతలికిపంపించె । చిన్నబుచ్చుకుచేడె । రాజుచేసినపుణ్యం । వ్రాశ్రఫలమిట్లుండె । తననగరుకేతెంచె । పతితో సుమిత్ర । కైకదగ్గరకొచ్చి । రమణీవిరమ్మని । రహస్యముగజెప్పె । చెప్పినస్త్రీవనీవు । చెంపలుకొట్టిస్తు । సుమిత్ర చెప్పగా । సువతిసమ్మతించె । మందరతోకూడ । తరలివతుమనెను । రాజు యావానమ్మ । లక్ష్మిమీదేసుమి । రాజుతోకూడాను । రథముమీరెక్కంశి । కాలినడకనామేము । కదలివస్తామమ్మ । కాంతలారమీరు । కాలినడకవస్తె గడియలోవత్తునని । కైకప్రియాణమాయె । సువతివొప్పినది । సుమిత్రజెప్పెను । కౌసల్యతోజెప్పె కైకమహాదేవికి ।। యేబుద్ధిపుట్టునని । అప్పుడుకౌసల్య ఘనశిపార్లబిల్పించి । రథముతెప్పించుమనె । ముత్యాలచేరులు । పగడాలకుచ్చులు । నీలాలతోరణం । వజ్రములదాపించె । రథమును తెచ్చిరి । కౌసల్య కెరిగించె । కైకనుబిలిపించె । రాజుకప్పగించె । అప్పుడుకౌసల్య । ఘణిపార్లనుబిలిపించి । చాటించుమనిజెప్పె । పట్టుచీరలకుంచ పదికోట్లరమ్మనిరి । ముట్టజాలకుంచ । మూడుకోట్లరమ్మనిరి । తలగడిగిరమ్మనిరి । పసుపునూనెలుపోసి । ముట్టజాలకుంచ । మూడుకోలొచ్చిరి । భమిడికవదంపరచె । గుర్రములు తెప్పించిరి । భమిడిపల్లంకొసె । రాజునుకైకమ్మ । దంపతులు రథమెక్కె । జయభేరివేసిరి । జగమెల్లమ్రోసెను । ధనరాసులుతెచ్చి । కౌసల్యతాబట్టె । పసుపుకుంకుమపళ్ళు । సుమిత్రతాబట్టె । అనసూయరుంధతి । అహల్యభాయయూను । ముతయిదువులువచ్చె । రామచిలుకలురెండు శ్రీమతో యెకురయ్యె । వేశ్యస్త్రీలువచ్చె । సురకాంతములువచ్చె । గరుత్మంతుడువచ్చె । శకునంబునీర్చెను । మంచిపీళకునాలు । మళ్ళవద్దుపైనం అందలములెక్కె । అంచంచవాబిలీలు । పన్నెండుగడియలకు । పట్నంబుబయలుదేర । అప్పుడుకౌసల్య । సుమిత్రతోబలికె । రాజపత్నులంతాము । కైకదాసీనమనె । అప్పుడుసుమిత్ర । అక్కకుమ్రొక్కెను । మందర

తోడూన । ముగ్గురబానిపలం । అప్పుడు కైకమ్మ । రాజా బలెక్కెను । సవతు
లు యిద్దరు । అందలము లెక్కిరి । తోడు పల్లాకీలు । బాజాలు తీయించె । అ
ప్పుడు దశరథుడు । భార్యతో యిట్లనెను । యింత రాణువలోను । యింతులు
నడచితే । నీకు సమ్మతమేన । సమ్మతి గానుండె । అయోధ్య యేలించు । అ
ప్పుడు మహారాజా । సతితో డబలెక్కెను । వశిష్ట వాల్మీకి । గౌతమ కశ్యపులు ।
యివ్వరు చెప్పరు । రధము నడిపించిరి । తేరు వక్రించినదిగా । అంతట మహా
రాజా । కాపల్యను జేసి । మనకు హాని కలాయె । మల్లి నడిపించినారు । కైక
పోలు చేత । కార్యమ్ము కావనిరీ । యింత సొరూపోను । యింతి నీ తేలేము ।
అయోధ్యకు మనము । తిరిగి వెళ్ళితేను । అష్ట వరిపరించవచ్చు అప్పుడు సుమిత్ర
పెనిమిటితో యిట్లనెను । చెల్లెలు కైకమ్మ । అతిపరాక్రమశాలి । మంథరవి
నకుండ । చునవి చేసి అడగండి । అప్పుడు మహారాజా । కైక దగ్గరకేగి ।
మందరలేదని రాజా । ముద్దియను అడిగెను । కోరనధనముయిన । కోయిలీయి
త్తునని । పతిమాట వినిసతీ ధమిడికములను దెచ్చె । బంగారు పట్టాబాదశ్రీ
కారము పెట్టి । రాముని వనవాసము । భరతు పట్టంగట్ట । సదురాణుగేండ్ల
వివాహిని । కౌగిత్తం బుమ్మును । అ కైకమహాదేవి । చిటికెన వ్రేలితో । తేరు
యొత్తెవయ్య । రథము తానడిపించి । శాంత పట్నంచేరి । దమయిమా
ర్పుండె । మునులు ఋషులు వచ్చె । భూపతులు వచ్చిరి । రాజావందనం జేసె
దశాస తౌకాలు । మీగర్భమున బుట్టు । రాజ్యమునకధిపతులు । రాజాలయి పు
ట్టెదరు । వారి దీవన లంది । శాంతపట్నం వారు । రాజా రాణునడాది ।
శాంతను యెత్తుకుని । కోకిలాదేవొచ్చె । యేరాజ్య మే భూమి । యేమి వంశ
ము మీది । అర్కవంశం బని । అయోధ్య రాజని । ముగ్గురు భార్యలతో ।
రాజ్యములు యేలితీ । నాకు సంతతి లేక । శాంత కోరకు వస్తిమి । శాంతమ్మని
స్తేను । కొడుకులు పుట్టుదురు మేము పుణ్యుల మవుతాము । అమాటలు విని ।
గుండె నులుబలగుని । మూర్ఛతో మునిగెను । మరి మూర్ఛ తాదెలసి । నిన్ను క
న్నా తల్లి । నిన్నెట్లు యిత్తుమ । నిన్ను యిచ్చి నేను నిముష మోర్వగలేను । ఆ
దురుచు బెదురుచు తడబడబడుచు । తననగరుకేతెంచె । అప్పుడు మహాముని ।
తనజపము చాలించె । కోకిలాదే వెళ్ళి । ఋషితో నుడి చెప్పెను । అర్కవంశం బట ।
అయోధ్య రాజట । ముగ్గురు సతులతో । పుత్రులు లేకను । శాంతనా యిమ్మ
నిరీ । శాంతను యిస్తేను సంతతి కలుగునట । సరిమాట విని ఋషి । హాంకారులై
ఉండి । ఆపవాళ్ళు మీరు । వొదిగి వుండగలేరు । ఆశ్రీనుం బూలోను । దా
గివుండామనె । అంతలకు పోనేల । అవల్ప పడనేల । శాంతనూ దావంతి ।
దీక్షిదీయించండి । గవిశనలు వేయండి । గమిడిలియ్యవద్దు । ముగ్గురి భార్య

లతో । మునియాశ్రమం జేర । మండు వేసవిలోను । యెండబడిన స్వామి ।
ప్రాణంబుపోయెను । తరువాణ్నీదాహంబు । త్వరలోనయివ్వండి । తలుపు
లుతీసిచూసి । కమండలంలోది । గంగబట్టుకువచ్చి । దాహంబు యిచ్చెను
పిమ్మటదశరథుడు । ఋషిపాదములాబడె । యెంతపదవిఅయిన । దైవంబు
యిచ్చాడు । సంతతిలేదిపుడు । పుత్రసంతతియిచ్చి । వంశంబు నిల్పుమి ।
మీశాంతినిస్తైను । మాకసుతులూకల్లు । గుండెగుబులుమని । రాజతోరుషి
బల్కె । ఆరునదకేలేండ్లకు । ఒకబాలజన్మించె । ఆబాలనిచ్చియు యెట్లు
తాళగగలను । ఆడవారీమనసు । అలవిగాదనిపల్కె । కౌసల్య సుమిత్రి
ఋషిపాదాలపైబడిరి । వమ్ముగాన్నాతల్లి । మావానవివిసవమ్మ । మహాలక్ష్మి
వెళ్ళండి । కదలనివ్వరవారు । నిలవనివ్వలువారు కోకిలాదేవిని । రాజభా
ర్యలపడకె । రాజరాణవఅంతి । పదపదవనుచును । కైకదోడుకువచ్చి ।
ఆశ్రమంబునవుండె । కట్లచాటునవున్న ॥ తల్లిబిడ్డలజూచి । తిరుణ్ణి లిద్దరు
మ్రొక్కె । శాంతినయివ్వమని । ఋషికాంతినడిగిరి । ఆరవై వేలేండ్లకు । మా
కుఒకబాలపుట్టెగ । ఆబాలను యిచ్చి । యెట్లువేముందుము । కని గొడ్రా
లమవుదుమా । కాంతినూమీకిచ్చి । అప్పుడు సుమిత్రి । కోకిలాదేవితో ।
నలుగురముపోతల్లి । ఒక్కగర్భమునపుడితిమి । మీవద్ద వుంటేమి । మావద్ద
మంటేమి । నలుగురికూతురని । అయోధ్యకెడుదామా । అంతిరుషిపత్ని ।
పతిదగ్గరకువచ్చి । అవవారితోను । అందరువచ్చారు । అతివనుయివ్వకుంటె ।
భూజనులువొప్పరని । ఆమాటవినిముని । అతికోపముతో బల్కె । అతివని
తునని । అందరుతో చెప్పితివా । పతిమాటలువినిసతి । మరలి ఆశ్రముజేర ।
కౌసల్యనుజూచి । మగవారియిష్టమని । యిద్దరుమరివెళ్ళి । రుషిపాదములబ
డిరి । మానికిదయవచ్చి । శాంతినుతాబిలిచి । రాజాచేతిలోవుంచె । చెయ్య
ప్పగించెను । తల్లినీవుపోవె । తమ్ములాకెత్తుకో । అయోధ్యపట్నములో ।
ఆడపడుచువుగమ్మ రాజభార్యలబిలిచి । చెయ్యప్పగించెను । కాయకూరల
తోను । పిండివంటలతోను । పాయసాన్నమును । పణతులువడ్డించిరి । రా
జాపరివారములు । మహాపురుషులుఅంతాను । ఆరగించిలేచి । హస్తములుక
డిగిరి । కర్పూరవిడెంవేసి । కోకిలావహేముని । వగవపాగిరివారు । పరివా
రమునకంత శాంతినప్పగించె । శాంతిరేఖలుచూడ । వసిష్ఠుడూవచ్చె । అ
మ్మరమ్మనిపిలువ । అతివనవ్వినవవ్వు । చంద్రకిరణంబాయె । అతివనూబిలి
పించి । వసిష్ఠుకూడాపించె । శంఖుచక్రముగలదు । కౌసల్యకూతురికి । వెల
దివెన్నలోను । వెన్నచక్రముగలదు । కళ్ళనిరియాగలదు । కౌసల్యతనయా
నను । అతివవచ్చిననెనుక । మరినలుగురుడతారు ।అసురసంధ్యాకాశ । కుక్ర

వారముపొద్దు । అతివపుట్టినదినం । అత్తవారింటేని । సీతగడియవుండదనె । అయిదవవత్సరంకంటె । అతివమీనగరినుండదనె । అయిదవవత్సరం । వచ్చి తొమ్మిదిరోజాలాయె । బాలకుమేమిపుడు । తోడుగులుంచాలేదు । పన్నెండు లక్షలివి । తోడుగుచేయించాము । బాలతోడుగులయిచ్చె । పచ్చలపతకమిచ్చె । శాంతకల్యాణమునకు । బంగారువగలిచ్చె । బాలతోడుగులుయిచ్చె । యింద్రనీలపుమణిని । చంద్రికాలువయిచ్చె । కెంపులఅక్షతలు । భమిడిపేళ్ళగంప । బంగారుభాషికం। నవరత్నపళ్లెంబు మధుపర్కములుయిచ్చె। మంగళానూత్రము । యేడువారపుసొమ్ము । వుత్తరజంధ్యంబు । అల్లునిఅరణాలు । అగలక్షలుయిచ్చె పట్నపుయేనుగను । మీరుమాబాలకుయివ్వమనె। యింతసొమ్మిస్తినీ । యింతినీమీకిస్తి । కన్యదానంచాలు । మాకుపాత్రంబులిదాయె । మాగోత్రనామముతో । కన్యాదానంబుచేయుకే । అప్పుడు కౌసల్య । దశరధుతో బల్కె । యింతసొమ్మిచ్చారు । యింతినీయిచ్చారు। వారికిమనమేమి । యివ్వవలెననిపల్కె । అప్పుడుమహారాజు । కౌసల్యకిట్లనెను । కోకిలాదేవితోకు । కాలిమట్టెలువిలువ । మనరాజ్యమున్నదా । పళ్ళెంతో ధనంతివ్వి । పట్టుచీరలువుంచి । కౌసల్యచేనంది । దేవికివ్వగరాగ। సరమూంసమ్మము । నాతిరోనీకిపుడు । కోఁబిక్షంబెట్టు । కొంగుబట్టెను శాంత । పుత్రబిక్షంబెట్టుమని । పుత్రికను అడిగితిరి । పుత్రికనుయి స్తిమి । పచ్చిబాలింతివు । నడిబియ్యముకడుమ । మహాముని నగరిలో । కనకపీటలు వేసి । పట్నంపుదేవులను । యిద్దరినిపిలిపించి । అక్షతకట్టించి । శాంతను బిలిపించి కౌసల్యకప్పగించి । నడినిబియ్యమువుంచి నచ్చిబాలింతలు । పచ్చనక్షింతలు । పందిళ్ళచల్లండి । నవ్వుచుకౌసల్య । పందిళ్ళచల్లిరి । అప్పుడు దశరధుడు । కౌసల్యతో బల్కె । యింతచక్కనిచేడె । యీజగములోలేదనెను । యెవ్వరికియిత్తునని । ఆలోచించెనురాజు । శుభముహూర్తమువారు । ఋషిమూచూడంగానె । పట్నపేనుగుదెచ్చి । హౌదానువేయించి భమిడివచంపరిచి । శాంతతోడునువచ్చి । అంబారిలోవుంచె । జయభేరివేసికి । జగమెల్లమ్రోగను । కోకిలాదేవపుడు । కూతురికిదిగులాందె । ఆటపాత్రముమునాడు । ఆటచూడగలేదు । పాటపాత్రముమునాడు । పాడచూడగలేదు । వేకుజామునలేచి తద్దివుండాలేదు । విత్తనములేకుండ వకరికి విత్తనంబెపెతిని । మొక్కలేకుండాను । మొక్కఒకరికియిస్తి । వీధిలో విస్తరి । పాత్రప్రమాదెనుమాకు । అప్పుడుమహాముని । తనసతినిఓదార్చి । పందిళ్ళలోవున్న కైకమ్మనుజూచె । అద్భుతంబునపుషి । ఆకైకనూజూచి। అమ్మమిమ్మనమరచి । అందరూయేగిరా । కౌమ్మనమ్మనిబిలిచి। శాంతమ్మను

కాదకీరి ।. ఆడుచుపాడుచు । అరణ్యమంతా వెదకి । కొలనుదగ్గరజేరి । కో
మలులు ఆడిరి । ఆనందడోలని । కన్నులు దెరచియు । కన్యలనుచూచి । రెం
డుకొమ్ములువుండె । వీపెట్టితపసులో । ఏపూజచేసిరో । ఆశ్చర్యమునుబొం
దె । రాజుఅల్లునిజూచి । రమణులునవ్విరీ । మగపసువుపలెను మాట్లాడ
నేరడు । కారిటాకులదెచ్చి । కట్టువనియిచ్చిరీ । తియ్యనిభక్ష్యములు ।
తినిపించిరివారు । రాజుయిచ్చిననగలు । రాజఋషికిచ్చిరి । కంఠమాలము
లపుడు । ఋషిఅరగించెను । మల్లెపూవులపాన్పు । మగువలుపరచిరీ । మం
చిగంధముతీసి, ఋషిచేతులకపూసి । అత్తరుపన్నీరు । మేనునఅలరిరీ ।
సంసారమర్మములు । సఖియలుజెప్పిరీ । రెండుకొమ్ములుమీకు । యేరాజు
యిప్పించె । యీశ్వరుడుయిచ్చెనా । బ్రహ్మయిచ్చాడ । గొప్పఋషు
లముఆనే । దండకారణ్యమునా । వయినాలు ఆయివారు । పారిపోవుదు
మంచు । ఋషియును వెంటారగిలి । కూడవత్తునననెను । అయోధ్యవెడలితామ
నీపురవద్దనిరి । వొంటిగాననములో । ఒకగడియానిలువనని । అప్సరలా
వెంట । వచ్చెఋషికపలెను । మగురుకన్యలు । మునితోనువుండిరీ । యిద్ద
రుకన్యలు । రాజుదగ్గరకేగి । అతికష్టపడ్డాము । అల్లుణ్ణితెచ్చాము । అప్పు
డుదశరథుడు । అతిసంభ్రమమునపొంగి । చక్కనిఋషియని । ఆచెలులం
తాజెప్ప । చక్కనివాడని । చెలులుసంతోషించి । అతిసంతోషమ్మకు । త
గ్గరుడేకాడ । కౌసల్య సుమిత్ర । కన్నీరుబెట్టిరీ । కూతురుచేసినపుణ్యం
కాత్రిఫలమిట్లుండె । అల్లుడుచేసినపుణ్యం । మరియుమంచిదిఅనెను । దశ
రథుడువెళ్ళి । ఋష్యశృంగునిజూచి । సముద్రునివలెపొంగి । యింతచక్క
నివారుడు । యీభూమిలోలేడు । వందనముచేసిరీ । దీవెనలుతాయిచ్చె ।
వివాహకార్యంబు । మీకుకావలెనయ్య । రాజకన్యయితేను । రమణినీవద్ద
నవెను । నాతనయశాంతిని । నీకుయిచ్చెదననెను । పుత్రకామేష్టిచేయ ।
పుత్రులుపుడుదురనెను । రాజుఅల్లుడుమీరు । రాచకట్టుకట్టండి । బంగా
రుదుస్తులు । నిలువుటంగీలును । రాజఋషికిచ్చిరీ । ముస్తాబుచేసిరి । నిలువు
టొమ్ములువుంచి । అలంకరించిరీ । దశరథునకుచూపించె । పానకపుకావిళ్లు
పదివేలుతెచ్చిరీ । ఋషియురాజువచ్చె । సతులుయిద్దరువచ్చె । జయభేరివే
యించె గంధంబుపూసిరి । గంధపడిజల్లిరీ కట్నాలుయిప్పించె । రాజుఅల్లు
నితోను । బంధువర్గంబెవరు । తల్లెవరుతండ్రెవరు । వూరేది పేరేది । వివ
రించుమనిపల్కె । తల్లితండ్రిలేనియరుగ । వూరెరుగ పేరెరుగ । అంతటాదశ
రథుడు । వశిష్టునిపిలిచి యెవరిసుతులనియడుగ । ఋషిపల్లెలోపల ।
మాండవ్యమహామునికి । సుతులువీరనిపల్కె । వారికిమనమిపుడు । లేఖలు

శుభముహూర్తములు । ఋషీశ్వరుడు కట్టించె । పళ్ళెముతో తలంబ్రాలు । రు
షిచేతికట్టించి । మూడుదోసిళ్ళయిన । ముగుద శిరసునవుంచె । కన్యచేతా
వారు । శాంతునిశిరసుననుంచిరీ । సతివంక ఋషిజూచి। యింతచక్కనిచెడే।
యీ జగములో లేదు । అడవికిశెళ్ళినా । అయోధ్యలోవున్న । రుషిపల్లెలో
వున్న । కోమలినివరించె । లాజలోయుటకు । రజాను బిల్చిరీ । అంతట
ఆవరోరాజా । లాజలూతబోసె । కట్నంబుకోరెను । అప్పుడుఋష్యశృం
గుడు । మామతో నుబల్కె । సుతులు పుట్టినవెనుక । లాజకట్నములిస్తు ।
కట్నముఃజెప్పించి । రాజరుషికిప్పించె । సప్తపాదందొక్క । దంపతుల
బిల్చిరీ । సన్నికల్లమర్చి । పాదములతో త్రొక్కించె । అప్పుడు రుష్యశృంగుడు
రాజరుషికిట్లనెను । అడుదానిపాదంబెట్ట । యేశాస్త్రములోనుండె । ఋ
షులుచెప్పిరి । అప్పుడురాజరుషి । అల్లునకిట్లనెను । మీరుతప్పిస్తేను । మరి
ఒకరుపడుతారా । శాంతపాదంమీద । పోకచెక్కవుంచి । సప్తపాదం
దొక్క । ఆయుఃధగ్నివిజాపించె । పొత్తునా గూర్చుండి । ఆరగించివారు । ప
రగరెంపినవాడు । పసుపులునలిచిరీ । రవణాలందరుకలిసి । గాచక్రీడసల్పి
రీ । మూడవదినమున । పాకెన్నజేసిరి । యచ్చటనన్నవారిని । యెన్నిక
తోబిల్చె । రుషిపల్లెవారి । రాజరుషిబిలిపించె । శాస్త్రజ్ఞులొచ్చిరి । పాక
న్నపళ్ళెములు । పండితులుచదివిరి । పన్నెండు ఎరవాలు । సంభావనలు
యిచ్చె । అరుంధతిఆసమాయ । వారతులుదెచ్చిరి । అయిదుమూఁడవరహా
లు । పట్టుచీరలుయిచ్చె । అప్సరస్త్రీలు । అయిదుగురువచ్చిరి । కతికష్టైప
ద్దాము । బహుమానమిమ్మనెను । విలువులెతుధనము। దశరథుడుబోయించె
చాలనామీకనెను । చాలునని చూవారు । ధనముచేకొనిపోయె । అంతట
సుమిత్రి । కౌసల్యకిట్లనెను । శాంతకారతియివ్వ । నాకుమనసుఆయె । అ
క్కవాచెల్లెలివ । నీకువనమూపుట్ట । అప్పుడురాజరుషి । సుమిత్రికిట్లనెను ।
బుద్ధికపెద్దవు మాటలకుమరదలవు । హారతివేదామ్మ - అంటసుమిత్రి - హార
తితాదెచ్చె - అప్పుడు రాజరుషి - అపరిమితధనమిచ్చె - మునులరుషులా
అంత - రాజభార్యలుకలసి - ఆరగించిరివారు - హస్తములు కడిగియూ -
కర్పూరవీడెములు - దశరథుడుయిప్పించె - అపుడురాజరుషి - కౌసల్యకి
ట్లనెను - విం. వృపురాలుఅదారిం - పీసమెత్తుజరుగలేదు - లక్షవరహాలది -
పరుపువేయగవలెను - నాలుగువేలూకలవి - చీరలివ్వగవలెను - వెండిబొట్టు
పెట్టె - వెదులకుయివ్వాలి - దువ్వెన్నభరిణెలు కాటుక్కాయుగూర్చె -
శాంతకునయివ్వాలి - యెడువారఫుసొమ్ము - యింతికినివుంచాలి - వారా
డబడుచుంటు - వరుసనడుపగ్గవలెను - కౌసల్యసుమిత్రి - రాజానుమహా

ఋషి । అందరునువచ్చిరి । జయఘోషవేసిరీ । తలుపులువేయించి । కౌసల్యా
సుమిత్రి । విశ్వామిత్రుల్నిపిల్చిరి । అప్పుడుమహాముని । తలుపుతీయించె ।
పగలుజాలచేడె । పాన్పుపైబవళించె । కౌసల్యసుమిత్రి । పాన్పుపైనూర్చు
ని । పణతికిపాదాలువొత్తిరి । సరిగాలుగాము । పాదసేవలుజేసు । మీ
యంతవారంగాము । మిగులతోడుగులవేను । కళ్యాణంనాడయిన । శాంత
చూపిస్తిరా । నిన్నమొన్నా మేము । నగరుకురాలేదు । పాకన్ననాడొచ్చి
పండ్లెక్కునుంటిమి । నిండుజల్తారుచీర । కోడలికియిస్తేను । నాపెట్టెనిండునా
గొడ్డుమూగిమేము । కూతుర్నితేలేదు । పుత్రభిక్షంగోరి । పుత్రులకోరలేదు
వాసుకుడు । నాసుతుడు । ఋష్యశృంగునికి । బ్రహ్మచర్యంవదిలించిరీ ।
కౌసల్య సుమిత్రి । కడుచిన్నబోయిరీ । కన్నవారంగాము । కార్యములు
యెరుగము । కళ్ళుమూడగలేదు । కానుకలుసర్దండి । కొద్దిగుమ్మడికాయ ।
మీచేతిలోపెట్టితిమి । గోపాలోపములున్న । సర్దుకోవలెనమ్మ । అడపడు
చులుమీరు । అడుకేలచేస్తిరి । అలుకలుచెయ్యగా । అతిసరసమాయేమి।
అప్పుడుసుమిత్రి । మహాదేవికిట్లనెను । యల్లుడుట్టినమొగాలు । పలుకరాచే
యాలేదు । పంకరచేయించిరి । కౌసల్యసుమిత్రి । మహాదేవిబిలిపించి । తల
దువ్వికొప్పుపెట్టె । లక్షవరహాలాది । లక్ష్మికిపరుపేసె । నాలుగు చీరలు ।
నాతకీయిచ్చిరీ । యేడువారపుసొమ్ములు । వెలదికలంకరించె । వెండి బొట్టు
పెట్టె । బంగారుబరిణెలు । వెండికిచ్చిరి । వారాడపడుచులకు । లాంఛన
ములుదాచ్చిరి । ఋష్యశృంగునిబిల్చి । దేవిసరసనువుంచి । మద్దికాయులుదె
చ్చి । మహాఋషిసతికిబెట్టె । యప్పుడుసుమిత్రి । యుద్ధంబుచూపించె । మది
కాయలవదినె । బహుముద్దుగావున్నది । యప్పుడుమహాదేవి । సుమిత్రితో
బల్కె । కాసెబోసికట్టె । గడవేసిఆడము । చెంపకొప్పులుబెట్టె । బోగం
వారముకాము। పళ్ళకప్పులువేసు । తురకసానులముకాము। మీదాన్నిబోగంది
కోకిలాదేవనెను । మిటబాపబోగముది । కౌసల్యదేవిసుమి । రచ్చలోకైక
వ్య । రాక్షసీబోగమిది । నూటికోటీమాట । సుమిత్రిబోగంది । యప్పుడు
మహారాజా । యాచరలాలించి । యిదియేమిరునినవ్వి । తనసతులజూచి ।
మహాదేవికిట్లనెను । యక్కవీమరదళ్ళు । నేనువినియేటట్లు । చాలగాయును
మనెను । చాలుదుకన్నలు । వారురాచస్త్రీలు । మేళాలలోకల్ల । గరిడి
మేళంబిడి । యల్లందుములిగెను । యులకపాన్పువేసె । రాజానుబిలిచిరీ ।
యడిగివధనమిత్తు । యల్లుడారమ్మని । కోరినధనమిచ్చె । పట్టువేసుకు
రొచ్చి । హౌదానువేయించె । దంపతులనిద్దరి । అంబారియెక్కించె । రా
చనగరూనందు । యందరుచేరరీ । కనకపీటలువేసి । కౌసల్యసుమిత్రి । పీట

లాకూర్చొనిరి । ఋష్యశృంగుడుశాంత । పైడిపేళ్ళగంప । పందిళ్ళదించిరి ।
పదివుట్లధాన్యంబు । గంపలనవుంచిరి । యరుంధతియనసూయ । భూమిసిరో
కళ్ళిచ్చి । నెలమూడుశుభములు । యెప్పుడుజరుగవలె । వసంతముదెచ్చి ।
శాంతకైపులవారు । కన్యపైబోసిరి । యింతవేడుకయెప్పుడు । యింతిచూడ
గలేదు । సురలెల్లపొగడగ । జలకమాడించిరి । చలువతల్లొత్తిరి । రాజఋ
షులంత । ఆరగించిరియంత । ఆరగించీలేచి । హస్తములుకడిగిరి । కర్పూరవీ
డెములు । రాజాతాయిప్పించె । నాగవల్లిప్రోలు । వహోమునిశేయించె ।
రాజనగరిలోన । కనకపీటలువేసె । శాంతనుఋషినిబిల్చి । పీటలపైనుంచిరి ।
లక్కగుండూదెచ్చి । రమణిపెండ్లనగట్టిరి । నాగబలిసేసిరి । మేలికమ్మి
చీర । వగుపడుట్టించె । మూడుతరములచీర । యిచ్చినచ్చినచీర । యిప్పు
డెపుడుకట్టండి । ఆచీరవిప్పండి । నవ్వుతూసుమిత్ర ఆచీరవిప్పెను । చీని
చీనాంబరము । శాంతకూకట్టించె । మిథునవడియపుపొన్న । మహారాజా
చేయించె । దంపతులనిద్దరి । పొన్నపైనిడుంచి । సతిపతులపిల్పించి । ఫల
ప్రదానమిప్పించె । బొమ్మచప్పాదెచ్చి । వసంతములుబోసి । వసంతము
లాడిరి । కట్నములుదెప్పించి । కాంతలకియిచ్చిరి । బంగారుపళ్ళెములో
పాలుగాయిపోసిరి । శాంతచెయ్యిదెచ్చి । పాలలోపలముంచి । పతిచేతు
లోవుంచి । చెయ్యప్పగించిరి । అపవికరయేగినా । అయోధ్యలోవున్న ।
ఋషిశాలలోవున్న । కాంతభాగముమీది । శాంతిచెయ్యిదెచ్చి । పాలలో
నాముంచి । అత్తగారికివాను । శాంతనప్పాజెప్పె । బంగారుపళ్ళెములో ।
నవరసాన్నములుంచి । అతివనుబెట్టిరి । ఆరగించీలేచి । హస్తములుతాకడిగి ।
కర్పూరవిడెములు । సుమిత్రయిచ్చెను । పడిచీరగట్టిరి । పడిబియ్యముంచిరి ।
కంచపడిబెట్టిరి । బొమ్మనడిపెట్టిరి । తెల్లనిపడిబ్రాలు శాంతపడినింపిరి । వెం
డగిన్నియూదెచ్చి । పెలదపడినుంచిరి । కౌసల్యసుమిత్ర । కన్నీరుపెట్టిరి ।
చేడెనిచ్చేమేము । చేరినిలుచుంటిమి । అక్కచెల్లెలులేదు । అన్నతమ్ములు
లేరు । కొట్టుతాళంబిడుగా । కొత్వాలునంపుము । అయిదువేలచెలికత్తెల ।
ఆరణంబులుయిస్తు । అప్పుడుమహాదేవి । కౌసల్యకోట్లనెను । వెలదులాలమీ
యింట । పసిడిబొమ్మలులేవ । దంతపుబొమ్మలులేను । చాలగాచూస్తిని ।
మాటవినిసుమిత్ర । మణులబొమ్మలుయిచ్చె । అప్పుడుమహారాజా । మూండ
వ్యతోబల్కె । మాశలవులేక । మాయింతినీమీరు । యెచ్చటికిపంపొద్దు ।
మీశలవులూలేక । యింతినీపంపేము । అతమూనిరాయసం । కోడలందగ
వలెను । అప్పుడురాజఋషి । మహారాజతోబల్కె । యాతివనాయిస్తిమి ।
యెల్లనీయిష్టమునె । రాజఋషియామాని । మంచిరోజూజూచి । పట్టపేనుగు

దెచ్చి । యంబారి వేయించె । దంపతులనుంచిరి । జయభేరి వేసిరి । యప్సరస
లాడగా । యడుగడుగు మజిలీల। వడిగ వసిగగ దలుచు। పెండ్లినడకలు నడచుచు।
పన్నెండు ఘడియలకు । పట్నంబు లందు చేరిరి । ఋషిపల్లెలో పల । యంవరుచే
రిరి । లక్ష్మి వచ్చి వదనుమ । లక్షభేరి వేసె । జమ్మిచెట్టు క్రింద । శాంతసారె
లుపెంచె । పూర్ణకలశలు దించె । గృహప్రవేశంబాయె। నడికట్టు విప్పిరి ।
సంతోషమున నుండె । ఋషి దశరథుతో బల్కె । యజ్ఞంబు చేయుటకు । వ్య
వధి లేదు గనుక । ఋష్యశృంగుని దెచ్చి । కామేష్టి జేయించు । రాజు మహాఋషి
కలసి । మంచి వేళలు జూచి । శేఖరవ్రాసిరివారు । ఋషిపల్లెలో పల । మాండ
వ్య మహాముని । బావగారికనుచు । యాగంబు చేయించ యల్లునంపుమని ।
ఒకలేఖ యువ్రాసి । వశిష్టు చేతికిచ్చె । వసిష్టుడు దెచ్చి । మాండవ్యకిచ్చె
ను । సుతుని చేరగ బిల్చి । యయోధ్యకేగుమనె । ప్రయాణము ఋషి యా ।
యయోధ్యరాగాను । యల్లునికి యెదురుగా । దశరథుడు యేగెను । తగినమ
ర్యాదలతో । యల్లుని దెచ్చిరి । బంధుబలగంబంత । యేలరాలేదనెను । క్రి
తువు నాటికి వారు । క్రమముగా చేరుదురు । యజ్ఞంబు చేయించ । యేమేమి
గావలెనో । అనతివ్వుండనగ । వుత్తరపు దిక్కునా । వకశాలవేయించి ।
యూపస్తంభము దెచ్చి । మెప్పుతో పాతించి । పచ్చపూరిమాకు । పడికోళ్లు
కావలెను । మోదుగాకు తెండి । రావిఆకులు తెండి । మామిడాకులు తెండి ।
కతులరాకటార్లు । కావలసి వున్నవి । నల్లపశువుంమారు । ధాన్యము గావ
లెను । ప్రోక్షణంబందుటకు । భమిడిపాత్రలు తెండి । మంత్రములతో పిండి।
పంపించగావలెను । మంత్రి సామంత్రమునకు । మాటవసుంధరయ్య । నిలుచుండి
కూర్చుండ । పరుండి మంత్రమ్ము । మేము చెప్పగవలెను । పట్టుపుట్టంబియ్య।
ప్రోలయాగ్నలుంచితే । పన్నెండు వరహాలు । సోమిదేవమ్మలకు । మోహి
రీలు యివ్వవలె । యవభృతస్నానం జేసె । యవిమాటవస్తవి । రాజు నాఋషి
గలసి । మంచి వేళలు జూచె । వుత్తరశాల । వొప్పుగా కట్టించె । పట్న
పేనుగు దెచ్చి । యంబారి వేయించె । కౌసల్య సుమిత్ర । యేనుగనురొక్కిరి।
దశరథ మహారాజు । యగ్నిహోత్రంబట్టి । యల్లునితో వెళ్ళగా । హారములు
వెంచకొని । హోమునాయెదురుస్తు । కైకమ్మ తావచ్చె । యల్లుడత్తను జూచి ।
రాజగురుకుట్టెను । కళ్యాణగోలాలలో । కాంతమూడగలేదు ।
యీయింతిరెయోశ్వరన । రాజు మూడవ భార్య । కైక యనిచెప్పిరి । మహారాజు
కైకమ్మ । ఘనుడీరథమెక్కిరి । మంచి వేళలు జూచి । కాలప్రవేశించె । అ
గ్నిహోత్రములుంచె । దర్భశీనుననచ్చి । మంత్రాలతో నపుడు । రాజున
డుమునకట్టె । సతుల నడుముకట్ట । యప్పుడు కైకమ్మ । యదరిపడకుండగా

యాదరించి గూర్చారు । దర్భవడు ముకుగట్టె । సోమిదేవమ్మను । జట్టుగట్టుజర
చిరి । ఆవేళయజ్ఞంబు । ఋష్యశృంగుడు చేయించె । పాత్రీయోగంబట్టె ।
మానుమేమెవతాము । మంత్రులతో ధనం । యెంచిపుచ్చుకొండి । ఋష్య
శృంగుడువచ్చి । పాత్రీణయోగంబట్టె । యప్పుడుమహారాజు । పిల్లని జూ
చెను । తడిమిచూచెదగాని । కర్రివలెవున్నాడు । యప్పుడు మహాముని ।
మహారాజుతో బల్కె । వంటపాత్రిణంలేదు । యిందర్నాకంబేగ । చంద్రి
మండలమేగ । సూర్యమండలమేగ । నక్షత్రమండలమేగ । పుత్రులు గల్గు
టకు । పుట్టుగతిజూపించు । పచ్చపూకీమీద । పావకుడుపచలించె । ఆనం
దముతోపొంది । ఋష్యశృంగుడువచ్చె । గందెశృలోపల । పట్టెనీవుంచిరి ।
ఆవేళయజ్ఞంబు । ఋష్యశృంగుడుచేయించె । యూపస్తంభంతెచ్చి । మెప్పు
తో పాతిరి । వెదురుస్తంభంపాతి । పసుపుల్లుగాసిరి । నల్లపసువులు దాన్ని
కట్టబంధించిరి । మంత్రిములతోపండి । ముఖులచే వంపించె । కూష్మాండపు
యండి । మంత్రిములుజెప్పెను । వాటిపొరలుదీసి । హోమంబుచేసిరి ।
యేమరుధారగనేయ్యి । హోమమునబోసిరి । పాత్రివశంపండుకు । పాత్రి
తో బట్టుకు । ఋషిపాత్రిణయోగంబట్టె । దశరథునకూమీరు । జన్మింతురా లేద
ప్రత్యక్షముయప్పుడు । పావకుడుతాపల్కె । దశరథారాజింట । నలుగు
రుజన్మింతురు । ఋష్యశృంగుడుమళ్లి । దశరథునిజేరిరి । మంత్రితోఋషి ।
పాయసాన్నంబట్టె । మానుదశరథునికిచ్చె । కౌసల్యకిచ్చెను । కౌసల్యతానంది ।
కైకమ్మకిప్పించె । సుమిత్రికిప్పించె । కళ్ళవద్దునచెలులు । గడియలో ఆర
గించె । యప్పుడు సుమిత్రి । కైకదగ్గరకొచ్చి । సవతిపాలిక్కడికి । తప్ప
కపెట్టితా । యదరిపడిమండగా । పాయసంబెట్టంగ । ప్రీతితో కైకొని
మరువ ఆరగించె । యప్పుడు ఋష్యశృంగుడు । మహారాజుతో జెప్పి । సోమ
గుండంతొక్కటకు ! ఆలస్యమునులేదు । మీకూడబడుములకు । తోడు
కుపమ్మనెను । యప్పుడుమహారాజు । ఋషితోడజెప్పెను । సోమకుండందా
క్క । శాంతవోడుకురండి । తిరుగుపారియిచ్చి । దంతిగమననుదెండి । ఋషి
పల్లెకూబంప । శాంతకూపారెవుంచె । కౌశికునిబంపించె । కౌశికుండేగను ।
ఋషిపల్లెకూయేగి । శాంతనుజూచియు । పెద్దావబడుచువట । సోమగుండం
దొక్క । మీతండ్రిరమ్మనెను । యందరినిరమ్మనిరి । ఆడబిడ్డల తోమ ।
యుండరువచ్చిరి । పట్నపేరుదెచ్చి । యంబారికేయించె । శాంత పట్నపే
రుగదెచ్చి । అంబారికేయించె । శాంతనుయెక్కించిరీ । అందలములు యె
క్క । జయఘోషచేసిరీ । అందరుతర్లిరి । అయోధ్యకుచేరె । దేవ్రులెదురుగ
వెళ్ళి । దేవినిదెచ్చిరి । కాళ్లకడిగివారికి । ఆసనములేవేసె — ముత్యాలపా

సతులు - ముగుదలయిచ్చిరి । శాంతను సౌత్తుని - రాజారొడలనువుంచె -
కల్యాణము కన్న - కడుసొంపుగానుండె - నవరసాన్నములుంచ - ఆరగిం
చిరివారు - పతకములుహారములు - పణతికివుంచిరి - బాలతొడుగులు వా
రు - శాంతకుతొడిగిరి - పాచుగుపిందొ్రిక్క - శాంతతో నేగిరి - అరుం
ధతిఅనసూయ - అహల్యసురభిదేవి - బంగారురో లేసి - భమిడిరోకలిద
చ్చి సువ్వి సువ్వినిరంచ । సుందరంబుగనుండె । చోద్యములు చూడవలె
నుదతిరూపజూచి । మోహంబుబలువయ్యె । మంత్రించ జదువాలేక । ఋష్య
శృంగుడనవ్వె । గుండెంబుదొక్కిరి । మాఅపకడుచుకలు । దానంబు వస్తుం
ది - కౌసల్యచేతులవి - కంకణములివ్వండి - కౌసల్యచేతులవి - కంకణము
లిచ్చిరి - పోనతీగెతెంపి - తపసరుదెచ్చిరి - హోమంబువేల్చిరి - అంతట
తెల్లవారె - శాంతనుతాబిల్చి - నాతల్లిశాంతమ్మ - నీకోరికలు దెల్పుమన
నవ్వుచు శాంత - తండ్రితో తా బల్కె - తమ్ములుట్టిన వినుక - సగము రా
జ్యమియమ్మ - శాంతఅసురులు - దశరథులునవ్విరి - అన్నదానంబులు
అపరిమితముగజేసె - ఆశాంతలంటించి అందరు వెళ్ళిరి - అల్లుని కట్నాలు -
అత్తలియిచ్చిరి - అన్ని అందుకొని - అయోధ్యకువచ్చె - అంతఃపురములో
భార్యలతో చేరెను । ముగ్గురు సతులతో । మహారాజుభోగించె । అతివలకు
అంతట । గర్భంబులాయెను । రాజును మహాఋషులు । పరివారమంతాను ।
నవరసాన్నము వారు । ఆరగించిరివారు । కర్పూరవిడెంజేసె । మహాఋషు
లందరికి సంభావనలుయిచ్చె । ఋషికిమహారాజు । గొప్పకట్నములిచ్చె ।
తొమ్మిదినెలలవారు । యోగికిఅప్పుడు । శాంతకుగర్భంబు । క్రమముగాపెరి
గెను । చెనలేనిమాటలు । నెలతలుగోరిరి । పచ్చిబొప్పలు । పణతులూ
కోరిరి । పళ్ళుఫలహారములు పణతులుకోరిరి । శుభదినంబులయందు । చై
త్రశుద్ధనవమి । సువతునాడుముగ్గురు । నల్గురుపుత్రులుగనిరి । పురుడుపుణ్య
ముగడపె । పదునొకండవనాడు । బారసాలనాడు । మహాఋషులబిలపించె
ఋషిపల్లెలోవారిని । రాజరుషిబిలిపించె । ఋషులంతవచ్చిరి । కనకపీటలువే
సె । ముగ్గురుభార్యలు । మదతో ముగూర్చుండి సుతులనల్వురదెచ్చి । సతుల
తొడపైనుంచె । బంగారుశయ్యములో । పాలొప్పగాబోసి । రామలక్ష్మణు
లనుచు । నామకరణంబాయెసె । భరతశత్రుఘ్నులని । పేరొప్పగావెట్టె ।
ఆరంగతిలనమయాన । హారతులియివ్వంగి । అతివలకుబహుమాన । మహా
రాజయిచ్చెను । ఋషులురాజునుగూడి అరగించిలేచి । విడెమునుతాజేసి ।
చక్కసీసతులకు పువులా తస్వరంచరిపి । వేదోక్తలు మీరగ వేదులకువస్త్రములిచ్చిరి ।
పచ్చవెల్లంబులు । పంచిపెట్టిరివారు । సకుటుంబముగమీరు । ఋషిపల్లె

రమ్మని । మాండవ్యమహాముని । దశరధునిబిల్వగా । రాజరుషితో బల్కె ।
పతిసుతులనందర । బంధుబలగమునంత । అయోధ్యపురిజనుల । అందరిని
బంపెదను । నేను శాంతాదేవి । మానగరముండేము । రాజమాటలకపుడు ।
ఋషియు తా చింతించె । దశరధుడంతట । తరుణులను తాబిలచి । యేడువారపు
సొమ్ము । యేలనాగకును బెట్టి । అతివనిప్పుడు మీరు । యలంకారమును జేసి ।
తేగ దెమ్మనగాను । యువతులంతట నేగి । శాంతిను తాబిలచి । హారములు పత
కములు - నవరత్నసొమ్ములు - నాతకప్పుడు వుంచె - పట్టుపేనగు దెచ్చి -
యంబారి వేయించి - యందలయానను దెచ్చి - యంబారియెక్కించి - నలు
గురుసుతులను - నానాతిచెంగటనుంచి - జయభేరి వేయించె - 18 గడియలకు
బైలు దేరివారు యడుగడుగు మజిలీలు । యటు రేగుచుండిరి । యప్పుడు కైక
మ్మ । మందరకిట్లనెను - రాపరేపరు వెళ్ళారు - యెంచిచూడు మానగ । మం
దర తా జూచి - కొందరు వెళ్ళారు । చెప్పరానీ సొమ్ము । శాంతకును యిచ్చిరి
ఆమాటవిని కైక - యతివతో నూగూడ - ప్రియ ణమ్మైకి వలె - ఋషిపల్లె చే
రంగ । మాండవ్యమహాముని - సతితో దా బల్కె నా । రాజలొస్తున్నారు ।
పీటలు వేయించు । ముత్తైదువలు నలుగుర - చెంక బెట్టుక చేరి - శాంతయింటికి
రాగ । హారములు యిచ్చిరి - శుభముహూర్తంబున - సంతోషమున నుండె
శాంతి కాలంబునకు - బాలలనల్గురిని - యన్నప్రాశనచేతమని - రాజారు
షియు కలసి మంచి వేళలు జూచి । రఘుల నుపిలిపించె । ఋష్యశృంగునితో -
గూడ - రఘులెల్ల వచ్చిరి - కనకపీటలు వేసె - బాలులనలుగురిని జలకమా
డించిరి - చలువ తెల్లొత్తిరి - కస్తూరితిలకంబు - కన్నులకాటుక - రాసుతు
లకును వుంచె - బాలతోడుగులు వారు - బాలలకువుంచిరి - సుతులనల్గురి
రాజ - సరసముగ వడినుంచి - బంగారుతబుకతో । క్షీరాన్నమును దెచ్చి -
పసిడిగిన్నెలో వుంచె - ఆయుధంబులు పళ్ళు ఆభరణంబులు - ఛత్రిచామర
ములు చక్రరాదుటను వుంచ - పట్టాభిషేకవుంగ్రం - భరతుడు తీసెను -
వజ్రాయుధంబును - శత్రుఘ్నుడు పట్టె । చామరంబొక్కటి - లక్ష్మణుడు
తాదీసె రత్నకవచాబొక్కటి - రామచంద్రుడుదీసె - రాజు సంతోషించి - తన వెంట
మంత్రితో - యన్నప్రాశన చేసే - ఆరగించిరివారు - హారతులు యిచ్చిరి -
యందరును కలసి - ఆరగించి లేచి - కర్పూరవీడెములు - క్రమముగా జేసిరి.
శాంతఆటలు చూడ - మహామునికి మనసాయె - శాంతికార్యం చేయ - రాజ
రుషియు తలచె - దశరధ మహారాజా - తనయుకు శుభమిపుడు - తరుణి
చేయగతగదు - యింతి వేమి చెడుంగుడు - మాబలమునితో బల్కె - మామమాట
యువిని - ఋష్యశృంగులు బల్కె - గొప్పవారి పిడ్డకు - కల్యాణము తగదు -

జమ్మిచెట్టుకు యిచ్చి - పరిణయంజేసితే - పడతిబాగుండును - మామమీరవి
పల్కె - ఋష్యశృంగుడువెళ్ళె - కౌసల్యమహాదేవి - కాంతునగ్గరజేరి -
యల్లునకోపించి - యువనికియోగితే - పతికితేవగలేము - స్త్రీలమర్మంవల్ల -
సిద్ధఋషి తెచ్చితిమి - యల్లునికార్యంజేయు - యయోధ్యాపట్నమందు - రాజా
ఋషులుకలసి - మంచివేళలుజూచి - యాంతవ్యమునికి - మగువకౌసల్య
మని - బంధుపరివారముతో - పతిసుతులతో కూడి - పరుగునపురంపని -
శుభలేఖవ్రాసి - భూసురులచేతికియ్య - ఋషిపల్లెవారేగి - మహాఋషికిచ్చిరి -
మహాఋషి యదిచూచి - మగనితోనూజెప్పి - యింపుగా పయనమై - య
యోధ్యనృపుచేరిరి - రాజాపతులాకలసి - ఋషికియెదురుగవచ్చి - వందనం
బులుజేసి - పరషిరములువేసి - మాకునీయల్లునికి - కౌసల్యకిలలంటె - యువ
వికియోగినా - యయోధ్యనృపుగృహవున్న - కాంతిభారముమీద - తరతరంబులు
మాకు - దాహితులిల్లు కలుగవలె - జలకమాడించిరి - చలువవల్వొత్తిరి -
పీతాంబరముతెచ్చి - అల్లునికియిచ్చిరి - కరకంచులచీర - కాంతకును
యిచ్చిరి - హారములుపతకములు - అల్లునికివేసిరి - బాలతోడుకులుఅన్ని -
పణతికినిఫుందిరి - అగ్నిహోత్రములువేల్చె - మంత్రభంజదిరి - దంప
తులనువుంది - హోమంబువేల్చిరి - ఆశీర్వదించిరి - ఆరుంధతి అనసూయ -
హారతులుతాయిచ్చె - మానసుసామ్ములు - మహారాజావారికిచ్చె - తపసు
తులచేతను - రాజకట్నమిప్పించె - అప్పుడుకౌసల్య - వంటవాళ్లజూచె -
వియ్యాలవారొచ్చి - యింటదిగివున్నారు - యత్నంబులేదన - కోకిలాదే
వొచ్చి - స్నానంబుతాజేసి పట్టుచీరకట్టి - కమండలములోను - గంగ
తాచేకొని - రమణిప్రోక్షించంగ - పాకమంతాఆయె - పన్నెండుకూరలు -
పంచభక్ష్యాన్నములు - శాకంబులాయెపోయె - కనకపీటలువేసి - కాంత
లొడ్డించిరి - బంధుబలగములతో - కూతుఅల్లునికోడ - పతిసుతులతో
డను - రాజాఋషులుకలసి - ఆరగించిరిచె - హస్తములుతాకడిగి - వీడె
ములుతాజేసి - వియ్యాలవారికి - కట్నవర్గంబులు - భూకాంతుమాతా
యిచ్చె - కోకిలాదేవికి - కౌసల్యమిత్రి - కట్నవర్గమునిచ్చె - సాయం
కాలపువేళను - పతిపతులారగించి - హస్తములుకడిగిరి - వీడెములువేసిరి -
మహామునిరగదుగో - కనకపీటలువేసి - దంపతులనిద్దర - పీటలపైనుంచె -
మధుపర్కములుదెచ్చి - అల్లునికియిచ్చిరి - మాణిక్యాలచీర - మగువకు
యిచ్చిరి - ఋష్యశృంగునిచేత - ఫలప్రదానమిప్పించె। ముప్పయిమూడుకో
ట్లదేవతలు - మూడుకోట్లఋషులు - దీవించిరివార్ని - పానుపునవుందిరి -
ఋష్యశృంగుడు - రమణినితావిలచి - సరిరాజాలంగాను - [illegible]

వుంగరంబెగరేయ - ఆనుర్మములెరుగము - ముద్దుగుమ్మావచ్చి - విడెము
చుట్టిమ్మనగ - విడెముచుట్టియిచ్చి - ఆత్రుపన్నీరు - ఫలహారములు -
సతిపతులు ఆరగించె - సుఖనిద్రజేసిరి - మరికొంతసేపటికి - మహాఋషి యం
తాలేచి - సతినినిద్రలేపి - నిజరూపు చూపింతు - నిశ్చయంబుగ నాడు -
పుణ్యమిల ఆకాశమును - భూసురుడువక్కాణై విశ్వంబు వెరవంగ - విశ్వరూ
పము చూప - గడగడవణకుచు - కాంత తానిలుచుండ - అతివరోజడిసితి
వని - అంగనను చేరబిలచి - సుఖనిద్రను జెంది - వేకువజామున లేచి - ఋషి
యూతపసుకు వెళ్ళె - పతికి భయపడి కాంత - మరిలేవదాయెను - పదిగడియ
లాపొద్దు - పరగంగయొక్కను - కాంతను జూడంగ - తల్లులావచ్చిరీ
తండ్రులు వచ్చిరి - కోవిలాదేవొచ్చె - పిలచిన పలకదు - కన్నెత్తి చూడదు-
కాంతఝుడిసినదని - వశిష్టుని బిలచి - వీభూది పెట్టుమన - విభుడునట్టే గాని-
కార్య మొనగూడదన - తపసు చేసుకు ఋషి - తరుణి దగ్గరకొచ్చి - కమండ
లోదకంబు - కాంత ముఖమున జల్లి - సంచిలోభూది - సరసిజాక్షికి వుంచ -
కలకలనవ్వుచు - కమలాక్షి లేవగ - కలికిచిలుకలకొల్కి - కళ్ళుపడలేవని -
కౌసల్యసుమిత్రి - కాంతలంతాపాడలె - తల్లులజూచుటకు - తరుణివేగు
మని - తల్లులనగరికి - తరుణియూవెళ్ళింది - తల్లులు రొత్తుకుని - తలంటి
నీరోసి - దిష్టియూతాదీసి - అలంకారములు వేసి - వధూవరులకు - విం
దులను జేసె - ఆరగించి లేచి - హస్తములు కడిగిరి - వీడెములు జేసిరి -
మూడునిద్రలువారు - ముగుదతో చేసిరి - రాచకన్యగనుక - రాచనడవడి
మప్పె - వారియాచారంబు - విడనాడి యిప్పుడు - మునవడవడినేర్పి -
మగనను వుంచవలె - అనుచు చెప్పెరాజా - దర్భాసనంబును - చిత్రాసనం
బును - వజ్రకమండలం - మహామునికిత్తాయిచ్చె - అల్లునికి దశరథుడు -
గోదుకాలువలిచ్చె - అడవికియేగినా - అయోధ్యనృలో వున్న - ఋషిపల్లె
లోవున్న - కాంత భారం మీదని - చేతిలో చెయివేసి - ఋషిచేతులో బెట్టి -
కాంతను వీడనని - శపథంబు ఋషి జేసె - రాజా భార్యలబిలచి - వడినిదివ్యం
బుంచి - నడికట్టుకట్టండి - అప్పుడుఆత్తవచ్చి - వడిచీరకట్టెను - సిరిగులుక్కు-
చుక్కుంచె - మణులు పతకములిచ్చి - క్షీరాన్న ముంచెను - భక్ష్యంబులుంచెను
అతివ ఆరగించె । కర్పూరవీడెమునె । కాంతితో ఆడేటి । చెలికాళ్ళువగచిరి
రాజా ఋషియూకలసి । మంచివేళలు దాచె - పట్టు పేనుగు దెచ్చి - అంబా
రి వేయించి - ఋషిని కాంతను కూడ - అంబారియెక్కించి । జయభేరి వేయించి
ఋషిపల్లెలోవారు - అందరును చేరిరి - కాంత సారెలు - సరసముగ పంచిరి -
కాంతను దిగవిడచి - రాజసతులను గూడి - బంధుపరివారముతో - అయోధ్య

ధ్యచేరిరి - మరికొంతకాలమును - మగువనుచూచుటకు - తల్లులకును
పోయె - వశిష్ఠులనుయిచ్చి - పవిత్రనుజూచుటకు - దశరథుడుతనసతుల -
సుతులనుతోడిచ్చి - ఋషిపల్లెబంపంగ - కౌసల్యసుమిత్ర । శాంతినుజూ
చిరి - భరద్వాజునియింట - విందారగించిరి - మాండవ్యమహాముని - మగు
డిభించుకుబిలువ - మనువడుకలగనిది - మీయింటభోజనం - మేముచెయ్య
మనగ - ఋషికోపంవచ్చి - సుతనంపననిపల్కి - మనసునిల్వగలేక - మ
గువలుభోంచేసి - సుగతినీవొందొకని - అల్లునివొందొకని - సపరివారము
తో - అయోధ్యచేరంగ - కోసలేంద్రుండంత - కొలువులోకూర్చుండి -
వియ్యాలవారికి - వినయములతోజేసి - నదురుచేసిరాజా - చక్రిగాకూ
ర్చునె - కూతునెత్తుకుకౌసల్య - నగరకుచేరగా - కన్నెత్తిచూడదు - పిల
చినపలుకదు - భీష్మించుకున్నాదు - యినవంశరాజని - కూతునెత్తుకునతి
రాజదగ్గరరాగా - తినయుశాంతాదగి - దండముబెట్టియు - మావల్లతప్పే
మి - మహారాజాచెప్పుమన - మాతల్లికౌసల్య - మిగులగడుసుదిగనుక -
మగనిమాటయుదాటి - మరిమగువనవచునని । అంతటకౌసల్య పతిపాదము
బడగ - శాంతకళ్యనజూచి - కరుణించెఆరాజా - శాంతనెత్తుకురాజా -
నాతల్లిశాంతమ్మ - నగలుకావలెనమ్మ - యేనుగులుగుర్రాలు - రథవాహ
నంబులు - మణులురత్నములైన - మగువరోకావలెన - యేమేకావలెనె
నో - యిలనాకకోరుమన - నలుగురితమ్ములకు - సరిపోవునట్లుగా - పసి
డిబొమ్మలునాకు - చేయించియివ్వమన - విశ్వకర్మనుబిలచి - పసిమిపుత్త
డియిచ్చి - బొమ్మలనుచేయించి - బొమ్మకునుయిచ్చిరి - బొమ్మలతోగుమ్మ
లు - ఆడుచుపాడుచుమండె - సంతోషచిత్తులయి - దశరథులవుండగా -
జనకమహారాజునకు - సంతానములేక - యజ్ఞంబుచేయుటకు - భూమిదు
న్నించగా - నాగేటిచాలన - మందసంతగిలంగ - పరిచారకులువెళ్లి -
జనకునకుచెప్పంగ । సంతోషమునపొంది - విధియుదొరకనని - సభకును
సెలవిచ్చి - పాదచారైతాను - పరుగుపరుగునవచ్చి - క్షేత్రంబుత్రవ్వించ
బంగారపుపెట్టె - రంగుగాదొరకంగ - వెలుపలకుతీయించి - ద్వారంబుతెర
వంగ - దగద్దగాయమానము - కలకలనవ్వుచు - కేకలనువేయుచు - శిరిగు
లుక్కుమన్నట్టి - శ్రీలక్ష్మిదొరకంగ - బాలనుతాయెత్తి - మురిపెముతో
ముద్దాడి - నగరుకుయేతెంచి । నాతులకుయివ్వంగ - సంతోషమునుపొంది
రమణిబాలింతఅయి । పురమునుతాగడపి - భారసాలయుజేసి - సీతయను
నామంబు - స్థిరముగాచేయించి - దశదానములతోను - ధరణీసురులకు
జేసి - పరిచారకులబెట్టి - పణతినితెచ్చి - శివవిల్లువిరిచితే - సీతనిత్తు

తలతో నజన్మమయితె తనకుబహు మోసంబువచ్చుననుచు
రూదురు కాళ్ళనబుట్టెను యేడుగురుదాదులను జంపెనపుడు॥ ౩
చెత్తురిలోయుండియపుడు ఆబాలకావుకావునయేడ్చుచు
నన్నేలయెత్తుకొనవే నాతల్లి దేవకీనందనమ్మ॥ ౪
ఒళ్ళెల్లహీనంబుతో యీరీతినున్నానుకన్నతండ్రి
నిన్నెటులయెత్తుకొందు నీవొక్కనిముషంబుతాళురన్న॥ ౫
గంగనుప్రార్థించెను జలసిద్ధులుగంగతానువొప్పంగను
గంగనదిలోనప్పుడు దేవకీజలకంబులాడెతాను॥ ౬
ఇకనైన యెత్తుకొనవే ఓతల్లి దేవకీనందనమ్మ
కానిబాలకునివిన్నవించెను నన్నిట్లయేడబాసియుండదగునా॥ ౭
నీపుణ్యమయొకొదుకా ఒంకొక్కనిముషంబు తాళుమనుచు
కామధేనువునప్పుడు దేవకి వదియందుదలచగాను॥ ౮
పాలవర్షముకురిసెను అప్పుడాబాలపైజల్లగాను
తడివస్త్రములువిడిచెను దేవకీపొడివస్త్రములుగట్టెను॥ ౯
పొత్తులామీదనపుడు బాలుండుచక్కగాపవళించెను
తనరెండుహస్తములతో దేవకీబాలకున్నియెత్తుకొనెను॥ ౧౦
అద్దాలపైనేసుకు ఆబాలచక్కదనమునుజూచెను
వసుదేవపుత్రుడమ్మ యీబిడ్డశ్రీవాసుదేవుడమ్మ॥ ౧౧
నవనీతచోరుడమ్మ యీబిడ్డనందగోపాలుడమ్మ
సీతాకళత్రుడమ్మ యీబిడ్డశ్రీరామచంద్రుడమ్మ॥ ౧౨
శిరమునచింతామణి నాతండ్రివాలుకనునక్షత్రము
పండ్లనుపరగనేది భుజమందుశంఖుచక్రములుగలవు॥ ౧౩
మీపునవింజామర నాతండ్రిబొడ్డునాపద్మజాతం
అరికాళ్ళతామరములు అన్నియునున్నవీకన్నతండ్రి॥ ౧౪
నీరు పుచక్కనా అబ్బిమ్మారు నాన్నర్భవాసెతండ్రి
అన్యకారిగర్భమూ నాఅయ్యయేలజన్మిస్తివయ్య॥ ౧౫
మాయన్నకంసుడుండూ ఇప్పుడూవచ్చురేళాయెరన్నా
నిన్నుచేనెత్తుకొని యేతోవపోదురాకన్నతండ్రి॥ ౧౬
ఆచక్కదనముచూచి దేవకీశోకింపసాగనప్పుడూ
తల్లిశోకముమాన్పగా మాధవుడుతానిట్లుచేసెనపుడు॥ ౧౭
పెద్దబొబ్బలుపెట్టుచూ మాధవుడుగట్టిగాయేడ్వసాగ
శోకంబుచాలించితా బాలుణ్ణియెత్తుకొనెను॥ ౧౮

నాయన్న వూరుకోరా నాతండ్రి గోపాలపవళించరా
అల్లదుగో బూచివాడు నాతండ్రి వస్తాడు పవళించరా ॥
బూచినువర్ణించను నలినాక్షి బుద్ధివంతుడనమ్మరో
బూచేమిచేసునమ్మ నాతల్లి బూచినన్నెరుగనమ్మా॥ ౧౯
నీపుణ్యమాయెకొడుకా నీవొక్క నిముషంబు తాళరన్నా
అల్లదుగో జోగివాడు నాతండ్రి వస్తాడు పవళించరా॥ ౨౦
జోగివాండ్లుంచుటూ యేవేళ నాచెంకనుంచగనూ
జోగేమిచేసునమ్మ నాతల్లి జోగినన్నెరుగునమ్మ॥ ౨౧
నీపుణ్యమాయెకొడుకా నీవొక్క నిముషంబు తాళరన్నా
అల్లదుగో పామువచ్చెనూ నాతండ్రి గోపాలపవళించరా॥ ౨౨
పాములకురాజు అయినా ప్రభుడు నాపాన్పయి యుండగాను
పామేమిచేసునమ్మ నలినాక్షి భయమునీకేలనమ్మ॥ ౨౩
నీలమేఘపుఛాయలు నీమేను నీలాలవారములును
ముద్దుముదువాలిపిరాను నాతండ్రి నీరూపుచక్కదనము॥ ౨౪
విన్నావేనొత్తుకొని యేలోవబోదురా కన్నతండ్రీ
మాయన్నకంసకుండూ వచ్చువేళాయెనా చిన్నబాలా॥ ౨౫
నాకేమి భయములేదు వోతల్లి నాకేమికొదవలేదు
మామామకంసకుండూ తెమ్మనీనిన్నడుగవచ్చినపుడు॥ ౨౬
వాళ్ళతో అందియ్యవే దూరముగనిలుచుండిచూడవమ్మ
వాళ్ళచక్రములు గాంచూ నాపేరు ఘనుడు శ్రీరాఘవుండు॥ ౨౭
మామావనన్నట్టుగా యీవేళనన్ను వెరపించివస్తే
మామామనాచేతను మరణమైపోయేది నిజమ్ము నమ్మా॥ ౨౮
వచ్చెవేళాయెననుచూ నాతల్లి వసుదేవుబిలువనంపూ
గోపెమ్మబిడ్డనపుడూ శీఘ్రముగతెచ్చినీవుంచవమ్మా॥ ౨౯
అంతలో వసుదేవుడూ బాలుణ్ణితే మీదయెత్తుకొనెను
రేపల్లెవాడలోనా గోపెమ్మయింటనూ వుంచెనపుడూ॥ ౩౦
గోపెమ్మపుత్రినపుడూ వసుదేవుభుజముపైనెక్కించుచూ
అతిత్వరితముగవచ్చెను దేవకీహస్తమునను ఉంచిపట్టె॥ ౩౧
దేవకీతనయుడపుడు పుట్టెననికంసునకు కబురాయెను
ఝల్లుమనిగుండెలదర కంసుండు పీఠంబు దుమికెనపుడూ॥ ౩౨
బాలికంబులుచూచెను గండంబుతగిలెననికంసుండూ
ండాళ్ళాయుధములూనెను శీఘ్రముగ దేవకీవద్దకొచ్చె॥ ౩౩

తెమ్మనిసుతునడిగనూ దేవకీఅన్నదీఅన్నతోనూ
మగవాడుకాదురన్నా యీబిడ్డఆడపిల్లానమ్మరా॥ ౩౪
ఉపవాసములునోములు నోచియుపుత్రికనుగంటిరన్నా
పుత్రికాదానముచేయగానాయన్న పుణ్యావంగడవుకమ్మా॥ ౩౫
దేవాదిదేవులైన బ్రహ్మరుద్రాదులకుపూజచేసి
పూజఫలముచేతను వారికృపపుత్రికనుగంటిరన్నా॥ ౩౬
నీపుణ్యమాయెరన్నా పుత్రికనునీవుదయచేయరన్నా
నిరయాత్మకుడవగుచు నీవిట్లుచేయుటతగదురన్నా॥ ౩౭
ప్రేమతోచెల్లెలపుడూ అన్ననూచెయిబట్టిబ్రతిమాలుచు
గంగాదినదులయందు పుత్రికాదానముసేయుమనివేడెనూ॥ ౩౮
కాదుకాదనికంసుడూ దేవకీపుత్రికనుఅడిగనపుడూ
అడ్డాలపైబాలను పుచ్చుకొనియెగరేసి నరకబోయె॥ ౩౯
అంబరముకెగరవేయ నవ్వుచూఆబాలకంసునిజూచీ
నన్నేలజంపేవురానీకుబ్బరేపల్లెవాడలోను॥ ౪౦
పెరుగుతున్నాడువినరానీయాయుష్షుతరుగుచున్నాడుకనరా
కృష్ణావతారమెత్తినాడు నిజముగాదోచెనిపుడూ
కంసునకుగుండెఝల్ ఝల్లుమనియెను భయముతోచీ॥ ౪౧
ఏయుపాయముదోచక కంసుడుయేతెంచిపవళించెనూ
రేపల్లెవాడలోనుపెరుగుచున్నాడనీడిగలాంగుచూ॥ ౪౨
నీయుబ్బనీతాతరా కంసుడా కృష్ణుడుపుట్టెననుచు
చల్లమ్మగొల్లపతులయీకబురుచాటగాచెప్పగాను॥ ౪౩
పూతకికీకబురాయను అప్పుడాపూతకీచనుదెంచెనూ
శృంగారముగపూతకి స్తనములకువిషధారలుంచుకొనియె॥ ౪౪
చక్రగావాడలందూ కృష్ణునూతిరుగుచున్నచోటను
చనుదెంచిపిలిచెపాలనుయివ్వగాసమాకట్టయుండదాను। ౪౫
బాలులతోబంతులాడ కృష్ణుడూబాలురందరుకొట్టగా
కావుకావునగోడుపుచూరగాగతి వీధినడుమనునిలచెను॥ ౪౬
ప్రేమకృష్ణునిజూచియుపూతకీప్రియముతో బుజ్జగించీ
నాయన్నపూరుకోరా నాతండ్రిపాలుయిచ్చేనురారా॥ ౪౭
మాదుగుకరులుపిల్వగా పూతకీ మిప్పెకొరిగిపడగా
గోపెమ్మచూచియపుడూ బంగారుగిన్నెలోబువ్వపెట్టె॥ ౪౮
ప్రొద్దుసావుగ్గుబోసీ కృష్ణునితొడిలోనుపండవేసి

అంతలోకంసకుండూ బండిరూపైకొదుముగావచ్చెగ॥ ౪౯
పాదములదన్ని వేయ పిసుగునలెదడదడవరిగియపుడు
వృషభమైవచ్చినిలువ ఒక్కలఘువునజంపి వేసె॥ ౫౦
చల్లమ్మవారలాతో చక్కగానిరుగు మావారితోను
చల్లనీపనులుచేయా గోపికలుగోపెమ్మతో చెప్పిరీ॥ ౫౧
మాయిళ్లకొచ్చునమ్మ కృష్ణుమా సమురస్వచేసునమ్మ
తాళలేమమ్మమేము నీసుతుడుతాళిమితోవుండడమ్మా॥ ౫౨
మగనివలెపనులుసేయూ నీసుతుడుమాయిడ్లకూవచ్చెను
యికనైనబుద్ధిచెప్పి యింటనేవదిలము సేయుమమ్మా॥ ౫౩
అప్పుడూగట్టిగాను మనవుంతపట్టుకొనిగోపెమ్మకూ
చెప్పనాననుచువారు చెచ్చెరచెలగుచునుండునంత॥ ౫౪
సందడిసేయుచుండవెన్నంత చక్కగామిర్రింగుచుండ
చెప్పగావారందరూ కృష్ణునివరుసగాబట్టుకొనిగ ౫౫
గట్టిగాకట్టివేసి గోపెమ్మకడకుబోయిచెప్పిరీ
గోపాలకృష్ణుడపుడు అవటనేపాలందాగ్రివుచునుండెనూ॥ ౩౬
అంతటవారందరూగుమికూడియిళ్ళకూవచ్చేవపుడూ
నడిమిస్తంభమునందు కృష్ణునిచూచి యాశ్చర్యపడిరీ॥ ౫౭
సిగ్గుపడిలేచితాము తనుతమయిళ్లకువేగవచ్చి
యిదియేమియాశ్చర్యమే చెలులార యిదియేమసోద్యమమ్మా॥ ౫౮
కనుపాపలనుతీసునె కృష్ణుడుదొంగతనములుచేసునే
యికనేమిచేసునోచెలీ మనముబులసాటమున వస్తిమమ్మ ౫౯
గోపెమ్మపిలచినపుడు కృష్ణుండు ఆగడపుపనులునేడు
చేసినావనుచుతాము గోపికలుగోపెమ్మతో చెప్పగా॥ ౬౦
అమ్మనేనెరుగనమ్మా నాతోరినేనుబోవుచుండగాను
నమరస్వజేసిరమ్మా నేనంతభయపడినసీనమ్మా॥ ౬౧
కొబ్బరికుడకలనుమా గొబ్బునగోపికలుపిలువబోవ
కొబ్బరికుడకలివిగో యనుచునునుబ్బలుచూపినారు॥ ౬౨
పౌర్ణమిరోజానందూ జలజాక్షులందరూకూడుకొని
చీరలటుతీసివేసి గోపికలుజలకమాడుచునుండగా॥ ౬౩
తీసివుంచినచీరెలూ కృష్ణుండుతీసితాపొన్నమీద
వేసియావేణునాదం పూరించుచుండెనామాధవుండు॥ ౬౪
జలజాక్షులందరపుడూ జలకంబుచాలించివచ్చిచూచి

మనచీరలేమాయనో వోచెలియమనరవికలేమాయెనే॥ ౬౫
నమ్మరాదమ్మమనము యీకమీదనీచిన్నిగొల్లవానీ
యెంతపనిచేసెనమ్మా ఓచెలియయేమియాశ్చర్యమమ్మ॥ ౬౬
కొతుకుచుకొందరుండె నీళ్ళలోమునిగియుండిరికొందరూ
అప్పుడుగోపికలలో నొకయింతిజూచి శ్రీకృష్ణునీ ౬౭
రాకవోయమ్మలారా చెలులార రారెయోకొమ్మలారా
యీపొన్నమీదనున్న చిన్నికృష్ణమ్మను అడుగుదామూ॥ ౬౮
ఇవ్వరామాచీరెలూ ఓకృష్ణయివ్వర మారవికలు
దండంబుపెట్టెదమురా కృష్ణయ్య దయయుంచదయచెయ్యరా॥ ౬౯
అందరూఒకచేతితో దండంబుపెట్టెగా జూచితానూ
పొందుగామీరందరూ దండంబు రెండుచేతులబెట్టరే॥ ౭౦
ఎంతపనివచ్చెననుచూ గోపికలుమానభంగమునొంది
వసుదేవతనయునకునూ దండంబురెండుచేతులబెట్టిరీ॥ ౭౧
పొందుగావలువలన్ని కృష్ణుండువేరువేరునయిచ్చెనూ
నాయత్రిలిట్టునేమొయనుచునొకరొకరితో వగచిరపుడూ॥ ౭౨
మాయాడబిడ్డయిపుడూ కొట్టునే మా బావదండించునో
నామగడునన్ను బ్రతుకనివ్వడికనేనేమిసేతునమ్మ॥
కస్తూరిరంగరంగా మాయన్నకావేటిరంగరంగా
శ్రీరంగరంగరంగా నినుబాసియెట్లునేమరచుందురా॥ ౭౩

## 22. శశిరేఖ పెండ్లి పాట.

బలరామునిసుత బంగరుబొమ్మ । దుర్యోధన నీకుమారునకు
లక్షణవంతుడు లక్ష్మణునకు । ఇచ్చి వివాహము వేడ్కగ చేయ
వలెగమియని తన యంగనబలుక । కార్యమాటలకు పరమప్రీతితోను
భీష్మద్రోణుల బిలిపించియును । గురువర్యులు ఇరువురు వెంచేసి
బలరామునితో పాణిమిచ్చి । శశిరేఖను లక్ష్మణునకునిమ్ము
అని యదుగుండన నంతనేపోయి । ఓబలరామా యొప్పుగనీవు
దుర్యోధనసుతు దోర్బలయుతుని । లక్ష్మణ నెరుగవ లాలితమూర్తి
అతనికినీసుత కతుకముతోడ । నిచ్చి వివాహము వేడ్కగ చేయ
సంతసమీయన బలరాముండు । మంచిదిలగ్నంబుంచుడుమీరు

అనగానెల్లుట ననువైయుండె । మాఘమాస సప్తమితిథియందు
అనూరాధ కన్యాలగ్నమున । సుముహూర్తమతగు శుభమైయుండె
ననిన మంచిదనినట్లనె చేతు । తలిదండ్రుందు తగతప్పక మీరు
అనిన మంచిదని యరుగగవారు । రేవతియంత భాగమునందు
వగచివగచి వల్లభుతోడను । నిట్లనిపలికెను ఇంపెసగగను
ఆరోగ్యరాంటను నభిమన్యుండు । మేనల్లుడు నామేటికిగాక
లక్ష్మణకియ్యట లలితమెమీకు । అనగా మిక్కిలి యాగ్రహుడగుచు
అర్జునుడడవుల నంటుకపోయె । జానెడుపొట్టకుజేరెసుభద్ర
కుడువగనన్నము తోడుగగుడ్డ । లేనివారికి లేమనొసంగి
పాల్లుచూడపలె పాపముగాదా । కన్నబిడ్డలను ఘనులకునీయు
సుఖముగనుండిన జాడగలేదే । ఒట్టిమాటలను నెన్నటికయిన
ప్రేలకువాకడ ప్రియములుగావు । అనునట్టిమాటలను నాలకించుచును
శశిరేఖయుదాస్యాంతమునందు । గుందుచుచెలులతో పొందుగకేళి
వనములకేగెనువనితలతోడ । పూవులుగోయదు పుష్పాదులయిన
ఎత్తదుఫలముల నేమియుగొనదు । అభిమన్యునిపై అతిప్రేమమున
చిన్నటనుండియు జేసినమైత్రి । తలపునవచ్చిన తడబడుచుండు
ఇట్లులనుండగ నింతటిలోన । అభిమన్యుడుత నచటికివచ్చి
సంగతియంతయు సరగునవినుచు । తల్లినివీపున దనరగబెట్టి
తండ్రికడకు పోదముపదమనుచు । మేనమామపై బూనినయాసక్త్య
వెడవెడ మిక్కిలి వృద్ధినిబొంద । పోవగపోవగ త్రోవలో నొక్క
యాశ్రమమునుగని యచ్చటికేగ । నచట ఘటోత్కచుడనురాక్షసుడు
ఎవ్వడవోరా ఇవ్వనమునకు । రాబనియేమిర రభసముతోడ
యుద్ధమొనరచుచునుండగనంత । నారదుడెదురుగ నయముగవచ్చి
మీరలిద్దరును పోరుటతగున । అన్నదమ్ములయి నతిఘోరముగను
కొట్టుకొనుట మీకెట్టులజెల్లు । అనిననాతనికి నంతయుదెల్ప
అరయతమ్ముడ అరయనుజ । నిష్కారణమున నీతోబోరి
యెరుగకజేసితి నెగ్గెన్నకుమీ । తల్లిసుభద్ర తప్పెన్నకుమీ
అని పలువిధముల ననుజానికెక్క । కౌగలించుకొని కడువడితాను
అమ్మకునొక సాష్టాంగముచేసి । కారణమంతయు కనుగొనితేగ
కోపముమిక్కిలి కురియుచునుండ । శశిరేఖనునే చయ్యన నేడె
తెచ్చెదతమ్ముడ తెచ్చుటయేల । పెండ్లిచేసెదను పెండ్లియొకాదు
దుర్యోధనునోగితోలెదకేగ । ననుచువేగమే యచటికిబోయి

మంచముపై శయనించియున్న । శశిరేఖను మంచముతో గూడ
అభిమన్యునికడకనువుగ దెచ్చి । మరలతాను నొకమంచముమీద
శశిరేఖతో సరిచక్కనిరూపు । దాల్చిపరుండగ తగనచటికిని
చెలికత్తెలేతెంచి చెలియశశిరేఖ । పెండ్లివారందరును ప్రేమతో డుతను
వచ్చికూర్చుండిరి వనితరో లేవె । మంగళస్నానములు పొంగుచును సేయ
వేచియున్నారమ్మ లేచియనురావె । అనుసంతనామాటలతివచెవిబడగ
ఎక్కడిలక్ష్మణుడు ఎక్కడిపెళ్ళి । ముక్కుమొగమెరుగనిమూఢునిచేత
పరిణయంబగుకన్న మరణమేమేలు । అనియక్కచెలికత్తెలట్లనుటకగున
రావమ్మతండ్రిబలరామునికన్న । తెలిసినవారెవరు తెలివిగలవాని
నీకుపెండ్లిచేయ నిశ్చయముగాను । అనుచు బలవంతాన అతివతో దెచ్చి
పీటముపైకూర్చుండబెట్టియాక్షణికి । లక్ష్మణాశశిరేఖతాలించిచూడు
అనగానెకన్నెత్తి యతివవీక్షించి । అమ్మయ్యోపెద్దపులి అమ్మయ్యోపాము
అమ్మయ్యోసింహమ్ము అమ్మయ్యోతేలు । అమ్మయ్యోవెలుగుబంటమ్మయ్యోజెర్రి
అమ్మయ్యోగండుబిల్లమ్మయ్యోరేచు । అమ్మయ్యోతోడేలు అమ్మయ్యోచిరుత
అమ్మయ్యోచిట్టెడ అమ్మయ్యోదెయ్య । మమ్మయ్యోరాక్షసి అమ్మయ్యోభూతం
అనుచుగజగజవణకి యంతలికిబోవ । పెద్దలందరుజేర భీతిలేదనుచు
చక్కనిశశిరేఖ చానమజూచి । యిట్టుభ్రమజెందంగనేల నాతండ్రి
యనుచుతీసుకవచ్చి యాపీటమీద । కూర్చుండబెట్టంగ గొబ్బుననుమరల
తేరిపారజూడ దెయ్యమమ్మయ్యో । కళ్లుపెద్దవిజేసి కరవవచ్చెడిని
నాకుపెండ్లివద్దు నన్నుచంపకుడు । ఎక్కడిశశిరేఖయిదినాకువద్దు
పోదమురండనుచు పోవుచుండగను । ఎక్కడికిపోయెదవు ఇదుగో నాదెబ్బ
చూడుమనివీపునను జరుగ్రమునిచరచ । బాబో బాబోయనుచు పరుగులెత్తంగ
అందరుభీతిల్లి యిట్టెపోవంగ । పోనురేమిమ్ముంక పాడిచేయవాడ
నేఘటోత్కచుడనని గొరిదెల్పన సి । నాతమ్ముడకునీక నాతిపగులకును
పరిణయముచేతువా బలరామునీవు । నాతమ్ముడభిమన్యుడాతడిపుడున్న
చంపిపాగులుబెట్ట చాలడానాడు । మిమ్ములనందరిగూడ నొక్కపరిచంపు
బంధువర్గంబనుచు పారదోలితివి । శశిరేఖయభిమన్యుపతి గాగనుండ
లక్ష్మణునిపెండ్లాములట్టెలగును । చూడవేడుకయున్నచో మీరలంత
నాయాశ్రమమునకునరుగుము గారండు । శశిరేఖపెండ్లిపెరగవీక్షింప
ననుచుకొందరువెంటనంటరాగాను । తన మాశ్రమంబువకుతగగొంచుబోయి
అచ్చటనునభిమన్యువిచ్చయిన పెండ్లి । యుత్సవము గావించియుండునంతటను
సిగ్గుపడిహాలధరుడు చెల్లెలాసేను । తప్పుదేనితోనిప్రముదిత గాపుమింక

అభిమన్యుడా నేను అన్యాయమునకు । పాలయితినవియున్ని పాటింపబోకు
అని పెక్కురీతులను అందరకు దెలిపి । కూతుదగ్గర బిలచి కొమ్మరో నీవు
కోరుకొన్న విభుండు కూడె నీకిపుడు । నిన్ను బెట్టిన కలతయెన్న బోకపుడు
అనుచుండె రేవతి హాయనతి సంతసమున । వదినరో సుభద్రవనిత నీకిస్తి
నా బిడ్డ గాదిక నీ బిడ్డసుమ్మీ పనిపాటు లెరుగని పడతిసుమి వదిన
కసిరి కొట్టని కట్టుకాంతను సుమి వదిన । నను విడచి యుండని నాతిసుమి వదిన
చెప్పి చేయించుకొను టొప్పు సుమి వదిన । ఆకలని అడుగని అతివసుమి వదిన
వేగించిన తెల్లపోవును సుమి వదిన । నను విడచి యుండని నాతిసుమి వదిన
జొంకి రోయరుగని జుట్టిపాలతి సుమి వదిన । అని పెక్కుభంగులను అతివతా జెప్ప
నాకింతగా జెప్పనాక న్యరాల । అన్న కూతురు గాద అతి సుగుణములను
నేనెరుగకుంటినా నాకింత యేల । పసితనము సుమి నా ప్రక్కనే లేదా
చాలకాలంబున చక్కనే లేవా । అని చుసంతోషమును గానలేక
తండ్రికి మ్రొక్కించి తల్లి మ్రొక్కించి । బావకు మ్రొక్కించి భక్తి మీరగను
పెద్దలకు మ్రొక్కించి పేర్మితో నపుడు । సుఖముగా తిమతను చొప్పులకు బోయి
దంపతులు మిక్కిలి గ్రద్ద తోడనుండి । కాపురము చేయుటను గనులవీక్షించి
తలిదండ్రులతి మోదకలితులైయుండ్రి । బంధువుల్ సంతోషభరితులైయుండ్రి

## 23 శ్రీశైల భ్రమరాంబాష్టకము.

మొదటిపల్లవి ప్రతిచరణం ఆఖరున పాడేది.

రవిసుధాకరవహ్ని లోచన రత్నకుండలభూషిణీ ।
భవవినాశనిమమ్ము నేలిన భక్తజనచింతామణీ। ౧
అవనిజనులకు కొంగుబంగారైన దైవశిఖామణీ ।
శివునిపట్టపురాణిగుణమణి శ్రీగిరిభ్రమరాంబికా॥ రవి॥ ౨
సోమశేఖరపల్లవాధర సుందరీమణిధీమణి ।
కోమలాంగికృపాపయోనిధి కుటిలకుంతలధీమణీ ।
నామనంబున బాయకుండెదు నగకులేశ్వరనందినీ ।
సీమలోపలవినుతికెక్కిన శ్రీగిరిభ్రమరాంబికా॥ ౩
అత్యధికంబుగ కాశిలోపల అన్నపూర్ణభవానివై ।
సాక్షిగణపతిగన్నతల్లివి సద్గుణావళిశాంభవీ ।
మోక్షమొసగెడి కనకదుర్గవు మూలకారణశక్తివై ।

శిక్షజేతువుక్రూరజనులను శ్రీగిరిభ్రమరాంబికా॥ ౪
కలియుగంబున మానవులకు గల్పతరువై యుండవా ।
వరలుశ్రీగిరిశిఖరమందున వైభవంబుననుండియున్ ।
అవనిలోపలభక్తజనులకు నఖిలదానములివ్వవా ।
జిలుగుకుంకుమ కాంతిరేఖలు శ్రీగిరిభ్రమరాంబికా॥ ౫
భూతనాధుని వామభాగము పొందుగా చేకొంటివే ।
ఖ్యాతిగా శ్రీశైలమందున ప్రాకటముగ నివసించితీ॥ ౬
పాతకంబులపారద్రోలుచు భక్తులను చేకొంటివే ।
భోగము నరజితాద్రి వెలసిన శ్రీగిరిభ్రమరాంబికా॥ ౭
వేడ్క వెలసిన మీప్రభావము । విష్ణులోకమునందునా
పల్లవించిన యింద్రలోకము । బ్రహ్మలోకమునందునా
మొల్లముగ కైలాసమందున మూడులోకములందునా ।
చెల్లునమ్మ త్రిలోకపావని శ్రీగిరిభ్రమరాంబికా॥ ౮
అంగవంగకళింగ కాశ్మీరాంధ్రదేశములందునా ।
పొందుగా కాంభోజకొంకణ పూర్వభూములయందునా ।
రంగుగా కర్ణాటలాట మరాట దేశములందునన్ ।
శృంఖలా రాజ్యమున వెలసిన శ్రీగిరిభ్రమరాంబికా॥ ౯
తరుణిశ్రీమల్లిఖార్జున దైవరాయుని భామినీ ।
కరుణతో మమ్మేలుకొమ్మా కల్పవృక్షము భంగినిన్ ।
భక్తినిత్యమునష్టకంబులు వ్రాసిచదివినవారికీ ।
శిరులనిచ్చుచు నుండగోరద శ్రీగిరిభ్రమరాంబికా॥ ౧౦
ధరణిలోనీఅష్టకంబాదరమునన్ వినువారికిన్ ।
ఘోరభూతపిశాచబాధలు చేరకుండగ జాడుమీ ।
తప్పులిందున గలిగియున్నను యొప్పులని భావించుమీ ।
చెప్రవతో నమలోప్రవశజెడద శ్రీగిరిభ్రమరాంబికా॥

## 24 గజేంద్రమోక్షము.

కథాగీతము

ఆనంద భైరవి-ఆటతాళము.

రాజేంద్రవినుమా వీరాజితమగు గజరాజమోక్షణకథనూ । మహాసుధను
సహితమనోవ్యధనూ । రాజిల్లుభువి సుధరాశిత్రికూటాద్రి । యోజనయుత

ముగ సన్నుతత్వంబూ । విభ్రాజితంబుగ కాంచనంబున రాజితంబున యో మయంబున నాలుగగు శృంగములు మూడతులనుసె ధాతువులు వెలుగునల। రాజేంద్రా ।

2. మాతులుంగలవంగలుంగ మాతకే తాకినుందా రాథల్లాతకా । మ్లాతసింధువారా । ప్రియాళు ఖర్జూరకోవిదారా । పిచుమందకంజాతబీజపూరా॥ ప్రముఖావాసజాతనిరంత వసంత సామంత సామేత సౌభాగ్యసంభూత సామందితా । నూతనప్రియకోరకిత పల్లవితకుసుమితఫలితలతికో ద్భూతమకరందాను మోదమిళిందమై యానందమైతచ రాజేంద్రా॥

3. శరభశార్దూల చామరశల్య భల్లూక నరగండభేరుండ । వృకాహి ఘోరరచండవేదండా । ఖడ్గాది భాసుర మృగపతికండా కలహంస ముఖరవిహంగమఖండా । మహాభాండా । గరుడగంధర్వకిన్నర విద్యాధరకింపురుష సిద్ధసాధ్యసరససల్లాప । సంభరితమై సద్యోవిష్కృతదురితమై కమలామనోహార చరితమై మోక్షార్థిజన బంధురితమై దనరారుచుండెను రాజేంద్రా

4. తనకుంభములు పూర్ణకుంభసాటి సఖులు పైటలు కుచములుదూర్చగా । యానము కోకిలయంఘ్రులందెలు చేర్పగా । కరములకోడితొడలు మేఖలదూర్పగా । రధరుచికోడినగవు ముఖశశిదీర్పగా । వగదీర్పగా । తన దూలానణ్యాము తగని యుంజనాదివనితలు తన వెంటజను దేవగజరాజా । దనకరేణుల మొత్తము ముదానునుపిపాసాయుతచిత్తమున నటదీర్పగ ఒకసరోవరమెం నవితనసినటింపుచుండెను.

5. భుగభుగా యుత ధూమబుద్బుదచ్ఛటలు తారకలై దివికినేగాయా । స్ఫూర్త్కారముగానిగ్రహములు నేగాయా । నాలముక్రిప్ప తగనివాయువుగా నేగాయా । సంఘుట్టణజగతీజములు నెగాయా । నాగంబశిమా । మిథసంభ్రమించిమించి కుప్పించిబెట్టుగహుంకరించి । తటుగపొంచిలంఘించి । వగదలిర్పగ ఘావుకబలింపపగమోలంగను ఘోరగాహుపుపగిదినొక మకరీందుప్రుడత్తిబట్టెగ్రక్కున నక్రేంద్రుని। రాజేంద్రా।

6 కరికరి హరిహరి గిరిగిరి పరిజేరి కలపిపోరినలీలగా । కారాకారిబోరసిధాయణివార్యలగా । మూఖాముఖినలసితనువులుదూలగా । సారాశారిబోరనిరక్తముగ్రోలగా । పగలారగా కరమాచినరమూచు వెరచూచు విరచూమ జరమూచు దవమూచు మొరచూమ మొరలిడా । తరచుకరముచుముకరియూతకరినరిమురింబోనిపోరలివేయం వత్సరములిటుబోరగను శిధిలతనలని కరిచింతించు చుండెను॥ రాజేంద్రా।

7. సంతతమగు తరులు రాపాడె వనములోపలను దిరుగచునుండగా

18. అరూఢిపాంచజన్యము పూరించినను నతిమోదము చేతనూ । గరుడారూఢుడై హరివేంచేసెను । వైకుంఠమునకమరగణంబెల్లనూ । సంతోషించిరతిమోదముచేతనూ । అనిశ్రీశుకుడీరీతిజెప్ప పరీక్షన్నరేంద్రునకు యీ రహస్యకథను నీకెరిగించెనూతుడాఋషులు శౌనకప్రముఖులకు నన్యూతసారము గురియజెప్పిరి హరిమిత్రో శ్రీరామకృష్ణునికోరికలు సారెకునుఫలింపగా॥ రా॥

## 25 గోవుపాట.

గొల్లకృష్ణుడు వేణునాదము - చేతబట్టుకునూదుకొనుచు - గోవుమందలవెంటనడచి - పొన్నవృక్షముచెంతజేర - గోవులన్నీ పొదలదూరి - కలసిమేయుచునుండగాను - పెద్దకాలపుఆవులారా - పేరుపడ్డా[illegible]వలారా - కపిలియావుమాదలారా - కర్రియావుదూడరావె - తెల్లగూవుపిల్లరావె - బొల్లిగూవునీవురావె - కామధేనుకల్పతరువా - శ్రీలక్ష్మిపేరుదేవి - అన్నపూర్ణవిశాలాక్షి - తెల్లమచ్చాగోవురావె - నల్లమచ్చఆవురావె - చిన్నఆవుదూడరావె - కనీవారమువిష్ణుప్రీతి - పేరుపేరునపిలచితాను - బట్టువట్టిబిగియుగట్టి - లేగదూడలచేతబట్టి - బంగారపుచెంబుపట్టి - వెండిత్రాళ్ళుతెచ్చితాను - బందములనువేయుచును - గోవులనుగాలుపితికి - గొల్లబాలుల మూపులందు - బెట్టివారియిండ్లకనిపి - చెట్టుయెక్కి - వేణునాదము - చేతబట్టుకపూదుచుండగ - గోవులన్ని పొదలనాటి - సకలదిక్కులమేయుచుండగ - తూర్పుదిశకుకొన్నివెళ్ళి - గట్లపైనిమేయుచుండగ - గొప్పనాదం చెవులబడగా - అదురుకొంటూ మేతమాని - ఎదురుచూడగ గాండ్రుమనుచు - వేగమె పెద్దపులియొకటొచ్చి - నిలిచినాదు పాలముపాడు - నేడుగ చేదువచ్చినయావులారా - పోరుపోకుడుమేతమాని - చిక్కినాయుగ చేతికి - వారమొక్కటీవమునుగా - గొంతువిరచిరక్తమెల్లా - గ్రోలిపట్టచించివేగమె - కావుతీసి వారగిస్తును - దాటిపోవజాలరేమో - పారిపోవజాలరేమో - కురవకొమ్ములు చిన్నయావుల - విసుపుకొమ్ముల పెద్దయావుల - పేరుబడ్డాయావులాను - కోట్లకాలదిగతిన్నదానను - నన్నువిడిచిపారిపోరె - వెంటపరిమిచంపివేతును - నాదుపాలమాచేరిమీరు - నాకుహారంబౌరికారు - నాదుపేరువ్యాఘ్రరాజా - మాకుమీకువైరమెందుకు - నేనుచెప్పినమాటదాటక - బుద్ధికలిగివుండునునుచూ - ఒక్కగా యుల్లావుముందు - నిలచితానుబల్కుచుండెను - పేరుపేరుగనున్నయావులు - వెనుకచేరినిల్వగాను - వ్యాఘ్రరాజా వినుము [illegible]

ఒక్కమనవి చిత్తగించు - మూడుదినములక్రింద నేను - కవలదూడలుకన్న
దానను - నన్నుపెంచినదాతలెల్లా - పాలుపితుకక యుండగాను - రెండు
దూడలెల్లా యెదురుచూచు - బెంగతోనుశలవుయిచ్చిన- పాలుయిచ్చివుళ్ళి
వచ్చి - నీదుయాకలితీర్తుననుచు - బల్కగాను నీదుమాటలు - నమ్మ నేను
వదలివేయు - నమ్ముననన్నువ్యాఘ్రరాజాను - నేనుగానఅనుచు బల్కుచుం
డెను - సకలదేవతలానవచ్చెద - నాదుపుణ్యముధారబోసెద - నాదుకొడు
కులమీదుగాను - సత్యమైనతల్లిదండ్రీ - తోడునీడలమీద నేను - సకల
యానలుబెట్టెదాను - సత్యవాక్యముతప్పితేను - స్వామిద్రోహముజేసినట్లు -
పుట్టినింటివారికెల్లా - కీర్తిసంపదబోయినట్లు - కల్లగాదుమాటనమ్ము -
బొంకుగాదుమాటనమ్ము - శలవుయిచ్చినవేగవస్తు - కోరిమొక్కితిదా
పునా - ఇన్నివిధములకోరగాను - గొప్పయానలుబెట్టగాను - పెద్దపులికి
జాలిగలిగి - యడవిలోనా యానపెట్టి - తప్పితేను ద్రోహముల - మెట్టి
తనముకొచ్చినిన్ను - బట్టిచంపివేస్తునుగాన - వేగమె వెళ్ళినీవువీదు - కొడు
కులజూచిపాలుయిచ్చి - వెళ్ళిరమ్మటంచు - శలవుయిచ్చిన-గంతువేయుచు
ఛంగుఛంగునుదాటుకొనుచు - యింటిమొగమైదొడ్డిచేరియు - కవలదూడల
చేరబిలచీ - పాలుయిచ్చి తృప్తిపరచి - బిడ్డలారావేగవెళ్ళెద - అడవిలోను
మేయుచుండగ - పెద్దపులియొకటొచ్చి - బట్టగబిడ్డలారాజెప్పె - వేగమె
వస్తుననుచు - బాసలిచ్చియుంటినగాన - మీరుబుద్ధిగలిగి - నాపలుకుమం
డుడి - పచ్చిచేనులో మేయుబోగా - కాపువేసిలాదిక్కబోకా - పొవచా
టున మేయబోకా - పులులనోటికందబోకా - ఇండ్లలో నాతిరుగబోకా -
కర్రదెబ్బలుతినకమీరు - కాపువాడు - మేపబోవుబీళ్ళయందు - నిండికస
వు కడుపునిండాతినుచుమీరు - దొడ్డికొచ్చినిద్రజెందుడి - పేరిందేవిమీ
నాక్షి - ఆదిలక్ష్మి - అన్నపూర్ణా - కామధేను - కల్పతరువా - వేదుబ
డ్డగోవులారా - నాదుకొడుకులమీరుజాచి - ముందుకొచ్చిన - పాడవ
బోకా - వెనుకకొచ్చినతన్నబోకా - మందబేర్పుకబుద్ధిగరవ్వుడీ - నేవ్యా
ఘ్రునాకుఆకలిని - దీర్చబోయెదా ఓగోవులారా - నాదుకొడుకులదయతో
జూడుడీ - తుంగభద్రానదులలోను - స్నానమాడిభక్తిగాను - దేవునిపూ
జించితాను- అడవికేగెనూఓజనులారా - చూడచోద్యముగానుయుండేనూ-
అన్నరారా చిన్నిరారా - ఆకలిగనుండెకోపము - వ్యాఘ్రరాజా వేగవ
చ్చితి - కోపగించక నన్నుబంపుము - కోటిగోవులతిన్నదానవు - లక్షరుచు
లనుయెరిగియుండి - సకలన్యాయము తెలిసియుండి - గడువుమీరకవచ్చి
తేను - బొబ్బలిడినారాకయుండుటపులిరాజా తెలియజాలను - ఓవ్యాఘ్రు

రాజావేగవచ్చి - నన్నుజంపుమూ అర్చుకొంటూ - అడలుకొంటూ వచ్చి
గోవు - కాళ్లకుపుడూమ్రొక్కిచెప్పెను - వ్యాఘ్రిరాజతల్లినీవు - లక్ష్మీ
దేవిఅన్నమాట - దాటనేరవునిన్నుమించిన - వారుభువిలోనీతిపరులా -
గానలేనసీదుచర్యలు - విన్నవారలుచదువువారలు - వ్రాయువారలుయెంత
మూర్ఖ - ద్రోహులైన నాపుణ్యాన బ్బి - మోక్షమందేరు - ఓపులారాత
ప్పకనుచదువుచుండూడీ - అనుచుచెప్పి ప్రాణమొందలెను - బ్రహ్మవచ్చెను
రుద్రుండొచ్చెను - విష్ణువచ్చెనుయింద్రుడొచ్చెను - సకలదేవతలెల్లవచ్చిరిదం
డ్రినీవెమాతనీవే - నిన్నుమించిననీతిపరులు - యెల్లలోకములందులేరు -
నీవుయున్నాగ్రామమందు - పంటలెల్లపుష్కలముగాను - నెలకుమూడువర్ష
ములు - సకలజనులకాసుఖమునొందే - వోగోపురాజానీదుకీర్తిని - జెప్ప
శక్యమానీదుచరితము - చదువువారలు విన్నవారలు - జూచువారుకైలాసప
దవి - జేరసుఖముగానువుందురనుచు - ఏమిచెప్పినమాటలెల్లాశాశ్వతంబు
జరుగునవుచు - చెప్పివారిలోకములకు - వెళ్ళినంతటయల్లయావు । మంద
జేరిబిడ్డలాకు - పాలుయిచ్చిసుఖముండెను - ఓపులారాయెల్లకాలముచదు
వుచుందూరు - అప్పాటివింతలు యీదినంబునజరుగురీతిగను॥

## 26 శ్రీపారిజాత ప్రసవము

శ్రీకృష్ణుండొకనాడూ శృంగారాకారుండై ।
శ్రీకాంతమణి నగరుకువచ్చెను చెలువముతోడుతనూ ।
యేకాంతమ్మునననుండి ఇంతులంతె నాడగను ।
నాకస్మికముగ నారదుడను ఒకవచ్చితఋషియనేతెంచే ।
వచ్చిననారదులుజూచి వనితలుతానుమ్రొక్కి ।
అచ్యుతుడూనారదుడుండిరి ఆసీనంబులను ।
వచ్చితుడైనారదుడు కృష్ణుడికొక కానుకగాను ।
కుసుమపుప్పుచిగురాకున పొదిగియిచ్చెను వేడుకను ।
ఆదిస్వామిఆందుకు కన్నులనదుకు మ్రొక్కి హంబనిమదితలచి ।
వెన్నుడురుక్మిణీదేవికియిచ్చెను వేడుకతో పువును ।
అమగువావేగముగా ఆంగ్రుచుని ఛవ్వమి వినయముతోడుత ।
తనపతికంతవినుతులుచేసె శరణుశరణు కృష్ణ ।
శరణు శ్రీగోపాల హరిశరణు కనకాంబరగిరిధరశరణు ।

శరణుదేవామిన్నందిన వేగమున మేలుగానొప్పె ।
ఆమగువంతట కొప్పానముడుముక ఆశ్చర్యముతోను ।
తనదేహంబొకవింతచాయలు మెరయగను ।
చెల్వయెల్లరు యెంతచల్వమో కాంతలోనన ।
తలకురులుల ఒకవింతా మేలుగ నలుపులుయెక్క ।
అరుదుగ కోమలి ఒడలికి ఒకవన్నెధికమయితోచె ।
శుకవాణి యీపువ్వుచోద్యం అలంకగావినుమీ ।
వికసించుచుండును వాడదు యెన్నడు విడివాసన జెడదు ।
ఒకయేడు యీపూవు వనరుగనీవద్దవుంటే ।
సకలమైలవస్తువులను సమకూర్చుచువుండూ ।
అనినారదముని ఆడినవాక్యములన్నీ ।
వినయముతో దూత సత్యభామకు విన్నపించిరిచెలులు ।
యేమనిచెప్పుదుమమ్మా యింతిరో నీమగనికి ।
నారదుడొచ్చి పారిజాతమ్ము వనరుగయిచ్చెగదే ।
సామజవరదుడు రుక్మిణికాపువు సరగునయిచ్చెగదే ।
అమగువా ఆపువ్వందుకు వేగమునా ।
నవ్వు మతనకొప్పు ముడుచుకుసొంపుననుండెగదే ।
తరుణులుచెప్పినమాట నెలతసుగంధివిని ।
సరగునఅప్పుడు కోపముతోటి తరుణులకిట్లనెను ।
సరసిజాక్షులారా సర్వజ్ఞుండనియెరిగి ।
యెలమితో నేగతితో యింవరిసవతులలోపలను ।
నాకంటెయెక్కువఅనితలచెనురుక్మిణినిపుడు ।
అనితలకాయనుబిగియించి తరుణి మానముచేత ।
పొలయుచునవరత్నములుకలసిన ।
సొమ్ములుసళ్ళించి చెదరిన కొప్పువిడిచి ।
శిథిలముగాముడుచుకొని ।
సొలయుచునవరత్నమ్ములు కలసినమందిరములుదాటి ।
పూరింటిలోనొక్క కీలుగు మంచముపై ।
చిరాకుపడుచు పవళించెను శ్రీహరులనుదలచి ।
వారిజలోచనువంతాకోపముదీర్చుభావమునను ।
చనుదెంచెనుతనభామగృహమునకు ।
భక్తులవాకిటనుంచి సరగునలోపలికేగి ।

కనకపుమేడలు రంగస్థలములు కలసి వెతకఁ దొడఁగె ।
మైత్రినిపానుపు వెదకె మేపవడుగులు వెదకే ।
చిత్తరువుచవుకలు వీక్షింపుచు తనచిత్తముకిట్లనెను ।
కలహంసలు నడునవుగా కళికా యింతులు రారు ।
అవారమృదంగము తంతులుఁ గట్టరు ।
ఆడఁగబాడఁగరారు యున్నశ్యాకలేదు సుదతి ।
మందిరమే మోఁచిలుక తనసద్యఁ జెప్పదు ।
కోకిలకడమియర్యదఫలము ।
రామిలమితో కేళిలా పనులఁ జేయదు పంకజముఖికేమో
సిరిముఖమేమో చిన్నబోయున్నది ।
చెలియతో నెవరయిన పన్నగముని దెచ్చిరయా ।
పారిజాతపు మాట ।
విన్నంగములు జేసిరిగా బోలు మావెన్నెల మొక్కగను ।
అనుచు మందరధరుఁడు అఁచనీవెతుకగ ।
కనకపుమేడలు రంగస్థలములు ।
కలసి వెతకి అలసె తనిలలు మాటలు చెవులకని ।
వృగుర్గిందయి పోయా ।
వనజనాభుఁడు మామతో సఖియ వెనుక తానిలచె ।
మకరవిదేవివిసకలటి మగువ చేతనుఁదటి ।
మానముతో దుఃఖమురవయి రందుకు మత్యాత్మకివిసరె ।
అనలిహాత్తుండపుడూ ఆత్మలో నగుచును ।
పూబోణిమీదను పన్నీరప్పుడుచల్లంగ దొడఁగె ।
ఇందాకాళేవిట్లోయీ వింతవాసనలు ।
యెందుండి తెంచెను తేనుచును వనితా మేల్కొనెను ।
పల్లవాధరులంత పర్యేదలార్చ్చకొనుచు ।
ఉల్లము బోషట నయనము జల్కట బుద్ధిగాదో చెలియ ।
పున్నమచంద్రుని బోలు మురిపెంపు నీమోము ।
చిన్నబోయున్న కారణమేమొ చిగురుబోణి చెపుమా ।
బంగారుతీగకంటె బాగయిన నీదేహము ।
కసికందులు కందిన కారణమేమే కాంతయే చెపుమా ।
కమలపాకులవంటి కరుణిసీహస్తములు ।
చిరచెవటలు పట్టినవిధమేమొ చిగురుబోణి నీకు ।

చిగురుటాకులవంటి చెలువంపుపాదములు ।
పసిగాళ్ళాడేటి కారణమేమే వనితరోనీకెను ।
కింగిణీవిల్లుంబోలు మారిపెంపునీకనుబొమ్మలు ।
పొంగున్నవితలనొప్పింతువుకదవె ।
లలితాంగిఅప్పటి వేళాబట్టిగొప్పాకన్నులనీరు ।
కుప్పలుగాపూష్ణించెను రెప్పలసద్దుకోవె ।
ఇంతాజేసిప్రభునీయేమిసేయగాగలవే ।
ఇంతులకింతేసి పంతములేటికే ।
ఇందువదనచెప్పవే కాంతరోపతితో
కలహంబేటికి కంబుకంఠిలేవే ।
వనితరోతెమ్మనుచుమారడించి ఒకవనజగంధిలేపె ।
నాతులారామీరు నగధరునివారుగాదా ।
ఈవగలెక్కడనేర్చిరనుచూ వనితలదిట్టుచునూ ।
అకలంకినీదేహం అలయించుకునేవేమె ।
కమలాక్షుంమాటలువిని నాపయికరుణవప్పనేలే ।
మదిరాక్షిజనులాడే మాటలకువెరచీ యీపువ్వు ।
మొఖమాటమ్మున యిచ్చితిగానిమోహమ్మునకాదే ।
నీవాణ్ణిగానటవేనీకు తప్పితినయినరానీనె ।
పంతునవచ్చితినిపుడు నీబంటనునేగానా ।
పద్మనాభుండపుడు సత్యభామపాదములపైఒరిగెను ।
భామలు అప్పుడుసిగ్గుతోడుతను ముఖచంద్రునేవురును ।
మైనులోపలిదాగి అతివలువాడగఅప్పటివేళల ।
అతిసంతోషముతోను చిగురుటాకులవంటి ।
చెలువగుపాదములు నగమెట్లుదన్నితిరిమీరు ।
మందరగిరిధరా నెట్టనమందరగిరిమోపి నట్టిగట్టితలలు ।
ఇంతమృదువగుటకు కారణమేమో మారజనకచెపుమా ।
అనుచుపాదములొత్తి అతివలుసేవలుసేయా ।
కృష్ణమూర్తియతి సంతోషమున కలియనవ్వుచును ।
వక్కాపువ్వుయింతికి నేవొసగితిగాకాయికనూ ।
చక్కనిపారిజాతంగొనితెస్తును సరసవనములోది ।
యొక్కవగానాటింతూ నీవూలవనములోను ।
అనిహరిబల్కగయింతిగర్వక్కునలేచి ।

మక్కువతోడుత శాకపాకమ్ములు మరి సేయుమనెను ।
జలకమాడి ఒక్క సన్నవలిపె కట్టి ।
అలికుల వేణీ రత్నాభరణములన్ని ధరియించె ।
చెదిరిన కొప్పున ముడిచీ సంపెటి పండ్లు ।
భుజముల మెరయగ సందడి సేయుచును ।
పండ్లు పెట్టుకు జనులు పాదయాత్రము సేయ ।
సంపెంగ తైలము కృష్ణునికంటెను సత్యభామదేవి ।
అలరు సుగంధము అలది మలయుచు మేనునువలచే ।
జలకములార్చి వలిపెములిచ్చెను ఘనపతి కంతటను ।
తెల్లని వస్త్రముతో తళ్కువత్తుకొనుచు ।
పీతాంబరములు ధరియించెను ఆ శ్రీవిష్ణుండపుడు ।
వల్లెవాటు చెంగు భామపై వొప్పగా నువేసి ।
బంగరు కుర్చీలమీద బాగుగ కూర్చుండిరి ।
సంధ్యావందన వేళాయెనని సఖియులతో బలుకా ।
బంగారు కలశతో బాగైన పుష్పములు దెచ్చిచ్చిరీ ।
తిరుమణి శ్రీ చూర్ణముల బాగా తీర్చిదిద్దుకొనిరి ।
పరిమళములు స్వామి బాగానలదుకొని ।
బంగారు పళ్ళెరములో పంచభక్ష్యాన్నములా ।
పూర్ణములమరగ వేడుకతో పరమాన్నమువడ్డించిరి ।
పూర్ణేందులంతటను సంపూర్ణముగ వడ్డించిరి ।
పరిపూర్ణముగా భుజించిలేచిరీ పురుషోత్తములపుడు ।
ఆకుమడిపులిచ్చె మంచి అత్తరుజవ్వాదిచ్చె ।
మల్లెలు మొల్లలు విరజాజులు తానిచ్చె సత్యభామా ।
తనవాహనమయినా గరుడుని మోదముతో బిలువగను ।
కనకపు రెక్కలు విసరుచు చక్కని గరుడు వచ్చెనయా ।
గోవిందా కృష్ణ హరి గోపాలా గోవర్ధనగిరిధర ।
వామన కేశవ శ్రీధర శ్రీహరి యనుచు ।
తనవాహనంబయిన గరుడునిపై నెక్కి ।
అమరులు తనరు అతివేడుకతో అమరావతికేగిరి ।
పలుకులు కర్పూరమును పాదొత్తిగావించి పారిజాతం ।
వెల్లగించుకువచ్చెను పక్షీంద్రునిమీద పట్టుకురాగాను ।
గట్టిగ యింద్రుడు సేనతోను ।

కృష్ణునిమీదికి కయ్యానకువచ్చె ।
మతిదప్పివచ్చితివా మహిమీదనుయీచెట్టు ।
కయిగొనిసురల నీపురికేగగలవా ।
చెడుగుమనుజులెల్లాగర్వముతోనూ కొట్టుకొని స్వనంటె ।
మర్మముతోనూ బుటుమాయముగా పారిజాతం పెల్లగించితివా ।
అంతటయింద్రుమహానుభావుడు వరగడుఅని తెలిసి ।
అడిగిన నేనుయిత్తుననుచును పాదములంటెను ।
అంతటఅమరులంతయురు అతివేడుకతో అమరావతికరిగిరీ ।
ఆవేళకుఅట్టెవుండి మరునాడుపొద్దున్న ।
అంతఃపురములోపలికొచ్చెను ఆనందముతోను ।
కర్పూరపుపలుకులతో పాదొకటిగావించి ।
చెలతలువేడుకతో పన్నీరుబోసిరప్పుడు ।
చిగుళ్ళఆకులతోను మొగ్గలుపువ్వులతోను ।
కాయలుపండ్లతోటి చెట్టువికసించియుండే ।
వట్టిమానుక్రిందాపట్టుమంచంవేసి చెలికత్తెలతో ।
సత్యభామ తాపవ్వళించియుండె ।
అంతటకృష్ణుండపుడు ఆనందములతోను ।
పట్టెమంచముపైకూర్చుండెను సత్యభామతోటి ।
పూచినపువులన్నియూ రుక్మిణీకపుడు వెళ్ళెతుమ్మెదలయి ।
పువులన్ని రుక్మిణిపయివాలె వేళ్యకాంతవుకనుక ।
నీవుపువులన్నిముట్టరాదు అంటరాదు అనికృష్ణుడుతాబలికె ।
అంతలోనెనారదుడు ఆనందముతోపాటపాడుచు ।
సత్యభామతో దానవ్వుచుబలికె పూచినపువులన్నిరుక్మిణికడకువెళ్ళె ।
తుమ్మెదలయిపువులు అన్నిరుక్మిపైణిక్రవాలె ।
వట్టిమానుయీరవ్వాయేలనీ నారదుడూబలికే ।
అంతటకృష్ణడపుడూనారదుచెయ్యిబట్టుకుని ।
నారదుతోటికృష్ణుడుఅప్పుడునవ్వుచుతాబలికే ।
ఒక్కపువ్వుదెచ్చివనితలకునాకును ।
జగడంబెడితివిఅనుచూకృష్ణుడునారదుతోబలికే ।
నారదుడుకృష్ణుడుగలసిరుక్మిణిమేడలకేగ ।
నారదుడప్పుడురుక్మిణితోను నవ్వుచుతాబలికే ।
పారిజాతపుచెట్టు సత్యభామవేరటా ।

చేయుటగాని పూచినపూవులు అన్ని ।
నీపైనేవ్రాలెగగా అనుచునారదుడుఁబలుకగా ।
హస్తములు ముకుళించి నారదునికిఁ గృష్ణునికీ ।
మ్రొక్కెను రుక్మిణి తానపుడు ।
గోవిందా కృష్ణహరీ గోపాలా శ్రీకర ।
గోవర్ధనగిరిధర వామనకేశవ శ్రీధరహరి యనుచు ।
పారిజాతపూ పువ్వుయొసఁగా పాశీనస్నాను ।
పతులకు సౌభాగ్యంగల్గను సంతోషమ్మునఁనందు ।

## 27 మేనకాదేవి నొప్పులు.

లాలి శ్రీనవరత్నా లాలిసురకల్పభోజా ।
లాలి కరతలదురితసరోజా ఆలించులాలి నత కల్పభోజా ।
నెలదప్పె మేనకాదేవికనుచూ వేడిమితో చెలులెల్ల చెప్పుకొనుచూ ।
నెలతనీభాగ్యమనుచూ మెలిమెల్లె పలికిరట్లని నవ్వుకొనుచు ।
రుచులపై వేడ్కలేదు శిగ్గుచేవచియింప సఁపిగాదు ।
ప్రకటముగ దెలియనియ్యక రెండోనెల గ్రిచుఁదు యైన మేనకా ।
భావమెంతయున లేదు భుజియించ కేవలంబుద్ధిలేదు ।
శిగిబట్టకట్టలేదు బలువైన చెవిళ్ళ కోపలేదు ।
వనజాక్షివునికి జూచి చూలాలవని పలికి మదినిగాంచి ।
శిగ్గుపడిముఖముపంచ దినశుద్ధిచేసిరా స్త్రీలుఁగలసి ।
మూడోమాసమున బాలాకుచములను నీలిమావిసరించెనూ ।
మేలయినవదనమున మాధవళమాలీలగా గనుపించెను ।
నాలుగవమాసమునను పాలుబడెనని కొందరు ।
మేలిమితో బాలికామణికిందురూ మేలువారలుఁ అందరు ।
దినదినము స్త్రీలచేత నెవిందురు అయిదవమాసమునను మంచిదినమందు ।
అయిగవులు బిలువనం పీమోదములో ధనముబంచి సీమంతమాదిశుభమందునుంచి
కలికిచేతులుగాజులూలో డిగించి కలిమితో దురకాంతలు।
ఫలమూలమపచ్చి పెసలు పంచిరా చెలులకును చంద్రిముఖులు ।
ఆరో నెలబాలకనుచుచనెను తనజననిగర్భంబులోను ।
ఏనదాదులెన్న గాను మేలిమితో బాలికామణికందురు ।
ఏడోనెలబాలకనుచు కదులాడెయొడవ భాగమునబాలా ।

ఆడశిశువనుచు అబలా ఆనినలుకోరియుందురు గర్భమున ।
ఏనిమిదోమాసమునను తనపతిని పతిగూడలేకా ।
మోదముతో విడవలేకా పవళించను మాటాడలేకా ।
తొమ్మిదవమాసమునను మాట్లాడిసొమ్మసిల మొగము వాడ ।
సమ్మతిగ చెలులు వేడ మోదముతో కొంగుదిగ పీడపీడా ।
వనజాక్షివునికిజూచి అలసట సొలసెనని మదిని గాంచి ।
తలఅంటిపోసి తుడచి జలశుద్ధిజేసిరా స్త్రీలుగలసి ।
అమ్మరో రోగదమ్మా భుజియించవమ్మయిపుడు ।
రేదిష్టమమ్మా సమ్మతిగ దెల్పవమ్మా మాయమ్మకొమ్మరో ।
వేగరమ్మా వద్దనగూడదమ్మా వినవమ్మా యొరాగ్రవుపాలుసుమ్మా ।
యుగ్రగాగాచిరమ్మా వేవేగజాగ్రవేముద్దుగుమ్మా ।
సుదతిభుజియించలేకా నిజప్రసవవేదనకు నిలువలేకా ।
నొప్పులనిచెప్పలేకా చెప్పకను చెలులకును చెప్పలేకా
నగపతికి జెప్పరమ్మా నొప్పులకు నగమీదుగట్టరమ్మా ।
మగువలకు గండమమ్మా వీలయినతగువారినడుగరమ్మా ।
అనుచుచెలులుబల్కగా ఆరుణాలుఘనపాటకులు చదువగా ।
ఘనమంత్రతీర్థము మియగా సన్నుతించెను నిజప్రసన్నములుదెలియమొదలు
కరములతో మంత్రిసానిపట్టి తనకరముతో సతిగనాని ।
గట్టిగావుండుమాని కూర్చుండ కరుణించు దైవమాని ।
తరుచుగా మేనలదెను యున్నమని తిరుణపైచెయివేసెను ।
వెరచియిటుఅటుజూచెను తాళదనితరుణి కనుఁటయూనెను ।
తరుణిపరవశము జెందె నగరాజు మోదమున శాంతిజెంద ।
దివినుండిదిశలనెల్ల తెలివినొంచే వనజాక్షివునికిజూచి ।
మొప్రక్కవేదైవాలను వేడుకొమ్మా అయినప్రొగ్దుడుగరమ్మా ।
శకసువుదయంబారునో చూడరమ్మామృగశిరా వృషభమునను ।
శ్రీకరమ్మునప్రథమ చరణమందునా తగసింహలగ్నమందు ।
సప్తమీబుధవాసరమ్మునందు నగరాజపట్టణమున ।
దివినుండివానలుగురిసెను తరులుచిగిరించెపూచె ।
బాలికామెరుగుతీగెలు మెరసెను కలవాణులేతెంచిరి ।
బాలకూజలకంబులాడించిరి సొలసిపాన్పనసుంచిరి ।
వేడ్కతో బాలరూపముగాంచిరి తమ్ములను బోలుకనులా ।
ముంగురులుతుమ్మెదల మారుమిగులా అమ్మయీబాలికోయేలా ।

జగమెల్ల నెమ్మదినిబ్రోవజాలు
ముఖమువీక్షింపరమ్మా యీబాలకామారిసౌఖ్యసుమ్మా ।
అమ్మలోవినగదమ్మా శివునికీపట్నంపురాణిసుమ్మా ।
యిరువయివొకదినముశా యేతెంచి పరవధూమణులమేనా ।
బాలికారత్నములును వరహంపతూలికాతల్పమునను ।
శృంగారపుమేడలోను బంగారపుతొట్టొకటికావించియూ ।
మేనకారత్నమునను పూచిరాబాలికను ।
మణులందరుయీపాట పాడినావిన్నగాని ।
సకలసంపదలిచ్చిరక్షించుశంకరుండెల్లపుడును॥

## 28 శ్రీ కంచివరదరాజు పెండ్లిపాట.

వాణిదేవిమదినిదలతు వరదరాజాబ్రిస్తుతింతు ।
చారుమతినిదలతు సప్తసాగరమ్మున ।
కంచివరదరాజామీద మంచిపాటసకలకీర్తి ।
యంచగమనయీపాట యెంచిపాడరే ।
కవులకెల్లమేటియయిన కాళిదాసు మదినిదలతు ।
గావ్యంపుకర్తయైన స్వామిదల్చెదా ।
వెక్కసూర్యమండలముల వొక్కచోటపాడిచినట్లు ।
చక్కనీవరదరాజా చాయలెట్టిదో ।
భుజమునశంఖుచక్రిములు ధగధగమెరయగాను ।
పరగరెండుకేలస్త్రీలు పరీచారులు ।
అంతసముద్రినితనయ హంసగమనపేరుందేవి ।
వొవ్వపెరుగుచుండె తనమందిరంబునా ।
తుమ్మెదగుంపులనంగ తోయజాక్షికురులనంగ ।
రంగిణీవిండ్లబోలు చెలియబొమ్మలు ।
చెలియతామరజాట్లు శోభరించినట్టికర్మ ।
[illegible]ర్వెఅరటిస్తంభాలు అతివతొడలును ।
చక్కశేసాగరములు సూర్యచంద్రులవిందు ।
అక్కజముగ వియ్యమందె అతివకనులతో ।
[illegible]న్నపూవులుకోయ[illegible]ను పాదములుచెలంగూడి ।

రాచపడుచు నిపిలుతమనిరి రమణులందరు ।
సుందరవదనతల్లివద్ద కోమలాంగివుండగాను ।
కన్నుసన్న జేసిపిల్చె కాంతయొకృతె ।
కేళించినవ్వి అపుడు కేరిడి నవ్వుముంపెదట్టి ।
పూలుగోయ్యబోదువా పుష్పబోణిరో ।
రాణివాసమెల్ల విడిచి రమణితోట వెంటనేగ ।
భావ్యమాయి దినీకు పద్మలోచనా ।
అనుచు తల్లి గారవించ వినక నాపేరుందనా ।
కొంగునగట్టినవి పూలన్ని కారజల్లెనా ।
ఘల్లుఘల్లున నుమతినా గజ్జెందెలు రవలుసేయ ।
మొల్లగంధివారములు మ్రోగుచుండెనూ ।
తరుణిచేరు చుక్కబొట్టు నుదుటనాట్యములుసేయ ।
కొప్పునముడి చినపూలదండ గునిసియాడెను ।
కన్యకాదిగుల జెడ జాలి [illegible] చందమాయెన ।
తల్లిచేరదీసి అపుడు సోకమాన్పెను ।
తల్లిగర్భమపుడు కరిగి తనయనప్పుడెత్తుకొని ।
పూలుగోయ్యబోదువాని బుజ్జగించెనూ ।
పన్నీటజలకమాడి చెంగావిచీరగట్టి ।
వన్నెమీరజడవేసె వనితయొకృతే ।
వారంపుసొమ్ము దెచ్చి భామరమ్మనిపిలిచి ।
వీటుగానశృంగారించె బోటిఒకృతె ।
పారంపుచల్దిదెచ్చి సఖియరమ్మనిపిలిచి ।
వెండిపళెనుచల్దిబెట్టె వెలదికరమునా ।
పసిడిపావాలు దొడగపసిడికూడ చేతబట్టితీసుక ।
చనుదెంచె నతివ ఇందువదననూ ।
ఆరాత్రియుదరివీణ అతివలంతామాటగాను ।
తత్తుగాపించిరా తరుణులందరూ ।
సన్నపూ [illegible] సఖియలంతా విసరగాను ।
సుంద [illegible] తెల్లి గునిసియాడగా ।
ఆడగా [illegible] తిలోను అపుడు కంచివరదరాజు ।
బోటి [illegible] చూపెనూ ।
యింతచక్క [illegible] కలది యిందువదనయెవ్వరనుచు ।

కనులతో టిమన్మథుని కాంతజూచెను ।
చూడగా నెలంతలోను సుందరీచెలులు గూడి ।
ముగువలంతకలసి తమమందిరమునకరిగిరీ ।
వారుతీర్థములు జేసి ప్రేమబుజ్జగించనునుచు ।
వరుసగా బారుటాకులు కోసుకొనరే వొల్లనీఅరిటాకులు ।
ఒకరుపెట్టెరములందు మొల్లగంధిముద్దజేసి వొప్పగించరే ।
పోకపా త్రలుపరచిపాలతిపెట్టె జలములందు ।
నైవేద్యములజేసి నెలతలందరూ ।
కరములూడుకుకోని కర్పూరంపు ।
తాంబూలములు అతిసకొగ్గవిరిబోణి మడిచియిచ్చెనూ ।
బొడ్డుమల్లెలూదెచ్చి అంపముగపాన్పు రచి ।
యిందుముఖులుయచ్చోట వుంచిరంగుగా ।
రాచలేమప్రాగనుకరానందుచుగని గుడికిగినాము ।
తగినబహుమతియ్యవమ్మ పేరుదేన్మా ।
నవ్వి పేరుంచినిద డు నళినాక్షుంగు నెల్ల।
బాగాలుమూడలు పంచిపెట్టెనూ ।
కొలువుచాలించి లేచిపోద మనుచు పొన్నపూలు ।
నీళ్ళలోకిచనిరా భామలందరూ వొక్కపారిదువుందమనుచు ।
వొక్కఆటఆడమనుచు అతివలంతపొన్నమానునీడకేగిరీ ।
వరదరాజుకరుణచేత పొన్నపూవులు నిండుకుండ ।
గుడ్డలానువిందెనమ్మ కొమ్మలకప్పుడూ ।
బుజబుజరేకులనుచు కోమలాంగులుందుకొనిరి ।
నాలుగూ స్తంభాలఆటలాడిరీ ।
ఆడగానెలంతలోను కంచివరదరాజువచ్చి ।
అనుచుపొంచిచూచెనూ పట్టుపట్టిమొలనుజాట్టి ।
బంగారుచిక్కటమున వంకి మొలనుజాట్టె కంచివరదుడప్పుడు ।
చంద్రకావిగుడ్డ పొన్నచెట్లల్లుమునుకగానె ।
మంచిముత్యాలచేర్ల నామముదిద్దాగినూ ।
కర్ణమూలచవుకగండు నీలంపుచాయలు ।
సందిటూదండాలాను వంకీలు మెరయగా ।
మునిచేతులాకు మంచిముత్యాలకడియములు ।
మెలకుంట లారమూలుమెరిగుచుండెనూ ।

వొప్పేటికొసుభా వీణకంఠహారములా ।
చిలుకతాళిసంగతాళి రొలవిదా గ్చెనూ ।
పరగునాచనుదెంచి భామయెదుటనిలచుండి ।
చంకచాచిబెదరించె సఖియలంపరిని ।
అనుచుబెదరించగాను అతివలంతవణకుకొనుచు ।
నీళ్ళలోకిచనిరా భామలందరూ ।
పొదురేపణతులార పొన్నపూసుంకమీక ।
రొంపుమీర మావనములకేలవస్త్రి ।
గూడకొక్కమాటయిచ్చి భామచనుదెంచునుంటె ।
పసిడిబొమ్మకొపమేలె పణతినీకూ ।
గొప్పకంఠ్లవరదరాజు ధిక్కరించిమాడగాను ।
అతివలంతపొన్నమూను నీడకరిగిరీ ।
అప్పుడాపేసుందేవి కప్పుకొనుమపైటిచెంగు ।
వొప్పిదముగపల్కె కంచినరమతోడనా ।
ముసికొప్పుమొల్లచాయ తొగలజాచాయముఖము ।
బొండుసంపెంగచాయపనితచాలు ।
పలుకుపలుకుతేనెధార లొలుక గానెచిలుకపలుకు ।
కలికిమోవికంఠసాన గానవచ్చెనూ ।
మాటపుచ్చుకొనలేవు రూకపుచ్చుకొనలేవు ।
మాచేతనో కారాగి కానుకొందువటర రమణిసుంకరీ ।
పోరసుంకరీ యింతపోతరంపుమాటలేల ।
జాడజూచివనములోకి జాడఅరుదురా ।
జాణవేనీవుగనుక పరుగ్తాపలేదుగనుక ।
జాడగట్టివచ్చినాను జాణవందువా ।
వనితచేతులోనువున్న జాడమానుపకమాయిస్తె ।
జాడలేదుఅనుచు వనములోకిఅరిగెదా ।
కలికిచిలుకనెత్తుకొని కంచిపురము కరుగవలె ।
తెలదులారమీరుచనరే వేగిరమ్మనా ।
కనివారమ్మఅని పనాథోజనమ్మకొస్తే ।
ఘనముసేసివారి యింతఘాతజేతువా ।
కోకిలాపువ్వులన్ని కోమలిపైజల్లుకొని ।
ముత్తడిబొమ్మ అక్కడచిక్కుండేనూ ।

అట్టితొలకరిమెరుపు హంసనడక లేడిచూపు ।
కలికిచిలుకలకాంతి వనములోలకరించెనూ ।
మచ్చెకంటిచిక్కవడక మరివేగిరమునబోయి ।
చెలులతోనగల్పుకొనెనూ చంద్రవదనా ।
తమగూడలేనిపువ్వులు తరుణిగూడలోనెబోసి ।
భయముయీడిపిగారవించిరి సన్నుతాంగినీ ।
కుంజరమ్మఆచోట కోమగనెదురువచ్చెననుచు ।
చెప్పవద్దనుచు పంతమ్ములాడిరీ ।
ఆకాంతలెల్లగూడి యేకాంతమాడుకొనిరీ ।
అందరూకలసివారు అరిగిరప్పుడూ ।
రవికెచుట్టుచుట్టుకొనుచు రమణికి స్నానెత్తుకొనుచు ।
మగువదోట్టికాని మందిరమునకేగిరె ।
యెదురుగానువచ్చితల్లి కౌగలించుకొని యప్పుడు ।
భయముదెలిపి గారవించె సన్నుతాంగికి ।
ముద్దుముఖముగడిగితల్లి ముత్యాలహారతిచ్చి ।
తీర్థమాడిబుజ్జగించెసన్నుతాంగినీ ।
పున్నమచంద్రిబోలునీమోము అదివేమో ।
వన్నెకలుతప్పియుండె వనితవెరస్త్రీవా ।
తమ్మకుంజరమ్మమాకు అడ్డువచ్చెనక్కచోట ।
వెరచుకోలేదుఅనుచు వెలదిపలికెను ।
తననుముందువరదరాజుకు అమ్మపెళ్ళిసేయుమనగ ।
అంతధనవుకొండమనాపాలికొచ్చెనా ।
ఆసదాశివునిబ్రహ్మఅత్తుణముపిలువనంపి ।
కూర్చిసముద్రూసినుతకు కోవాలాంగినీ ।
వారుసాగరమునకుచనిరి వేగిరమునబోయివారు ।
ప్రియముచేసి కనకంపుపీటబెట్టిరీ ।
వినవోయిసముద్రిడా మనవివెట్కవరదరాజులకును ।
కన్యకాఅమ్మనడగకగామవసిమీ ।
వయసుకూడలేదుగనుక వనితచిన్నదిచుగనుక ।
కువుకియెందు పెళ్ళిచేయవచ్చునా ।
విన్నటీకేకబట్టి వరదుడునీసుతనుజూచి ।
భ్రమిసిఅమ్మమింతజేయ కోరతనుండెను ।

వట్టిమాటలాడవద్దు వూరికేమముపంపవద్దు ।
చిత్తమెరిగిపెండ్లికాయ త్తపడుడీ ।
మాసాలలోకెల్ల విశేషమయిన మాసమైన
వైశాఖమాసపంచమ్మినాడు మగువపెండ్లి ।
లగ్ననిశ్చయంబుచేసి రమణికపుడుంబుజ్జగించి ।
నిబ్బరముగ కంచిపురముస్థలముకరిగిరీ ।
మూడుకోట్లయేనుగులు నుముప్ఫయికోట్లఅశ్వములు ।
పదికోట్లయేనుగులును భద్రగజములూ ।
నాభిమాణిక్యము నాలుగుదిక్కులమెరయగాను ।
పక్షివాహనంబురూపు డెక్కెముదమున ।
గరుడపచ్చలపల్లకీలో కామాక్షమ్మయెక్కెనపుడు ।
గరుడవాహనంబునెక్కె కంచివరదుడు ।
నిబ్బరముగ అంతగలని సాగరముకెత్తిరాగ ।
సకలసురలు మోదమంది వచ్చిరప్పుడు ।
ఆకాశమంతలేసి పందిళ్ళువేయగాను ।
భూమియంతఅరుగులేబాగవేసిరీ ।
గుచ్చిముత్యాల తోరణంబులేగట్టిరి ।
గుచ్చనీముత్యాల పళ్ళెమునసుంచిరి ।
మరునాడుదయమందు మరుజాముపొద్దువేళ ।
వారికివరదులాడుతీర్థ మమరబోసిరీ ।
కన్యకపుడు శృంగారించి స్వామిసన్నిధినివుంచి ।
పెండ్లికొడుకు నెదురుకొనిరిప్రియముతోడుత ।
జీలకర్రబెల్లమ్ము చేడెశిరమ్మునవుంచ ।
వరదరాజు శిరమ్మునవనితవుంచెను ।
అగ్నిహోత్రసాక్షిగాను అతివనుపరిణయంచేసి ।
అన్నపాత్ర్యప్రమాణ్యమ్ము వారుచేసిరీ ।
అపరంజితాళిబొట్టు ఆదిలక్ష్మిమెడనుగట్టె ।
కళలుమీర కాంతిచంద్రునికళలుదేరను ।
కనకంపుపళ్ళెరములఘనమైనముత్యాలు ।
అనురంగతలంబ్రాలు అపుడుబోసిరి ।
అలనిసాలనితలంబ్రాలు హాసగామొప్పగాసెబోసి ।
అఖిలబ్రహ్మాదిమునులు ఆరుఋషులతో ।

లాజహోమములు వేల్చి రమణినపుడుబుజ్జగించి ।
పువ్వులంబుక్కావసంతమాడె కంచివరదుడు ।
బంగరంపు గిన్నెరములో పాలునెయ్యి దెచ్చియుంచి ।
అప్పగించెబంధువులకు మెప్పుతోడనూ ।
నామనవిచేకొమ్మి నాసుతనుయేలుకొమ్మి ।
చేకొమ్మనుచు సుతనుచేతికిచ్చిరి ।
ద్వారమందునిలుచున్న మామగారికిమొక్కి ।
భామనంపుమనుచు వారుపయనమ్ము చేసిరి ।
పుట్టినూరువాళ్ళు లేదు పొలతిన తత్తవారికంప ।
చిత్తమెరిగి నీపనులు చేయనేర్చునా ।
వింటివా కామాక్షమ్మ అతనుఅన్నమాటలను ।
వినివూరకుంటనీవు ఆదివుచితమా ।
తల్లిమరుగు చిన్నదాన్నితనసుఅనిపంపరేమి ।
తల్లికంటె మాగుతల్లిని తనయానంపుడీ ।
శ్రీవేంకటాచలా శ్రీపతి ప్రాశిగివారు ।
అతివనంప కుంటేమనకు ఆదీవుచితమా ।
కౌగలించితనా సుతనుగారవించి ముద్దుబెట్టి ।
పూలుకోయబోయివిభుని పొలతిదస్త్రివా ।
కందదుంప ఒడినిపూచి చంపసంపుబొమ్మవుంచి ।
తెల్లవరిబియ్యం వడినింపవంపిరి ।
పసుపుకుంకుమ్మ చాలంబా ఒడినేవుంచి ।
పల్లకైన గానులు బళ్ళలో వెంటదోలిరి ।
మూడుకోట్ల యేనుగులు ముప్పయికోట్ల అశ్వములు ।
పదికోట్లయేనుగూలు భద్రగజములు ।
నాభిమాణిక్యమును నాల్గుదిక్కుల మెరయుగాను ।
పక్షివాహనంబురూపు దేవ్రథమయుగా ।
గరుడపచ్చలపల్లకెక్కి కామాక్షమ్మతాను ।
గరుడవాహనంబునెక్కి కంచికరిగెవరదుడు ।
తలుపులు వేయించి పేరులు జెప్పించి ।
ఆశీర్వాదముచేసి అక్షింతలిచ్చిరి ।
వచ్చిన బంధువులందరికిని పసుపుకట్నాలిచ్చి ।
విందుచేసివారినగరిపొందుకంపిరి ।

బంగరంపు మేడలోను పసిడి పాన్పులామీద ।
అందముగా పాన్పు పరచిరపుడు వరదుకు ।
పన్నీరు అత్తరు పాన్పుపయిని చిలికించి ।
మల్లెవిరజాజులూ సంపెంగలు జల్లిరీ ।
బంగరంపు మదితరావె పణతి నీవు వేగరావే ।
కాముని కోధరావె కలికి రావే ।
సుంకరులతోటి నీవు జూదమాడి వోడితేవె ।
అంతధనము గెల్చుకోవె యిందువదనా ।
పచ్చివాకలూను పండుతెల్లనాకులూను ।
తాంబూలమేసిరా దంపతులిద్దరు ।
కోర్కెతో నులింగపల్లి గోపయారాము పేర ।
కణరుకలిగి యుండెచాలు కంచివరదుడూ ।

## 29 అశ్వద్ధ ప్రదక్షిణం.

విష్ణు గ్రామమందు కృష్ణుమ్మబుట్టె । రాజీవలోచనుడు రావిగావించె
సూర్యమ్ముతోను నుదురాయెనావి । అశ్వద్ధ శశ్వద్ధంబులో పుట్టిల్లె
వేదమ్ములనియేటి వేళ్ళుగలరావి । అమ్యుతుండనియేటి ఆకులారావి
కమలనాభుడనియేటి కాయలారావి । పద్మనాభుడనియేటి పండ్లరావి
పండుసంపూర్ణము యిచ్చాలవిందు । పలుకులు కోవిలలు బకములగుంపులు
యెప్పుడు అశ్వద్ధంబు పైనాడుచుండు । పక్షిజాతులు వ్రాలెపుడు వృక్షంబుమీద
అట్టిఆడు మండు ఆరావిమీద । మూడువేలవిద్వాంసులారావిక్రింద
ముఖ్యపురాణాలు చదివేటివారు । నాలుగువేలపురాణులు ఆరావిక్రింద
చాలపురాణాలు చదివేటివారు । పదివేలవిద్వాంసులారావిక్రింద
భక్తిపురాణాలు చదివేటివారు । ఋగ్వేద యజుర్వేద సామవేదులను
అరుణాలుచదివేటి ఘనపాఠకులు । విద్వాంసులందరు విచారింపుమను
యీరావిప్రదక్షిణం యిదియొట్టిదనిరీ । భక్తితో రావికర్ఘ్యమిచ్చినను
విద్వాంసులమధ్యను పుట్టెదరు రావి । కోటాను పాపములు బాపును రావి
యిది యెట్టిదనిమీరు అడిగితిరయినా । పాడినా విన్నాను పాపములుపోను
గోత్రాలు విన్నాను కొడుకులనుగనును । బ్రాహ్మణుడు వింటేను బ్రహ్మజ్ఞు చేయు
రాజులు వింటేను రాజ్యకర్తగును । కోమటి వింటేను కోటీశ్వరుడవు

కూడా మ్రొక్కుడించేను శుభము చేతురూ । కన్యలుడించేను కళ్యాణమవును
బ్రహ్మచారికింకే గృహస్థుడగనూ । పుణ్యస్త్రీకయితే సంతానంకలుగు
నమ్మియున్నవయ్య ననకీటచోర । అన్నిదిక్కులనన్న అంపకమితిఁడ్రి
పాదాలుఅయినాను పట్టీవున్నాను । కృష్ణకృష్ణకృష్ణమ్మదంతు
రామజేరావజే రఘురామచలతు । యిటువంటి దలమాట యిచ్ఛరక్షించు
బంధువులదరికములు బ పిరక్షించు । నాచింతయొడబాపు యేచింతలేక

వ॥ అశ్వత్థనారాయణతిఁడ్రి యేడాదికి ముడమట్లు కాశీకివెళ్ళి వస్తావుగనుక అందులో ఒకపారి ఫలంనాకియిచ్ఛరక్షించు॥

## 30 శ్రీరంగనాయకమ్మ వయ్యారుల శృంగార సంభాషణము

ఇందువదనావింటివా । సద్దులు చంద్రవదనరోగింటివా
మందగమనరోవింటివా । యీరంగాడి మర్మమంత తెలపెను
కోపకరోనన్నడబాయకవనిచెప్పి । పాములబట్టగదా
చెయ్యరానిబాసలజేసేదే । దానింటికిపోనసిబోంకేగదే
అడిచాలవలపించునుంగదే । తిరువెంగళరాయని । పరిమళగంధము
దానికుచములపైనిండాను । ఘుమ్మఘుమ్మని కన్పడేగదే
నాంచారమందూలవహివలు । యేడాదికోకతూరి రాయయూరువస్తేను
యేమన్మనన్నింత రట్టుజేసేరు । యేలనన్మనన్నింతరవ్వజేసేరు
శృంగారవిమ్మాని కాకటిరంగని । రంగాగతె నద్దుకున్నదట
పట్నములోవున్న ప్రిజలంతజూడగ । విభునిచెయి జిక్కించుకున్నదట
రంగానిబంగారు రొమ్మెక్కి కూర్చోను । తప్పాయెనావల్ల తగనాటెనేను
యేమేవయ్యారునాంచారమ్మలుతో । యేమనినన్నాడిపల్కితివో చెప్పుమా
పుట్టితి పెరిగితి యింతదానసైతి । యిటువంటి బూటాక మెన్నాడురోరంగ
దేవతలందారు జేజేయనగ । బృందావనమున పుట్టితినిగాని
పేరుప్రతిష్ఠలతో పెరియాళ్వారింట । మురిపెముతో పెరుగుటయోరంగరామిారు
పెరియాళ్వారింట యిచ్ఛాకములాడిన । హితవులచెప్పిన రంగదేశాడా
న్యాయముదప్పదు నాటికేటికి । నన్నడబాయ నాప్రాణనాధుడు
నాకేమిభయమే నీరంగశేత్రి । నీకన్నమూరెదు సాచ్చియనదాన్ని
అక్కాయూరెదుపైచ్చానిశక్కితివి । తిరువాయిగొండపైయెక్కినిల్చుంచేని
నేను పెద్దగాననగదును । నాపడ్డకామడిగా నీవరుసవద్దనయినను
అరవబ్రిమ్మాడమూతుర పిసితి । అణకువలేబ యొసి

చేవూనిరాప్రళ్ళు బెదుదూవటే । అక్కరాకుండిజేసితె నగుబాట్లగాదటె
రంగానివాయింటికిబంకవద్దా ।
అలుకజూపవద్దావీతనిపైనయినా । యిటువంటివీకలికిఅలక్షణమా
పతియూపతియూగలని । వక్కచోటుండాలి । పతినివిడచిపతియుండూనగే
వీవంటిపంచలమారిగాబోనూ । అక్కావేలస్త్రీలకు ।వన్నెకాడయితిరిగివా
వరువినదతికవోర్వాకనీవాళమా । పాతివ్రతివంటిదానికియినమా
చనువునావీవంటివా । నాకన్నచక్కనిదానావటే । యెక్కడనుండొస్తివే
నావిభూనియెంతరాపిడిబెడితివే । వూరేదిపేరేదినీవున్నస్థలమేది
యిచటికిరాకారణమేమే । యీదుతోడుద న । నావూరేలడలచేవు
పేరేలదలచేవు । నావారినితంపానకారణమేమే । వియ్యాలమందగవచ్చిరా
నీతోటికయ్యాలమందగవచ్చిరా । తాటంకముత్యాలకమ్మాలుగడలాగ
తాటాకీతంపూచకే । నీవునాటిదానవుకేదువే । అక్కముందునావల్లాను
యేమిముచ్చాటగన్నావు । కాకనావల్లానుకడతేరదిపుడూ
వన్నెలాడినీవాడినమాటలు ।
భువిలోనచోద్యములే వన్నెలాడియని । నన్నంటివి ఝుపుడూ
వన్నెమృగమునుదెమ్మంటివనెనా । పతినియనుజాని బంపితివనెనా
రక్కసునివరియించి రథముపైకెక్కి । లంకలోకివెళ్ళియుంటివానేనూ
బిత్తరినీవగుదువే । దేశజమ్మరిఅటుపోగదే। దిమ్మరినిన్నుఅంటివివోకొమ్మా
రొమ్ముపగులగొట్టించెదజలుకులచేత। ముడిచివిడిచినపూలురంగనాధునికంపి
వలపించుకున్నస్త్రీనెరజాణగావే । ఆటదానవోవే
నీతోటిమాటలుయికనేటికే । ఆటదానివనన్నంటివెయిపుడూ
పట్టూజూచుకువుండు పదిలముగానూ । తిట్టకానేమాననేనక్క
మకిబూసినేరేడుపళ్ళమ్మకేలా । అంగజజనకూమావారిని
అంగట్లోబెట్టుదురాపలుకూవు । కాంకరాలవని వచ్చియుంటినిగాని
నీతిదప్పినదానివనియెరుగనె । నీవూరికొస్తూంటే నీవుండువాడలకునేవత్తునా
అక్కనీపేరుకలలోనయిననుదలతువా। సప్తసముద్రాలుప్రళయముపొంగగా
నక్కానుజూచిసేపణకూదునా । కునకంబెనేజూచి బెదురుదునా
కుటిలకుంతలిరావె । నాంచారురావె । పట్నంపురాణ్ణీరోగొట్టూనరావె
పళ్ళురాలాగొట్టరే । దానిధాటీలుతగ్గాతయూ । యేమిచేయగగలవటే
నన్నిపుడువంచనలుజేతువటే । ముందుచెవులాకన్న వెనుకకొమ్ములాడి
అన్నపావ్యంబునిజమాయెనే । యిందుముఖులంతామ ఒకచోటగుమిగూడి
చెవులలోసీసంబుపోసినట్లుండు । కణకాములకు। పెద్ద ములుకులయివుండు

మాటలునేరవిమృదుభాషివెనీవుపద్మనాభునిముద్దు । గుమ్మరో రావే
పారిజాతములుముడిచీ । పరిమళాద్రవ్యముతో శృంగారించి
చేరబోయీదాని కొప్పుబట్టితీసి కొప్పూలావైరులన్న । విప్పితీసుకురార
కానుకలిత్తూగదే । చెలులార కట్నంబులిత్తూగదే । అక్కగజ్జలాగురివమ్మ
రొక్కరంగేశుడు । ఘలుఘల్లుమనుచును రవళిమ్రోయంగ
మకరకుండలములు మణికిరీటములు । శిరసన శ్రీరావస్తాళిధరయించిరయా
వచ్చుచున్నాడమ్మ శ్రీప్రాణేశుడు । వోయమ్మయికమీరుపాదులుమానార
వనజనాభుడంత వాహనంబుడిగి । అదిరుద్రాదలందరినిబిల్చుకొని
మాపటికాలువునకు రమ్మనిచెప్పండి । రావమ్మ శ్రీరంగనాంచారువేగ
మేలిమగులద్దూలు లియ్యాగిబూరెలు । మరివారిమండియ్యలు
తేనెతోనలుచక్కిలములుఆరగించెను । రంగేశుడప్పుడు
రావమ్మ శ్రీరంగనాంచారువేగరావమ్మా । నిగనిగముత్యాలకమ్మలుమెరయంగ
నటనతో బంగారుబొమ్మవలెను । గజరాజవరదుడు మెచ్చకిచ్చినా
కంకసరులలాడవే । నాకంతానవెలుగుతున్నవిప్పదూ
పచ్చనలాపల్లకీపట్టుకని । యింకనేపుట్టింటికిపోవలెను
పెరియాళ్వారులకూతురిని అనినన్ను । వేవేలవిధములాపూజిస్తురాగదవే
తెచ్చుకన్నట్టి ఆదొమ్మరిసతిచేత ।
తిట్లుబడవేసాచ్చెబ్రహ్మవిధియిట్లంది గాబోలునూ
యేలయ్యయీవాదులాడించుతున్నావురంగధామా ।
మాటాడబోతేనుకవటికొట్టగవచ్చెరంగధామా ।
పోయినపుట్టింట పొందూగనుండెదరంగధామా ।
భూతపిల్లలుజవ్వాదిపిల్లులారంగధామా ।
కస్తూరిపిల్లులాకానుకంపినదయ్యరంగధామా ।
ముప్పదిమూడుకోట్లధనరాసులంపింది రంగధామా .
హస్తకంకణాలుఆవనితిచేయించె రంగధామా ।
సముద్రుడుమీకిచ్చి వేడుకలచూచె రంగధామా ।
మకరకుండలములు మీమామబంపెను రంగధామా ।
పన్నీరుచెంబులు బంగారుకోకలు ।
వన్నెలరవికలు మాణిక్యాలతోకట్టిన మకరికపత్రికలు ।
జవ్వాదిభరిణెలు ఆడేటిబొమ్మలు అపరంజిసొమ్ములు ।
పట్టెమంచంపరుపు పాలిచ్చుమొదవులు పదివేలిచ్చిరయ్య నీలవర్ణుడా ।
దండివికడవలు వెలలేనిరత్నాలు పగడంపురోకళ్ళు పసిడిపొన్నులవి

వజ్రములతోళ్ళు దంతపుదువెన్న ముత్యపుదిక్కుంటు ।
కాటుకాయకరాటము పంపించిరెయెరుగవ నీలవర్ణుండ ।
యేటేటతప్పాకసారెచీరబెట్టెరంగధామా ।
మురిసేవుముద్దులాకోమలాంగినిజూచి నీలవర్ణుడ ।
కడుపునిండగనీకు అన్నంబుబెట్టిర పచ్చానికమ్మాలనుప్పాటిబెట్టిరి
నీపాదధూళిమాపైనిసాకితేచాలువిజయలక్ష్మి ।
జన్మపావనమాయెను పతితులమగుదుము అగిలక్ష్మి ।
సిగ్గాయెనీయొగ్గుమాటాలువినగాను నీలవర్ణుడ ।
మురసేవు ఆముద్దుకోమలాంగినిజూచి చక్రిధరుడా ।
పరిణయకాలమందు నాగవల్లిరోజున నేను యూదరత్నపీఠంబుపైగూరుచుండ।
హోమమువేల్చగ బ్రిహ్మదేవుడువచ్చి కల్పముజెప్పగ ।
సముద్రుడుయేతెంచి కట్నకానుకలిచ్చె నీలవర్ణుడ ।
కరమూనపచ్చాలకడియాలుబెట్టుకుని వెలలేనిపతకములుమీకంఠమునవేసి ।
పీతాంబరంగప్పిమీకువిష్ణుడ కోటిసొమ్ములిచ్చె ।
దాదూలనిచ్చిరి వెల్లయేనుగులయిన ఒకలక్షయిచ్చిరీ ।
పట్టుఢేరాలును పల్లకీలయినాను పట్టెమంచంబులుపరుపులా ।
తలగడలు పణతికిచ్చిరయ్య పద్మనాభా ।
యేటాకోటిధనము జంబూద్వీపమంత మొఖాసాయిచ్చిరి నీటుగాడా ।
భార్యలేచి పంచభక్ష్యాన్నములువడ్డించ ।
నంబెరుమాళ్ళయితే తానారగించెను ।
హస్తములుకడుగుకుని కర్పూరవిడెంజేసి ।
సతియుపతియుగలసి సౌఖ్యంబుగానుండె రంగధామా ।
సవతులావ్యాంబు భువిలోనెలతలుబాడ ।
దంపతీసౌఖ్యంబు బాగుగాపొందెదరు రంగధామా ।

## 31 వెంకటేశ్వర్లువారి వేట.

శ్రీకరముగశ్రీవెంకటనాధుడు । శ్రీతోకొలువయికూడియుండగా
అవతలవచ్చిరి చెంచుమగువలు ।నయుతోకరమునను
కనుగొని మ్రొక్కిరి సాగిలబడిరీ । జాంటితేనియుబం
కానుకలిచ్చిరీ వినయమ్ములతో । అతివేడుచూవేటకురమ్మనిరీ

లాలితముగ శ్రీవేదవాథుడు । లాలితనీకథబుద్ధిజెప్పగా
పాలసముద్రినిపైపవళించెడు జగతీపతియాకోనేటయ్య
శిరులుయిచ్చిమమురక్షించును । సంభ్రముతోడుతనూ

## 32 కోవెలరాయభారము

చిరిచిరిపువ్వులావారే కోవిలారో - శ్రీరామచంద్రులే కోవిలారో
లక్ష్మిప్రాణవల్లభులే కోవిలారో - ముక్కంటివిల్లువిరచే కోవిలారో - మూ
రయూచుక్కల్యాణమాయె కోవిలారో - పర్ణశాలలోవిడిచీ కోవిలారో -
మాయామృగంవెంట కోవిలారో - పాపకర్మునిచేజిక్కితి - కోవిలారో -
భర్తానువిడచితి కోవిలారో - వెన్నెలలుగాయంగ కోవిలారో - చల్లనిరాత్రు
లందు కోవిలారో - శ్రీగంధమలదితే కోవిలా - భూదేవికూతుర్ని కోవిలారో -
జనకునికూతుర్ని కోవిలారో - దశరథులకోడల్నె కోవిలారో - శాంతకు
మరదలునకోవిలారో - కౌసల్యకోడలును కోవిలారో - ఊర్మిళకుఅక్కను
కోవిలారో - లక్ష్మణ్ణకదినెను కోవిలారో - రాఘవులదేవిని కోవిలారో -
నల్లనయినవారే కోవిలారో - నవ్వుచునందురే కోవిలారో - యఱ్ఱనయినా
వారే కోవిలారో - యేడురాజ్యమేలెటి కోవిలారో - సాగరంకట్టిరే కోవి
లారో - లంకదండెత్తిరే కోవిలారో - రామచంద్రులజాపు కోవిలారో -
అశోకముక్రింద కోవిలారో - ఆహారనిద్రలేకుంటి కోవిలారో - రాము
లమ్మానిచెప్పవే కోవిలారో - మెడదిహారంయిస్తు కోవిలారో - ప్రాణేశుదో
డ్తెమ్ము కోవిలారో - పత్తిజేసినపనులు కోవిలారో - వుపకారముయుండు
కోవిలారో - యీపాటబాడితే కోవిలారో - సతిపతుకలసుంద్రు కోవిలారో॥

## 33 వామనచరిత్రపాట

సరస్వతిగౌరివిరలక్ష్మిదలతు । విఘ్నేశుపార్వతీ శంకరులదలతు
వామనమూర్తికథవర్ణింతునేను । పాపరాశులనెల్లపారంగదోలి
శేషవామనరూపుపుణ్యచరిత । తెప్పలుగహరికథలుచెప్పుకుందురు,
బలిచక్రవర్తనేప్రబలరాక్షసుడు । సకలదానంబులాసర్వజ్ఞుడయ్యె
దానసామర్థ్యమునఅన్నిలోకములు । ఏదురులేకాభూములేలుచుతాను
సూరులగుదేవేంద్రదేవతలనెల్ల । సూరుడైస్వర్గంబుచోరగుండగొట్టె

అసురులు భూలోకమున సర్వరూపమున । ధరియించి జగమెల్ల చరియింపుచుండె
అమరులు పోషగాన దితి భీతిల్లి । అతిశోక దావాగ్ని లోన మునుగుచును
చిత్తమున వగచుచు కశ్యప బ్రహ్మ । వచ్చి అదితి యెదుట నిలచి తా బలికె
వున్నారు నీ సుతులీ యూర్వియందు । చనినారు బలికోరకు స్వర్గంబు విడచి
యెంతైన బలిదాన మేమరల బోదు । యెంతైన బలి గెల్వ నెవ్వరి తరము
బ్రహ్మేంద్ర రుద్రులు దేవతలు మునులు । నిలుపలేరా బలి చేయు ధర్మములు
అట్టిగాని మ్మను చు అదితి నీ మనమున । పట్టి ఒక వ్రతం పరమాత్ము గూర్చి
చెలగి ద్వాదశి వ్రతం చేయుచు నుండె । అదితి తపస్సునకు ఆత్మలో మెచ్చి
శంకచక్రములతో శ్రీ విష్ణుమూర్తి । గదయును ఖడ్గము చేతులను మెరయగ
వచ్చి యెదుట నిలచె నారాయణుండు । దేవాదిదేవుని దేవి తా జూచి
ప్రణమిల్లి మొక్కి నపణతి నిదీసి । కోరము వరమని గోమలీ నడుగ
బలి నణచి దేవేంద్ర పట్నంబు నీవు । నా సుతునికి గట్టుమి నరనాథ యనిన
యింతి నీ కోర్కెలు అవివృథా యనుచు । కాలంబు సమకూర బలి నణచి వైతు
నీ గర్భమందున విష్ణు వై పుట్టి । బలి నణచి వైతును ప్రబలంబు గాను
అంత కన్యపు మనసు ఆనందమాయె । హా దేవ యనుచు మహారి వలచుచుండె
అంత యతుమాసంబు అదితికి వచ్చె । అతిది గర్భంబు నా శ్రీహరి జొచ్చె
ప్రథమమాసంబు నా బహలి దేహంబు । రెండవమాసమున నెలతకళ వప్పె
మూడవమాసమున ముద్దు యయ్యెండె । నాలుగవమాసమున నరరూపమాయె
అయిదవమాసమున అవయవపూర్తి । ఆరవమాసమున ఆ యసువు పోసె
యేడవమాసమున కేళములు కలిగె । యెనిమిదో నెలను కన్యప్టె గర్భంబు
తొమ్మిదో మాసమున వికసించె నాభి । ప్రసూత కాలమని గణతికి నిదోచె
బ్రహ్మేంద్ర రుద్రులు బ్రస్తుతి సేయ । తుంబురు నారదులు గానంబు సేయ
రంభయూర్వశి మేనకలు నాట్యమాడ । దశదిక్కుల కాంతి దీక్షతో వెలగ
కోటి సూర్యుల కాంతి తేజంబు నొంద । ముక్కోటి దేవతలు మురియుచు జాడ
భాద్రపదమాసమున శుక్ల పక్షమున । శ్రవణ ద్వాదశినాడు దివ్యదినమందు
అమర మధ్యాహ్నపు సమయంబునందు । కోమరొప్ప కన్యపుని అదితి గర్భమున
అమరులకు సమ్మదమయి అదితి సుదయించె । దేవుడు వయియించగా దివ సుందుభేర్లు
ధిమ్మధిమ్మన మ్రోసె నాకాశమందు । దేవతలు పుష్పవర్షము నుకురిపించె
భానుతేజానికన్న ప్రభ గలిగి వెలుగ । పరమాత్ముడప్పుడు బాలరూపముతో
తనయుడు కలిగెనని కశ్యప బ్రహ్మ । పుత్రోత్సవం పచ్చె యెల్ల భూసురుల
దశదినంబులు వారు గడిపిన వెనుక । నామకరణము జేసె వామనుండనుచు
శుక్లపక్షము పెరుగుపోమని పగది । అభివృద్ధి పొందెను అపరాత్పరుడు

అందంపు అడుగులు చిన్ని పాదములు । చేనొప్పుచుండేటి జానలు కురులు
పొన్నకాయల బోలు చిన్ని పిరుదులను । అరటియాకుల బోలు నీయరికాళ్ళు
అదితి జేసిన తపసు అధికఫలమాయె । పంచవర్షమ్ములు బాగుగా రాగా
పొందుమీరగ బృహస్పతిని పిలిపించి । అక్షరాభ్యాసంబు సుతునికి జేసి
ఉపనయనము జేసి చినవడుగునకు । వేదశాస్త్రంబులు వేడ్కతో జెప్పె
అరువదియారు విద్యలు అన్ని నేర్పంగ । బ్రహ్మాదిరుద్రులు ప్రస్తుతులు సేయ
బ్రహ్మోపదేశంబు బృహస్పతి జేసె । పసిడి మౌంజీ గోచి పతకంబు గట్టి
పొసగంగ ఉత్తర జంధ్యాలు వేసె । తిరుమణి జందెంబు నుదుట తిలకంబు
తీర్చి తోడుకవచ్చె నదితి దగ్గరకు । భవతి భిక్షాం దేహి అనినాడు వడుగ
అంత సుతునకు బెట్టె అన్నభిక్షంబు । సావిత్రి తా నిచ్చె మరల భిక్షంబు
గాయిత్రి తా నిచ్చె మూడవసారి । శ్రీలక్ష్మి తా నిచ్చె సిరిసంపదలను
సరస్వతి తా నిచ్చె సకలవిద్యలను । శివుడు పార్వతి యిచ్చె తేజస్సు బలము
బ్రహ్మేంద్రరుద్రులు అసురులు మునులు । భక్తి తమ తేజస్సు ఇచ్చిరందరును
అంతటి తేజస్వి యయిన వామనుడు । నెన్నడో ఒక చిన్ని బ్రాహ్మణవేషమునను
విప్రులెచ్చోటికేగుచున్నారో । వచ్చెద నచ్చోటి కిచ్చయొనమీర
అయిన నాకును దానవేంద్రాశ కలిగె । అందరము గూడి చలిన దుడుగు దావనుచు
శ్రీవల్లభుడు లోకసృష్టిరక్షకుడు । భావజగురుడగు పద్మలోచనుడు
యేతెంచె యావిప్రసంఘముల గూడి । రాక్షసరాజగు బలిచక్రవర్తి
అమరావతీపురంబు నేలుచుండు । సురలను మునులను భూసురులు పొగడగ
చెలువొంద యాగంబు సేయంగ దలచి । పట్టణప్రాంత నదీతీరంబునందు
నాలుగు యోజనాల్ పొడవయినయట్టి । రెండు యోజనముల వెడల్పుగల
చతురముఖములతో నుశాలవేయించి । హోమగుండంబు లేయూపస్తంభములు
ఉపయోగపాత్రలు హోమద్రవ్యములు । అపరిమితంబుగా అందు సమకూర్చి
పడతియు తాను బ్రహ్మరథమెక్కి । భేరీమృదంగ శంఖములు మ్రోయ
కాలప్రకాశమై చన్నొందివెలుగ । జనకునికడకేగి వామనుండంత
తండ్రితో తగబల్కె తాపసోత్తము । యేదానవుడగను బలియింటికేగి
ఆ ముద్దుపల్కులు ఆలించి తండ్రి । కటకటా లోకకర్తయు తాను
శ్రీవిష్ణువై జన్మించి లీలలు జరిపి । మాయకల్పనగ చనన్నడుగుచుండె
నాయన తరముద్ధపుత్రకా నీవు । నగరులు సౌధములు నవరత్నములు
గజములు అశ్వములు ఘనరాజ్యములు । కోరక పృథ్వి మూడడుగులడుగుమి
బలి నీకోరమనీక భయమేమి లేదు । అంతట దానవునకు హర్షంబు గుమ్మ
డించెలు మానక విచారించకుండ । మంతనంబున నుండె మంచిదివ్యత్రి

ఆనిపీడొక్కని ఆవడుగటుచనియె । గొడుగుజంద్యము చేతనుప్రాచకోల
చిన్నిమడుగూగోచిమనిబొట్టునుమట । చిటిచిట్టిఅడుగులతో శ్రీకృష్ణమూర్తి
ఘుల్లుఘుల్లునపాదగజ్జెలటుమోగ్రయ । వామనుడువేంచేసె రాజశాలకును
రాక్షసరాజగుబలిచక్రవర్తి । చెలగికూర్చున్నాడుసింహాసనమున
సమస్తదేవతలుసప్తమహాఋషులు । బ్రహ్మరుద్రులుఅష్టవసువులును
గరుడగంధర్వులుఅప్సరస్త్రీలు । కొలువునమండిరికొమరొప్పగాను
వచ్చినపరమాత్మవారెల్లజూచి । సాష్టాంగదండంబుసరగుననుజేసి
అర్ఘ్యపాద్యంబిచ్చిఆసనంబిచ్చి । శంకరుడొవిష్ణువో వాయుదేవుండో
ఇంద్రుడోచంద్రుడోయాకుబేరుండో । యజ్ఞనారాయణుడో వేంచేసెననుచు
చెలిగిపూజలుచేసిప్రస్తుతించిరి । యిచ్చెమంత్రాక్షతలారాక్షసేశునకు
మేలిమితో అక్షింతలు శిరసందుదాల్చి । దేవదేవునిచేతదీవనలుగొనెను
ఓరాజదేవేంద్రఓకీర్తిసాంద్ర । పరమధార్మికుడవనిప్రజలుచెప్పంగ
అష్టదిక్కులకీర్తివిలసిల్లుచుండ । వేదవిప్రుడనేనుబాలుండనగుట
దానంబునిన్నడుగవస్తినిచ్చటికి । వినియారాక్షసరాజువడుగతో బలికె
బాలుడవుజూడబుద్ధులుపెక్కునీకు । తల్లెవరుతండ్రెవరుపూరేది తెల్పు
నీపేరుమెవరోనునిజముగాదెల్పు । అనగవామనవిప్రుడసురరాజుతోను
పెక్కుదేశంబులుఒక్కలోకంబు । నిక్కముగనేనుండునిర్మలభూమి
భూమిఆకాశంబునాకుతలిదండ్రి । చుట్టాలుబంధువులుపృధ్విలోలేరు
వారలునాకుగారు నేనొరులకాదు । శరధియందువనందు చోటెందులేదు
దశదిక్కులానుందు తరముగాకుండ । విశదంబుగానన్ను వివరింపలేరు
కనిచూచినాఘనులెవ్వరులేరు । కనుపిస్తూనానిజము ఘనముగానీకు
మనుజమాత్రునిగాను మదిసెంచవలదు । తత్వమార్గంబెల్లదనుజపతితెలసి
మందరగిరిధరుడో మధుసూదనుండో । కాకుంటెఒకచిన్నబాలునివలెను
యాచ్ఞకంబులకోరయిట వచ్చువాడే । యిస్తునువిప్రునికిఅఖిలభాగ్యములు
అనుచుమదిలోదలచి ఆవడుగుబిలచి । దానమడుగుమునీవు కోరుదానువిశ
పృధివిమూడడుగులు దానమ్మియిమ్ము । తడవుసేయగవలదు త్వరగానుబంపు
అనవిని బాలుని యావనముజూచి । కోరుడవుబాలుడవు కష్టమెరుగవుగ
సతిసుతసంపదలు నీవెరుగవయ్యా । భూములుపురములు కనకసౌధముల
సింహాసనంబులా గజఅశ్వములా । యిన్నిసంపదలు ఇంటనిండియుండ
కోటిఒకవజ్రదానంబుయిపుడు । మూడడుగులాభూమి నీకేమిచాలు
సభవారునవ్వరా ఓవిప్రవరుడ । అనియిట్లుదనుజేశుడా సభలోనబల్కి
చిరునవ్వునవ్వెను శ్రీవిష్ణుమూర్తి । అధికదానంబడుగ ఇలపాటిగాదు

భూములుపురములు మేలందలములు । నవరత్నసొమ్ములు ధాన్యరాసులును
నాకేమికొరగావు ఓయిసురరాజ। నేనడిగినదిచాలు నాకనుమనపుడు
పృధివిమూడడుగులు దానంబుఇమ్ము । ఇచ్చేటివాడవిన్నదుగనేటికిని
వేదంబులందున శాస్త్రంబులందు । తర్కమీమాంసల తగపరీక్షించు
చెప్పన్నవిద్యలు యెల్లశాస్త్రములు । నేర్చితిపిఒకటయినదిగబడకుండ
జగములోపలపుట్టి విప్రబృందమునను । తడయకనేనిస్తు తగినపరీక్ష
దానంబునాకిమ్ము దనుజేంద్ర యనిన । సకలగురువగుఆశుక్రాచార్యుండు
సభలోనికిరాగరాజాతాజూచి । చేసెనువందంబుచెయ్యెత్తిఅపుడు
మొక్కులుగైకొని మునియిందీవించి । ఓదానవాధీశఓధర్మరాజా.
దాతృసేశ్వరాఓబలిచక్రవర్తి । నామాటవినవయ్యనాకనివాసా
బాలుడుబ్రాహ్మణుడుబహుతంత్రవాది। మాయలుమంత్రములుబహునేర్చినాడు
ఆదివిష్ణునాథుడవతారమూర్తి । మత్స్యమైసోమకునిమర్దించివాడు
కూర్మమైకుధరమును కుదురుగానిల్పె । వరహావతారమై హిరణ్యాక్షునిజంపె
నారసింహుండై ప్రహ్లాదుగాచె । వామనరూపమై వసునజన్మించి
నిన్నువంచనజేయ యిటకొచ్చినాడు । పొట్టివానిగావపుట్టెడుబుద్ధి
దిట్టతనమునవీని రుజుపించివిడువు । గిట్టిగాయితనికిదుపులోపలను
సృష్టించెనుమిబ్రహ్మచపలబుద్ధులును । వినుబట్టి పాతాళమునుబెట్టుటకును
వామనుండైపుట్టె వనజనాభుండు । దానంబుఅతనికినీవివ్వవలదు
పట్టియుక్తులుచెప్పెంపుమివాని । గట్టిగానీపాలిగాలకింపగుడు
ఆచార్యపలుకులు ఆరాజువినియు । తపసితో యిట్లని తాజెప్పదొడగు
వోవిప్రపుంగవా ఓమునిచంద్ర । నీవుచెప్పినబుద్ధులు హితముగావయ్య
లోకాలకర్తగు శ్రీవిష్ణుమూర్తి । ఆదినారాయణుడు అఖిలరక్షకుడు
కోరిదానంబడుగ నేనిస్తునంటి । యిచ్చటపావముల మూడుఅడుగులు
సత్యంబుగాయిస్తినో తాపసేంద్ర । యిచ్చెదననివొప్పి మారుమాటాడ
సత్యంబుగప్పితేబల్కపాడగునే । నారాయణుడుక్రిందు నేనుమీదాయె
పాయషక్తుల ప్రబలదానంబు । శ్రీవిష్ణునిచ్చిసిద్ధిబొందెదను
అనిపల్కరాజామాటాడించి । గురువుమెల్లగా వెంచేసె మేడలోకి
రత్నాలగద్దెయుగంగుగావేసి । ముద్దులబాలుని కూర్చుండబెట్టి
సభలోనందరుచూడ సంతోషమునను । బంగారుపళ్ళెములో పాదుకలనుంచి
కనకకలశంబుతో వుదకంబుదెచ్చి । తనసతిచేతితో పదగవడ్డింప
భక్తితోగలిగినా పార్థివోత్తముడు । కృష్ణార్పణమని వటుకుబల్కగను
సభవారునవ్వితి సామాన్యడనుచు । మూడడుగులాయిచ్చె దానశేశ్వరుడు

పంచశరుడ నీకేజయుతు । పరగంగా మమ్మేలినిస్వామి
గజ్జరూపున వెసబోయి । ముదముతో మూడడుగులనడిగి
బలికిశిరస్సున పాదములిడిన । పరమాత్మనీకేజయుతు
జనకునికూతురు జానకిదేవి । దేశాయిలు మిమ్మున బొగడ
వినుషమ్మున పెండ్లిఆడిన । నీలవర్ణుడా నీకేజయుతు
కలికికాంతల అభిమానమ్మున । ఘనముగమీరటు కొల్లలుగొంటిరి
కలికావతారుడ మముకరుణించు । కలకలనవ్వుచు కమలనాభుండు
అంబుజాక్షితో ఇట్లనిబల్కె । పాడిచిన పొ్రద్దుబోవలెవనకు
వేడుకజూదం బాడుదురమ్మ । అనుచును తననాథుండిలువ
వార్షించెనుగా లక్ష్మీదేవి । గజవరదుని కరములుబట్టి
వగరాంగణపు నగరికిజనిరి । చతురంగపు శాలలలోను
చిటిచాపలు శ్రీహర్షమునబరచిరి । దళపడియింతిట సంతోషమ్మున
గూర్చుండిరిగా పరుపులమీద । కొండితో జేసిన సాగటాలేమొ
వెన్నుడుతాను దెప్పించె । రత్నాలసాగటాలేవొ లక్ష్మితెప్పించె
బంగారుసాగటాల్వాళి పద్మనాభుడుబరిపించె ।
ముందరపందెము వాదీయనుచును । మురియుచుశ్రీవిష్ణుడుబల్కె
అతివతోను అడగవచ్చి । అభరణమ్ములు సొమ్ములుబెట్టె
చేర్పుతో మెంలనూళ్ళుబెట్టె । మేలయింసా పతకంబుబెట్టె
యూరమునయూత్తిర జంధ్యంవేసే । మెలనూల్లు మొ్రయుచునుండే
మోహనాకారువికపుడు । అతియగుదేవుండపుడు అందెలుపాదములబెట్టె
వక్షస్థలమునా వనము లా । అచ్యుతుడుతా ధరియించె
చెక్కుటకుండలములు । ధగధగలాడుచును మెరయగను
ధగధగలాడే ముత్యపుబోగులు । చెలువులను మెరయగాను
ముద్దుముఖమ్మున ముత్యపుతిరుమణి చక్కగతాను ధరియించె
కెలవంకబోలు కెన్నుదురువినాదను । చంద్రవంకాతిలుకందీర్చె
పింగిలిపింఛలతలకూజుట్టి పీతాంబరముపైనిగప్పె । వన్నెకాడేకల్కివిష్ణుండు
వల్లెవాటొప్పగ వేసేతాను । సొక్కుచుపోలుచు వేణునాదం
చక్కగానుహరియూబట్టె । కన్నులుగీటుచు సన్నలుజేయుచు
పారిజతాండవమాడుచును । దేవేంద్రాదిదేవతలెల్లా దేవదేవునిచూడవత్తురు
అకూ్రరుడుమొదలగు । హరిదాసులెల్లాగూడి
భక్తితో భోగపు్రదులు । పద్మనాభుని జూడవత్తురు
నాతులారా సాధునికొల్వుడు । నవ్వుచురారే కొమ్ములారా

యిట్టిదేవునిహోమలుఅంతా । అప్పుడయిన జూచితిరిమీరు
అంతటనూ అలక్ష్మిదేవి । ఆభరణములు సొమ్ములు పెట్టె
నేప్పుతో మొలనూళ్ళు బెట్టె । మేలయినా పతకంబెట్టె
పచ్చలకెంపుల బన్నస్వరములు । మెడనిండా దిగవేసెనుచాలా
మన్ననియానుచములనడుమను । చెన్నమరిన చంద్రహారంబెట్టె
రత్నాలుదాపిన రవికాదొడిగె । ఆభరణమ్ములు సొమ్ములుబెట్టె
నాతినాసికమ్మున ముక్కెరబెట్టె । నవరత్నములగీలించిన
వడ్డాణం నడుమునబెట్టె । సొ[illegible]భూషణాలువుంచె
పద్మనాభులదేవికనుక । కంకణములుతూటిగాజులుమురుగులయిన
కరములమంచె । చక్కానగుసందటిదండలుబెట్టె
సర్వేశ్వరులదేవికనుకా । సంపెంగ తైలంశిరసున బెట్టికొప్పుదిద్దె
కొప్పామీదరత్నాల । కొప్పాగొలుసులుంచిబెట్టె
ముద్దుముఖమ్మునముత్యపుతిరుమణి । ముద్దులుగుల్కగతానుబెట్టె
చక్కనగునుదుటిమీసను । చంద్రవంకన తిలకందీర్చి
పణతీతనపాపిటయందున । బంగారంపుమాణికముంచె
కలికీతనకన్నులమీదను । నిగనిగకాటుక మెరయగను
యిత్తిగతీవంచా ఆదిమక్కాపగడా । అద్భుతకఅచ్చోంగ అతిశారయనుచు
జవ్వనుచూ జూడనుచూ । పారికపలుమారు
బలువైనపందెములను । పద్మనాభులదేవివేసె
ఆటలతోవారూ । పొద్దుబుచ్చుచుండగను
పాపకర్ముడు । పాండురాజులఘాతకుడు
ప్రజలద్రోహుడు దుశ్శాసనుడు । ద్రౌపదినిసభలోన
వలువలిమ్మనివిప్పగాను । అన్ననీవేదిక్కు అనుచుఆద్రౌపదిఅపుడుబల్కె
ద్రౌపదిపల్కులు కృష్ణునికెంతో । నాదంవలెవినగావచ్చె
అక్షయమనుచూపొంచికలేయా । కోట్లపాడుగునా చీరెలుపడెను
మేట్లకొలది రవికెలుపడెను । కట్టలేకను ద్రౌపదిదేవి
విప్పలేక దుశ్శాసనుడు । స్వామిమహిమయిది యనిదలచి
ఇచ్చేటివాడు విశ్వంబరుడుండగ । విప్పగనెవరితరమయ్యా
చుక్కలపొడుగున రానులుచీరలు । చొక్కమైనరవికెలతోళ్ళు
కొలువుకూటమున కలవారెల్లా । పట్టుచీరెలు బంగరురవికెలు
కట్టుకొనిరవీరజాక్షులు । పంకజనాభుండైన శ్రీకృష్ణుడుపక్కననవ్వె
...ాధుడనీలా నవ్వినవిధము । నాకెరిగించుమిశ్రీకృష్ణా

నీరజనాభుడ నవ్వినవిధము । నీతితోడుత నెరిగింతూ
కమలనాభుడ నీతోడ బొంకి పోచిక వైచితి నా
భువననాభుడ నవ్వినవిధమూ । బొంకక నాతో నెరిగించు
నాతీరూపువల్లని గాని । నాకూతగదని నవ్వితి రా
వనితాతవంతవచ్చినదాని । వలచుటతగదని నవ్వితిరా
పదహార్వేలనుగువలగోపల । పణతీతగదని నవ్వితిరా
రుక్మిణిమొదలగు పట్నపుదేవికి । పోంకము గాపువు దచ్చిస్తే
పంకజాక్షి సత్యభామా । పల్కాని అందుకు నవ్వితిరా
హరిమీగు అచ్చటికేగి । ఆభామకోపం దీర్చి
శిరిశిరితో నేనక్షము దచ్చి । వేసినందుకు నవ్వితిరా
యెల్లపసులలో కెక్కువైన । రుక్మిణికివరములి య్యా
పెక్కువినమ్ముల సిరిముమునపొందిన । మక్కువలకు నవ్వితిరా
ద్రిమ్మరి గానవు నీవు పతులను । దిట్టవయిచెట్టాబట్టి
చెంనాబిడ్డల చెలులముతో తెచ్చి । నీచంవం గాదునుమ్మీ
హెచ్చవు నానీకులను । తచ్చన సేయకువో శ్రీకృష్ణా
తచ్చన గానవు నీవూ కృష్ణా । హెచ్చులు కామిక నేబదువా
యెన్ని నేర్చుకుంటే నేవు । యింతుల నెల్ల చేపట్టి
లోకమ్ముల అన్ని సాదునబట్టి । మోగ్రి రాగునా
కారగుణంబులు చోంతనంబులు । యెన్ని నేర్చెనో మాయన్న
అనూమాఆలక్ష్మీదేవి అచ్యుతులను । దాయగవచ్చి
చిరునవ్వులునవ్వుచును । మురయమ్మ శ్రీకృష్ణునికొంగుబట్టె
ముత్యాలహారం మెరయా । మురహరుడు ముదితితోన వ్వ
పతికొంగుబట్టినవారికి । తప్పులేదా నరణిలోన
నాకొంగుబట్టితే మాకు । నేరములు యేమయె నాగలనా
నేడుగా దేవికొంగుబట్టి । బహుగాకాలం ఆయె నేలక్ష్మీ
తరుణీనా చిటికనాబట్టి । తరుణులచేతా పూజలుగొంటివి
గోవిందూ లక్ష్మివని । కోరికలన్ని యడుగుచును
పురుషోత్తములా దేవీ నానిభూజన మెల్లా । తెలుగొమ్మురుచిక్కితినీ చేతయునుచూ
చిరునవ్వులునవ్వుచును । పక్కవహరి చెక్కిలినొక్కి
మరియచుము నితను ముద్దిడగా । నవ్వినపురుషుని బంటన బెసుదుర
యేలోకమునందయునస్త్రీలు । నాతిరోనన్నూ బందవబెడితివి
నేడు నాకు కానుకచ్చు । నాతిరో నేను నవ్వినవిధమూ

వామనావతారమున బలిని మూడడుగులడిగి । త్రిభువనమాక్రమించితి గాని
గోపిదేవి నేను కొంగ నెరుగ ।
పరశురామావతారమున వసుధ రాజులనెల్ల । యిరవై యొకమారు బరిమార్చి
పృథివియేలితి గాని గోపిదేవి నేను । కొంగజూడ
శ్రీరామావతారమున సిరులు అనుభవించి । దురాత్ము రావణుని త్రుంచియేలితి గాని
గోపిదేవి నేను కొంగ నెరుగ ।
బలరామావతారమున పుడమి నాగటి నెత్తి ।
క్రూర దైత్యులదునిమి ధరణియేలితి గాని । గోపిదేవి నేను కొంగ నెరుగ
బుద్ధావతారమున ముద్దులు జూపించి । గొల్లముద్దియలతో ఆటలాడితి గాని
గోపిదేవి నేను కొంగ నెరుగ
విల్లు నువిరచితిని మల్లులజంపితి । రణయుద్ధములోన కంసుజంపి
కాళింగిమడుగొచ్చి కలికి నాగులయొక్క । కన్నులా విషములు పిక్కటిలగా
పడగమీద పాదాలు పరగ మోపియు నేను । తాండవం చేసితి తరుణి అప్పుడు
కొంగయొట్టి దొరొయ్యగ గోపిదేవి
యేడు సముద్రమ్ములూ యేకమయి పారగా । అక్కడా అమ్రియాకుమీద
వటపత్రశాయినై బవ్వళించితి గాని । మగువరో కొంగ నే నెరుగమ్మ
నన్ను వెరపించేవు నలినాక్షి కొంగనుచు । కొంగ జూపవె తల్లి కొంగ జూపు
అని నోరు తెరవగా అఖిల బ్రహ్మాండములు । తనయుని కుక్షిలో నిండియుండెను
పారేటి కాల్వలు పర్వతమ్ములు చెట్లు । పాతాళములు పెక్కు బ్రహ్మనదులు
చంద్ర సూర్యులు సప్త సాగరమ్ములును । త్రిభువనంబులు జూచి యా యశోదా
భయమంది వెరచియూ తననుతునకిట్లనెను ।
నాయన్న నీ మహిమ బ్రహ్మాదులెరుగరు । వెన్న దానిన్ను నే కన్న బలిమి
కొంగంటె వెరతునని మరచి పల్కితి గాని । మురవైరి మూర్తి మాత్ర మొక్కెదాను
తనతల్లి వెరచుటకు తననోరు మూసుకొని । మందకును గొంపోవ శిశువు నన్ను
అని పల్కు మాటలకు వద్దు శ్రీకృష్ణమ్మ వద్దు పురుషోత్తమా వద్దు వద్దని తల్లి మళ్ళి చెప్పె
ముగుద శ్రీకృష్ణమ్మ నుయ్యాలలో వుంచి । భమిడి వుయ్యాల చేరు పరగ బట్టి
జోజో మత్స్యావ జోజో కూర్మావ । జోజో అచ్యుతా జో అనంతా
శంఖుచక్రధరా అని యిట్లు యశోద । అంకించి పాడగా అతివలొచ్చి
పెరుగుడు పెరుగిడి యిరుగిళ్ళకు పోయినాను । తరికడవతా పెరుగు తాగిపోరో
అని యిట్లు యశోద అంకించి పాడగ । పొరుగింటి వనితతా బోరున వచ్చి
పాలిడి పాలిడి యిరుగిళ్ళకు బోయి నాను । యీడ ముంతల పాలు తాగిపోరో

యేమిసేయుదుమమ్మ యచ్చటికిఁబోదుము । పందుంనేతికివున్న వెన్నదినెను
అంతట్టఒకచెలియ అతివేగిరంవచ్చి । చెప్పఁడుడిగోపెదేవి చెఁకనిజెట్టదుగా
మనమెంతపించినా మాధవునిచరియలు । పానపేలేదమ్మగోపిదేవి
పోదాముసదరమ్మ ఆసామితోనునకు । రారాప్రశేలయిక వనయిండ్లకు
యీరీరుజలజాక్షులందరును జెప్పగా । వినిగోపిదేవినాకొడుకుముచ్చకాదరా
వారిజాక్షులార మీయిండ్లగలమంచి । నెయిపెరుగులుబోసిబాలుపెంచు
కడుమంచిదాదులను అచ్యుతులకు । కాపుంచిగొల్లకజకెను గోపిదేవి
తమతల్లితోనింపలు తనయుడుగుకెరిగి । వారికంటేనుముందుతానుబోయి
యేయిల్లుజూచిన పాయిసప్రుకడసలూ । యేయిల్లుజూచినా పాలునెయ్యి
యేయిల్లుజూచినా పెరుగులూమీగడలు । వెన్నబాట్లతోను నిండియుండె
ఈరీతిగానుండి గోపిదేవియూరిఖల్లి । గొల్లవాడలుదిరిగెను
గలకుంభములన్ని కలశలన్నియునిండె । దండితీరములతోను
కలశతో ఒకవనిత జలకంబుసేయూని । యశోదకాళ్ళకడుగుటకివ్వగా
కలశలో నిరంత క్షీరంబులయిపోయి । సిగ్గుపడియూచేడె శిరసువంచె
వెన్నదిన్నాగుర్తులా కళ్ళజూపారమ్మ । పాల్దాగినదుత్తలాజాడలేవే
యేపాలుయేనెయ్యి యేర్పడకదిన్నాడు । నాకొడుకుముచ్చనైనిచ్చెదను
నీకొడుకుముచ్చగాడచ్యుతుల. యోగ్యుడూ । ముచ్చలము మేమానీముగుదలనిరీ
కాంతలంతాగూడి కట్నాలయిచ్చిరీ । మళ్ళినగరికిజనెను గోపిదేవి
పులికాలుపులిరతు పాంబ్రాణిగుగ్గిలం । అగరుధూపములచే దృష్టిదీసి
ముద్దాడిపాలిచ్చి సతులచేతికివ్వ । గొల్లచేడియలెల్ల ముద్దుగొనిరీ
ఆదిత్యవారమున అష్టమీదినమందు । బాయకను ఈపాటపాడినావిన్నా
భక్తిముక్తులుగల్గు పరమాములుగల్గును । పాటచెప్పెడుమీరుబాయకండి

# 36 సీతాదేవి వామనగుంటాలాట.

వామనగుంటాలాడుదాము వనితజానకీ ।
పాముజవరదారావయ్య నాస్వామిరాఘవా ।
ముత్యాలవామనగుంటాల పీటలుంచూకొని ।
ముగుదసీత మనమిద్దరమాడుదామటే ।
వజ్రాలవామనగుంటాల పీటలుంచూకొని ।
వనితమనమిద్దరమాడుదామటే ।
కెంపులావామనగుంటాల పీటలుంచుకొని ।

సొంపుతో మనమిద్దర మూడుదామటే ।
రత్నాలవామనగుంటాల పీటలుంచుకొని ।
రమణిసీతా మనమిద్దర మూడుదామటే ।
పచ్చాలవామనగుంటాల పీటలుంచుకొని ।
పణతీమనమిద్దర మూడుదామటే ।
నీలాలవామనగుంటాల పీటలుంచుకొని ।
నీలవేణి మనమూడుదామటె ।
రాముడుకదలెను రత్నంపుచవికెకు రమణిసీతను గూడుకొని।
కర్ణకుండలములు కదులుచుండగాను కాకుత్థ్సతిలకుడాడెను ।
పచ్చలబావిలీలుగదల పణతిజానకియాడెను ।
రెంచాము ముంచాము ఆవులనూ సీతదీసెను ।
పసిడిడబ్బీలన్ని పందెములుగెల్చి పరమాత్ముడేదీసెను ।
చిన్నబోనుయేలనీవు చెలియజానకీ ।
విభుడుయిళ్ళమన్న నందాలన్ని తానేదీసెను ।
అఖిలబ్రహ్మాండములే ఆటపీటములా ।
పలుధర్మములచేత ప్రజలరక్షించూటె పసిడిడబ్బులా ।
సఖియనీతో ఆటనేడుసంభ్రమాయెనే ।
ఆటచాలానికనూ చెలియ పీటగట్టువిూ ।
పీటగట్టుమనిబొంకి పారిపోదురా ।
ఆటకరువైవేలుయివ్వవలె కలిగున్నవోలి కట్టక అడుగుదాటికదలనివ్వనూ ।
నిలువునిలువుమనుచు సీతఆజ్ఞచేసెనూ ।
స్వామిపైవోణిఅయిన పట్టుకుఅసెను ।
పుడమిలో నెవరయినా ఆటవోడితె ।
కానుకీపమిత్తురుగాని వేలుయిత్తురా ।
నేనుగెలిచినా వోడినానీసొమ్ముగాదటే ।
నీవుగెలిచితేను నాసొమ్ముగాదటే ।
భరతలక్ష్మణాలువింటె నిన్నుగేలిచేతురే ।
నావారంతావింటే నవ్వుకొందురే ।
గాలుచాలుసఖియ జాణవందురే ।
దొడ్డనేర్పరివందురే ।
అయితెసీతా నాచేతిలో యేమివున్నదే ।
ముప్పదికేలాడిముత్యాలుపతకాము ముగుడపుచ్చుకో ।

పదితేళ్ళున్నవి బంగారుబటువులు పణతిపుచ్చుకో ।
చంద్రకాంతులదీప్తి శోభిల్లుచున్నట్టి కిరీటమున్నదిపుచ్చుకో ।
మామగారునాగవల్లినాడిచ్చిన ముద్రికయున్నదిపుచ్చుకో ।
పడకటింటిలోన పదిలక్షలుజేయు పానుపున్నదిపుచ్చుకో ।
అయితేసీతానాచేతిలోను యింకాయేమియున్నదే ।
కోసలరాజ్యమంతా కోమలియున్నది యేలుకోగదే
గొల్లదాన్నికానుస్వామి పల్లెకేగిచల్లఅమ్ముదు ।
అయితేసీతానాచేతిలో నింకానేమియున్నదే ।
తొడుగులుగుర్రములు హెచ్చుంపలములున్నవే ।
పురుషరాజవునీవు భూమీశుడవుగనుక యెక్కుటకునీకెదగుగాని ।
యాచకొట్లునాకేలజెప్పేరు యికమీరుస్వామిరాఘవా ।
నవ్వుకొనుచు సీతశెచిపోయెను ।
అకుగంటం స్వామిచేతికిచ్చిరీ ।
చైత్రశుద్ధనవమినాడు ఓడినందుకూ ।
చిల్లరనగలన్నీదీని సీతవోలియిచ్చేను ।
అరువైవేలుకాంతకు అరణమిచ్చెను ।
నవ్వుకొనుచుసీతతాను మాపెకేగెనూ ।
కౌసల్యాదిఅత్తలంత చూచినవ్విరి ।
భూపుత్రిమీదంపతులలో ఎవరుగెల్చిరి ।
రమణినీవుచోడివాన చంద్రకోడనా ।
మీకొడుకుగడుసుగనుక డిబ్బదీసెను ।
కానుకలందియపుడు మీకుతెచ్చియిచ్చెను ।
మాశివిదయాశరకీర్తియూర్మిళమున్నలందరు మాబావతోడు ।
గెల్పులన్ని విన్నవించుచు ।
అనగవినవ్వునవ్వి బావతోడి పదివేలుకట్నమిచ్చేను ।
భరతశత్రుఘ్నులంత పణతిని పరిహసించిరీ
అనుమదంపతులుకలిసి అధికసంతోషమునపొందిరి ।
పుడమిలో ఈపాటబాడిన పుణ్యకాంతలు ।
సీతారాములవరమునగూడి వర్ధిల్లుచుందురు॥

# 37 శివుడు పాలారగించుట.

మహాదేవుడను పేరశివభక్తుడొకడు । ఉదయానపొరుగూర కేతెంచదలచి
పిలచెనుతనముద్దుపట్టిదగ్గరకు । పొరుగూరుకేబోయి పొలతినేవత్తూ
మాయమ్మమాతల్లి మాచిట్టిబొమ్మ । మీబొమ్మలకువెల్ల పొత్తికలుదెస్తు
కొమ్మపొరుగిళ్ళకు పోబోకుమమ్మ । బాలలతోగూడి కయ్యాలుదేకు
పూనినమావ్రతం తప్పబపకుండ । గుడికేగినిత్యమ్మ కుంచెడుపాలు
అనుదినంశంభునకు నైవేద్యమిమ్మ । అనివిన్నవించియు జననిజనకుండు
తర్లివెళ్ళంగాను తరలాయతాక్షి । కాళ్ళుముఖమునుగడిగి స్నానంబుజేసి
శుచిభూత్రిమెతాను శిగనువిడిచి । గోక్షీరములన్ని మరగంగగాచి
కొలిచికుంచెడుపాలు కొలలోనుబోసి । కొలచేబూని శివుద్వారంబుజొచ్చి
పాలకొలశివుని ముందరబెట్టి । అరగించుమిదేవ హరహరయనిన
అరగించకహరుడు నుయుగునసుదాగ । మరివచ్చిచూచి నామతరిగ్గకుండె
క్షీరంబుచేకొనవు యేలసర్వేశ । క్రాగుటకుచాలవా కాగనులేదా
కాటనబోయెనా మీగడలేదా । పాచైనగలిసెనా పరమాత్మదెలుపు
కొలవెలితాయెనా కుంచెడూశివ । పుట్టిమీదటికలోవున్నదినెయ్యి
అదిఅయినవడ్డింతు నీవారగించు । చిన్నటునుమీదను అరిసెలున్నవిగ
అదిఅయినవడ్డింతు నీవారగించు । పినభద్రుడుజాతరవేడుకలలోను
పాయసంబెట్టింతుబంగారుతండ్రి । సోమేశ్వరునిపెళ్ళి చూడబోతాము
పాలారగింపుమీ ఓపరబ్రహ్మ । యెన్నివిధములయేడిన యేలదయరాదు
కటకటాపోయికన్నీరునించి । దిగులుపడిధరగూలి మూర్ఛలునొంద
కాలుచేతులుకొట్టి కలువరంబొంది । తెప్పిరిలితెలిసితాచప్పునులేచి
భుజియించుమని తెల్విగుడ్లెర్రజేసి । యీపాలుత్రాగవని మాబాయువింతె
చంపుదురుయికనన్ను సందేహమేల । యెప్పటికినాముప్పుతప్పదుయనుచు
యిచ్చటశిశుహత్యయిపుడుజరుపుదును । అనియాడుచెలిపల్కులాలించిగౌరి
కటకటశిశుహత్య మనకేలనయ్య । పాలారగించుమాపరమేశ్వరుండ
బాలభక్తికిమెచ్చి ఆసాంబశివుడు । కోలతోపాలెత్తి తానారగించె
నన్నింతవేచితివి చిన్నదాన్నగుట । కరకంతయీమాట గైకొనకున్నా
కొట్టుదునాచేతి కుంచెకోలతోను । అనిబల్కెఆకన్య యిల్లుచేరంగా
పూరికిబోయినాతల్లి దండ్రులు । యెదురుగావచ్చిరా బిడ్డనుజూచి
యెదుండిన పీవి యెలనాగచెప్పా । బాలయక్కడాసి అడిగె పీవి
మీరుచెప్పినట్లు శివునికేపాలు । అరగింపుచేసి అమ్మయిపుడొప్పి

ఈశ్వరుఁడురెచ్చేట పాల్దాగునమ్మా । నక్కకుబోసితివా కూలసేసితివా
ఆడేటిబాలలకు బోసివచ్చితివా । శేషయినచూతాము యీకన్యమహిమ
అనితేఁబోయుచు తెల్లవారంగ । మరునాడుతాలేచి శివభక్తుడంత
గోక్షీరములుగాచి కొప్పెరలబోసి । బోరుననమాళ్ళివు ద్వారంబుజొచ్చి
తెచ్చినఆకోల శివసన్నిధుంచి । అరగించుమిదేవ మారహరాయనగ
చిరుతబోయీమారని సన్నిధినిల్చె । అరగించుటలేదు ఆసాంబమూర్తి
ముక్కంటిబిల్లడే ముద్దుగుమ్మా । లింగమూర్తియు అరగించడిప్పుడూ
ఓబాలయొన్నటికి పల్లడేపాలు । బొట్టజీల్లునిస్సు పోడుతుమయించు
శిఖాగ్రినమతినపుడు శిక్షజేయంగ । హాశివశంకరా మారహరాయనుచు
బాలస్మరియించెను కైలాసపతిని । పార్వతీపతితన పక్రింబుతెరచి
కన్యనభక్షించె కడపీగ్రతోడ । కూతురుమహాత్మ్యంబు జూచిజనకుండు
అధికదుఃఖముతోడ సతికినిదెల్పె । అతిశోకమునతల్లి వాడలుచువచ్చి
కూతురుగుణములు మదినిదలపోసి । చిత్తమ్ముఅంతాను శివునిపైనుంచి
చక్రధరులకుతన కార్యమ్మువిక్క । బొమ్మలనాడకే నాముద్దుగుమ్మ
చెంగునారావమ్మ ఓకలాకంఠి । గుజ్జనగూడువందు చెలులతోగూడి
నీవాడుబొమ్మలు రెవ్వరికిస్తు । పసిపుత్రిబాలాది బంగారుబునీవు
వినువిడచిమేమెట్లు జీవించగలము । సంతతముకైవల్య పదవిచేకూడె
అనుచుశోకించి దంపతులుయేగ । యీపాలమంజరీ పాడినావిన్నా
పంచపక్షులబుల పకనజేసినమా । కైలాసవాసులయి ఘనముగానుందు
శంకరానీపాద సన్నిధినిచేర్పు । జనులనందతిసేల జనలోకసంద్య॥

## 38 శకుంతల సీమంతము.

దుష్యంతునిరాణికిని । దోయజగంధి శకుంతలకు
గర్భపుచిన్నెలు గలిగినతోనే । కాంతకువచ్చెను కాంతులుచాలా
అన్నముయించుకతినదూ । ఆకలిసలుపదు శోకిస్వరమున బెదరు
కోపలికోరునుఫలపు । అశ్రమవాసులగనదు ఆసించదుతానతిరసము
చింతచిగురులనగోరు । చేమంతులనటకనబోదు
పుల్లటిఫలములగోరు । పల్లదునపుపనసాని
ఓకలింతలతిఘనమాయెను । ఓర్పులకరుసాయెను
సతికబట్టలకెత్తుగకెట్ట । పలుమారుపవళించు
చిక్కనిక్రేమునన్నంబోయె । నడుములావుగాపాతికయమార

ముఖమువెల్లనై ముదితకయెప్పె । నింటియురంబులు నింపుగపెరిగె
ఆచందముగని చెలులలా । ఆయింతికితామిట్లనిరి
అన్నముతినవించుకైనా । ఆకలిగాదని పల్కేవు
కోకిలస్వరముకై చేదచేదవు । కోరుచు మెక్కేవు నుపులును
అలసట వాకిలిలగనవు । ఆసించవునతిరసము
ఓకిలింతలతిఘనమాయె । ఓపికలేకనుపోయె
బట్టలునెత్తుకబరచి । పవ్వళింతలతిఘనమాయె
గర్భచిహ్నములివిగావా । కామినిదాచెదవేలా
చెప్పెదమిప్పుడె చేరియా । చెలగుచునాతి జవ్వనకు
అనుచుసతులును పరిహాస్యములాడ । నతివకుతామసమెచ్చె
బొబ్బరిరొట్టెలుగోరె । పాలతులు తెచ్చిరిచాలా
విప్పరిపేలాలడుగా । నింతులవేసిరివేగ
ఊచబియ్యమునుగోరా । నువిదలు తెచ్చిరిచాలా
కందవడియములగోరా । కాంతలువేచిరివేగ
పుల్లరేగులనుగోరు । పూబోణులగనబోదు
రెండకాకలకుయింతి । నడలుటగనపూబంతి
తల్లికిజెప్పుదమనుచూ । తక్షణమెగౌతమికడకేగి
చేడెగుణంబులుజెప్పె । నెరపుమనిరిసీమంతము
రాజాజ్ఞపేటకైవచ్చి । రమణితోగలసిననాడె
గర్భమునిలిచెను సుతకు । కబురంపుముఋషిసతుల
అనవినిగౌతమివేగా । అతివనుజూచెనుపేరిమా
హర్షమొందుచునుచాలా । అతివకుజేసెనుసేవ
అమరించెనుపండ్లూ । తరులఫలంబులుగోసి
తరుణికియిచ్చెనుచాలా । చందనతరువుకడకేగి
గంధపుచెక్కలుదాతెచ్చి । బండరాళ్ళపైరాచి
భూమినిదీసెను గంధంబు ।
అడవిపుష్పములనుదెచ్చి । అతివకుదువ్వెరితలను
గోరోజనములదెచ్చి । గొబ్బుననుంచిరినుదుట
పర్ణశాలయందంత । పడతులుబెట్టిరిముగ్గులను
మామిడాకులనుదెచ్చి । మగువలుగట్టిరితోరణము
గౌతమియందరకపుడు । కబురుబంపెను రమ్మనుచు
సీమంతంబునుచేయ । చేరిరిచెలులాతోట

ప్రేమతో యొకసతియపుడు । బెట్టెను బేలపువుండలను
ఇంతిరొక్కసతియపుడు ।
ఇచ్చెను నివ్వరిటుటుకులను । వాతిరొక్కసతియచట
నయముగ బెట్టెను దుంపలను । కాకుంతల కొక కాంతి
కాకంబులు దివిపించె । పృధ్విదివెదుయీపతికి
పుట్టెను పట్టపురాజనుచు । మంచిమహూర్తమునందు
మగువను కూర్చొబెట్టి । ఇంపుగ పాడుచు సతులు
ఇచ్చిరి మంగళహారతులు॥

# 39 శ్రీ కన్యకామ్మవారి పాట.

శ్రీరాములకు మ్రొక్కి సీతకును మ్రొక్కి ।
గణనాధునకు మ్రొక్కి శరకంతు మ్రొక్కి
మునులతో సూతుండు మును చెప్పినట్లు । కన్యకాచరితంబు కరమొప్పచుండ
చెప్పెద వినుడిమీ చిత్తంబులలర । శివుడు పార్వతి పెండ్లిచేసుకువచ్చి
కయిలాసగిరియందు కరమొప్పచుండ । కొలువుకూటమునందు కూర్చున్నవేళ
కరమొప్పగురలెల్ల కామకలోసంగ ధనధుని జూచియా తరుణేందుధరుడు
దివినుండివచ్చి యీ దేవతలంత । కామకలనుమన కర్పించుచుండ
భూలోకవాసులు కామకలుమనకు । లేకున్న పోవు దెల్పుమనియనుగ
తారకాసురభీతి తరలిదిక్కులకు । పారిరిజ్ఞానులౌ వైశ్యులు లేక
కామకలు రాకుండె గౌరికయనగ । నీకుండు ధనదుతో నిట్లని పలికె
వాణిజ్యగోపరిపాలనాదులను । వ్యవహారములనిచ్చి యవనికేగి
గంధర్వవరుల చేగనిరీకాపములు । అతినుడి వెరిగి శశాంకధరుండు
వైశ్యుల భూలోకవాసుల జేసి । ధనకనకాదులు దద్దయునొసగి
వస్తువాహనధాన్య బహుమతినొసగి । రత్నపరిమెళాదిపరిజ్ఞలనొసగి
క్రయవిక్రయంబులనయబుద్ధినొసగి । రమ్యనగానంద రాజ్యాలాలించి
రక్షించుమమ దేవయత్నరాత్మిత్రి । యనిశంకరుని వేడ నతియంబొసంగి
అతిసంతోషమున నుండుడనశంభుడనిరొ । మరికొంతకాలంబు జరిగిన వెనుక
వైశ్యులు శివద్వారపాలకులయి యుండ । వానిఘోరగను దూర్వాసముని వచ్చి
హరునిదర్శింపబోనాటంకపరుప । రోషంబు చేగొప్ప శాపంబొసంగ
పాపడుమునీంద్రునకాసనంబిచ్చి । రోషంబువారించి కూర్చుండబెట్టి

బ్రహ్మాదిదేవతలుభవునిదర్శింప । వచ్చినవారికినిచ్చి పీఠములు
కొలువుననుండియాకోమట్లజూచి । బహుశాపములమీరుపతితులయియుంట
కైలాససుఖమునకర్హులుకారు । భూలోకమునకేగి పుణ్యాత్ములగుచు
శాపములన్నియుబాపుకొనిమీరు । శుద్ధులయికైలాస సుఖమొందుడనిన
వినివైశ్యులందరువెతజెందిరేడ । కరుణించిచెప్పెనా కైలాసపతియు
భూలోకమునమీరు పుట్టినవెనుక । నగరేశ్వరుండను నామంబుచేత
అచ్చటవెలసి మిమ్మాదరించెదను । శ్రీగౌరి వింధ్యవాసినియనుపేర
వెలసియిష్టార్థములనిచ్చుచునుండు । అన విని నారాయణునిజేరి మ్రొక్క
పార్వతీనాథుడు పల్కినరీతి । భూలోకమున మీరు పొలుపారుచుండ
ధరణిమీపురజనార్దనుడనవెలసి । శిరిగూడమిమ్ము రక్షించుచుండెదను
అనవినివైశ్యులత్యానందమంది । విష్ణుదేవునిపాదనివేడుచునుండ
వైశ్యులనుజూచియావాసుదేవుండు । వసుమతికిప్పుడుబోవతప్పదనుచు
భూలోకమునమీరు బుట్టినవెనుక । జగతినిభాస్కరాచార్యుడనంగ
కోమట్లకెల్లనుగురువయిపుట్టి । ధర్మసూత్రంబులుదగుబోధపరచి
పిదపకైలాసపదవిత్తుననగ । ఈశ్వరునాజ్ఞచేనిలనుదయింప
నారదమునియొక్కనాడువైశ్యులను । జూడవచ్చిన గని శుభమువాకనుచు
నర్ఘ్యపాద్యములిచ్చి యామునికిమ్రొక్కి । వారికష్టంబులువరుసతోదెల్ప
మునినాథసుక్షేత్రమొక్కటిదెల్పు । మనమునిహిమగిరికతిసమీపమున
ఘనవశిష్టాశ్రమమున కామధేనువర । గర్భమందొక్కవత్సరంబున్న
కుడిచెవిలోనుంచి వడిపురుషగణము । వామకర్ణంబున వనితాగణంబు
బుట్టుదురందునపూతాత్ములనుచు । దెల్పినారదముని దివికేగుదెంచె
నారదవాక్యానుసారంబుగాను । హిమగిరివసిష్ఠాశ్రమముజేరి
కామధేనువుగర్భంబులోన । వసియించిబుట్టిరి చెవులలోనుంచి
పరశుభేరునిగూడి వనజగర్భుండు । పుష్పకంబెక్కి యాభూమికేతెంచి
ఆబాలురకు జాతకాదులొనరించి । వుపనయనాదుల నొప్పగాజేసి
అరదంబుపయిజేర్చి ఆబాలకులను । తీరగుగౌతమీ తీరంబుజేర్చె
అరుదగుపెనుగొండయను పురమొకటిగల్పించె ।
ధనకనకసంపదల నలకపురమొకన్న చోద్యంబుమైనట్టిపురము
మణిమయసౌధాళి మహితవనాళి । భూలోకవైకుంఠ పురమనదనరి
వర్ణింపశేషుని వశముగాదనగ । దీనికిసన్నిధి దివ్యమానట్టి
ఘనపురంబులు పదునెనిమిదిగాగ । విశ్వకర్మసృజించె వేడుకతోను
వరజగన్నాథాఖ్య పురమాదిగాగ । గ్రాసంబునకునిచ్చెకమలోద్భవుండు

పాలు సేయు పెనుగొండ పురములోపలను । శ్రీవింధ్యవాసినిశ్రీనగరేశు
లనేకనగరములజనార్దనులనగ । వెలయుదేవతల కోవెలలుకట్టించి
సకలోత్సవంబులు జరుపుచునుండి । భైరవాదులనెల్ల భక్తిపూజించి
వ్యవహారముల యందు వాసిదప్పకను । దానధర్మంబులు మానకెప్పుడును
ముదమున పెనుగొండ పురవాసులయిరి । అపుడుశాలంకాయనాఖ్యమునికిని
మ్రొక్కిధర్మంబులు చక్కగావిల్చి । కుసుమశెట్టియనంగ కోమటియొకడు
ఈశ్వరారాధనయింపారసేయ । నీకుంక పుత్రకామేష్ఠిసేయుంగ
పుత్రులుపుత్రికలు బుట్టెదవరగ । పుత్రులుగలిగిన పున్నరకమొదలు
కేకున్నగతులు లేవందురియులను । యనికుసుమాంబిక తనపతికిమ్రొక్కి
బహుచింతగుందిన భార్యనుజూచి । భూరిధర్మంబులు బోధించిచెప్పె
పూర్వజన్మంబున పుణ్యంబులేమి । నీకిప్పుడు నిట్లుచింతింపనేల
పూర్వజన్మంబున పుణ్యమేమయిన । జేసియుండితిమేని సిద్ధించునన్న
పుత్రికామేష్టిచే భూతేశుగొలచి । ప్రార్థించగానిచ్చుండత పుత్రులను
యనిపుత్రికామేష్టి ఆరంభింపంగ । పరమేశుడప్పుడీయనితనుజూచి
వనజాక్షిభువినొక్క వైశ్యుడుండు । పుత్రులకోరుచు పుత్రికామేష్టి
చేయుచున్నాడు శీఘ్రంబునేగి । పుత్రులనిమ్మని పురవాసుండనిన
గౌరిపుడమికివచ్చి కరుణవైశ్యునకు । ప్రత్యక్షముగనున్నపదములకు మ్రొక్కి
దీనులయి వేడగా దేవియిట్లనియె । కొడుకులుకూతుండ్రు కులముద్ధరింప
గల్గుదురని వరంబులనిచ్చెనియె । బ్రహ్మాదులను భక్తిపూజించి
విప్రోత్తములకిచ్చె వివిధదానములు । వారుడుగౌరియా కుసుమాంబగర్భమున
కరుణతో కవలలుగా నుద్భవింప । బ్రాహ్మణులనుపిలచి వైశ్యోత్తముండు
జాతకర్మాదులు జరిగించియువల । విద్యబుద్ధులునేర్పి వృద్ధిబొందంగ
అపుడుకన్యకు పరిణయముసేయదలచి । జతనంబుసేయువాసమయంబునందు
ఆటశౌనకాదులకా సూతసూతి । చెప్పినరీతిగా జెప్పెవినుడు
ఘనుడుశాలంకాయన మునీశ్వరుండు । విష్ణువర్ధనుకథ విశదంబుగాను
వంశక్రమంబువర్ణించెనపుడు । ఆనవిమార్కండేయుసోముని ఆశ్రమంబరన
రాజమండ్రంబనుపురము నేలెడు । రాజనరేంద్రుడుగర్భమున
వైశ్యశాపంబున వరచిత్రకంఠు । డనెడుగంధర్వుడు యవతారమొంది
విష్ణువర్ధనుడనవిఖ్యాతినొంది । రాజమహేంద్రాఖ్య రమ్యపట్టణము
తనరాజధానిగా దగనేలుకొనుచు । కులధర్మములనెల్ల కొదువలేకుండ
కొమరొప్పపల్పుచు కొలువుసాగించి । మంత్రితోనిట్లనుమనుజేశ్వరులను
రౌనిమిదినాళ్ళకు యేతెంచుమనటుల । రావించుచుండిన యారాజాజ్ఞభటుల

పంపించిచాటింప పదివేలనృపులు । సకలాయుధంబుల సంహతితోను
జనుదెంచియుండగాజగధీశ్వరుండు । చతురంగబలముతోచనుదెంచియపుడు
విఖ్యాతిసర్వదిగ్విజయంబుజేసి । తీర్థయాత్రలనెల్ల తిరిగిసేవించి
రాజమహేంద్రిపురంబుతాజేరి । పెనుగొండనుమహాసుంబు విష్ణువర్ధనుడు
వర్ణింపుమంచుఆవైశ్యులువచ్చి । విష్ణువర్ధనునకు వినుతులుసేయ
అంమకుసుమశ్రేష్ఠి యనువైశ్యకుండు । సకలభూషణములుకానుకలిచ్చినేడి
పెనుగొండకువేంచేయ పెద్దగాకోర । పెనుగొండకేతెంచి వినయంబుతోను
శివకేశవులభక్తి సేవించిరాజు । ఆకుసుమశ్రేష్ఠియొక్కాత్మజజూచి
అతిమోహమున విరహాగ్నిలోమునగ । అదిగనుగొనిమంత్రియారాజుతోను
వాసవియనుకన్యకోప బుమారు । ఆశజెందితివింత కతిచింతయేల
ఆకన్యదెచ్చిమీకర్పింతుననిరయ్యె । కుసుమశ్రేష్ఠినిమంత్రిగావంబొప్ప
వాసవియనుకన్య వనజాక్షితాక్షి । విష్ణువర్ధనునకు వేడ్కనిమ్మనిన
కుసుమశ్రేష్ఠియు బహుకోపంబుతోను । వైశ్యకులోత్పన్న వాసవిమిన్న
ధరనురాజులకీయ తరముగాదన్న । అనిపల్కవిష్ణువర్ధనమహారాజు
పటురోషమున పెండ్లియద్దనిపల్క । ఆప్పుడుకోమటులతిభీతిజెంది
ప్రభువులకోపంబు ప్రళయకాలంబు । అతివిచ్చినమనకపకీర్తివచ్చు
నియ్యకున్నమబ్రతుకనియ్యడీరాజు । వైశ్యులవెల్లనుపసుమతిలోన
వెతకిచంపించునీవిష్ణువర్ధనుడు । కోమటులపెరిఅగ్నిగుండమేర్పరచి
చొరదొరవాసవి తరలాక్షిజూచి । తనతండ్రితోడనిట్లనిచెప్పదొడగె
వరమునచేనీనీకూతురనయితిగాని । ఆదిశక్తినిదేవతారాధ్యనేను
రూఢిగానానిజరూపంబునీకు । జూపింతుననివిశ్వరూపంబుజూప
ఆరూపమునుజూచి యతిభీతినొంది । చేతులుమోడ్చిని చ్ఛేష్టుడై యుండ
ఆవిశ్వరూపంబునపుడుచాలించి । వాసవిరూపంబువనజాక్షిదాల్చి
జనకునితోగూడ సభకురాజూచి । నెందుగానానూటరెండుగోత్రములు
వారుభార్యలతోడ వచ్చిరాసభకు । సభలోన భాస్కరాచార్యులకుమ్రొక్కి
చిన్నబోయినకుసుమ శ్రేష్ఠిముఖంబు । కూతురుభావమెటులున్నదోచెపుడు
యిప్పుడువీరితో నిప్పులోబడెగ । నొప్పునోయొప్పదో యుప్పతియనగ
మిన్నకతనతండ్రి యున్నసమయమున । తనవిశ్వరూపంబుతండ్రికిజూప
ఆశ్చర్యమునవైశ్యులందరుతిలింప । విశదంబుగాతనవృత్తాంతమెల్ల
దెలిపెనుగరాలకును తేటపడగ । తగనూటరెండుగోత్రజులరావించి
కోరినవరములం కొమరొప్పనొసగి । యొప్పటికన్యయైయెదుటనునిలచె
గురువులుతమశిష్యకూటంబుగాంచి । నిలనుమేరినకంబులివ్వనివారు

తెలుచనధోలోకములు జెందగలరు । అప్పుడు మాండవ్యమహామునీంద్రుడు
వాకన్యకిప్పుడు మేనరికంబు వ్రాసె । తనమామకూతురు తగదనితలచి
అన్యకన్యలపెండ్లి యాడంగరాదు । తెలియక వరియించి తేపాపమగును
తల్లిగా భావింప దగునన్యకన్య । యనుచు నగరాలకు నన్నిధర్మములు
వర్ణాశ్రమాచారపద్ధతులు దెల్ప । నపుడు కాలంకాయవాఖ్యాత పసుడు
శిష్యసంఘంబుతో చెలగ మవచ్చి । సభను వేంచేయ వైశ్యాగ్రగణ్యుల్ మ్రొక్కి
వుచితాసనంబులనుంచి పూజించి । విష్ణువర్ధనుభావమును చెప్పి
అగ్నిప్రవేశప్రయత్నంబు గల్ప । శ్రీ కృతిగోత్రప్రవరలు దెల్పుచును
భూసురకోపంబు బోవుట కొరకు । వహ్నిగుండంబులో బడినమీకెల్ల
కైలాసవాసంబు గలుగునుమీకు । అనిచెప్పి బ్రాహ్మణుండాశ్రమంబేగ
గరిమతో వైశ్యులు గురువును గాంచి । మమ్మీదకరుణంప్రమాణ వేడుకొనగ
తనువశెట్టియు నగ్నిగుండమేర్పరగ । ఖిలపాషాణపభృత్యులనిలింపించె
అతడేగినగరేశు అలయంచెదుట । ముఖ్యాగ్నికుండంబు ముందుగల్పించి
మహనీయవాసవాంబకు పెండ్లియనుచు । కాటించిచెప్పిన పాటితెరవులను
పెంపుమహాత్తరంబు పెంపారనునిచి । పరిణయోచితవయి నవరత్నకలశ
శుభలేఖలనచాలసొంపుగా వ్రాసి । కటిరాజనరేడ్గు దంచు
వాసవాంబకు పెండ్లి జేసెదమనగా । వైశ్యాకరి నిపెదువారములందు
వరుసగా పూజింపవలయు ననుచు । విరివియాగవనంబు విడిదిగానిల్పి
హితుడైన తనపురోహితునిబంపించె । అవసమీమాయ నలదుమాయిమరచి
యేమియెరియక నతడేమరివుండె । అప్పుడావాసవి భ్యంజనము చేసి
నీరొత్తిరిచెలులందరు గూడి । కురులునాన్నగదువ్వి కొప్పుగాముడచి
నుదుటనుతిలకంబు నొనరంగదిద్ది । నఖశిఖాంతము భూషణములను బెట్టి
తహతహలాడుచు తల్లియిట్లనియె । వాసవిమాతల్లి వరమున గంటి
నీముద్దుముచ్చటలేమి నేగంటి । కోపనిక్నెట్లుగుండంబులోన
పడద్రోయునగునమ్మ పద్మాయతాక్షి । అనివిలపించుచు రాజాను పెనుగొండ
లలితాంగినీకింతలావణ్యమేల । వేర్వేరుబొమ్మలపెండ్లిండ్లుచేయ
నెవ్వరు మాయింటసిభరాజగమన । చిలుకలకు పలుకులు నేర్పనెవ్వారు
కొన్నినోములు నోచినోచియే నాతిగంటి । నెలతలందరునన్ను మెత్తురనుకొంటి
పైడిగిన్నెలలోన పాలు నెయిబోసి । పంచదారయొకింతమించగాజేసి
బహువిధంబులబోలపాడి త్రాగింతు । నీముద్దుపలుకులు సింపుగావినుచు
పాలతినీబుద్ధులకలరుచునుంటి । వ్రతములకెల్లను ఫలమింతగలిగె
పుత్రికావేష్ఠితపాలతిశంకరుడు । వినుమామనిచ్చెనతనయను జేసి

కలికితొమ్మిదినెలలుకడుపులోమోసి । పెంచిననందరి విడచిపోదగునే
నీముద్దుమోము నెప్పుడుచూతుననుచు । పొంగుచునుంటినో బంగారుతల్లి
అగ్నికీలలకట్లుఅప్పగించెదను । బ్రహ్మవిష్ణాదులు యీపాటువినిన
యెవరుచెప్పెద మాకేది త్రోవమ్మ । అంతవిరూపాక్షుడాకన్యజూచి
యేలపుట్టితివి మాయింటనోయమ్మ । అనివిలపించుచున్నట్టిసమయమున
తననిజరూపంబు తల్లికినిచూపె । కనులచూడగలేక కాంతలందరును
కనులుమూసుకొనంగకన్యయయినిలచె । కుసుమశెట్టియు నెల్లకోమట్లు గూడి
తగువారితో గూడనూరెగుండములు । యెవ్వరెవ్వరికేదియేదియటంచు
మండుచున్నట్టిగుండములలోన । శిఖిజ్వాలలెల్లకొనిచెలరేగుచుండ
పరవిజొచ్చినవహ్నిచల్లనయియుండె। అందులోనుప్రధానమయినగుండమున
పరమేశ్వరధ్యాన పరవశమయిన । వాసవియనుకన్యవహ్నిపయినలిగి
యామెకోపమునకు యనలుండుజడిసి । ప్రత్యక్షమయివాసవాంబకిట్లనియె
యిటువంటిఘనుల నేనెట్లుదహింతు । దహియింపదురితంబుతప్పునేయనగా
చేతులుజోడించి చిచ్చులోయుంచి । బయటకువచ్చిన వైశ్యులచూచి
మీయందుదయచేతనిమ్మగాల్పకను । యుండితిగాని వాయుగ్రతగనుడు
యనుచుభగభగమంటలాకాశమంట । వైశ్యులందరుతమవనితలతోడ
భూషణంబులుదాల్చిపాలుపోరుచుండ । కుసుమాంబమొదలగుకోమటిసతులు
ఆకన్యకాంబకు అభ్యంజముజేసి । సాంబ్రాణిధూపంబుజక్కగాజేసి
పచ్చకర్పూరాది పరిమళములొసగి । మండుచుండెడు అగ్నిగుండములజేరి
వలగొనిమ్రొక్కిరు వహ్నిపడబోవ । కలగిసాగరములు కలుషములయ్యె
చుక్కలుదివినుండి మిక్కిలిగరాలె । సూర్యచంద్రాగ్నులు సూటులుదప్పె
పరమేశుడంతటప్రత్యక్షమయిన । శ్రీవాసవాంబికశితికంఠుచూచి
తగునూటరెండు గోత్రజలయినవారు । సౌఖ్యసుఖంబిచ్చి రక్షింపుమనిన
వసుధయందిష్టంబువచ్చినన్నాళ్ళు । మోదించికైలాసమునకు రమ్మనియె
వాసవాంబచ్చట వైశ్యులజూచి । ఇచ్చటనుండిమీరిండ్లకుచేరి
కన్యకాంబనొక్క కలశమేర్పరచి । భక్తికాలంకాయనోక్తమంత్రముల
బూజింపగామీరు పుత్రపౌత్రాది । వివిధసంపదలచే వృద్ధిపొందెదరు
కోమటులారామీకులమందుబుట్టు । కూతురెల్ల కురూపవతులగుదురిలను
యనిశాపముపెట్టె నావాసవాంబ । ఆమాటవినివైశ్యులతిచింతగనిరి
పరమేశుడావాసవాంబనుబట్టి । మహనీయమయినట్టి మధ్యగుండమున
చొరబడనంతలోజూచికోమటులు । తమగుండములయందుతమరు చొరబడగ
పుష్పవర్షముగురిసెపాలుపోరనప్పుడు । వానవాదులనిష్టవరములనిడిరి

ముదముతో కయిలాసపురమునకేగి । వారునిగొల్చి మనఖండానందులయిరి
భువిబాలనగరులుడు సుదుఃఖమొంద । గురుడు వారలమదిగుదరబోధించె
వీరలదుఃఖములిట్లని గాఢపటులు । వృత్తాంతమంతయును నిభీతినొంది
విష్ణువర్ధనునకు వేగ దెల్పుటకు । రాజు హేంద్రవరము చేరంగ రాగ
కరము విహా హెచ్చగలవారు గాన । రాజా పెనుగొండకు రాబడలు దేర
చాకులజూచి రాజతికోపమున ను । పెనుగొండవిడచివచ్చిన హేతువడగ
కుసుమకోమలిక న్యకోమట్లు కూడి । చిచ్చులో జొచ్చెనని చెప్పగా నదరి
కాలమృత్యువు బోలు శూలంబు దాల్చి । వేలకొలదులతల గూలంగ వేసె
ఆపార్వతీకృపను శాపంబు జోవ । గంధర్వరూపంబుకరమొప్పదాల్చి
బాలనగరులను చేపట్టి కరుణించి । వీరలందరి వెంటబెట్టుకొని తాను
కాశిగయాప్రయాగలు పుణ్యనదుల । క్షేత్రంబులన్నియు సేవించియుచట
చేయించెనతడు విశేషదానములు । పితృదేవతులకు సంప్రీతిజేయించి
తగనుదీవించి యంతర్ధానమొందె । తగవాతవిష్ణువర్ధనుకుమారుండు
జనకునిసంగతివినిచింతజెంది । కులగురుడౌ ధౌమ్యుబిల్పించి వేగ
పితృకార్యమంత యునతిభక్తి జేసి । తనపరివారంబుతో పెనుగొండవచ్చి
బాలనగరుల సెల్లనిట్లప్రార్థింప । నన్నురక్షింపుడు నారాజ్యమందు
అర్ధరాజ్యమును మీకర్పింతుననిన వినుపించుకొనకయున్న నువారిజూచి
మీకిచ్చు రాజ్యంబుచేకొనకున్న । నిపుడు ప్రాణములు మీకొప్పింతుననగ
కరుణతో బాలనాగరులాలకించి । కన్యకాంబకునుతుల్ గావింపదేవి
ప్రత్యక్షమాసప్తరాత్రింబులు । నీతిశాస్త్రములన్నియును బోధపరచి
నిజరూపమునతానునిలచిదీవించి । నిరాజసుతుడిచ్చినరాజ్యముజ్యమర్ధంబు
నాకుపట్టాభిషేకంబుగావించి । విరూపాక్షు గావింపుడనిన
మార్కండభాస్కరుడు । మొదలుగాగలమునులు మోదంబుతోను
కన్యకాంబకుగట్టిరపుడుపట్నంబు । భక్తితో కన్యకాచరితంబువినిన
వ్రాసినచదివినపరమేశ్వరులు । భుక్తిముక్తుల నిచ్చిబ్రోతురుగాక

## 40 సుభద్రసారె.

చిత్రింపుపాంజోళ్ళురత్నబాగడల్లూ । అర్జునుడుందొడిగవేఅపడకటింట్లో
నడుమువాలుగుడిశలునవరత్న సేతా । తలాపిదిక్కునాతామరశ్లీబెట్టి
పాన్పుమీదపవళించె పద్మనాభుడు । ఆకిదుగోపాకిదుగోఅడకత్తెరిదుగో
మునగంపుకాయిదుగో చుట్టియున్నదిమే । ఆకేలపోకేలఅడకత్తెరేల

సన్నంపు కాయేల చుట్టియ్య నేలా । అనగ పార్థుడు నవ్వి అతివ కిట్లనెనూ
పున్నమ్మ నాడయిన బూరెలొండుకుని । పుణ్యడారమ్మ నిపిల్చిరె మీవాళ్ళు
అమావాస్య నాడయిన అట్లువండుకొని । అల్లుడారమ్మ నిపిల్చిరె మీవాళ్ళు
కనుము నాడయినా నుగారెలొండుకొని । కామూడారమ్మ నిపిల్చిరె మీవాళ్ళు
మావాళ్ళు పేదవాళ్ళు మాకేమి గలదు । పెట్టగల పెద్దింట పెండ్లాడితేను
అచ్చటలు ముచ్చటలు అన్నియును జరుగు । అతివ పల్కులు విని గుడ్లెర్ర జేసి
ఎడమ మీసందువ్వి పాంకోళ్ళు మెట్టి । పాంకోళ్ళతో దన్ని పక్కనన వ్వ
ఘోలు ఘోలుమని గోడపైకొరిగి । ఇంటిసొమ్ము తీసి ధరిణేలనుంచి
మాసినబట్ట గట్టి ముడుగులు విప్పి । ముద్దులా ముద్దున్ని చంక బెట్టికొని
గంటలా బొల్లున్ని చెట్టపట్టుకొని వెళ్ళె నే । సూభద్ర అన్నవాడలకు
వాకిట్ల వారన్న నిదుర జయవించె । అంతిపురీశుని వదినె రెయొచ్చురున వచ్చి
ఆడబిడ్డను జూచి అతిజాలి జెంది । నిద్రవోతున్నావు నీలవర్ణుండ
నీచెల్లెలు వచ్చింది నిద్రలేవయ్యా । నాముద్దు చెల్లెలాయే మె సుభద్రా
ఏనుగులుండంగ గుర్రాలుండంగ । హౌదాలు వుండగా పల్లకీలుండ
బంటులూ వుండంగ బానిసలుండంగ । కాలినడకలతోను ఒంటరిగ నీవు
విడిబడి వచ్చుటకు నగరబ్దమేమె । పున్నమ్మనాడయిన బూరెలొండుకొని
పుణ్యడారమ్మని పిల్చిరేమా వాళ్ళు । అమావాస్య నాడయిన అట్లువండుకొని
అల్లుడారమ్మని పిలిచిరె మా వాళ్ళు । కనుము నాడయినా నుగారెలొండుకొని
కామూడారమ్మని పిల్చిరె మీ వాళ్ళు। పుల్లవిరుపు మాటలాడి పురుషుడా నన్ను
గుడ్లెర్రగా జేసి బాదాడన్న । మాటలు చెనువ స్త్రీ నీ అన్నా మీకడకు
చెల్లెలను వోదార్చి చేరంగదీసి । కంటతడి బెట్టకుమి కాంతరో నీవు
దండెము నా వున్నాయి కొత్తచీరేలు । యిదుగో నెచెల్లెలా నీకు అరణమ్ము
పెట్టెలో వున్నాయి పట్టుచీరేలు యి॥ చె॥
గూట్లోను వున్నావి గుండుగిన్నెలను యి॥ చె॥
అటుకుమీదను వున్నవి అంచుబిందేలు యి॥ చె॥
ధరిణెల్లో వున్నాయి పతకముల పేర్లు యి॥ చె॥
సావిట్లో వున్నాయి కావడి పెట్టెల్లు యి॥ చె॥
రత్నాలకోళ్ళది పట్టెమంచమ్ము । ముత్యాలజాలరు పచ్చలదోమ తెర ॥యి॥ చె
వారంపుసొమ్ములు । మందసమునుండె యి॥ చె॥
కాపాలు భూములు । బానిసలు వుండెగ యి॥ చె॥
అనుచు విష్ణుడు యిచ్చి సతులకడ పంపె । పెదయింటి పెదవది నెపోయి వచ్చెదను
పోయిరా అత్తింట బుద్ధిగలిగుండు । చిన్నింటి చినవది నెపోయి వచ్చెదను

పోయి మీ అత్తింట బుద్ధిగలిగుండు । మారి పెంపుముద్దువదినె పోయివచ్చెదను
పోయి కోడకనిగని యెత్తుకొనిరమ్మి । బుద్ధిగలముద్దువదినె పోయివచ్చెదను
మువ్వల్లా బాలుడిని యెత్తుకొనిరమ్మి । చిన్నారినావదినె పోయివచ్చెదను
చిత్రాంగి బాలుని యెత్తుకొనిరమ్మి । పాషాణమూవదినె పోయివచ్చెదనూ
ఉల్లావిరి చుక్క పొమ్మి యీ ముద్దుగుమ్మ । ఉంటివాకాలన్ని బండిపై వే
ముంజూరు వాసాలు ముట్టించి పొమ్మి । యెండినధాన్యమ్ము యెత్తుకొని పొమ్ము
వండినవంటకము కట్టుకొని పొమ్మి । కాళ్ళుమట్టె కోడు దీసుకొని పొమ్మి
కట్టుకొను బట్టయిన ఒకటియుంచకము । అనిన గుజదుజలాడి అతివ దుఃఖించి
అన్నరో వింటిరా అలిమాటలను । కొన్న బానిస అంటే కొదువేమి వనకు
మన అమ్మ కొన్నది మాయ వందరను । పదవేమో సుభద్రాపంపేవత్తును
పల్లకియెక్కించి పరమాత్ముడప్పుడు । నవరత్నాభరణాలు పట్టెమంచములు
ఆవులు ఆశ్వాలు మేలందానములు । కాపాలు బానిసలు కలవియున్నియును
కానుకలుగా యిచ్చి కవలాత్ముడంపె । సిరిసంపదలు గల్గి స్థిరముగానుండి
అర్జునుడు సుభద్రయులవితో నుండె । ధరణిలో గలయట్టి దంపతులంత పాట
పాడిన విన్న ప్రబలులయుయుంద్రు॥

## 41 ప్రయాగదళము.

గ్రుక్కన ప్రయాగపట్నము కాంచిరి వార్షములోన ।
చక్కగపాగి దండప్రణామంబులు సమర్పించి ।
పెక్కు జన్మములయెత్తి యెక్కువయిన భాగ్యములు ।
దక్కని భాగీరథి తల్లిని నేబోడగంటి ।
జన్మపావనమాయెను భాగీరథిదర్శించిన మాత్రమున ।
అక్షయంబగు పుణ్యములు అమరపతి మాకొసగా గంటెని ।
త్రివేణి భాగీరథిగంటెని సరస్వతియమునా కంటెని ।
బిందుమాధవుల కన్నులపండుగాను కంటిని .
భాగీరథీవైభవములు వైకుంటములోన ।
పసుపులు కుంకుమకాటుక పరిమళద్రవ్యములు ।
పద్మాక్షులు పూజంతురు భాగీరథీ దేవమ్మను ।
పొమ్ములు చీరలు రవికెలు ఘుమ్మను గంధపుష్పములు ।
కొమ్మని కిదికానుకనుమ్మా । భాగీరదమ్మా గైకొమ్మా
మేలయిన భూషణములు పాడిమితో ధరియించి ।
పాతమయిన। త్రివేణి పాదమ్ములు సేవించి ।

కాళింగుమర్దనమిది కడుతీర్థములోయనుచు ।
కమలాక్షుడుజేసెను దశాశ్వమేధయాగములు ।
ఆహోయీకాలనుకు పడమరదక్షిణాంబుధనుచు ।
అలివేణులుగూడుకునీ అందయకదులుచునిా ।
సుదతికితూర్పుదిక్కున దూపిపట్టణమనగా ।
పణతికిపడమరదిక్కున ప్రయాగపట్టణమనగా ।
తరుణికిదక్షిణదిక్కున రామేశ్వరమనగా ।
సువిదకునుత్తరదిక్కున కాశీపట్టణమనగా ।
అవినాలుగుపట్నంబులుఅమరించెనుకమలజాడు ।
శ్రీమదమ్మనేతెంచిప్రయాగస్నానముజేసి ।
నీమముతోచనుతెంచిరి భాగీరథిస్నానముకు ।
మందరగిరివరునిగొనియాడుచు మహాదేవులబోగడును ।
పొందుగదివ్యవిమానమందుకుని హర్షంబుతోను ।
అందమయినపల్లకీలు అందమయినరథములను ।
పొందుగకొల్లరిబండ్ల సందడితోనడువగను ।
అశ్వములుగజములు అమరినలాటిటలా ।
విశ్వమ్ములోచనుదెంచిరి వివరమ్ముగకాశికినీ ।
కాశీపట్నములోనా భాసురముగప్రవేశించి ।
గంగాస్నానముజేసి మంగళగౌరినిపూజించి
విశ్వనాధునిఅన్నపూర్ణను అందముగమొక్కి ।
అండజవాహనుడైన దండపాణినిసేవించి ।
నిండినవేడుకతోను గణపతినిబూజించి భాగీరథీనదుమను ।
అందముగలవారిశ్చంద్ర స్తంభంగంటి ।
పాపమ్ములుబాయువలెనని పంచక్రోశందిరిగితినీ ।
ముక్తిమండపంరొక్కి త్రిమూర్తులకెదురుగనిల్చి ।
సక్తులుజల్లుచుప్రజలు సరగునగయకేతెంచి ।
వటవృక్షముదర్శించి నటభోజనములుబెట్టి ।
వైతరణీగోదానము వైభవముతోనేయుచును ।
తిలతర్పణమ్ములు విడచిరిద్రవ్యములతోను ।
పితృదేవతలకు పిండములుంచిరి వేదమంత్రములతోను ।
తీర్థవిధోప్పగబెట్టి దీపారాధనజేసి గదాధరునేవించికదలిరి ।
జగన్నాధమునకు దరిసించిపురుషోత్తము రారోజగన్నాధమునకనుమా

మురియుచు తమకావళ్ళు మూపులపై బెట్టుకుని ।
గోవిందలు బాడుచు కదలిరి గోదావరినదికి ।
గోదావరిస్నానము జేసి యుదకము కొప్పెర్లను బట్టి ।
గోదానంబులు భూదానంబులు కొమరొప్పగ జేసి ।
సప్తసాగర సంగమంబులకు సరవితో జేరి ।
స్నానమ్ములు జేసి శిద్ధులమఠముల చిత్రవిచిత్రములు జూచి ।
శిద్ధుల కైలాసం జని బుద్ధిని దలపోయుచును ।
క్షేత్రపుపోష్యములుండి నవనందుల సేవించి ।
తిరుమలకొండకు జని వేంకటేశుని జూచి ।
తిరుపతులు తిరుమంటపమ్ములు । దేవాలయములు జూచి
కాళహస్తికి జని కాళహస్తీశ్వరుని జూచి ।
కుంభకోణమును కామేజని కుంభేశుని జూచి ।
కావేరితీరము జని స్నానము జేసి కావేటిరంగని సేవించి ।
వెంజిల్లుచు రామేశ్వరమునకు రభసముతో జనిరి ।
దశరథరాములవారు సగర్వ కట్టిన సేతువులోను ।
ధనుష్కోటిలో స్నానము జేసి । సేతుమాధవుడు రామలింగనికి
నానామంత్రములతోను । గంగోదకము అభిషేకము జేసి
పిండివంటలు పేరిన నేతులు । పాయసాన్నములతో దండిగ
రాజాన్నంబులు తమరంతా సమర్పింతురు । జేజేశంఖురురాణి
జేజేఓభవురాణి । యనిపాడుచు వచ్చిరి మధుర పురమునకు
మధురాపురమునకు జేరి మీనాక్షిని సేవించి । యీశ్వరు నిదర్శించి
కాంచీపురమునకు జని యాకామాక్షమ్మను జూచి । శ్రీశయిలంబునకు జని
మల్లిఖార్జ భ్రమరాంబల పూజించి ।
దక్షిణవాటికకు జని భీమేశ్వరుని । మాణిక్యాంబను జూచి
పీఠికాపురికే జనియు । పాదగయ స్నానము జేసి
కుక్కుటేశ్వర కుంతీమాధవు జూచి । రాజేశ్వరలక్ష్మికి నమస్కరించి
బెజవాడేగి కనకదుర్గతల్లిని సేవించి ।
యాత్రలు పూర్తి జేసుకు మరలిరి । సంతోషముగాను యిండ్లకు జేరి
బంధువులు ప్రియులు హితుల గూడుకొని । కాలభయిరవుని సంతర్పణ జేసి
గంగపూజ జేసి బాల భజంత్రీలు । బాకాలోగ్లతో డగంగానిరాగంబు జేసి
సుఖముగనుండిరి సుందరాంగులెల్ల । బాయక యీపాట బాడినయింతుల కెల్ల
పరమేశ్వరు డిచ్చును కైవల్యపదవి । కడుసంతోషముతోడ

# 42 తిరుమంత్రము.

హరిహరిరామానుజా నీమతమందు నమ్మినహరిదాసునీ
హరిహరిభూములందూ యీవనమందు దిరుమంత్రముకొరకై
భూములన్నియూ తిరిగితీ మంత్రముకొఱకు బుద్ధిమీముకూడితి
యిమ్ముగమీవెంటను అలసటలేక వెదకివెదకితిరిగితీ
గోవత్సస్థలమందునా ఆచార్యులు దాహము తెమ్మనెను
అటుయిటువెదకిచూచి జలమందక యిదియేమిచోద్యమనుచు
ఆకాశమందుజూచి అయిదు తుంబ్రవీధిని వెళ్ళగా
రంగపిపోయెంతులా మీరెక్కడెటి జలమున్నస్థలమేదయా
వినవయ్యహరిదాసుడా మేమెక్కడెటి నీవడప్పకరానయా
పయినపక్షులువెళ్ళగా నీడనునిచ్చి కొలనుతావునవచ్చెను
కమండలామితోనూ తీర్థముతాను గ్రక్కునచేరబూనెక
తనగురువురేమనునో అనుచూతాను పరుగుపరుగునవచ్చెనూ
అంతఆచార్యులూ ఎటమపదమువేంచేసె కాలమందూ
ఇంతకాలమందునా యీ బిడ్డకు అంటదాయెనుమంత్రము
తనమనసుజాలినొంది మేదినిఎయిని హస్తముంచితుడిచి
ఘనమయినతిరుమంత్రము ఆచార్యులు వినయంబుగావ్రాసిరి
దేహమక్కడవిడచీ ఆచార్యులు జేరిరిపరమపదము
యీటీసానివక్కడతె తిరుమంత్రము వినయంబుగాచదివెను
అమనవ్రాసినదనీ హస్తముంచి అదారు తుడిచివెళ్ళె
జలముదెచ్చినదాసుడు ఆచార్యుల స్థలముదగ్గరకొచ్చెను
జలమారగించరయ్య ఆపాదట మమ్మురక్షించరయ్య
నివత్రిలేనిఘనులా యీ స్థలమందు నిద్రింపతగదులేడీ
చెంతస్థలమందున్నట్టి చెరుప్పువుజూచి గుండెలెగసిగొట్టెనూ
గురువునెరుగనయితిని యీవనమందు గుట్టుతెలియకపోతినీ
జలధిగట్టుకుపంపెనా గురువునన్నడవిపాలుజేసెనా
గురువేమిజేసెగదా యీవనమందు గుట్టుతెలియకపోతినీ
గురువుపైచెయ్యికని తనగురునివూపివూపిలేపెను
తనమనమువృష్టిచేత తనగురువునకు తగినక్రియలెల్లజేసి
అంతఅంతటపరమాత్ముడు ఆత్రోవను పనులగాచుచుండగా

పనులుగాచెటిబాలుడా యీతోవ్రను పద్మాలెందరువెళ్ళిరి
వినవయ్యహరిదాసుడా యీతోవ్రను యీటిసానివెళ్ళెను
యీటిసానెకుఅబ్బెనా తిరుమంత్రము వీధంతావిరజల్లెను
ఆటసానెకుఅబ్బెనా యీమంత్రమందరికి యెరుకాయెనూ
అందరిని వెదుకుకుంటూ వెళ్ళిరి వారుహస్తినాపురమందునా
పల్లెగుడిసెలయందునా చోళపురాజా పట్నమందునజొచ్చిరీ
అమ్మమ్మనుమ్మలుమీ చెప్పినపనులు ఆజ్ఞతో చేయించుమీ
మీరుజేసెడిపనులు మాకేలయ్యా మావద్దవుండుమానే
ధర్మరాజానేసెడీ యజ్ఞముజూచి హరిదాసుడెళ్ళగాను
యెవరయ్యహరిదాసుడు తెలియకమీరు యిబ్బందీపడకరండీ
సమయానద్వందార్థము తిరుమంత్రము సమకూడదాయెనూకు
తలియాకుపుచ్చుకుని పాతనవేసి తలచేనుఆచార్యులా
నాగవాసములేనిఘంటలు ఘల్లుఘల్లున మ్రోయగను
సభవారుఅంతవచ్చి తెరచాటున సభదీర్చికూర్చుండిరీ
యెవరయ్యహరిదాసుడూ ఇచ్చటికిమీరెందుకొంచేస్తిరీ
సమయానద్వందార్థము తిరుమంత్రము సమకూడదాయెమ్మాకు
యీటిసానివద్దనూ తిరుమంత్రము యిప్పిస్తెపదిలక్షలూ
ఆమాటలువింటునే ధర్మరాజా ఆశ్చర్యములబొందెనూ
వేయిబ్రాహ్మణులకెల్లను సమకూడవక వైష్ణవుండెక్కడా
ఈటివాళ్ళనుపిలువుడీ యిచ్చటికి మాటలాడించుదామూ
యీటిసాటివానివచ్చెను దండంబెట్టి నాట్యమాటలుజూపెను
మాటలజూచిమెచ్చి మేలిమిమిద యానతివ్వగాను
మిద్దేలస్థలముక్రింద కర్ణములకు ధరణిపైబడవేసెనూ
అయాకుతీసుకుని ధర్మరాజాహరిదాసు కివ్వగాను
ఆకుపాతనతీసెనూ హరిపురమందు దాసుడైనిలచుండెనూ
హరిదాసుకథలన్నియు నన్నాకన్నా వ్రాసిసాచదివినాను
ఫలమయినతిరుమంత్రము దొరకును వినయుంబుగానమ్ముడీ॥

## 42 తులసి గోవింద నామములు.

భక్తితో తులసికిగోవిందా రామ । పాదుఅయినాజేతుగోవిందా
కృష్ణతులశమ్మకు గోవిందారామ । మొక్కఅయినాజేతు గోవిందా

నిత్యపుదకంబులు గోవిందారామ । నిమ్మళంగా బోతు గోవిందా
భాగీరథీనీరు గోవిందారామ । భమిడిబిందులబోతు గోవిందా
పాదములుగడిగిరు గోవిందారామ । పైజల్లుకుందుము గోవిందా
కంచుకొప్పెర్లతో గోవిందరామ । కాశీపుదకంబుబోతు గోవిందా
విరివిగల కొమ్మలతో గోవిందారామ । విస్తీర్ణమైవుండుగోవిందా
కడసారకొమ్మకు గోవిందారామ । పరగనైదోదళము గోవిందా
గోమయంబెచ్చిరయా గోవిందారామ । బృందావనము అలికి గోవిందా
ముత్యాలముగ్గులు గోవిందారామ । ముదముతో నే బెడుదు గోవిందా
వజ్రాలముగ్గులు గోవిందారామ । వరుసతో నే బెడుదు గోవిందా
కెంపులముగ్గులు గోవిందరామ । సొంపుతో నే బెడుదు గోవిందా
పచ్చలముగ్గులతో గోవిందారామ । పద్మాలు నే బెడుదు గోవిందా
దామరాపద్మంబు గోవిందారామ । యేర్పొద్దునే బెడుదు గోవిందా
అష్టదళపద్మమ్ము గోవిందారామ । నిష్ఠతో నే వుంతు గోవిందా
వొనరుచాతుర్మాస్య గోవిందరామ । ఒక్కద్వాదశివాడు గోవిందా
నీమమ్ముతో ప్రజలు గోవిందారామ । నిన్నుపూజించితే గోవిందా
అష్టహారతిలోను గోవిందరామ । అరువై వేలవత్తులేవేసి గోవిందా
యేకహారతిలోను గోవిందారామ । వెయ్యికోట్లవత్తులేవేసి గోవిందా
పంచహారతిలోను గోవిందరామ । పదివేలవత్తులువేసి గోవిందా
రాగిపళ్లెంలోను గోవిందారామ । లక్షవత్తులువేసి గోవిందా
ఆవునెయ్యితోను గోవిందారామ । మహాలక్ష్మికి దీపంబువుంచెగోవిందా
సాంబ్రాణిధూపంబు గోవిందారామ । కదళిఫలశర్కరలు గోవిందా
అవుసరంయిచ్చిరి గోవిందారామ । పాయిసంబూరెలు గోవిందా
నైవేద్యమిచ్చిరి గోవిందారామ । సిరిసంపదలతోను గోవిందా
స్థిరముగా నుందురూ గోవిందారామ।

# 43 తులసి పూజాకల్పము.

## శ్రీ తులసిమహాలక్ష్మీపూజ ప్రారంభః.

కేశవ. నారాయణ, మాధవ, గోవింద, విష్ణో, మధుసూధన, త్రివిక్రమ, వామన. శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహ,

అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హరే, శ్రీకృష్ణాయనమః ॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ॥ ఏతే భూమిభారకాః ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మసమారభే ॥ ఓంభూః, ఓంభువః, ఓంసువః, ఓంమహః, ఓంజనః ఓంతపః, ఓగ్ంసత్యం, ఓంతత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియో యోనః ప్రచోదయాత్ ॥ ఓమాపోజ్యోతీ రసోమృతం. బ్రహ్మభూర్భువస్సువరోం మమోపాత్తదురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే, ముహూర్తే శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే॥ భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన సంవత్సరే, అయనే, ఋతౌ, మాసే, పక్షే, తిథౌ, వాసరే, శుభ, నక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమతి, గోత్రవతి, నామధేయవత్యాః, ఆచరితవ్రత సంపూర్ణసకల ఫలావాప్త్యర్థం లక్ష్మీనారాయణదేవతాసహిత, శ్రీతులసీదేవ ఉద్దిశ్య తులసీదేవతా ప్రీత్యర్థం, శ్రీసూక్తవిధానేన ధ్యానావాహనాది షోడశోపచార తులసీపూజాం కరిష్యే॥ ఉదకంవదిలిపెట్టేది గంగకలశారాధనం కరిష్యే॥ చెంబులో అక్షతలు గంధం ఉంచేది. కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితాః। మూలేతత్రస్థితో బ్రహ్మమధ్యే మాతృగణాస్థితాః। కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా । ఋగ్వేదోథయజుర్వేద కలశాంబుసమాశ్రితాః కలశే గంధపుష్పాక్షతైరభ్యర్చ్య । అకలశేషు ధావతి పవిత్రీకరిష్యే తేషుద్ధి ర్భక్ష్యేషు ఏతత్ । ఆపోవాఇదగ్ంసర్వం విశ్వాభూతాన్యాపః । ప్రాణావా ఆపః । పశవ ఆపోన్నమాపోమృతమాపః సమ్రాడాపో । విరాడాపస్స్వరాడాపశ్ఛందాగ్ంస్యాపో జ్యోతీగ్ంష్యాపో। యజూగ్ంష్యాపస్సత్యమాపస్సర్వాదేవతా ఆపో భూర్భువస్సువరాప ఓం ॥ గంగేచయమునేచైవ గోదావరి సరస్వతి । నర్మదేసింధుకావేరి జలేస్మిన్ సన్నిధింకురు॥ అయాతు శ్రీతులసీపూజార్థం దురితక్షయకారకాః । కలశోదకేనపూజా ।

ద్రవ్యాణిదేహమాత్మానం సంప్రోక్ష్య కలశఉదకంపువ్వుతోమీదను తులసిమీదను శిరస్సునచల్లుకొనేది॥ ధ్యానం॥ తులసీస్వమృత జన్మాసి సదాత్వంకేశవప్రియే, కేశవార్చన యోగ్యామే వరదా భవసర్వదా । కృష్ణానందాశ్రుసంభూతే వరదేవతులసిస్త్వయం త్వామహ్యా వాహయామ్యర్ఘ్య కవలాపతిర్లబ్ధే ఉపశోపచారపూజాంకృత్వా॥ హిరణ్యవర్ణాంహరిణీం సువర్ణ రజత

స్రజాం । చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥ శ్రీతులస్యై
నమః ఆవాహనం సమర్పయామి॥ తులసిపైనిపుష్పం ఉంచేది తాంమఆవహ
జాతవేదో లక్ష్మీమనపగామినీం యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పు
రుషానహం శ్రీతులస్యైనమః ఆసనం సమర్పయామి పుష్పం ఉంచేది॥
అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీం
శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మాదేవీ జుషతాం తులస్యైనమః
పాదయోః పాద్యం సమర్పయామి ఉదకము చల్లేది, కాంసోస్మితాం హిరణ్య
ప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం। పద్మేస్థితాం పద్మవర్ణాం
తామిహోపహ్వయే శ్రియం తులస్యైనమః, హస్తయోః అర్ఘ్యం ఉదకం విడి
చేది, చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారాం
తాం పద్మినీం శరణమహం ప్రపద్యే, అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే తుల
స్యైనమః ఆచమనీయం సమర్పయామి ఉదకము విడిచేది, ఆదిత్యవర్ణే తప
సోధి జాతో వనస్పతిస్తవ వృక్షోథ బిల్వః, తస్య ఫలాని తపసా నుదంతు మా
యాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః, తులస్యైనమః స్నానం సమర్పయామి, నీళ్లు
చల్లేది, తదనంతరం పంచామృతస్నానం సమర్పయామి, దధిక్రావ్ణో అకారి
షం జిష్ణోరశ్వస్య వాజినః సురభినో ముఖాకరత్ ప్రాణ ఆయూంషి తారిషత్
పెరుగుతో స్నానము, ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమవృష్ణ్యం భవా
వాజస్య సంగథే, పాలతోను, శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితో
త్పునాత్ అచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః, నేతితోను, మధువా
తా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః మధుసక్తముతో
షసి మధుమత్పార్థివగ్ంరజః మధుద్యౌరస్తు నః పితా మధుమాన్నో వనస్పతిః
మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతు నః, తేనెతోను స్వాదుః పవ
స్వదివ్యాయజన్మనే స్వాదురింద్రాయ సుహవీతునామ్నే స్వాదుర్మిత్రాయ
వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః శర్కరతోను,
తదంగ శుద్ధోదకస్నానం సమర్పయామి, ఆపోహిష్ఠా మయోభువః తానవూ
ర్జేదధాతన మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః తస్యభాజయతేహనః ఉ
శతీరివమాతరః తస్మా అరంగమామవః యస్యక్షయాయ జిన్వథ ఆపో జనయథాచనః
శుద్ధోదకస్నానం సమర్పయామి॥ ఉపైతుమాం దేవసఖః కీర్తిశ్చ మణినాసహ
ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మిన్ కీర్తిమృద్ధిం దదాతుమే తులస్యైనమః వస్త్ర
యుగ్మం సమర్పయామి ॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్య
హం అభూతిమసమృద్ధించ సర్వాణ్నిర్ణుదమేగృహాత్ తులస్యైనమః
యజ్ఞోపవీతం సమర్పయామి ॥ గంధద్వారాం దురాధర్షాం । నిత్యపుష్టాం క

రీషిణీం । ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియం ॥ తులస్యైనమః దివ్యశ్రీచందనం సమర్పయామి॥ మనసః కామమాకూతింవాచ స్సత్యమశీమహి పశూనాగ్ం రూపమన్నస్యమయిశ్రీ శ్రీయ తాంయశః తులస్యైనమః ఆభరణార్థం అక్షతాం సమర్పయామి॥ కర్దమేన ప్రజాభూతామయి సంభవకర్దమ శ్రియంవాసయమేకులె మాతరంపద్మమాలినీం॥ అథాంగపూజా తులస్యైన్యమః పాదౌపూజయామి, విష్ణుప్రియాయైనమః గుల్ఫౌపూజయామి, రంభోర్వ్యైనమః ఊరుపూజయామి. క్షీరాబ్ధితనయాయైనమః కటింపూజయామి సకలసురపూజ్యాయైనమః నాభింపూజయామి, ఇందిరాయైనమః ఉదరంపూజయామి, బృందావనవాసిన్యైనమ. వక్షస్థలంపూజయామి, మహాలక్ష్మ్యైనమః, స్తనౌపూజయామి, భుజాయైనమః ఉదరంపూజయామి, బృందావనవాసిన్యైనమః హస్తౌపూజయామి, సుముఖాయైనమః ముఖంపూజయామి, రమాయైనమః లలాటంపూజయామి, ఇందుసోదర్యైనమః శిరంపూజయామి, శ్రీతులస్యైనమః సర్వాణ్యంగాని పూజయామి, కుంకుమసహితపుష్పైః పూజయామి, అనికుంకుమపువ్వులు అక్షతలుతో ఆఖరువ్రాసినసూటయనిమిది నామములచేతను పూజజేసెది.

అపస్రిజంతు స్నిగ్ధాని చిక్లీతవసమేగృహే నిచదేవిం మాతరం శ్రియంవాసయమేకులే తులస్యైనమః, ధూప మాఘ్రాపయామిఆర్ద్రాంయఃకరిణీం యష్టింసువర్ణాం హేమమాలినీం సూర్యాం హిరణ్మయీం లక్ష్మీంజాతవేదో మమావహ తులస్యైనమః దీపం॥ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిపింగళా పద్మమాలినీం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ। తులస్యైనమః నైవేద్యంసమర్పయామి॥ తాంమ ఆవహ జాతవేదో । లక్ష్మీమనపగామినీం । యస్యాం హిరణ్యం ప్రభూతంగా వో దాస్యోశ్వాన్ విందేయం పురుషానహం శ్రీతులస్యైనమః తాంబూలంసమర్పయామి యశ్శుచిఃప్రియతో భూత్వాజుహుయాదాజ్య మన్వహం శ్రియః పంచదశర్చంచ శ్రీకామ స్సతతంజపేత్ తులస్యైనమః నీరాజనం సమర్పయామి॥ ఆనందః కర్దమశ్చైవచిక్లీతఇతివిశ్రుతాః ఋషయః స్తేత్రయః ప్రోక్తాస్స్వయం శ్రీదేవదేవతా । పద్మాననేపద్మఊరుపద్మాక్షి పద్మసంభవే త్వమాంభజస్వపద్మాక్షి యేనసౌఖ్యంలభామ్యహం । అశ్వదాయీగోదాయీ ధనదాయీ మహాధనేధనం మేజుషతాం దేవీంసర్వకామార్థసిద్ధయే ॥ లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం దాసీభూతసమస్తదేవ వనితాం లోకైకదీపాంకురాం । శ్రీ మన్మందకటాక్షలబ్ధ విభవద్బ్రహ్మేంద్ర గంగాధరాంత్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియాం

శుద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమసర్వదా। వరాంకుశౌపాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థాం బాలార్క కోటి ప్రతిభాంత్రినేత్రాం। భజేహమంబాం జగదీశ్వరీంతాం సర్వమంగళ మాంగళ్యే శివేసర్వార్థ సాధకే శరణ్యేత్ర్యంబకేదేవీ నారాయణినమోస్తుతే తులస్యైనమః॥ సువర్ణమంత్రపుష్పం। ప్రదక్షిణం॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే। పాపోహం పాపకర్మాణాం। పాపాత్మాపాపసంభవాం త్రాహి మాం కృపయాదేవి॥ శరణాగతవత్సలీ అన్యథాశరణం నాస్తిత్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దనీ। తులస్యైనమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి। నమస్కరోమి దేవిత్వాం విష్ణువక్షస్థలెస్థితాం। ప్రణతార్తిహారేన్నిత్య మభీష్ట ఫలదాయక॥

శ్లో॥ యస్యస్మృత్యా చనామోక్త్యా తపః పూజాక్రియాదిషు న్యూనంసంపూర్ణతాంయాతి సద్యోవందేతమచ్యుతం। మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దని। యత్పూజితం మయాదేవిపరిపూర్ణం తదస్తుమే। అనయాధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయాభగవతీ సర్వాత్మికా శ్రీతులసీదేవతా సుప్రీతా సుప్రసన్నావరదాభవతు॥ అని ఉదకంవిడిచేది తులసీ దేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి॥ తలపైనుంచకొనేది॥

## శ్రీ తులసిపూజాకల్ప నామావళి ప్రారంభః

ఓంప్రకృత్యైనమః
వికృత్యైనమః
విద్యాయైనమః
సురభ్యైనమః
పరమాత్మికాయైనమః
వాచేనమః
పద్మాలయాయైనమః
పద్మాయైనమః
శుచయైనమః
స్వాహాయైనమః
స్వధాయైనమః
సుధాయైనమః

ధన్యాయైనమః
హిరణ్మయైనమః
నిత్యపుష్టాయైనమః
విభావర్యైనమః
ఆదిత్యైనమః
దీప్తాయైనమః
రమాయైనమః
వసుధాయైనమః
వసుధారణ్యైనమః
కమలాయైనమః

కాంతాయైనమః
కామాక్ష్యైనమః
క్రోధసంభవాయైనమః
అనుగ్రహప్రదాయైనమః
బుద్ధ్యైనమః
అనఘాయైనమః
హరివల్లభాయైనమః
అశోకాయైనమః
అమృతాయైనమః
సర్వభూతహితప్రదాయైనమః
శ్రద్ధాంతాయైనమః
విభూత్యైనమః
శ్రీపాద్యైనమః
లోకవినాశిన్యైనమః
ధర్మనిలయాయైనమః
కరుణాలోకమాత్రేనమః
పద్మప్రియాయైనమః
పద్మహస్తాయైనమః
పద్మాక్ష్యైనమః
పద్మసుందర్యైనమః
పద్మోద్భవాయైనమః
పద్మముఖాయైనమః
పద్మనాభప్రియాయైనమః
వరారోహాయైనమః
పద్మమాలాధరాయైనమః
దేవ్యైనమః
పద్మిన్యైనమః
పద్మగంధిన్యైనమః
పుణ్యగంధాయైనమః
సుప్రసన్నాయైనమః
ప్రసాదాభిముఖ్యైనమః
ప్రభాయైనమః

చంద్రవదనాయైనమః
చంద్రాయైనమః
చంద్రసహోదర్యైనమః
చతుర్భుజాయైనమః
చంద్రరూపాయైనమః
ఇందిరాయైనమః
ఇందుశీతలాయైనమః
ఆహ్లాదజనన్యైనమః
పుష్ట్యైనమః
శివాయైనమః
శివకర్యైనమః
సత్యైనమః
విమలాయైనమః
విశ్వజనన్యైనమః
తుష్ట్యైనమః
దారిద్ర్యనాశిన్యైనమః
ప్రీతిపుష్కరిణ్యైనమః
శాంతాయైనమః
శుక్లాంబరాయైనమః
శ్రియైనమః
భాస్కర్యైనమః
బిల్వనిలయాయైనమః
యశస్విన్యైనమః
వసుంధరాయైనమః
ఉదారాంగాయైనమః
హరిణ్యైనమః
హేమమాలిన్యైనమః
ధనధాన్యవిధ్యాయైనమః
సిద్ధయేనమః
స్త్రైణసౌమ్యాయైనమః
శుభప్రదాయైనమః
నృపవేశ్మగతానందాయైనమః

వరలక్ష్మ్యైనమః
వసుప్రదాయైనమః
శుభాయైనమః
హిరణ్యప్రాకారాయైనమః
సముద్రతనయాయైనమః
జలాయైనమః
మంగళాయైనమః
దేవ్యైనమః
విష్ణువక్షస్స్థలస్థితాయైనమః
విష్ణుపత్న్యైనమః
ప్రసన్నాక్ష్యైనమః
నారాయణసమాశ్రితాయైనమః
దారిద్ర్యధ్వంసిన్యైనమః
దేవ్యైనమః
సర్వోపద్రవవారిణ్యైనమః
నవదుర్గాయైనమః
మహాకాళ్యైనమః
త్రికాలజ్ఞానసంపన్నాయైనమః
బ్రహ్మవిష్ణుశివాత్మికాయైనమః
భువనేశ్వర్యైనమః

# 44 తులసి దళము.

శ్రీనివాసమూర్తి సేవజేసి నేను విన్నవింతు । మానసమున తులసిదళము మహిమ దెల్పెద । తులసిదళము మహిమ దలచి తెలియ నెవరివశము గాదు । తులసిదళము సకలలోకముల పవిత్రము । తులసిదళము మహిమ యెంత వర్ణింపనలవిగాదు । సరసముగ వినగ నలరుచు సరగ చెప్పెద । మంచిమీరి నట్టి ద్వారకాపురమ్ములోన కృష్ణు । డెంతో మిత్రులతో రాజ్యమేలుచుం డెను । ఇంద్రసదనికన్న యెక్కువై చెలంగుచుండు దేవేంద్రపురివలెను యేపుమీరను । నారదుడువచ్చి లోకనాథు కృష్ణు ప్రస్తుతించి । ద్వారకాపురమ్ము మహిమ తెలిసి చూచెను । బాగుమీరగాను సత్యభామనగరికే తెంచి । వదనమెంతో భామతోను వరుసబల్కెను । అమ్మ మున్ను ముందు పూజ లెన్ని యెట్లుజేసినావో । చెన్నుమీరగాను భర్త వెన్నుడౌటకు ।
తిరిగి మగని యెత్తుధనము మరల భూసురులకొసగి । మునుసముగ నీకొనగవలెను ధర్మశాస్త్రము । కోరి భర్తను దానమిస్తు కొమ్మ ఏనుగు దానమిచ్చు దారిజె ప్పనునుము తిరుగ తర్ణ్ని అడిగెను । నామనోహరుని లోకనాయకుని దాన మొందవ । వేమునీంద్ర నీకు తప్పవో పరన్యాయ అంజలిని బట్టుకొని వినయముతో సత్యభామ । మరియు చేతులు ముడ్చుకొని మగువ బల్కెను । స్వామి కృష్ణ చెట్టబట్ట సఖుల కోర్కెలెల్లదీర । మనవి యొక్కటున్నదనియు మగువ బల్కెను । యింతినీ గృహంబులోను వింతగాను మనవి లేదు । మనవి యొక్కటొచ్చెనని మగడు నవ్వెను । స్వామి నారదుడు వచ్చి వ్రత మెంకటి చెప్పినాడు । విభుని దానమియ్యమని వ్రతము చెప్పెను । భామ నన్ను దానమియ్య వ్రతమూ

ఒకటిపట్టినావు కానివెనుక౯ స్తుతేను కదలిపొమ్మనె పొంకముతో భూషణము
లలంకరించి మంచిగంధం । పొంకముతో సురులు సొగసుపణతియంగన ।
యనికధాస్తు తెమ్మటంచు వడిగవిభునితోడి తెచ్చి । వెలది గ్రేపుతోడునపుడు
వింతగా సమానియెదుట నిల్చెను । లెక్కలేనిమాటలన్ని ఒక్కవంకరాని
పోసి । వొక్కవంకకంగ వైరి నంచెముదమున । యెత్తురాకపోసిధనము యే
మివిప్పలొట్లుగలవు । యెంతగానతూచినాను తూగదాయెను । యే పుమీర
నింద్రపదవి చూడబోయి తెచ్చినట్టి ధనమువేసితూసినాను మొగ్గదాయెను
రాజమూయయాగమునకు రాజులెల్లపూజచేయు । మణులువేసితూసినాను
నిండెదాయెను । కాలదిజాంబవతీ మిత్రవిందరాధ మొదలుగాగ సతులకుకలిగి
నట్టిధనము లంతకలియవేసిరి । హితులమంత్రులు పురోహితులు సతులు
మిత్రులును యితరమయినవారు చాలకనకమిచ్చిరి । అంతయీతిరమయిన
వారుచింతసేయగానె బుద్ధిమతులయినవృద్ధవుండుమంతనమ్మునతెలియదింక
రుక్మిణీసతులు యేమొయింతధనము । కలదుయింకమనకు ఆశకల్లయెన్నడు
అనుచువృద్ధవుండుబల్క మదినిసత్యభామదలచి రుక్మిణమ్మకడకునేను యెట్లు
బోదును । యింతకాలమూయెతనకు యంతులాటయెన్నడయిన । చేరిరుక్మిణి
కిసేను సేవజేసిన । విభుడుతనకులోలుడనుచు కేడ్కతోనుబోధపడితే ।
తానుమరీజాణతనము మాటలాడును । చనుగానిరుక్మిణమ్మ కడకునేనుబోన
టంచు । పంతముతో సత్యభామ పలికెనప్పుడు । నోరుపంతమూడిలేను నోస
లుమంతమూడునటమ్మ । వారిదోడరుడు తన్నవంచదలచెను ... ...
గద్దెపైనకూర్చుండి కనులబాష్పములుగురియ లజ్జతోనుబల్క సత్యభామఅ
ప్పుడు అనుచుసత్యభామబల్క వదినీవృద్ధవుండు తలచి । రుక్మిణమ్మకడకుబో
వనీకులజ్జలేటికే నీకన్నపెద్దవనిత విమగారుక్మిణమ్మ । మొక్కినచ్చురుక్మి
ణికి మోడమేరగ । భూతడయలుగల తల్లిభూమలన్ని పాలింప । ఆదికాల
మందులక్ష్మి అవదియురెరుగవ ముఖ్యమయిన ప్రాణనాథుడు దక్కలేనీకు
చాలు । చేతగానిరుక్మిణమ్మకడకు బోవను । అనుచువృద్ధవుంత బలుకమదిని
సత్యభామదలచి కనుగావశమువచ్చెనని కదలివచ్చెను । అందుచేరిముందుని
లచి సుందరీజనాంగియపుడు । సందడితో రుక్మిణీకి మొక్కినిలచెను । అక్క
నాదునితో జేసినప్రతిజ్ఞకే మిందారిజెల్లె । ధనముగూడెవారి సోదరుడు
తన్ను వంచించదలచెను । కల్కినీకుకంధనమ్ము కానవచ్చుసగము ధనము ।
కంపికేకిదూచినాను యెత్తురాదుగా కెలదినీకు కంధనమ్ము వేగదెచ్చి విభు
నికిస్తి । తిరిగికృష్ణమూర్తి నిప్పుడు తెచ్చుకుందును । అనుచు సత్యభామబల్క
మదినిరుక్మిణమ్మనవ్వి । నాదుమూడుదానమంద సత్యభామదాన మపుడు

నిచ్చు విభుడు బోవుట వల్ల యొక్క వింతదోచెను అయినగాని తనకుగ
లుగు అంతవస్తు వియ్యవలెను । గాని వెనుకవస్తునేను కదలిపొమ్మనె అను
చుసత్యభామను పదహారు వేల సతులు జేరి । వింతగాను తోలిపంపిరి వేట్క
లలరగా । వెలయగాను నగరిలోను తల్లిదండ్రులుండగాను తల్లిదండ్రులివ్వ
వలెను సకల జనులకు నందుడా యశోదదేవి ముందుగాయుండగాను, దేవి
దానమిచ్చుటేమొ తెలియదాయెను ॥ పట్నంపుస్త్రీ అయినయిచ్చినా చె
ల్లుగాని, వేశ్యకాంతదానమియ్య ధర్మమున్నదా । స్నానమాచరించి
మంచిసరసవన్నె పట్టుగట్టి మేన సొమ్ములన్ని బెట్టి మెరువు దీర్చెను । సొంక
మయిన భూషణము లలంకరించి మంచిగంధం పొంకముతో సతులువేగ
ఆపుడనుర్చిరి । అందముతో తులసిదేవి అరుగుఅలికి ముగ్గుబెట్టి పణతిసక
కలోపచారమున పూజచేసెను । హేమమయమైన రత్నగజపీఠమందు తాను।
వీమములర వుంచెదళివనేర్పుతోడను । అతివకు తాంబూలము చెలులు అంది
యాచ్చుచుండ । గాను భూషణములు మెరయగాను కదలివచ్చెను । వచ్చినా
రదునికి మ్రొక్కివాని కోర్కెదీరునట్లు । రుక్మిణమ్మ ధనముత్రాసులో
నిలువగాను । హెచ్చిదేవమునీ చాలమేలుమేలనే । వెలదినీకుకలధనమ్ము
వేగదెచ్చివిభునిస్తె ॥ యింకనేపువిష్ణుమూర్తి నిచ్చిపోదును । అనగనవ్వి
భీష్మపుత్రివినయమొప్ప మ్రొక్కినిలిచి । ఘనులుమీరుయెరుగరాని కారణ
మున్నదే । సకలజగములెల్లయితని గర్భగృహములోనుగలవు । వనజనాభ
యితడు సత్యవంతుడాయెను । ఆదిమూలమయిన విష్ణుఅతనిదైవమాయే నే
నెం । వేదములు శాస్త్రములు వెలసియున్నను । తులసిదళముల చేత బట్టి
తూగవలెను అనుచుబాల । చెలియమానితోడతా । బ్రతిజ్ఞబట్టెను । మొద
లుమట్టుధనము అంతా మొదట అంటతీసివేసి । చెలియకుడకలోను తులసిదళ
మునుంచెను । అపుడుసకలజనులు జూడ అద్భుతముగ విష్ణుమూర్తి । కపట
మేమిలేక తూనికమరతొచ్చెను । అపుడురుక్మిణినిజూచి అమ్మనీవుతులసి
పూజ । యొన్నగాను జేయుటచె కలిగభాగ్యము । కాదుకబరికాదు యేమొ
కానవచ్చునో వినోది । మగువతులసిదళములోదమహాప్రభావము। తులసిప
మహిమయొవరుపాడినను విన్నగాని । పరమపవిత్రులగుపాతకములుబోవును
ఎకరముగతులసి పూజచేసివిష్ణుసేవచేసి । యేకదంతునిదలచి తులసిమహిమ
విస్తరించెద । మహామునులార తులసిమహిమ । మహిమకెల్లదొడ్డ మహామహి
మతెస్సపూడచేసి । భూతికొందరు । పుత్రపౌత్రసమస్తమయిన భోగమను
భవింతురుగాని । పవిత్రులైజన్మిస్తురెల్లకాలము । యొలమిపట్నానరాజాయేలు
చుంటెనుతులులేక । చెలిమిమీరదప్పిచింతనేయుచుండెను । అంతలోవశిష్ఠ

యూని అచటికేతెంచిరాగ । చింతదీరువిధము నతనికి చెప్పుమనిరి । వృద్ధుల
యిరియికను గొఱుకొయుపులేదుగాన । శుద్ధము నతులసిపూజచేసుకొమ్మనె ।
చిన్నమొలకలుపరిరాజుభూమియందు పదునుజేసి । చెన్నుమీర గుంపితులసి
వనమువేసెను । పాలునెయ్యి చెఱుకుమంచి పానకంబుతేనెవారి కేళజలము
పోసికొన్నాళ్ళుపెంచిరి । ఆదరముగ దంపతులు సకలోపచారంగాను ।
క్రమముయెరిగి పూజయేడాదీజేసిరి । అంశముపలితనము గోరా । కొంత
చిన్నవయసునవచ్చె । రాజునకుకాంతునకుసు సుతుంకల్గిరి । వేశ్యాశోభ
భరతుడనుచుపేరు ప్రఖ్యాతిగాను నతనికిచ్చె । రాజ్యమేలెధరతవంశముకొని
పేర ఎగ్గిలమాయెను । సరసముగసౌఖ్యమిచ్చు స్వామిసన్నిధిజేమఱ ।
పరమశోభనమిది ప్రథమపటలము.

## రెండవపటలము.

ఓయివిప్రులారవినరు ఒకకథవినుడిమీరు । బాయపకలవిధములయి
నపాతకమ్ములు । మేలుగానుమంచితులసి మీదనుండివచ్చునట్టి గాలిబారి
తేనుపాపులకు హర్షమొనవెను । తొల్లిలుబ్ధకుండొకడు దోషకారియొకక
వాడు కల్లవాడుగలిమిపోతు కాదుమానుషి । కుటిలవర్ధనుండు మనుజుల
కూడ గొట్టి చంపివేసి । మాంసమారగింపుచుండెను । నరులజంపిభూసురుల
జంపిమనిషి మాంసమారగింపుచుండె ననేకకాలము ... ... ...
యీవివిధమునభోజనములు జీవహింసలెల్లజేసి తోగ్రవనపచుప్రాణములను
సంహరించెను । ఒకానాడుభార్యజంపి మాంసమారగింపుచుండె । ఒకానా
డుతల్లిపంగ్రములం నుగ్గుజేసెను । ప్రాణులెవరుదొరకకున్న భక్షణాధకాను
యితన ఆగ్మసుతులగొట్టితా భోంచేసెను । మరణసమయమందుదేవ సుహి
మతోచలేదుగాని పుణ్యవశము నతనిమీదతులసిగాలిబారెను । తులసిగాలి
బారినపుడె యమభటులువచ్చి కపటముతోవాణ్ని బట్టికొట్టికట్టిరి ।వినయ
ముతోవిష్ణుభటులు వీనివగ్గరకువచ్చి యమభటులనుపారదోలి విష్ణుపురికిదచ్చి
రి । కాలకింకరులుయముని కీపరికారముతెలియజేయ చాలకోపించి యము
డువిచారమునుబొందును । దోషకారియొకకవాణ్ని చూచితేనుపాతకములు
వాసుదేవుపటపారిపోవుట వరుసయేమిటో। తెలసుకొకమనసులోని తెగులు
పోవదనుచులేచి । బలముతోను వేగిరమున పైనమాయెను.

భూతగణముగొలువగాను మహిషరాజు మందికాయపోతునెక్కి
వేగవిష్ణుపురికివచ్చెను । నిల్చినాపునీవు దండకార్యములనుకలజేసి బలమునీ
సిజేసి నాపు ళ ఎవ్వమగునా । చెక్కింపవలెనీణ్ని చెక్కవెయ్యవలెను డొక్క

కొక్కసందు నాను వీనితొక్కవలెనయ్యా । పొట్టచింపవలెను వీణ్ణికట్టి పెట్టికొట్టవలెను కొట్టిమంటలంటునా పెట్టవలెనయా । దుండగీడుదోషకారి దొంగవంటివాడుదేవ నీదండనుండతగడు నాదండకంపుము । గుడుగుగాను మరలమరల వాడిసరకమునకు పొమ్మిరయిన యొకవాణ్ణి తెచ్చినావు యేమిపాపము । దశపాతకములన్ని ముందుజేసినాడు తుదకు అగణితముతని మీద తులసిగాలిబారెను । తులసిగాలిబారుటాచే యొకవానికిమోక్షమిస్తి దోషమితని కుందులేదు గానయముని పొమ్మనే । అనుచువిష్ణు మూర్తిబల్కె హాసకా మొందియముడు తనలోకమునకు తరలివచ్చెను తులసీయింటనిట్టు వారు తులసిపూజచేయువారు తులసియందుభక్తులయి మొక్కువారలు । తెలసివారిదిక్కున యమభటులుచేరలేరుగాన స్మరించితేను మోక్షమిచ్చు పుణ్యమిచ్చుద్వితీయపటలము॥

# 45 సీతాదేవివేవిళ్లు.

సృష్టంతయేలేటి రామచంద్రులూ । రాజ్యపాలకులయిన రామచంద్రులు యొదురులేకాభూమి లేలుచున్నారు । ఆనందభక్తులయి అయోధ్యలోను అంతటాజనకసుత గర్భిణమ్మలాయె । నెలనాళ్లిరెన్నెల్లు అమరియుండగను వేవిళ్లుఘనమాయె లోకులుల్లాయె । తలవాల్చిదుడిచెయ్యి తలక్రిందనుంచి పాన్పుమీదపవళించె పద్మాయతాక్షి । అన్నమ్ముముట్టదూ ఆరామునీత తాంబూలము వెయ్యదుసర్వేశ్వర్ల దేవి । నిత్యతనదాసీల నిల్చిపిలువదు పాదాలువత్తుమని పణతిపలుకాదు । మధురమగుమామిడిపండ్లుగోరు అతిరసఅరటిపండ్ల నవియైనగోరు । కాంతఖర్జూరమూలైనను గోరు పణతిపనసపండ్లవ్వయినగోరు । వెలదివెలగాపండ్లనయిననుగోరు నాతినారింజపండ్లనయిననుగోరు । పాలకొమ్ములమీదిపండ్లయినగోరు చింతకొమ్మలమీది చిగురయినగోరు । దోరచింతలుగోరు తోయజగంధి యీరీతికోరికలుకోరుచుండగను । ముగుదకుముత్యాలపట్టెడేసడలె నాతికి నడుమువడ్డాణమేసడలె । పణతిచేత బాజబందులేసడలె అచ్చనవరత్నాల పేరులేలవలె । అనేకరత్నాలసొమ్ములేసడలె పాన్పుమీదపవళించె పద్మాయతాక్షి । ధర్మసేనుడుతన సతిమేడకొచ్చి రెప్పవేయకను కనువిప్పిమోహాన । తప్పకజూచెను తరుణితావంక పణతిగొనిరమ్మని రామచంద్రులు । యేమేమిజనకసుత నీవున్నవిధము

.కారడవిదిరిగావుకష్టపడ్డావు । ఆనాడుయీరీతి వడిలుండలేదు.
అడవులన్నీదిరిగి అకుభక్షిస్తి । ఆనాడుయీరీతివడిలుండలేదు
బావులనీళ్ళన్ని చేదిపడతాగ్రి । ఆనాడుయీరీతి వడిలుండలేదు
యెండలోనేయెండి వానలోనేతడిసి । ఆనాడుయీరీతి వడిలుండలేదు
పండుటాకులవలె పాలివున్నావు । పారుటాకువలెపవ్వళించావు
నీవిధములక్ష్మన్న కెరిగింపవలెను । గాజాలమరించినా గడపలుదాటి
ముత్యాలమర్చిన ముంగిళ్ళుదాటి । రత్నాలమర్చిన మేడలమదాటి
పగడాలమర్చినపందిళ్లుగాటి । పచ్చలమరించినారచ్చల్లుదాటి
వచ్చేనేరఘురాములక్ష్మన్నకడకు । అల్లంతటొచ్చేటి అన్నగాడజూచి
పాగడవిమూర్మ్యరుప్రిదక్షిణంజేసే । సాష్టాంగదండప్రిణామంబుజేసే
వందనము జేసికడుముందరనిలచి । అన్నవినులక్ష్మణావిన్నపమునాది
అన్నమీవదినెంత బడలివున్నదీ । కారడవిదిరిగిందికష్టపడ్డాది
ఆనాడుయీరీతివడిలుండలేదు . అడవులన్నిదిరిగిఆకుభక్షించి
ఆనాడుయీరీతివడిలుండలేదు । బావులనీళ్ళన్నిచేదిపడతాగ్రి
ఆనాడుయీరీతివడిలండలేదు । యెండలోనేయెండివాననేతడచి
ఆనాడుయీరీతివడిలుండలేదు । పండుటాకువలెపాలివున్నది
పారుటాకువలెపవ్వళించిందీ । నాచేతినొక్కటిమాద్రుటుంగరమూ
మాంజేతదొడగొచ్చ్రికలక్షమన్నా । అయింతిగర్భిణినితాజచారించి
మనసుసంతోషానమరిపొంగుచుండె । పాలుపొంగినట్టుపొంగిలక్ష్మన్నా
నక్షత్రిపర్వతంనడచినట్లుండె । చుక్కలపర్వతంచూచినట్లుండె
అట్లయితెమావదినెన్నచూచవత్తును । అంబులుఅయుధాలన్నికడనుంచి
బిగదీసిలక్ష్మన్నపిడికట్లుకట్టి । లక్షకేలాగొడుగుతాచేతపట్టి
వచ్చెనేలక్ష్మన్నవదినెమేడలకు । అల్లంతటొచ్చేటిమరదినిపాడజూచి
కాళ్ళపాపీరావెకదులీఘ్రిమునను । బంగారుచెంబుపన్నీరుదెచ్చి
పాదములుకడిగించెనారాముదేవి । బంగారుతీగెలాతివాసిపరచి
పచ్చకర్పూరాన తాంబూలమిచ్చి అలసివచ్చినారుకూర్చుండరయ్యా
సాష్టాంగదండప్రిణామంబుజేసె । వందనంజేసి కడుముందరానిలిచి
అమ్మమేముపోతాము అజ్ఞయివ్వండి । వేగిరం మీఅన్నకడకు పొండయ్యా
కడువేగమీఅన్నకడకుపొండయ్యా । గాజాలమరించినా గడపలుదాటి
ముత్యాలమర్చినా ముంగిళ్ళుదాటి । పచ్చలమరించినా రచ్చలుదాటి
పగడాలమర్చినా పందిళ్లుదాటి । అల్లంతటొచ్చేటి అన్నపాదగాంచి
పాదగనిమూర్మ్యరు ప్రిదక్షిణంజేసి । సాష్టాంగదండప్రిమాణంబుజేసె

వందనము జేసికడుకుందరానిలచి। మీకంటె ఘనులయి పుట్టనున్నారు
మీకేలురాజ్యమ్ము లేలనున్నారు। మీకెక్కు సింహాసనం యెక్కనున్నారు
మీచేతి ఆయుధం పట్టనున్నారు। అయింతిగర్భిణిని తావిచారించి
మనసులో సంతోషంమరిపొంగుచుండె। పాలుపొంగినట్లు పొంగరాముండు
నక్షత్రపర్వతం నడచినట్లుండె। చుక్కలాపర్వతం చూచినట్లుండె
ఆలంకలోపలా దండుదిగిరాగ। అక్కడరావణబ్రహ్మకూతురు
అలిగిఅత్తింటికి వెళ్ళిపోగాను। హస్తములు చేపట్టి యెత్తకేనయితి
నిండూగావున్నదినీలభవనాద్రి। పక్కలువిందుకుంది పంకజగంధి
అయింతికదిముదురుగర్భిణోయన్నా। యీయింతికిదికేతగర్భిణోయన్నా
వెండిబల్యాలవారువేయిలక్షవేలు। రాగిబల్యాలవారులక్షవెయివేలు
కంచుబల్యాలవారుకమ్ముకున్నారు। పాదాలకప్పుడుపణతివినకుండ
పాన్పుమీదనొచ్చిరి పద్మనాభులును। కూర్చున్నదాసీలునిల్చుండిరంతా
ఆడవకెనోడవలె గెల్వవలెగాని।ఆటవిడిచీమీరు లేవపనిలేదు
చిరునవ్వునవ్విరీ దాసీలుఅంతా। పుత్రరందక్షిణం చూచెనాదేవి
తూరుపూపడమరా చూచెనాదేవి। ఆడేటిసాగటాలు అటుపారవేసి
పాన్పుమీదికొచ్చెను పద్మాయతాక్షి। గుర్రిచ్చికాగాలించియెత్తితోడనుంచి
అటుకులుచక్కిలాల్మంచివస్తువులు। యీమాటమాఅమ్మకు చెప్పిపంపితేను
యీక్షణము తెప్పిస్తు యిందీవరాక్షి। పాలపళ్ళుమంచిఖర్జూరయములును
యీక్షణము దెప్పిస్తుయిందీవరాక్షి। అనాడునీమేడకొస్తినేదేవి
చాలచిక్కుంటివే చదరాలనీవు। అనాడునీవద్ద నేపవ్వలిస్తె
చాలచోటాయెనే చదరాలనాకు। యీనాడునీమేడలోస్తినేదేవి
చాలనిండుంటివే చదరాలదేవి। నీనుతులునీవును పైబవ్వలిస్తె
పాయలక్రిందనే నేపవ్వలిస్తు। రాజాధిరాజులకు విన్నపముయ్యె
రాజులల్లుళ్ళకు విన్నపమయ్యె।రమణులకునందరికిదీవెనలయ్యె
ఆమాటమీరేలఆజ్ఞ జేసేరు। మామీదదయవుంచి మమ్మురక్షించు
దండంబుదండంబు నీకురఘురామ। యీపాటపాడినా విన్నానుగాని
యిహపరంబులయందుసుఖముజెందుదురు।
మోక్షమిచ్చునుమీకు రామచంద్రుడు॥

——

# 46 గంగా గౌరి సంవాదము.

శివశరణ మాంపాహి శివశరణ పోమా। శివశరణ మనపాల శివునకు శరణు
గురుశరణ మాంపాహి గురుశరణ పోమా గురుశరణ మనపాలి గురువునకు శరణు
హరిశరణ మాంపాహి హరిశరణ పోమా। హరిశరణ మనపాలి హరునకు శరణు
యెక్కెన గౌరమ్మ యీలనందిమీద। కోసిన పూలన్ని కొమ్మవిరవకను
ముడిచెను జాజిపూలు ముందుగా తాను। ముడువ మిగిలిన పూలు పళ్ళెమునుంచి
పంపెను గవరమ్మ గంగ మేడలకు। వాడిన పూబంతి పనికిరాదమ్మ
పడలిన పూబంతి సవతిరావమ్మ। చాలకుంకేతెన్న సరిగొల్లలాడు
సరిగొల్లలాడను సరిదానవటవే। సరిదాన్ని కాకుంటె శివుడేల తెచ్చు
శివుడేల తెచ్చును జగమేల మెచ్చు। శివుడికిచ్చిన్నాలి నీకు చెల్లెలను
తిన్నానతని సవతి గుండెల్లు గల। అక్కమీపాదాలరాలిన వన్ను
పందుల్ని గట్టిస్తు గొందుల్ని గడుదు। కోడుకు వీరన్నకు కోటగట్టిస్తు
కోడలికు ద్రాదిప్రికి మేడకట్టిస్తు। బసవన్న కడుకు సేసంచటరుగేస్తు
శివునికి శివపూజ గద్దిగట్టిస్తు। నీకునా కుఅనగ సరిగద్దెకడుదు
సరిగద్దెకట్టను సరిదానవటవే। సరిదాన్ని గాకుంటె శివుడేల తెచ్చు
శివుడేల తెచ్చును జగమేల మెచ్చు। శివుడికిచ్చిన్నాలిని నీకు చెల్లెలను
తిన్నాము తిన సవతి పళ్ళస్నిరాల। అక్క మీపాదాలరాలిన పళ్లు
కూర్చుండి యేరిస్తు గుండుగంపలను। నిలుచుండి యేరిస్తు నిలువు గంపలకు
పండుండి యేరిస్తు పకటయిన లేక। పిన్నలకు పెద్దలకు పెద్దలకు నీవు పంచి పెడితె
పసిపుత్రిబాలాలకే పంచి పెడుదు। సమముగా పంచి పెట్ట నీవు సరిదానవటవే
సరిదాన్ని కాకుంటె శివుడేల తెచ్చు। శివుడేల తెచ్చును జగమేల మెచ్చు
శివునికిచిన్నాలిని నీకు చెల్లెలను। అనిపలికి గంగమ్మ జానెను మేడలకు
అంతట గవరమ్మకు చెంగతనూసె। ఉదకాలజాడలు కానరావాయె
తనకొడుకు వీరన్నను గ్రక్కున బిలిచి। రావోయి వీరన్న రాజశేఖరుడా
వయసు గలిగి వర్ధిల్లు నీవు వీరన్న। ఉదకాలజాడలు కానరావాయె
ఉదకాలజాడలు చూచిరా కొడక। అటుబోయి వీరన్న ఆకొలను జూచె
ఆకొలను ఉదకాలు దాచింది గంగ। ఇటుబోయి వీరన్న ఈకొలను జూచె
యీకొలను నీరంత దాచింది గంగ। చిలకసముద్రమున జాడచిన్న పెత్తు లేవు
పాలసముద్రంజాడ పాతికత్తు లేవు। ఎచ్చట తిరిగినా వుదకంబు లేదు
వీబూదిగుండాన యింకిపోయినవి। మల్లయ్య గుండాన్ని మరిగిపోయినవి
పసతులగుండాన చట్టు పోయినవి। వెళ్ళెను వీరన్న గంగ మేడలకు

శివపూజమాతల్లి చేసుకోలేదు । ఉదకాలజాడలుకానరావాయె
ఉదకాలజాడలు మిమ్మడుగమనెను । మీఅమ్మతక్కువేమినాయెక్కువేమి
పుట్టించగిట్టించ శివుడుకర్తగును । నోచిననోములకుగౌరితాకర్త
యేప్రొద్దుగంగతో యెదురువాదమ్ము । కూడదనిచెప్పుమీఆగౌరితోను
యీప్రొద్దుగంగకుతా మొక్కుమనుము । గంగసమ్మతిచేతఘనఉదకమిచ్చు
నదులన్నినిధులైనిండుండునయ్యా । స్నానపానమ్ములుసకలజపములు
నీరుంటెనెరవేరు నెలమివీరన్నా । మీతల్లిస్నానంబుఅటుజేయవచ్చు
అనిచెప్పవీరన్న తల్లి మేడలకు । చనిదెల్పెనీచక్కప్రదమంబుగాను
మీయమ్మతక్కువేమి నాయెక్కువేమి । పుట్టించగిట్టించశివుడుకర్తగును
ఆయుష్షుపోయుటకు బ్రహ్మకర్తయెను । అందర్నిరక్షించవిష్ణుకర్తయెను
నోచిననోములకు గౌరియేకర్త । ఆనీళ్ళజాడకు గంగతాకర్తా
యేప్రొద్దుగంగతోయెదురుకయ్యమ్ము। యేప్రొద్దుగంగతోయెదురువాదమ్ము
కూడదనిచెప్పుమీ ఆగౌరితోను । యీప్రొద్దుగంగకు తామ్రొక్కమనుమీ
గంగసమ్మతిచేతఘనవుదకమిచ్చు । నదులన్నినిదులన్నినిండుండునయ్యా
స్నానపానమ్ములు సకలజపములును । నీరుంటెనెరవేరునెల్లవీరన్నా
నీతల్లిస్నానమ్ముఅటుజేయవచ్చు । అనిచెప్పుమనిచెప్పెనమ్మరోయనగ
ఆపల్కులువినిఅంబతాసంతులో । కంటనునీరుంచికఠినంబుగాను
నీచదానింటికిపోలేనుకొడకా । జాలారిదానితో పొత్తేలనునకు
నీవైయునపోయిరాముద్దువీరన్న । వెళ్ళెనువీరన్నగంగమేడలకు
యొన్నడునామేడయెరుగవుతండ్రి । యేమిపనికొస్తివినీవువీరన్న
అనిబల్కవీరన్నగంగతోజెప్పె । ఐదుదినములనుంటస్నానంబులేదు
ఆరుదినములనుంచి శివపూజలేదు । శివపూజమాతల్లిచేసుకోలేదు
ఉదకాలుజాడలూ కానరావాయె । ఉదకాలజాడలు నిన్నడుగమనెను
మీయమ్మతక్కువేమినాయెక్కువేమి । ఆమెకంటెనువతి నాయందుకద్దా
ఊదకాలుజాడలునేనెరుగననెను । ఆమాటవీరన్నవిని నుండిపడుతు
తలపగులకొట్టేను చంపినేనెను । యమభటులకునిన్నునప్పగించేను
యమదండనలనిన్ను చాలజేతును । వద్దువద్దువీరన్నవాదమ్ము నాతో
పోవోయివీరన్న పొంకమ్ముమాని । వచ్చెనువీరన్న తల్లిమేడలకు
యేమనిదెల్పెరా యెలమిగంగమ్మ । మీయమ్మతక్కువేమి నాయెక్కువేమి
ఆమెకంటేఘనత నాయందుకద్దా । ఉదకాలజాడలు నేనెరుగననెను
ఆమాటవిని పుర్మాద్దేవిదిగులంది । యెందుకీవైరమ్ము యేమిపాపమ్ము
దైవవిధిగనుపసులరమె యెవ్వరికి । శివునికిచిన్నారి శిరసెక్కగనక

ముచ్చట్లమురియుచు ముదితకూర్చుండె । అనితానుతలబోసి తాపయనమాయె
ముందరనువీరన్న వెనుకగణపన్న । యిద్దరినడుమను గౌరితానడచె
గవరప్పరాకలు గంగిప్పజూచి । కంచనచేతూటకు వనితతాదలచి
పచ్చిచేపలుదెచ్చి పందిళ్ళువేసె । గొండుచేపలుదెచ్చి తోరణాలుగుచ్చి
పెద్దచేపలు పంచెటయగులుగట్టె । కప్పజచ్చిననీళ్ళు కళ్ళాపిజల్లె
చేపజచ్చిననీళ్ళు చెయ్యితాగడిగె । యెన్నడునామేడ యెరుగవూ అప్ప
ఏమిపనికొస్తివీ నీవుగవురప్ప । ఆమాటలువిని వారువాణిజెప్పె
అయిదుదినములబట్టి స్నానమ్ముశేసు । ఆరుదినములనుంచి శివపూజలేదు
శివపూజఅయినాను చేసుకోలేను । ఉదకాలుజాడలు కానరావాయె
ఉదకాలజాడలు చెప్పగంగమ్మ । వుదకాలజాడలు నేయెరుగనెను
నాకొడుకువీరన్న నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగ
నీకొడుకువీరన్న నాకొడుకుగాడా । వుదకాలజాడలు నేనెరుగనక్కా
నాకోడలుభద్రగిరిని నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగో
నీకోడలుభద్రగిరి నాకోడలుగాదా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాకున్నరవికెలు నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నరవికెలునాకునులేవా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాకున్నచీరలు నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నచీరలు నాకున్నలేవా । వుదకాలజాడలూ నేనెరుగనెను
నాకున్నసొమ్ములూ నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్నసొమ్ములూ నాకునులేవా । వుదకాలజాడలు నేనెరుగనెను
నాఒక్కశివుని నీకిస్తుగాని । వుదకాలజాడలు చెప్పవేగంగా
యిప్పుడన్నామాట తప్పకుమిఅక్కా । యీమాటకుసాక్షి యెవరినీబలికె
భూమిఆకాశమ్ము అవిరెండుసాక్షి । మద్దులుదూరేళ్లు అవిరెండుసాక్షి
సకలదేవతలువారెల్లసాక్షి । అనుచుసంతోషించి గంగప్పతాను
గుప్పుగుప్పునగంగ వుప్పొంగుచును । యేరులన్నీచాల యేకమయినిండ
గౌరిస్నానముజేసి శివపూజజేసి । శివుడొచ్చురాకలు గౌరితాజూచి
కుడిగాగరిమ్మనబెట్టె గవరమ్మతాను । భోజనతలుపెట్టు మేలాయెనక్కా
భూమియూకాశమ్ము వారైరసాక్షి । సుద్దులూమూరెళ్లు అవిరెండుసాక్షి
సకలమైనదేవతలు వారెల్లసాక్షి । యీశ్వరాగవరప్ప యిచ్చెనునిన్ను
అనిచెప్పశివుడప్పుడుఅందరినిగలిచి । సాక్ష్యంబుమ్మచ్చని పకియగౌరితో
మీకిద్దరకుకలహంబువద్దని । పలుకవారంతసఖ్యులై పొరలుచుండిరిగ

దుడుకున బాధించిదుఃఖపెట్టించె । అనిధర్మనందనుడు ఆనినమాటలకు
వినియు నావిష్ణుండు వివరముగబలికె। వినవోయి ధర్మజా బహుళచింతలును
పోయేటిరొకవ్రితం ఆనతిచ్చెదను । భాద్రపదమాసమునశుక్ల పక్షమున
చతుర్దశితిథియందు అనంతువ్రితము । దానిప్రభావంబుదగ నెరిగింతు
యమునానదికినేగిపూజగావించి । పంచవన్నెలముగ్గు లమరబెట్టించి
సప్తఫణాకారసహస్రమూర్తి । కావించిఆపూర్ణకలశమందుంచి
పుష్పగంధాక్షతలపురుషోత్తముని । ధూపదీపములిచ్చినయివేద్యమిచ్చి
పవిత్రముగకుంకుమబొట్టుబెట్టి । పద్మాలుగమూరవస్త్రంబుగట్టి
అచ్చగోధుమపిండివంటకంజేసి । హెచ్చగువిప్రునికొకదానమిచ్చి
తోరితోరముచేతకొనగట్టుకుని । విష్ణుండ నేనుసుమికృష్ణుండ నేను
శివుడున నేనేనబ్రహ్మయును నేను । సూర్యుండ నేనుసుమిచంద్రుండ నేను
అష్టవసువులు నేను శేషుండు నేను । ద్వాదశాదిత్యులుయేకాదశరుద్రులు నేను
యాగంబులు నేనుయజ్ఞములు నేను । ప్రీతితోవేసేటిపిండాలు నేను
అర్థులకుబెట్టేటిఅన్నమ్ము నేను । ఋగ్వేదమ్ములుయజుర్వేదములు
నేనువేదమ్ములుసర్వమున్నేను । అథర్వణవేదంబులర్థమ్ము నేను
అక్షయంబగుచున్నఆవటముక్రింద । ఆర్తితోకుడిచేటిబ్రాహ్మణుడ నేను
అశ్వత్థవృక్షమ్ముఅవనిలో నేను । మార్గశిరమాసమ్ముమహిమీద నేను
వారములలోకెల్లవిశేషమైన । భానువారము నేనుపార్థివోత్తముడ
యున్ని నేనగుటకుయిదినిశ్చయంబు । ఇంతినంతసందేహమిసుమంతలేదు
నల్లకలువలబోలుచాలికన్నులును । పీతాంబరధారినిపురుషోత్తముడను
శ్రీవత్సలాంఛనంచెన్నగలవాడ । అజానబాహుడఅనంతుడనుపేరు
కృతయుగపుకథయొకటిగలదుచెప్పెదనుకలదుసుమంతుడబ్రాహ్మణోత్తముడు
ధర్మపతియనునొకయింతిపెండ్లాడి । ధర్మార్థకామమోక్షంబులుజరిపి
సద్గుణశీలనొక సుతనుతాగనిరి । సుతకుసుశీలయని నామంబులిడిరి
దైవవశంబునదేహంబువిడచి । సతియుమరణంబయిజనెనుకైలాసం
కర్కశయనుపేరుకన్యకనుదెచ్చి । చేసెనపరిణయంనుమంతునకును
కర్కశదినదినంయిల్లిల్లుదిరిగి । కలహంబుబెట్టునుకడుప్రేమతోను
వీధివీధులవారువెరచిపోయినను । వాడుశేవనిపెక్కువాడలేదిరుగు
తోసెమ్మనీవునాతోవోడితివనుచు । ఆశమ్మరమ్మనుచుకాల్దువ్వుచుండు
వెలపెట్టికొన్నట్లువీధివీధులను । కలసిజగడముదెచ్చుకర్కశెప్పుడును
సుశీలపెరుగ బ్రాహ్మణునియింట । కన్యయున్నదనికౌండిల్యునకుదెలిసి
పరిణయంబగుటకువచ్చెనచ్చటికి । వచ్చినమునికితగవందనంజేసి

అర్ఘ్యపాద్యంబిచ్చి ఆసనంబిచ్చి । పెద్దలుంచిన శుభముహూర్తమున
వేదోక్తవిధముగా పరిణయంజేసె । భార్యను బిల్చి గూ వేదబ్రాహ్మణుడు
సుతకు కట్నము యేమియిత్తామనెను । సుతకు పెండిలి యెట్లు జేయుదామనెను
పతిమాటలకు సతి ఆగ్రహంజెంది । పండ్లుపటపటగొరికి తల్పుమూయంగ
కూతుని అల్లునికి పారేమి లేదు । పేలపిండి యిచ్చి అంపెదననుచు
పిండిమూటయుంగట్టి బిడ్డకునిచ్చి । పంపెను కూతుర్ని తనపతితోడ
బంగారు రథమెక్కి మునితోడగూడి । పరగు సంతోషాన మునియానంచేసె
మార్గమధ్యంబున ఆయమునదరిని । పురుషులును స్త్రీలును నిండియుండగను
యిచటుండ కారణంబేమని నారినడుగ । అనంతుని వ్రతము ఆచరించితిమి
కాంతలనడిగెను మానీశ్వరుండు । యీవ్రతము తెరగెల్ల మాకు దెల్పుడి
అనగ వనితలు మునికి అనతిచ్చిరి । భాద్రపదమాసమున శుక్లపక్షమున
చతుర్దశి తిథియందు భానువారమున । యమునానదికేగి పూజమరజేసి
పంచవన్నెల ముగ్గులమరంగ యుంచి । సప్తఫణాహారమూర్తి గావించి
పూర్ణకలశంబు నటిపాలుపొందనిల్పి । పుష్పగంధంబులు అక్షింతలను
ధూపదీపము నిల్పి పూజింపవలయు । ముఱ్ఱనికుంకుమ పట్టొంటిబెట్టి
పధ్నాలుగు మూర కాలువ యుంగట్టి । అచ్చగోధుమపిండి వంటలుండేసి
హెచ్చయినవిప్రునికి దానంబుయిచ్చి । కోరితోరము హస్తమందునగట్టి
భుజియించవలయును భూసురోత్తమున । అంతట హారుండు అతివేడ్కతోడ
యింటికి జనుదెంచి యింతితో గూడి । యమునానదికిబోయి స్నానమ్ముజేసి
వ్రతములు జేసిరి పృథివంత మెచ్చ । ఆతని విష్ణుడు మెచ్చి ఆ విష్ణుండు
కుటీరములు దివ్యభువనంబులాయె । రత్నాలరాసులతో నిండియుండెను
నవరత్న సొమ్ములు ముని భార్యబెట్టె । సుశీలతో గూడి శుభలీలనుండె
సతి చేతనున్నట్టి తోరంబు జూచి । పతికి గర్వంబు వచ్చి పణతి కట్టినదెను
కంకణములాదిగా కరమునను వెలుగ । నూలుదారంబేల ఓనారినుశిరో
అనుచు కోపంబు వచ్చి హస్తంబు చేత । తాదెంపి మంటలో పడవేయగానే
యీమాత్రమును హీమచే నల్లభుకవిసర । అనంతుడు మనకిచ్చె నఖిలసంపదలు
అనుచుమండెడు అగ్నిలోనాలుదీసి । సుశీల తావైచె క్షీరంబునందు
పశువులను దొంగలు తోలుకొనిపోయి । యిల్లుహుతాశనునకు వెల్లువాయె
వెళ్ళిన భాగ్యంబు వెళ్ళులకడను । కుడువ కూడును లేదు వస్త్రంబు లేదు
సతివిడవిడచి విప్రుడతికష్టపడుచు । పళ్ళతో నిండిన చూతవృక్షమును
చూచికనుగొంటివా అనంతునీయనిన । కానననితాదల్పె చూతవృక్షంబు
కొంతదూరముబోయి ఒక గజమును చూచి । గజమనీ వెరుగుదువ అనంతుననెను

తెరుగగననిదేమనుచు ఋషితోడబల్కె । వృషభము గార్దభమారెండుగన్పడగ
చూచితిరేమాయనంత దేవునియనగ । తెరుగమనియారెండుయేర్పడగదెల్పె
అవురేగ నిఁజూచె నంత బ్రాహ్మణుడు । దేవునిజూచితిరే ధేనువాయనగ
తెరుగగననియదిదెల్పె విప్రునికపుడు । యెండలకొండల యిలసలచుజెంది
పారుండువడదగిలి పుడమిపైబడగ । వృద్ధరూపంబున యావిష్ణుమూర్తి
ఋషికితానెదురయి నిల్చుండియడిగె । అలసియాసొలసియా అన్నమిటులేక
కారడవులలోదిరుగ కారణంబేమి । చేరువదేవేంద్రపట్టణంగద్దు
పోయిభుజించుమా ఋషివర్యయనిన । వెళ్లెనుబ్రాహ్మణుడు దివ్యనగరమునకు
నవరత్ననిర్మితనగరు గనుగొనియె । ఆడెడురంభలు అప్సరస్త్రీలు
తుంబురులునారదులు గానములుసేయ । శేషపర్యంకమున బ్రహ్మాండమూర్తి
శ్రీదేవిభూదేవి పాదంబులొత్త । దర్శనంబిచ్చెనాధరణిసురునకు
పూర్వజ్ఞానంబున దెలిసిబ్రాహ్మణుడు । ఓపుండరీకాక్ష జేచక్రహస్త
జేజగన్నాధయో గోపాలకృష్ణ । అనుచుస్తోత్రముజేయు నామురవైరుండు
మూడువరములుగోరుమీకిత్తుననగ । సతిసుతబాంధవులు గల్గనొకవరము
అష్టధనములుగల్గ రెండువరములు । మూడువరములతో సాయుజ్యమిమ్మ
యిభరాజవరదుండు యిచ్చెవరములు । వరములనుహిచేమఁకలిబ్రాహ్మణుడు
అడిగెనుబ్రాహ్మణుడుఅనుమానములు । ఓభక్తకల్పకా దేవదేవేశ
విందుగాకాపెనేనేచూతవృక్షంబు । పండయినముట్టదేపక్షిక్కటయిన
ఆచూతవృక్షంబువేదపాఠకుడు । శాస్త్రమెవ్వరికినీచెప్పకయున్న
అతనికియీగతీఅనతిచ్చితిని । యేనుగనుజూచితినియో దేవదేవా
యొకరాజువాదముచేయుజరంబాయె । గార్దభముజూచితినికరుణాకరుడా
యీవియివ్వనివానికీగతిగల్గె । అబోతుజూస్తినీవారివారీయనిన
హుంకారమనియేటిఅదిజీవరాశి । అనిఆవిష్ణుండుఅన్నమాటలకు
సంతోషమునుజెందిపాండవాత్మజులు । ధర్మజాడుజేసేనేఈపుణ్యవ్రతము
పోయినారాజ్యంబు అష్టసంపదలు । యిచ్చెనువిష్ణుండుయీప్సితార్థములు
వందనంజేసిరివరాహరూపునకు । కృష్ణజేకృష్ణజేకృష్ణమ్మదలకు
యిష్టసంపదలుమాకిచ్చిరక్షించు । పాపములపసద్రోబిమమ్మురక్షించు
కాళింగమర్దనుడకాచిరక్షించు । గోపికావల్లభా శ్రీపద్మనాభా॥

# 48 ఉషా స్వప్నము పాట.

(ఆటలన్నియూ గలవు)

అన్నంబుదినరాయె నాటలకుబోదాయె । నట్టినిలుచుండునంత
నిదురబోదాయెను నీరంబుగొనదాయె । నేలబున్నుండునెపుడు
కలువరింపుచునుండు గలకంటినవ్వుచుండు । పలుకదెవ్వరితోడను
పూలుగోయదాయె పుష్పాదుల్గొనదాయె । బుద్ధినిలకడనేయదు
పన్నీరుగొనదాయె పరుపుముట్టదాయె । పాటలుపాడదాయె
కథలుచెప్పదాయె కబురులాడదాయె । కాంతలతో కూడదాయె
సుందెనగిదియాడదు గుడిగుంజలాడదు । దాగుడుమూతలాడదు
ఊగెయ్యాలాడదు దాటుబిళ్ళాడదు । గట్టుమీదకోడియాడదాయె
నెత్తినగాళ్ళాడదు వాత్తిచేతులువేసి । కత్తిబదాటాడదు
వామనగుంటలాడదు పాచికలాడదు । వాంలాటలాడదు
బంతులాటాడదు పరచజల్లినయట్టి । చింతగింజలాడదు
బొమ్మలాటాడదు బూజమాటాడదు । నిక్కసిళ్ళాటాడదు
నాయ ప్రసవరమును నాకదెమ్మనునాట । సయముతో తానాడదు
వానవానచెల్లప్ప వాకిలదిగుచెల్లప్ప । యనెపాటలాడదెపుడు
చల్లోయమ్మచల్లలని స్తంభములుపట్టుకుని । గొల్లాటలాడదాయె
వెన్నెలాత్తాడదు వెలదులనుకూడుకొని । వెసగద్దుకదురాడదు
కాళ్ళగజ్జెయనుచు కంకణమ్మెయనుచు । కాంతతానాడదాయె
కేగుచుక్కయని వెలగమొగ్గయని । వెలదితానాడదాయె
దోపిడీపుల్లయని దొంగాడిపుల్లయని । తొయ్యలియాడదాయె
చిన్నిబిన్నెంతగద్దు సింగరగొరెంతగద్దు । తాకిబేకెంతగద్దు
కానురమొగల్లోయని తద్వాటలాడదు । తరుణిటెన్నాటాడదు
చెమ్మచెక్కయని చారడేసిబుక్కయని । సఖియతానాడదాయె
అట్లుపొయ్యంగనని ఆరగించంగనని । యతివతానాడదాయె
దాచుకోమూచుకోసంబారిబుడ్డియని । తరుణితోబంతాడదు
చిత్రరేఖయనునాడిచెలికత్తెదరిచేరి । చెలియతోనిటులబలికెను
పూర్వరీతినేకపోలికంతయుమీరి । పూబోడియెటులుంటివె
నీకుగలిగినకలయు నీమదిగలకోర్కె । నెలతనాతోజెప్పవే
సుందరుడెవ్వడో చూరగొనెనీమనసు । సుందరాంగిరొపల్కవే

వేలనీవీలీల నెడదచింతింగ। నెలమినాతో దెప్పవే
చెలికత్తెకడనిటులచెప్పకుండుటతగదు। చెలగిసత్యముజెప్పవే
ఎన్నడుయిటువంటి కెరుగవుసేకిటు। లేటికే చింతింపగా
దుస్స్వప్నమాయెనో ధూళిపడనాయనో। దోషంబుబాయకొరకు
రక్షరేకునుగట్టిరమణినుంతించి। రాత్రిధూతీయుసంగెవ
తాయెత్తుగట్టినను తరుణిరో చెప్పవే। తగగటులకృతియించగా
అనినవ్వుచుధూతనుంట లేదతివరో। యాత్మచోరుడువచ్చెనే
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। అతివయిందుడువచ్చెనా
అనగానెకాదమ్మయింద్రినాయకునన్న। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుని। యబ్జభవుడేతెంచినా
అనగానెకాదమ్మఅబ్జసంభవునన్న। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తెఅంతయును దెలుసుకొని। యార్యావిభుడువచ్చెనా
అనగానెకాదమ్మవాయుడంచుబల్కినను। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యాజయంతుడువచ్చెనా
అనగానెకాదమ్మ యులజయంతునినన్న। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును। దెలుసుకొనియలవసంతుడువచ్చెనా
అనగానెకాదమ్మయావసంతునినన్న నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యాకుబేరుడువచ్చెనా
అనగానెకాదమ్మ యక్షేశుననివచో।నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యబ్జబంధుడువచ్చెనా
అనగానెకాదమ్మయబ్జబంధుండనిన। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యానిశాపతివచ్చెనా
అనగానెకాదమ్మ యానిశాపతికన్న। నతిపాపముబ్బునాకు
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యంబుజాక్షుడువచ్చెనా
అనగానెకాదమ్మ యంబుజాక్షునిరూప। మనుచునేకొంచెముగను
అనగానెచెలికత్తె యింతయును దెలుసుకొని। యామన్మథుడువచ్చెనా
అనగానెకాదమ్మయామన్మథునిరూప। మమరెచాలవరకు
అనగానెచెలికత్తె యింతయులు దెలుసుకొని। యనిరుద్ధుడేతెంచెనా
అనగానెకానంచు నవ్వునంచుబల్కెక। యతివశిరమూనువంచెను
చేతితో దలయొత్తి చెలికత్తెనవ్వినను। సిగ్గుచే దలయొత్తదు
కాలివేలితోడ నేలనురాయుచును। కాంతదాతలయొత్తదు
వయిటసవరించును పాపిడినిదిద్దును। పడతితాతలయొత్తదు

మురుగులొత్తుకొనుచు ముక్కెరనుదిద్దుచును । ముదితాతిలకయెత్తదు
కురులుదిద్దుకొనుచు కొప్పుసవరించుచు । తరుణితాతలయెత్తదు
ముఖముపైచెమ్మటను మువముతో తుడుచుచును । సఖియతాతలయెత్తదు
రత్నాలహారమునురదనమున దొరుకుచును । రమణితాతలయెత్తదు
రవికముడిగిల్లుచును రాయిడికినొక్కుచును । యువిదతాతలయెత్తదు
అట్లుండచెలికత్తె యంతయును దెలుసుకొని । యామెతండ్రికినిట్లనె
అయ్యానీపుత్రికకు యవ్వనమువచ్చెను । అనిరుద్ధుమీదిప్రేమ
కలగాంచనిత్యమును పలవించుచున్నదిక । కౌతుకముసేయవలయు
అన విని బాణుండు హర్షంబుమితిమీరి అట్లనేచేతుననగ
ఆమాటచెలికత్తె యామెయొద్దకుబోయి యంతయును దెల్పగాను
ఆకొన్నమనుజునకన్నంబుదొరకిన । ట్లామె సంతోషమొందె
పేదకునులభియించు పెన్నిధివిధంబునను । వెలదిసంతోషమొందె
దగగొన్నమనుజునకు దాహంబుదొరికిన । చందమున సంతోషమొందె
నడిరేటమనుజునకు నావదొరికినయట్లు । నాతిసంతోషమొందె
పడగొన్నసస్యంబు వానదడిపినయట్లు । వనితసంతోషమొందె
తరువాతవారికిని తనరవివాహమై । ధరణిసంతోషించిరి
ఈపాటపాడిన కన్యలకునుపెండ్లి । కావచ్చు హరికరుణను

# మైరావణచరిత్రపాట.

రాణువపోయెను రాజ్యముపోవును । రామయుద్ధమందు ఆహా!
పరబలమునసే మిగిలియుండినను । బ్రతుకుతెరవుతగునా
రాముడునరుడని తలచినందులకు । రాపిళ్ళయ్యెనుగా
కోటిలోనతల దూరిచియిప్పుడు । కోకటికైవెరపా
కలదుగదానొకమిత్రుడునాకు । బలవంతుండతడు
పాతాళంబునరాజ్యమేలుచు । ప్రబలియుండువాడు
నవరత్నంబుల దగద్ధగితమగు । సింహాసనము
దానిమహిమచే నాతడేలుపా । కాళముగడగడగా
ఆపదిమిత్రము సంపదిమిత్రము । అతడేయాజాడ
ఆపదధర్మోద్ధారకంబుగా । నతనిదల్తునిప్పుడు

## రావణుడు ప్రతాపలంకేశ్వరుని దలంచుట.

దలపుదలపులో తగిలియుండగనే । తనయెదుట నతడు
ప్రతాపలంకేశుండను వాడు । పనియని యడుగుచును
వానిజూచి సంతోషముగను రా । వణుడు పల్కెనపుడు
రాముడపోయెను రాజ్యము పోవును । రాముయుద్ధమందు
వరబలమున నే మిగిలియుండెనట । బ్రతుకు తెరవు తగునా
ఆపల్కులువిని యతిరౌద్రముతో । యనియెనతండిట్లు
వరపులస్త్యునికి పరపౌత్రుండవు । పాడియయ్యెయిట్లు
దీనజనునివలె దీనతబల్కుట । మానుమయ్యయిపుడు
నాజీవంబును ధారపోతుని । ర్ణయము చెప్పుమనగ
రామలక్ష్మణులు శూర్పణఖను జూచి । రముగదరిగినారు
దానియేడ్పువిని చెవులు తెగుటగని । నేనుపోతినటకు
మారీచుడునా వెంటవచ్చెకదు । మండిభటుండతడు
వాడులేడియై మాయజూపగా । వానిపడతిసీతా
లేడినితెమ్మని రామునిచాలా । వేడగానునతడు
మాయలేడియది మనకేలనగా । మటపినదు సీతా
అంతట వాడదు రాగ లేచిపోయె । మాయదారితీసె
రాముడుదానిని వెంటపగిలి యిట । రాకయుంటజూచి
మరదిలక్ష్మణునిపంపె నచ్చటికి । మహిళామణియంత
ఆమె ఒంటరిగానుండగనుంగొని । కామార్థతి నేను
పోయి విమానముపైనెక్కించుకు । పోతినతిపగొనుచు
క్షత్రియవీరుడు రామనరుడు నను । చంపి సీతగొనగ
యెత్తువేసెనొక పెద్దయెత్తు యది । యేమనియడిగెదవా
ఎరుగుదుగద వాలిశూరుని । హితుడంచునతడు
అతనిజంపి వాతనిసతినిసుగ్రీవున । కితడొసంగినాడు
దానితోడ సుగ్రీవుడుకోతుల । దానమొసంగినాడు

## హనుమంతుడు వార్ధిదాటుట.

వారిలోన హనుమంతుడొక్కడు । వార్ధిదాటినాడు
లంకజేరి, మనలంకిణిజంపియు । లలనసీతవార్త
రామలక్ష్మణులకెరిగించియు పో । రాటబెంచినాడు
వారధిదాటగ కోతిమూకచే । వార్ధిగట్టినాడు

దడదడదడదడదడ ధవుడాయించుచు । తరలెకోతిమూక
వందలు వేలు లక్షలకోలదిగ । వచ్చిచేరి లంక
దణదణదణణదధవుడుచేసిరి । దండుగట్టుకొనుచు
మంత్రిప్రహస్తుడు చిటికెలోన । మటుమాయింబైనాడు
అతికాయుండును మహాకాయుడును । అకంపనపుత్రుండు
మకరాక్షుండు మహోదరుండును । మహాపార్శ్వకుండు
కుంభనికుంభులు ఇంద్రజిత్తును । గూడిన పుత్రికులు
హతమైనారని రావణుండు తా । హాడలియేడ్వగాను
మిత్రుడు కన్నుల నీరుదెచ్చుకొని । మేనుగదలగాను
చెప్పవైతివే దలపవైతివే । చెనటినరుండెంత
అనవినిపౌలస్త్యుండనె నిట్టుల । నతడునరుడుగాడు
మనవిభీషణుడు వానికూడికడు । మంతనంబుసల్పి
రాజ్యమిట్టిగతి దెచ్చినాడునుము । రాముడులేకుంటే
లంకదాటియిటు కాలుపెట్టుటకు । జంకకుంపలేదు
బొటబొటబొట కన్నీరుగారగా । హాడలుచుదుఃఖింప

## ప్రతాపలంకేశ్వరు డోదార్చుట.

గని ప్రతాపలంకేశుండిట్లనె । వనటమానుమయ్య
నేటిరాత్రియే రామలక్ష్మణుల । వీటబుచ్చికాళి
కాలయంబునను బలియిచ్చెదమహం । కాళిదేవికిపుడు
అపలుకులువిని యానందముతో । ఆరావణబ్రహ్మ
మంచుకొండవలె పొంగిపోయెను । మంచువిరిగినట్లు
తనమెడనున్న చంద్రహారమూ । తనిమెడజుట్టుచును
దండము దండము దండమనుచు పడి । తడవలు పొగడగను
పాతాళేశ్వరుడప్పుడుపోయెను । పాతాళంబునకు
పోయిరాములను పట్టితెచ్చుటకు । పోదమనుచుతలచి
బహుప్రయత్నములు సలుపుచుండెనట । భవ్యులతోనిచట
దెబ్బతినినపులి రావణాసురుడు । బొబ్బరించుచిపుడు
రాడు, రానికారణమేమోయని । తోడివారలెల్ల
నాలోచించ విభీషణుండు తా । లోనికేగియపుడు
తనప్రియురాలిని సరమజూచి తా । రణమేమునియడుగ
సభకువచ్చి సుగ్రీవాదులతోనిటు । సలిపె భాషణంబు

రావణునికి పాతాళవాసి మై । రావణుండుగలడు
మాయలమల్లుడు మోసగాడు బలు । మాటకారియతడు
రామలక్ష్మణులమోసవృత్తిచే । రాత్రిపూట యతడు
దొంగిలించుకొని కాళిదేవికి । బలిపెట్టెదననుచు
చెప్పిపోయె మనకేమిదారియని చిత్తవ్యాకులుండై
బలికిన నందరు వాదుగాలివిని । భయకంపితులైరి

## హనుమంతుడు శ్రీరామలక్ష్మణుల కాపాడుట.

తుదకువిభీషణుడిట్లనె హనుమం । తుని ముఖంబుజూచి
నీవలన నెగావలె యేపనియైనను । నీకంటెను ఘనుడు
స్వామిభక్తుడును బుద్ధిమంతుడును । సచ్చరితుడుగలడె
సుగ్రీవాదులు జాంబవంతుడును । స్తోత్రములొనరింప
పొంగుచు పెంచెను హనుమంతుడప్పుడు । పూర్ణముగనులోక
పాతాళాంతరముననుండియు నది । బర్వె సకలలోక
వ్యాప్తంబై బ్రహ్మాండమంతటను । ప్రబలుచుండెనపుడు
ఆవాలంబున కట్టె కోట భువి । నంటనుండుచోట
అచ్చటనుంచెను రామలక్ష్మణుల । నంటముట్టరాక
పారాకుండిరి వానరకోటుల । ప్రబలి చుట్టుజేరి
పోటుబంటుడై జాంబవంతుడును । చాటుమాటుగాను
పారాయిచ్చుచు వచ్చిపోయెడి । వారినిగనుచుండె
సుగ్రీవాంగద గంధమాధనులు । సుషేణులుగ స్త్రీలు
తిరుగుచు మరుగుచు చూచుచుండిరి । తెరపిలేక యెపుడు
వేగుమాపుతో దిరుగుచుండె వి । భీషణుండుచుట్టు
ఇట్టులవానర వాలపుకోటను । గుట్టుచెడకయుండ

## పాతాళలంకేశ్వరుడు రాముల దొంగిలింపజూచుట.

పాతాళంబున మైరావణుడు । జాతదయాపరుడై
రావణబ్రహ్మకు మాటయిచ్చిని । రామునిబట్టంగ
విప్రకెందుటిది మిత్రధర్మమా । నిందవచ్చుననుచు
మూడవజామున నిద్రించి సతి । మోముజూచునంత
ఆడదాననని యుగడుసేయకుడు । ఆడిదప్పనొకమాట
మీరుమానసులో రామునిబట్టగ । కోరుచుంటిరాన
రాముండీశ్వరునవతారమ్ము । సీతయాదిశక్తి

వారిబట్టగాబోయిచెడెను రా । వణుడులంకతోడ
గోలుపోయెపుత్రులను బంధువులు । గోలుపోయెలంక
గోలుపోయె సోదరువిభీషణు । గోలుపోవుదయనురు
స్త్రీచెరబట్టిన చండాలుండని । స్త్రీలుగొణుగుచుండ
శిగ్గులేకయె తమ్మునెరిచెనని ! స్త్రీలుతిట్టుచుండ
తరుణినివ్వనగ తన్నుదన్నెనని । తమ్ముడెడలుచుండ
తనయులుబంధులు పోదురనుచుతన । తరుణిదుఃఖమొండ
ఇప్పుడో ఇంకనుకానేపటికో । యీల్గనున్నవాడు
కడుదుర్మార్గపు చేష్టలచేతను । కాగియున్నవాడు
వానికిబాసటగాజనినీవును । బంధుజనములతోఁ
పరిజనములతో సతీసుతులతో । మరణముకెందెదవా
పాతాళంబు సమస్తభాగ్యమును । పాడుచేయదగునా
అనివాపోయెడి తనసతిగాంచుచు । ననియెను వాతండు
ఆపద్ధర్మముగా నన్నడిగెను । అతడు రావణుండు
మాటయిచ్చితిని రాముదెత్తునని । మాటపరాకయిన
నీతిదప్పుదును ఖ్యాతిదప్పుదును । నీమముచెడపోవు
కావునతిప్పదు రామునిదేవకి । కాదనకీకమీద
ఘటికాసురుఁడా కాగలకార్యము । ఘటనచేయుమయ్య
ఓయి సుచర్మక ఓయీఘటకా । నోపికబూనుచును
మీరిద్దరులంకాపురమునగల । వీరులైన రామ
లక్ష్మణమూర్తుల దెండికేగమే । తక్షణంబు పోయి
వారినెత్తి మన కాళీదేవికి । వారబోయవలెను
వారితలలు మనకాళీదేవికి । బలులుపెట్టవలెను
చెల్లెలిముక్కు చెవులనగోయగ । చెల్లెలేడ్వగాను
అన్నయుండి తాసూరకుండునా । అవిడయేడ్పులకు
అందమైనదా సీతనుంచును । అవిడచెప్పఁగ
పోయి కష్టపడితెచ్చెరావణుడు । పాలతిలంకలోకి
అంతమాత్రమున కింతయుద్ధమా । ఎంతపొగరొచూడు
వాలిజంపి సుగ్రీవునకిచ్చెను । వాలిభార్య తార
ఏమిధర్మమో ఏమినీతియో । ఏమిరాజుగాడుకో
కోతిమూకలను మొంటవేసుకొని । కొండలగొట్టుచును
వార్ధిగట్టెగద సేతుబంధనము । వానితీరువాడు

పొండి పొండి లంకాపురికిప్పుడు । పొండి తెండివారి
స్వామిభక్తిగలవారలయితిరా । వారి తెండి యనగ
మంత్రులిద్దరు బయలుదేరిరి । మంచిదనుచు లేచి

## ప్రతాపుని మంత్రి లంకలోనికి వచ్చుట.

త్రుటిమాత్రంబునవచ్చిజాడ । నొక్కటిగానరుగా
ఎక్కడజూచిన లోకరొక్కటే । నిక్కమని పెంచె
దానికితుదయూ మొదలునులేదు । దానిలేదు తెలియ
పాతాళంబున లోకయున్నది । బర్వానిటునదిరొ
భూమ్యాకాశంబంతయులోకరొ । బుద్ధిమకిలపడిరొ
ఘటకుండప్పుడు లోక పండ్లలో । కడగిరొత్తగాను
పండ్లువిరిగెను లోకలేవదు । బరువుగాపలేక
దొర్లికిందబడిదొర్లజొచ్చెను । లోకతాపుచేత
రెండవమంత్రియు లోకముక్కలో । చెంపజాచెగాని
ముక్కువిరుగగా మూలబడియెను । మూలువెంటబడగా
ఇద్దరుమంత్రులు దద్దరిల్లుచును । యిద్దియేమిమాయ
ఎవ్వరిలోకది యొక్కడలోకిది । యేమిలోకయనుచు
నెవ్వరినడిగిన నెరుగమనిరిగా । నేరుపరుపలేక
తిరిగితిరిగి చెడతిరిగి మరలి వే ।మరలివచ్చివారు
స్వామితోవారు తిరిగినాము మా । స్వామిభక్తిచేత
ఎక్కడజూచిన లోకమాత్రమే । యెరుకపడునుగాని
పుట్టువెక్కడో అంతమెక్కడో । బుద్ధిలోచలేదు
తిరిగినాము చెడతిరిగినాముగుమి । దివ్యప్రభూత్తంపా
యనుమాటలవిని యాతడునవ్వుచు । ననియెనిట్లులపుడు
పోయి తెచ్చెదను రామలక్ష్మణుల । పొండియిళ్ళకును
భద్రము భద్రము పాతాళంబున । భద్రమనుచు జెప్పి

## ప్రతాపలంకేశుడే రాములను గొనిపోవుటకై వచ్చుట.

ఒక్కక్షణములో నెగిరిపోయి । నాదిక్కువ్రాలినాడు
నిమిషములోన విభీషణుభూమిక । నెటియుదాల్చినాడు
చూచినవారు విభీషణుడేయని । శుభములడిగినారు
ఇక నొకజాము పొద్దున్నదినుమ । యేమరి యుండకుమా
రామలక్ష్మణుల నోకానుమంత । రక్షింపుమిజాగ్రత

యనిహనుమంతుని ముఖమహరంబున । జని వారినిగాంచి
మోహజనకమగు పుష్పొడిజల్లిన । మూర్ఛిల్లినవారి
రామలక్ష్మణులనిద్దరిపెట్టెను । గోముమీరబెట్టి
పెట్టెచంకలో పెట్టుకవచ్చి । క్రితగదురనసియె
ఓహనుమంతా మైరావణుడు । హోయలకారివాడు
మాయవేషములు దాల్చివచ్చువాని । మాయతెలుగలేక
జాగ్రత జాగ్రత పోయివచ్చెదను । జాగ్రతనువ్వయ్య
అనుచుపోయి పాతళమందుగల । అంబికగుడిలోను
పెట్టెదించి యాగుడికిత శమును । బెట్టి భార్యకడకు
వచ్చి యిట్టులనె ఓమాతంగి । దెచ్చినానువారి
దెచ్చినానునుమి కాళికబలిగా । యిచ్చువాడనేను
ఆమాటలువిని గగడ వడకును । ఆమెయనియెనారా
చేయరానిపని చేసినందుకును । చేటువచ్చుమనకు
లంకపాడుపడు రాణుచ్చెను । పొంకవడుగు మనకు
నిన్నువారె బలియిచ్చెదరు పయి । నిజముదెలియలేవు
రామలక్ష్మణులు దేవులు వారిని । దోషులనుచుదెచ్చి
చంపజాచెదవు పిచ్చివాడ నీ । పాపమేమందు
ఇప్పుడయిన గొనిపోవారిని । చప్పుడుగాకుండ
లంకలోననిడి చెంపలేసుకొని । నింకబ్రికజాడు

ఇచ్చట విభీవణాదులు రాముల పోకడ గనిపెట్టుట.

ఆనెడు భార్యగని యదలాయించుచు । నలిగెను వాతండు
ఇవటలంకలో విభీషణాదులు । ఇంపుమీరగ స్త్రీ
తిరుగుచునెప్పుడు తెల్లవారుజా । దివ్యమూర్తులకను
యుద్ధవిజయమను రావణుహతియును । యెప్పుడుజరిగెదునో
జాగ్రత జాగ్రత హనుమంతా । జాగ్రత్తనిపలుక
ఘనువిభీషణని గాంచివానరుడు । కదగియిట్టులనియె
యిప్పుడేగదా వచ్చిపోయితివి । యింటిలోనికనగ
తెల్లవారయెనె విభీషణుండు । తెలివితప్పినాము
వాకేషముతో మైరావణుడు । మనలమోసపుచ్చె
పదదు పయిడని లోనికరుగగా । ప్రభులలేరుచూడ
లోకచట్టయేచట్ట కొన్నది । శ్రీకరులటలేరు

ఏమిచేతమని పిలుగుకొనుచు । వారేమిచేతమనుచు
సుగ్రీవాంగద జాంబవంతులు । సుషేణులనువారు
కపికోటులు భల్లూకకోటులును । కకవికలై యుండిరి
ఎవరికోసమీ యుద్ధముజేసితిమి । యెవరికోసమిటుల
వార్ధిగట్టి రిపువర్గముచంపితిమి । పారావారంబు
తల్లడిల్లగనులంకాపట్నం । బెల్లకాల్చినాము
ఏమిచేతమిపుడేమిచేసి ప్రభు । హితముజరుపగలము
అని చింతించుచునుండ విభీషణు । డనియె నపుడులేచి
చింతించుటచే కార్యంబౌనే । చింతమాని యిపుడు
చెప్పెదుపల్కులు వినియాకైవడి । చేయదలచుకొండి
లంకకుడమపార్శ్వంబున కవతల । లావుమిగులువనము
కలదా వనిలో కలదొకకొలను । కలువలుతామరలు
సొగసగుపూవులు సువాసనలతో । సొగసుగులుకుచుండు
అందొకపద్మము శతపత్రంబది । సుందరంబుగాను
వికసించును నోకారవిధమున ద విని । వేడుకగనుచూడ
దానినాళమతిసూక్ష్మము సుమ్మీ । దానిదూరిపోగా
పాతాళంబగపించును చూడంగ । ప్రభలవెలుగుచుండు
మైరావణుడా పాతాళంబున । మహిమమీరనుండు
వాని జయించియు రామలక్ష్మణులు । బూని తేరవలయు
నని చెప్పిన వినిహనుమంతుండనె । మనవిభీషణాధ్యు
జాగ్రత తోడుత చూచుచుండుడీ । సకలజనులుకలసి
అనిచెప్పుచు తాసూక్ష్మరూపియై । అపుడా కొలనికిపోయి
పద్మనాళరంధ్రముజొచ్చియు । పాతాళంబునుగనెను
ప్రథమద్వారమును బుడబుడదూరగ . పారాయిచ్చుచున్న
మత్స్యవల్లభుడు మారుతసుతుని । మరిమరి గిరగిర త్రిప్పి
విసరివేయగా పద్మగర్భమును । వెలువడికొలనికివచ్చి
పద్మనాళరంధ్రముజొచ్చియు । పాతాళంబునుగనెను
ప్రథమద్వారమును పరుగునజారగ । పట్టుకొనెనుమరల
మత్స్యవల్లభుడు మారుతిసుతుని । మాటిమాటికిటువేయ
వచ్చిచిక్కులను పడిరోదవయ్యా । వచ్చినట్లెపొమ్ము
ఈపల్కులువిని హాశ్చర్యంబున । నిట్లడిగెనునతడు
ఎవ్వరిపుత్రుడ వెక్కడివాడవు । నిక్కవపనియేమి

ఘనవినుమని యాతండుచెప్పెను । ఘనము మీరగాను
వినియుండువుగద రామచంద్రుడను । ఘనదైవతమొకడు
సీతాదేవిని రావణుండుగొన । చింతపొగిలి యపుడు
హనుమంతుడను వానరేశ్వరుని । పనిపెసీతజాడ
నామహోనుహుండప్పుడు దధిపై । నంబుజేయుచుండ
జారిపడెను చెమ్మటబిందువు మ । మత్స్యంబొక్కటి మ్రింగి
గర్భము దాల్చగ నీజనియించితి । క్షణములోననప్పుడె
మత్స్యవల్లభుండందఱునన్నని । మనుతమీరబల్కి
కౌగిలించుకొని పుత్రకుండనని । కడు సంతోషముతోడ
నే హనుమంతుడనని నాతడువిని । నీనిజరూపముజూపు
మనవుడప్పుడా హనుమంతుడు తన । రూపునికిజూపగాను
తప్పగాయుమని ధరపైవ్రాలు । తండ్రిపాదములబట్టి
లేవదీసి సుతుతోడ జెప్పెనిటు । రావణుండాసీత
దెచ్చిన జాడనుచెప్పినరాముడు । దైత్యేంద్రయుద్ధముజేసి
ఓడజేసిన పౌలస్త్యునిసుతు । డోడిమిత్రుడైన
మైరావణుడేమాయల బఱపియో । మారాములగెచ్చ
పాతాళంబునబెట్టినాడు నే । పగిదినైనవారి
గైకొనిపోవలె రాముకార్యమిది । కడగిచెప్పుమనిన
స్వామిద్రోహముకాదా మర్మము । నీదుమిషలిచెప్ప
తండ్రివిగావున చెప్పెదనొక్కటి । ధర్మమొప్పగాను
ఇదిదాటినగలదు తులారంధ్రం । బదిదాటగనచట
నలుబదికోటుల రక్కసిమూకలు । లుతెరగులనుమంద్రు
వారిదాటినను ధ్వజస్తంభ ను । వ్రలను గానుపించు
తొంబదికోటులరక్కసి మూకలు । తూగుచుందురచట
వారిదాటినను కాళికాలయము । వరలుచున్నదచట
అచ్చట తక్కినసంగతులన్నియు । నపుడెతెలియుపొమ్ము
పరేమంచిదని పుత్రునువీడగ । చరచరలాడుచునపుడు
హనుమంతుండపు డరుదెంచెను నా । కోలనుదరికివేగ
అప్పుడె యచటికికలశోదకము । జొప్పడగొనిపోయి
రామలక్ష్మణుల స్నానానంతర మా । సుహానీయులకాళి
గుడిలో బలిపెట్టగ దోర్దండియు । గోరివచ్చెనార
అమహీశామణి రామలక్ష్మణుల । అన్నజంపుననుచు

కించపడుచు లోగుందుచునుండెను । మంచికాంతిగాన
ఆంజనేయుడీదోర్దండినిగని । అడిగెనువినయముగా
అమ్మాచెప్పుము భయములేదు నే । నమ్మా రాములను
అనగా నా మెయ్యి చెప్పెయుదంతము । ననుమానముమాని
అంతటనాతడు నామెకలశలో । వింతకప్పుడగుచు
దూరెనామెతో తులారంధ్రమును । దూరుచుండగాను
పెళపెళపెళమని పెద్దమ్రోతతో । భీతిగలుగునట్లు
తులారంధ్రము విరిగిక్రింగబడగా । తోడనె రాక్షసులు
ఎక్కడదాస్తివి దొంగవాడు నీ । కెక్కడతా దొరకె
ననుచుండగ నాంజనేయుడది । విని బ్రహ్మాండముగ
తోకబెంచి ఘనకాయము బెంచుచు । తోలెనువారలను
కొందఱజంపెను కొందఱజిదిపెను । కొందఱబోడిచేసె
చిందరవందర చేయగతక్కిన । చీపురక్కపాళి
పారిపోయిరా ప్రాంతమునుండి । తేరిచూడకుండ
ఆంజనేయుడా వెనక ధ్వజస్తం । భంబుకడకు రాగా
తొంబదికోట్లుల రక్కసులప్పుడు । దాడరిపోరగాను
కొందఱజంపెను కొందఱజిదిపెను । కొందఱబోడిచేయ
పారిపోయిరా తొంబదికోట్లును । తేరిచూడకుండ
అప్పుడు కాళియాలయమందున । నొప్పుతరిగియున్న
రామలక్ష్మణుల పెట్టెదాచి తా । రయమున గొనబోగా
నక్కడిరక్కసమూకలు రేగి । యుక్కుమిగిలి పోర
కొందఱబాదెను కొందఱమోదెను । కొందఱపరువగను
మిగిలినవారలు పారిపోయి యా । వగ ప్రభునకు దెలుప
నాతడుగ్రుడై మంత్రిపుంగవుల । నాహ్వానముజేసి
యేమిచిత్రమది పాతాళమునకు । నెటులజొచ్చినాడు
ఏమిచేతు మనవీరాలాపము । లామె తలారగను
కొట్టితెచ్చెదము కోతిగెక్కయా । కూరుచుండుడయ్య
చావుమూడియే వచ్చినాడునేమి । చంపివేతుమిదిగో
చూడుండీయని పండ్లుగొరుకుచు । క్రూరాలాపముల
కటకటలాడుచు వచ్చిచూడగా । పటుబలవంతుండు
తోకవిసరుచు త్రోసివేసెను । తొక్క రక్కసులను
యామడదూరము వాడలిపోయిరి । యారక్కసులు

కొండలుజచ్చిరి కొండలునొచ్చిరి । కొందరేగిప్రభువు
ముందటవ్రాలిరి పాతాళమునకు । ముప్పువచ్చెననుచు
ఆపలుక్కులువిని మైరావణుడా । అదరిపడుచులేచి
నిప్పులురాల్చుచు కోతిబట్టుడని । నేటుబంటులైన
మేఘశల్లభుని ఘటకాసురుని । మించిన చర్మకుని
భైరవముఖుని నలుగురిబిలచి । మీరుపోయియిపుడే
కోతిబట్టుడనిపంపెనువారిని । కోట్లసేనతోడ
వెడలిరివారలు చిరుతప్రులులతో । భేరిమృదంగములు
దిక్కులదరమ్రోయంగ యుద్ధము । రక్కసులావంగ
వారినందరను కాళికిబలియని । బల్కె కోతియపుడు
శివమునజంపెను కోట్లబలమును । చెండికిబలిగాను
పోయికాళితో భద్రమురాములు । పోయిన నీగుడిని
నిన్నుగూడ నేపెకలింతును సుమ । కన్నుకాయమనుచు
పెడబొబ్బలతో నొక్కగంతుతో । ఫెళ్ళుమనుచు బడెను
ఈ వాడావిడికి కోట్లరక్కసులు । ఇజగుజలైపోయి
చాపచట్టుగా పడిపోయిరి తమ । చావువెదుకుకొనుచు
అంతట రక్కసులందరుదిగులున । అదవదలైయాపుడు
వారిసివీరును వీరినివారును । విఱుగద్రొక్కుకొనిరి
అందఱద్రొక్కను కోతినాయకుడు । హైసరమజ్జనుచు
పాతాళంబపుడంతయునిండెను । పారెడునెత్తురుతో
పేగులు డొక్కలు ముక్కులు చెక్కలు । పెద్ద మొండెములను
తలలును కాళ్ళును చేతులు వీపులు । తుంతులాడుచును
పగిలిన శిరములు నొగిలిన పొట్టలు । పిగిలినప్రేవులును
అన్నియునేరై పారదొడంగెనునా । మాళావాళినిజూచి
భూతప్రేత పిశాచిడాకినీ । భేతాళాదులును
యిష్టవిహారము సల్పిరపుడు । సంతుష్టులౌచు వారు
ప్రాణబంధువుడు ప్రభువుచెంగటను । బల్కెనపుడునిట్లు
అయ్యా అందరు మరణముబొందిరి । మయ్యాలించండి
రామలక్ష్మణుల నిచ్చటచేసిమము । రక్షింపుడివేగ
ఆమాటలువిని మండిపడుచునా । పాతాళేశ్వరుడు
పటపటపళ్ళుపటపండ్లు గొరికెతా । బ్రహ్మాండంబదియ
సింహనాదమును జేయగావేసా । సింహముఖానముడు

సర్పముఖుండును కర్కటముఖుండును । చాగముఖాసురులు
అసురులెల్లరును గడగడలాడుచు తా । నపుడు వచ్చినారు
ఏమి[illegible]యాగడమేమి బ్రతుకులు । ఏమీ విలయంబు
మీరు మాన్పరా నేనేపోయియుండ । వారి మాన్పవలెను
అవలక్కలు ఏవి అందలు లేచి । హుంకృతిచేయుచును
నడుములుగట్టిరి వానరపట్టగ । నకరిసర్పవృశ్చి
కాదివాహనంబుల తామెక్కుచు । నట్టహాసములతో
పదునెనిమిదికోట్ల రక్కసబలము । పరుగువారలపుడు
వారిజూచి మనవానరబంటును । పాఱ కాళికడకు
అమ్మా తల్లీ ఆదిదేవతా । అరుగోరాక్షసులు
నీకాహారము నైవేద్యముగా । నిపుడు తెత్తుననుచు
మొక్కి కాళికాముదమున । నొప్పంగ మోముచూలికోతి
బడ బడ బడ బడ పరుగువారిపై । బడెను మూకమీద
చెల్లా చెదరై చెట్టొక పిట్టగ । చేరినారు మూక
కాళ్ళు విరిగియు నడుములు తెగియు । కంఠములు తెగియు
రక్తవరదలై యుద్ధరంగ మది । రహీనీగతినుండ
మంత్రులు దొల్లిరి మూకలు జచ్చెను । మనకు గతియికేమి
పాతాళంబునకిక నాశనమే । ప్రభువా యేమందు
మిగిలినవారము అంజనేయుతో । మించిసంఖ్య మొనర
జేసి వెంటనే రామలక్ష్మణుల । దీసియిచ్చి బ్రతుకు
దారిగంపమన మండిపడుచు నా । మైరావణుండపుడు
నేనేవత్తును యుద్ధభూమికని । బూన్చి మనెను తేరు
మాతంగి నేయుద్ధముచేయగ । జూతువేమోయమ్మ
కదనభూమి యిక గడగడ లాడును । కాంతజూడుమనగ

### ప్రితావలంకేశునిభార్య యుద్ధము వద్దనుట.

ఆర్యా యుద్ధము వద్దువద్దుమన । కచ్చిరాదునిపుడు
రామలక్ష్మణులు విడిచిపుచ్చుమన । రాజ్యమేలుకొమ్మీ
రాముడు దేవుడు రాక్షసహరణము । నీమముతో బుట్టె
నీవిపుడాతని నెదురించుటలు । నీతికాదుమాను
అనగా కన్నుల పెద్దజేయుచును । ననెనా రుద్రుండు
తేరు సిద్ధమై యున్నదిచూడు । వీరసేనలవిగో

లక్షరథములు లక్షగుఱ్ఱములు । లక్షలుకాలబలుగా
పదాతివర్గము చుట్టుకొలువగా । భయనుగు నేమనకు
పాతాళమునకు రాజునుగాక । పరగనయోధ్యా
భూమికిరాజని ప్రజలుపల్కగా । భోరుకలుగ నేమి
గజఘీంకృతులు గుఱ్ఱపుహేషలు । కాల్బలములు రొదలు
దుమ్మురేగి యెటులాకాశంబున । దోచు చున్నవోయిపుడు
శూరుడైనవాడెవడీ పడిలో । పోరకుండగలడు
మిత్రునియాపద నీయాపదయే । మించిచూడవదియు
రావణుండనన్ గడగడలాడును । బ్రహ్మాండంబంత
అట్టివాడునను బట్టగోరనీ । గిట్టనివారలను
పట్టితిరిగియీయొక్కరీతికే । పట్టలేకనిట్ల
నేమనుకొందురు జగతిలోని వా । రేమియుజాడవుగా
అదిగో శంఖారావముచేసిరి । పదపడపోవలెను
దారికడ్డముగనిలువబోకు నీ । దారిజూచుకొనుము
ఈపల్కులువిని మాతంగప్పుడు । ఇకను గతులులేవు
బ్రతుకుకాలములు సరిపోయెను వా । బ్రహ్మవ్రాలుపోలు
నీవికరావిక నేనికనుండను । నేటితోనుతీరె
పాతాళంబేలెడిబుణమదిమనకు । పాపము పండెనుపో
పామ్మనిపలుకుచు పెటపెట ధ్వనులను । పోయెనతడుయుద్ధ
భూమినిచూచెను వాంజనేయుని । భోరుకలగననియె
కోతీ నీకీవేళకుసరియె । కోరుకొమ్మునీకు
కావలసినదేమైనయున్న నే । కరుణనిత్తుననగ
రామలక్ష్మణుల వేగముదెచ్చి । రహియిప్పించితివేని
పోదునేనిక లోకముదుచుకొని । పూర్వపుణ్యమనుచు
నీమాటలువిని కడుమగ్రుండై । యికనిలువనిపలికె

## రాక్షసులు ఆంజనేయునితో యుద్ధముచేసి మరణించుట.

మేలుబళాయని ఆంజనేయుపై । మించిపడిరిమూక
గుద్దిరి తన్నిరి తిట్టిరి పట్టుక । కొట్టిరప్పుడుమూక
ఆంజనేయుడా పడిగనిరథముల । నట్టహాసమునను
తోకజోకతో తుంపెసలాడగ । చూర్ణముగావించి
ఏనుగుగుంపులనాదికురికి తా । మానుగహరియించి

గుఱ్ఱపుదళముల నొక్కతోపుతో । కూల్చె రథణిపైని
గడగడలాడుచు పదాతివర్గము । ఈడబడుచునురాగా
నొక్కవిసరుతో దూదిపింజవలె । నూపివైచెవారి
ముక్కలు తెగగా నడుములుపోగా । మూతులువిరుగంగా
రొక్కడివారక్కడజచ్చిరి । యేమిచోద్యమనుచు
పాతాళేశ్వరుడప్పుడు బాణము । ప్రయోగించివేచె
ఆంజనేయుడా తోకజోకుతో । నప్పుడు రథములను
విరుగగొట్టెగా నావిభుడప్పుడు । గరగరలాడుచును
క్రిందినిల్చెరే బాణపరంపర । కేవలవర్షముగా
కురిసెనునాతూపులకును నాతడు । కూలెధరణిలేచి
యొక్కవిసరునను తోకగదల్చగ । దొక్కటపరివిభుడు
పిడిగ్రుద్దులకును బయలువెడలతా । పిడికిలిబట్టుచును
అంజనేయునిముట్టిగొట్టగా । నాతడువాలమున
జుట్టివేసెనాలంకేశ్వరుని । మట్టుముట్టుకొనగా
గిజగిజలాడెను తోకతెంపగా । గింజుకొనెనుచాలా
అంతికంతకును నురిబిగియంగా । నతడునవ్వాయనిరో
ఏరావానరయింతకాపరము । రోయగవెనన్నెపుడు
అనుచునీగవలె సన్నసన్నమై । యసనిజారిపోయి
తననిజాకృతిని తనరదాల్చగా । దరిసివానరుండు

## పాతాళేశుడు ఆంజనేయులతో యుద్ధముచేయుట.

యేమరిపాటుననొక్కతాపుతో । నెత్తిగూల్చినాడు
పాతాళేశుడు బాహుబలంబున । పట్టెమరలనతని
నిరువురగి వుర గరగర గురుగుర । పరిపరివిధములను
క్రిందికి మీదికి మీదికి క్రిందికి । క్రీడసల్పినట్లు
దొర్లుచు రోలుచు విల విల దిరుగును । తోగినారువారు
తిరిగిలేచె యాలంకేశ్వరుడు । పరుగువారియాంజ
నేయునేయుగా నాతడుమరల । నేసివానిగూల్చె
చచ్చినాడురా మనమికరాముల । హెచ్చుప్రేమమీద
గైకొనదగునని తలచుచుండగా । గారడీనిబోలె
చుక్కచెదరకను లేచివచ్చెను । యుక్కుమిగిలి వాడు
మరలజంపెనా వాయునూనుడా । మాయలరక్కసిని

మరలవచ్చె నారాక్షసప్రభువు । మాయకాదు కాన
గోళ్ళచీరితా చేతులగొట్టితూ । గూల్చెకోతియతని
మరలవచ్చె నారక్కసినవ్వుచు । మాయకాదు కాన
ఆంజనేయుడీయులజడిగని తా । నప్పుడేగి కాళి
గుడిముందర ధ్వజ స్తంభము పెకి । గూల్చెనతడు మరల
నవ్వుచు లేచెను నన్నుజంపగా । నెవ్వరికిజగతి
యీపల్కులువిని కాళిగుడికి తా । నంజనసుతుడేగి
కాళిచెప్పుము వీనిజంపగా । గలమార్గంబనగ
వానికున్నది బ్రహ్మవరము నీ । వాతనిజంపంగా
నేరవు రాముల విడిచిపొమ్ము । నీ । నేరమేమిలేదు
ఈపల్కులువిని యుగ్రతచెల్కన । హీనరోషములన
నీగుడియిప్పుడె పెటపెటలాడగ । సాగదీతునెను
గుడి శిఖరముపై తోకబెట్టెనే । గూల్తు నననుబలుక
పకపకనవ్వుచు కాళియప్పుడు తా । బల్కె నిటులవినుము
నీవు తులారంధ్రంబుజొచ్చితే । నెగ్గుమీరబోయి
ఏడుసముద్రములెల్ల దాటి యుండ । యాద్రికొండలెక్క
వేయి శిఖరముల పర్వతమున్నది । వేగజూచియచట
దాటిపోవగా సప్తప్రవాహములు । తనరుచుండునచట
వానిదాటగా నొకగుడియున్నది । దానదాటనేడు
తుమ్మెదలున్నవి వానితెచ్చి యీ । విమ్మహితునికిని
వాసనజూపిన వాతడుమూర్ఛ । వశుడైతానుండు
వాసిమ్మట గంగావాహిని । నందుగ్రుంకులిడును
వాసీరముగొని జల్లితివ యక । నాటినుండియతడు
లేనలేడు మరణించునుగావున । బోవుమయ్యవేగ
యనవిని కష్టము వచ్చెననుచుమగ్ని । ననుకొనితోకతుతా
లంకేశుని వడిగానుజుట్టి తా । లంఘించెను వేగ

## ఆంజనేయుడు మైరావణుని తోకకుజుట్టి యీడ్చుట.

సప్తజలధులనుదాటి వేగదా । జర జర జనుచుండ
మరొక్క మొర్రో విడువుమునన్నని । కోటిధ్వనులతోడ
అరచె శరీరము రక్తపరదమై । యదపదయాచుండ
పీడదు మారుతి పీడదు యతనము । వేగమె యుదయాద్రి

చేరి శిఖరములచేరి గృహములను । చేరితుమ్మెదాళి
చేతబట్టుకొని చచ్చెర పాతా । ళంబు వచ్చినాడు
తుమ్మెదవాసన జూపగానె నా । ధుండు మూర్ఛబడియె
వెంటనేమారుతి గంగాజలముల । వేగతెచ్చిపోయ
లంకానాథుడు మరణమునొందెను । లావుపరిగి యపుడు
తల్లికాళీ పాతాళేశ్వరు । దగనీకర్పిస్తి
ఇకనన్నేలుము నీభక్తుడను । ఇహపరములనొసగి
యనగా కాళియానవ్వుచుబల్కెను । హనుమంత వేగనీవు
రామలక్ష్మణులగొని పొమ్మికనీ । లంకవీధియనగా
మత్స్యవల్లభుడు దండముపెట్టుచు । మారుతుగదియంగా
నీవీరాజ్యముల నేలుచుయుండక । నేర్పుమీరగాను
నీకీదుర్గండీ సుతుడిప్పుడు । నెటియువరాజౌను
ఆపల్కులువిని మత్స్యవల్లభుడు । హర్షముతోనుండ
అంజనేయుడా రామలక్ష్మణుల । నరకటవిడుకొనుచు
రాజమార్గమునవచ్చె లంకకు । రావణహతమునకై
వచ్చి పెట్టితాదించి చెప్పెనా । వానరులకుతాను
చేసినపనియందరువిని మెచ్చగ । శిష్టచరితుడపుడు
తెల్లవారగామచ్చపాడులంతా । మెల్లవిరిగిపోవ
రామలక్ష్మణులు నిద్రలేచిరి । ఏమియెరుగకుండ
పిమ్మటవారలు రావణాసురుని । వీరరణమునందు
జంపివిభీషణునకు నకు రాజ్యంబును । చక్కగగట్టించి
సీతదీసికొని హనుమంతాదులు । చెలగివెంటరాగ
నయోధ్యాపురి కేగిరప్పుడు । నాటిపాటివారు
మెచ్చుకొనిరి యీమహిమైరావణుని । మేలుచరితనెరు
చదివిన వ్రాసిన వినినవారికి । సకలసౌఖ్యమబ్బు.

## 50 ధర్మాంగద చరిత్రము. (పాముపాట.)

శ్రీరుక్మిణీశ రాజితకీర్తిసాంద్ర । పారసదళనేత్ర సజ్జనాధార
ధారాధరశ్యామ ధర్మసంచార । చారుమంజులభాష జగదేకపాల
పాలితామరసత్యభామినీలోల । లోలరసాధీశ లోకసంచార
ధారుణీధవహార దైత్యసంహార । హారకౌస్తుభవక్ష యఖిలలోకేశ

కొలువుకూటంబున గూర్చున్నయప్పుడు । ఆపుత్రికయు తనయల్లుడుగూడి
యేపున కాల్నడ నెదురుగా రాగ । చూచి భూపతిచాల చోద్యంబుకొంది
యీచిత్రవిధి యేమి యిప్పుడు కాల్నడ । వచ్చుటయిది గాక వస్త్రహీనంబు
అచ్చెరువయ్యెడునని లేచి తాను । యెదురుగా నేతెంచి యిద్దరినప్పుడు
కదిసి కౌగిటజేర్చి కడుముప్పుననిట్లు । ఖరసింహ శార్దూల గండభేరుండ
శరభ ఝుల్లీమృగసంఘంబు గడచి । వరుసతో నెటువలె వచ్చితిరిందు
తెరువజాపుటకయి ధృతినొక్కరుండు । మనుజమాత్రుండన్న మాటకులేదు
అనవొండమీకేమి యాపదవచ్చె । వినిచెప్పవలయు మీవిధమంత యనిన
తనతండ్రితోడుత దనర నిట్లనియె । తగవినుమా తండ్రి ధర్మాంగదునకు
బాగడంగ మొదటికి పుత్రుడే లేడు । కమలాపతంబున కాలసర్పంబు
ఆమిలారిగర్భంబునందు పుట్టినది । బూమెలమంత్రి తా పుత్రుడే యనుచు
భూమెల్లపాలించె భోరునప్పుడు । యేమేమొ బోధించి హితబుద్ధి జెప్పి
అమీదమిమ్ము ననటమటజేసి । అక్కడ తనపుత్రి నమరంగ జూపి
యిక్కడనొక్కకత్తికిర్వరుపనుచు । వనయింటికి నిదెచ్చి మాయలుబన్ని
ననుబెండ్లిజేసితిన్నగ దోడుకొనుడు । పోయిధర్మాంగదు ముందర నిలుప
సాయనయిదిపాపమనక చేవేగ । కోరి గృహంబుల కోడలనుచు
వారకనన్నుంచ రారింట నేను । యేరీతు లెరుగక యేగి మీవలెనె
మీరకయాజ్ఞలో మెలగియేమసక । అత్తమామలమీద నతిభక్తితోను
చిత్తంబురా పనులోసయుచునుండు । తరువాతనంతకంతకు వయసెరిగి
పురుషునికానక బుద్ధిలోవగచి । అత్తగారిని జేరి యడిగితి భువిని
మత్తిల్లి శేషుండు మగడంచు జూపె । అప్పుడు చింతించి అహిరాజు గొంచు
చప్పన్న దేశముల్ జగతిలోనదులు । పుణ్యస్థలంబులు పూర్ణంబుగాను
గురుతరారణ్యముల్ గానకొనితిరిగి । తిరుపతులన్నియు తిరిగి వేసారి
కరమతికల్కిట్లు కడపారి చేరి । పురుడింపదగు ధర్మ పురిజేరి నేను
వరనరసింహుని వర్ణించి మ్రొక్కి । తిరమయిన ఆశలు తెగ గోసి చేసి
ఒకనదిలో పలను నురకబోవంగ । సకలేశ్వరునియాజ్ఞ చయ్యననప్పుడు
అశరీరి పలికెనిట్లసిగారవించి । ఇక ముక్కానట్టి యావనముల నదులు
అష్టదిక్కులు జూచి యాపదలొచ్చె । సృష్టికుడింక రక్షింపడీ వేళ
వలదవమ్మ యిందురకవలవదుకేవు । వలనొప్పపెట్టెలో పలనున్నయట్టి
భుజగేంద్రు దెచ్చినీ భుజముల జుట్టి । గజరాజవరదని క్రమమొప్పదలచి
పరవిసీగంగలో స్నానంబు సేయు । పురుషుడౌ ననినాకు బుద్ధి జెప్పినను
వేగంబె నేనువా విధమున జేయ । బాగుగానప్పుడు పరమాత్మకృపను

నాగేంద్రుఁడల్లన నరరూపమయ్యె । నాగేంద్రశయనుండు నన్నురక్షించె
చూడుమీతఁడె యని చూపిననుజూచి । వీననిదుఃఖంబు విభునకువచ్చి
యచటిపెద్దలజూచి యపుడిట్టులనియె । యెడలేనియాపద లీచిన్నబాల
కేమిప్రాప్తించెనో యింతగాఁగలిగె । యామంత్రిచెప్పిన నదిపాపమనక
యిరకొనిధర్మాంగదుండెంతదోషి । యరయంగయిదిదొడ్డ యపకీర్తియనక
పరవారిపడుచనని భయమింతలేక । కరుణావిహీనుఁడై కటకటాయితఁడు
పనివడితనమంత్రి బంపిదానెట్లు । మనపాప దప్పించెమరి వారి మోము
జూతామురంచంచు చుట్టాలజేరి । అత్తరికోపించిఅపుత్రిజూచి
అతిదుఃఖమునబొందె నాగజనకుఁడు । మదిలోనవగచిరి మంత్రులుబుధులు
అప్పుడుతనపుత్రినమరఁదోడ్కొనుచు । నొప్పగాగృహమునకొనరంగబోయి
యీవార్తఁజెప్పిన యెల్లబాంధవులు । ఆవేదినిజూచి అతిదుఃఖపడుచు
నంతెంత వగచిరి యతిగాసిగూడి । అంతపుత్రినిజేరియశ్రువులొలుక
తల్లికౌగిటజేర్చి తడవుచింతించి । యెల్లవారినిజూచి యిట్లెంతటంచు
రంతుమాన్పిరయిలేచె ధర్మాంగదుండు । చింతింపవలదని చెలువమైనట్టి
పుత్రునివెయినోళ్ల బొగడెనావేళ । మిత్రబాంధవులతో మృష్టాన్నములును
నప్పుడుభుజియించి రల్లుఁడుదాను । కర్పూరవిడెములు కాంతతోనిచ్చి
అకలంకచిత్తుఁడై యల్లునినపుడు । నొకమేడలోపల నుంచెనావేళ
అప్పుడుపుత్రికి నాగల్లునిని । గొప్పైనతొడవులు కూర్మితోనిచ్చి
ఒప్పైనవస్త్రములొకకొంతముగ । పుష్పాలుగాబంప కొదువరాదులేక
మల్లెలువిరులు చామంతి బంతులును । వకుళముల్ గేసంగి పంజాళంబును
మొల్లలుసంపంగి మొగలిపువ్వులును । అగరువత్తులు తగయోగ్యమైనట్టి
సొగసైనకస్తూరిగంధములును । పండుటాకులంతమ్మి బాగాలుగూర్చి
మెండైనపేటికతో మేరబంపినను । యెనయానిద్దఱునవియెల్లధరియించి
చనువుతో నవ్వుల శయ్యపైవేడ్క । సతిపతులంతంతచాలనింతులు
నతనుకేళినిదేలి యానందమునను । వింతగావిభవముల్వెలయనిద్దఱును
సంతోషచిత్తులై సరసతమీర । సకలసంతోషముల్జరుపుచువారు
ప్రీతినొకమాసముచ్చటనుండియంతటను । పాలతియత్తింటికిపోవగమదిని
దలచియప్పుడుతనతండ్రికిట్లనియె । నోయయ్యయిన్నాళ్లునుండిననిదియా
మాయిల్లెగానుమ్ము మరివింతగాదు । అక్కడమామామఅత్తయుమిగుల
మక్కువజూడంగ మనసయ్యెనాకు । వారెంతనాకునైవగలనొందుదురో
వారువృద్ధులురాజ్య వాంఛలులేవు । ఊరకనిక్కడ నుండంగనేమి

## రత్నాంగరాజు ధర్మాంగదుని చూడబోవుట.

ఆ రాజ్యమంత నీ యల్లుని చేత । యేలించవలెను మీరందరుగూడి
పాలించరయ్య మీరందరు ప్రేమ । ననివిని రాజేంద్రుడానందమొంది
తనమదిలోపలదనరనిట్లనియె । ధరపావనమూర్తి మానుడు ధర్మాంగదుండు
యూరగంబున కునిట్లు యీవిధగొంపోయి । అడవులపాలుగా నతడిట్లు పోతె
యవరక నేబోయి యతివదెమ్మనిన । యేనునగలవాడో యికజూతమనుచు
ఆమంత్రివరునిచే నందరినపుడు । అనువొందబిలిపించె నారాజవరుడు
తనబలంబుల కూర్చి తత్క్షణంబునను । తనపుత్రికప్పుడు తగినవస్తువులు
పసుపచ్చ భూషణాంబరములు నిచ్చి । నల్లునికొకలక్షయశ్వసంఘములు
తెల్లయేనుగులు వేయినూరు సురభులు । నుతమూర్తులైనట్టి సుందరాంగులను
ఒకలక్షగోవుల నొనరంగనిచ్చి । సకలవస్త్రంబులు సకలవస్తువులు
ప్రకటంబుగానిచ్చె బహుళంబుగనపుడు । మకరకుండలములు మకుటకిరీటములు
అకలంకమగురత్నహారములొప్ప । పచ్చలపతకంబు పెండెమాపూసను
హెచ్చయినసొమ్ములు నిచ్చివేవేగ । అధికమాభక్తిని నతనిపూజించి
రథముపైనెక్కించి రాజసంబునను । రమణమున పుత్రిని రాబంపెనంత
వసుమొప్ప భూషితయుంచి నలినాయతాక్షి । అంతటవేవేగ నతిభక్తితోను
అంతఃపురంబున నతివలనెల్ల । బాగొప్పవీడ్కొని పద్మాయతాక్షి
వేగంబె యతిభక్తి వెలయంగనపుడు । తనతల్లికిని మొక్కి తల్లిచే బరియు
అనువొందదీవెనలందంది మిగుల । ఉల్లంబురంజిల్ల నొప్పగాజేర
పల్లకిలోనుంచి పటముపైగప్పి । అరుణకేతనములు నందమై మెరయ
పురముతా విడిచె యద్భుతవైభవమున । సంతోషమొందుచు సాలవైభవము
సేగుచు నెడనెడనెపగెడునదులు । బాగుగాజూచుచు బహుళమైనట్టి
వనములు గిరులెల్ల వరుసతో గడచి । కనకాపురము జేరె కాంతపోషించు
కరిహయమూకించ కాంతఘనరవంబెసగ । ధరణీవరంబులు ప్పనులల్లసిల్ల
అప్పుడునిస్సాణాదిఘోషంబు । అప్పుడు బలములయార్భాటములను
రథములమ్రోతలు రథికసారథులు । పృథులరవంబులు వెల్లుగామ్రోయు
అరయనాధ్వనివినియాశ్చర్యపడుచు । పురజనుల్ చూచియుప్పొంగుప్రీతిజెంది
పాల్లకల్లోలమైయట్టిట్టుబెదరి । తల్లడింపుచువచ్చి ధర్మాంగదునకు
మునుకొనిసాష్టాంగముగ భూమి నెరిగి । మనకోటచుట్టుముట్టడివేసిరనిన
అదరితత్తడిపడి ఆతతభుజాల । పదునయినయాయుధపరివారములను
పిలుపించి యోరణభేరి వేయించి । బలువయిన సుగాణాధిపతులతో గూడ

యేమిని బొంకుదు నేమి సేయుదును । యేమెరుగనివారికిటు యేమివచ్చె
పెండ్లివద్దని మొరబెట్టిన నేను । కండ్లగానక చేసె కపటియీమంత్రి
పడుచులేకున్న ఆపదవచ్చునిపుడు । పడుచుయున్నదియన్న పంపుదందురిక
యీవహీనునితోడ నేమందునను చు । ఆమంత్రిబిలుపించియాగ్రహంబునను
చూచియాతనితోడ చురచురబలికె । యేచిరత్నాంగదుడిటవచ్చె నేడు
ఓరిపాపాత్ముడా వుండుండినీవు । యూరక యపకీర్తి నొందజేసితివి
మూలనుండినవాని ముంగిటవేసి । యీలీలయాపద నేమి తెచ్చితివి
యెక్కడి శేషుండు నెక్కడిపడుచు । యెక్కడి పెండ్లి నిన్నేమి సేయుదును
యిదిశాశ్వతనియని యెంతజెప్పినను । మదిలోన నెరుగక మంత్రివానీవు
లేమయీ గృహమున లేదన్న దెరిగి । తామసంబునపుత్రితో బంపుమనుచు
రాయబారముబంపి రాకయున్నాడు । పోయియేమనివారి ముందరనిలచి
మాట్లాడినొప్పించి మరివారితోను । నెట్లుగాదలచిపూనికె మీరువాడ
నాటివేడుకగాదు నగుబాటుగాని । చాటిచెప్పినగాని చయ్యనవినక
సమ్మతంబునబోయి సఖియదెచ్చితివి । పొమ్మనితలవంచి పోజాలకపుడు
మరినోటయించుక మాటైనలేక । విరుపంబుననుండె నిర్విణ్ణుడగుచు
అంత ధర్మాంగదుడతని నిందించి । యింతైనగానిమ్ము నేపోయియతని
అంతరంగముబట్టి అఖిలంబుగాను । యంతయుజెప్పిన నటుమీదనతడు
ఎంతయానతోపించియేమయిననన్ను । యంతవింతలుగాగ సాదనిమ్మనుచు

## ధర్మాంగదుడు రత్నాంగదుని జూడబోవుట.

మించినరథమున మేలువస్తువులు । కొంచపోయువిరాజాకునుసమర్పించి
కాంచనాంబరములుఘనరత్నతతులు । కాంచనపాత్రిలకట్నంబులిచ్చి
అతనికౌగిటజేర్చిహర్షంబుమీర । చతురతగూర్చున్నసమయంబునందు
ధర్మాంగదునకురత్నాంగదుడనియె । అర్మిలిగుణవతియనిగాకమరియు
సకలదిక్కులనినుసన్నుతిసేయ । ప్రకటంబుగావినిబహుసంతసమున
యికనింతచోటుదానేడలేదనుచు । నాకచోటికక్కడనొప్పకనేను
నీపుత్రిజూడకనాపుత్రినిస్త్రీ । నాపిన్నవానిపైయభిలాషచేత [illegible]
నేడైనకన్నులనిండజూచెదను । తోడితెప్పించుసంతోషంబుమెరయ
తరువాతమాపుత్రికగబంపవలయు । అరయెంగనేటిపరత్వంబుమాకు
ధారుణిభారంబుకగిలియుండంగ । వారకనిందాకవచ్చెడికొరకు
తీరకుండంగయిన్నిదినములుజరిగె । కొరికతోడుతకొడుకుతోడలిని
పంపించుపోవలెపనిచాలగలదు । పంపకగానిపోగూడదటంచనిన

మీయింటనుండియీ మెలతయు వెడలి । పాయనియడవులు పర్వతంబులను
వేరైన నదులును వేరైననిధులు । వేరైనతీర్థతతుల్ ప్రియముతో దిరిగి
చెలగిధర్మపురంబు చేరియీచెలియ । విలసితనరసింహ విభునివర్ణించి
గురుతరంబైన యీకుండంబు నహిమ । వినివిహితంబుగా విప్రులకెల్ల
దానముల్ సేయుచు తరళాయతాక్షి । గురుజనంబులగూడి గుండంబుజేరి
గురుతైన యాబ్రహ్మగుండంబులోన । అహిరాజుతోడను అంచుకుంకినను
మహిమీగపరమాత్మ మహిమచేనపుడు । పురుషుడైనిలచినాపాలతితో గూడి
కరమర్థివచ్చిరి కనుగొనుమనుచు । దంపతులను వేగ తగబిలువించి
సొంపుగానిద్దరి జూసినజూచి । కంపించియుంత భూకాంతునకనియె
దంపతులంచు రాధరణీశయిట్లు । యెవవానిదెచ్చి మీరిప్పుడునాకు
పోడిమితోడుత పుత్రుడటంచు । అడంగదెల్లునా యపకీర్తిభువిని
కోడలైయీగాని కొడుకుగాజేతను । పుట్టినగ్రామము పుట్టగోవిడిచి
పుట్టనివానిని పుత్రుజేసెదరు । యిట్టిమాటలుపల్క యిదిపాపమనిన
గట్టిగావినిమరి కమలాయతాక్షి । అట్టిట్టు చెదరక అప్పుడిట్లనియె
యేల్లపల్కితివయ్య యిటధర్మమడిగి । ఏపాపమతివైతి యిందేలవత్తు
భూపాలవిమమునీ పుత్రుడేయితడు । సత్యంబుచెప్పెద చనగవిచయ్య
మానంబువిడిచి దుర్మార్గులైపోయి । మానితులెక్కడ నుగుడనేరెంచి
సిగ్గులజ్జయుమాని శీలంబువిడిచి । అగ్గలంబుగనవ్వ మాతఘనలేః
తనవా ముందర తలలెత్తుకొనుచు । కొనకొన్ని ప్రక్కన నునుకునంగర
యిరువుగానానునెరుగకాశితివి । పరమాత్మునుతగా భయయేమినాకు
వినవయ్యపేక సేవిన్నవించెదను । కనకాపు ంయి వేగమొకర్తి సేతు
మునివేషధారినై ముఖ్యమైనట్టి । వనములుగిరులు దేశాల యుంబులును
మించిన నూటయెనిమిది తిరుపతులు । కొంచక సేవించుకొనివచ్చిపిదప
శ్రీధర్మపురిజేరి క్షీరాబ్ధిపుత్రి । నాథుడైనట్టి శ్రీనరసింహుజేరి
ఎదిరైయెనుగనముల ప్రస్తుతిజేసి । వదలక సేవించివచ్చియీవలను
పదండిగొనక మంటపములోన జేరి । మదిలోన చింతించి మరిమరిగుండి
నదులుదేశంబులు నగరశైలములు । ఉదయాద్రిపర్యంతమున్నతీర్థములు
తిరిగితి నాపాలి దేవుడెంతయును । కరుణించడాయెనా కర్మమీలాగు
ననుచు వేసటనొందియతివేగమునను । ఘనమైనబ్రహ్మపుష్కరిణియామడుగు
గనియుందునురికెద గాకని దలచి । వినయముతోడ నావిభునున్న పెట్టి
భూకాంతపైబెట్టి పుణ్యవాహినిలో । యీకమ్మదేహంబు నెసయబోవంగ
ఆకాశవాణి యిట్లనియెనావేళ । ఓకాంతయిందులో నురకనేమిటికి

కాకోదరుఁ నీదు కంఠమందునిచి । చేకొని స్నానంబు చేసినంతటను
మురుకంటెచక్కని మహనీయమూర్తి । పురుషుడౌనని చెప్ప భూనాథయేను
నశరీరి చెప్పిననట్లు చేసితిని । నాశరీరమునను శేషుఁ రూపముడిగి
పురుషుడై నిలచెను భువనైకవంద్య । మాపటంబుతోడుఁ దనసతిఁ దోడ్కొనుచు
వరుఁసమీపాలికి వచ్చెదనన్న । నరులయీతనిఁ జూచి నవ్వఁగటంచు
గ్రక్కునమాతండ్రి కడకేగుదెంచి । యక్కడనాప్తమంత్రియుఁ దెల్పి
ఒక్కతె వచ్చుటయుఁ జూచిమా యనచు । తక్కక తండ్రిని తగ దోడుకొనుచు
వచ్చితినన్న యీ వనభూసంద । ఆశ్చెరువందిరా నబలకిట్లనిరి
భోగిరాట్కుడనైన పురుషుడౌనమ్మ । అగడంబున కడుపార్చుటే గాక
పతులకెక్కుడనైన సత్యశాంతములు । శీలోన్నఁగఁదని చెప్పఁగానము
ఇందునసాక్షివారెవ్వరున్నారు । కందవకోడ వాకాశవాణమ్మ
అక్కడఁ బలుకట అరినవ్వరాదు । యిక్క బలికి యడవిశ్చయంబు
అక్కడఁగలధవళ గతిగలదిచట । ఇక్కడివారెల్ల యందరవినఁగ
పలికెనా నిజమని పాటించవచ్చు । పక్కఁవృవి ప్పడు పడతిరో యవిన
కలికిరో నీగుణకథ లెన్నవచ్చు । సీలోనధవళంబు నిలచియుండఁగను
లోలాక్షియిందరిలోన బల్కుంచు । అనినను ఓకనప్పుడబ్జాయతాక్షి
కొంనసితారాపదిక్కు ముఖముగ నిలచి । తనహస్తములు ఫాలతలమున జేర్చి
యగణితభక్తితో నప్పుడిట్లనిరి । వారాశిజాచ్యుతనరసింహరామ
వారిజోదర జగద్వంద్యలోకేశ । పరమాత్మ కృష్ణ ద్రౌపదిమానరక్ష
కరిరాజ నాహార్య గాచినయట్లు । ననుగావుము శ్రీకృష్ణ నలినాయతాక్ష
జనపతినన్ను విశ్వసింపడిప్పుడు । కరుణాకటాక్ష వీక్షణము పైనుంచి
పరమాత్మయశరీరి బలికింపవయ్య । అనియిట్లు శ్రీహరినభినుతిజేసి
వనజాక్షియాకాశవాణివీక్షించి । అలినీలవేణి ఓయాకాశవాణి

## శశిముఖి ఆకాశవాణిని పల్కించుట.

సలలితమృదుపాణి సైకతశ్రోణి । వారక పేశతివ్రతనైతినేని
ధారుణీవేదముల్ తథ్యమౌనేని । మురరిపుఁకడు లోకమనగల్గెనేని
మురువక భూమి ధర్మము దప్పదేని । తగ శేషుడీగడై తగనిల్చెనేని
గగనంబునుండి వేగ మెపల్కుమనిన । అధర్మకేతన యధిపతో ననిరి
ఓధర్మగుణసాంద్ర యోరాజచంద్ర । నీపుత్రిఁడితడౌను నిజముగానమ్ము
భూపతివ్రితమాట లివికల్లగావు । అనగజ పాంతి యామాల్యతార
శివపత్ని యనహాయిశ్వరాబ్ధితనయ । కొండలయినవనితల బోలునీకాంత

యిదిమొదలెవ్వరీ యింతిసేమి కూను । మీాపల్కగరాదు మెలతమిమ్మెల్ల
వారించిపోయి కీర్తులుదెచ్చెగాక । మీాకులంబెల్ల శూన్యమైనిల్చెగాక
గామన్నవింతటి కాంతలుగలరె । ధరణీశవినవయ్య తన్వినీకరణి
కరుణించినీసుతు ఘనతచేపట్టి । పట్టునవేగంబె పట్టంబుగట్టి
గట్టిగానేలించు కలరాజ్యమంత । నీవువైభవంబున నేటనుండియును
దావలంబుగను మోదముతోడనుండి । అత్యంతధామిణీమరాలైనసతిని
సత్యవతియంచు సన్నుతిసూర । ననరయ్యమీారలు నపచారపడక
అనిచెప్పినంతలో నమరకన్యకలు । వనజాక్షిపైపుష్పవర్షంబువేగ
పనిబడికృపచేత పరమమోదమున । కురియుంచిరంతట గుంపులైచూచి
సురదుందుభులుమ్రోసె సొరిదిసీమంత । ఆవేళతండ్రితా నానందమంది
వేవేగపుత్రిని వీక్షించియనియె । రావమ్మనాతల్లి రాదనాపట్టి
తీవితోపుట్టినింటికి కీర్తిదెచ్చి । యీావేళన తనవాల్లుద్ధరించి
భావింపనింతటి పతిరతియేలదె । కులముద్ధరించిన కూతురమనుచు
పాలుపొందపుత్రిని బాగడెమ్రానికతము । కడుపంతయమునోడకోరికదీర
మనసులోపలనుదమానంగమందెపుడు । వనజాక్షిభావముతానదిమెచ్చి
చాలహర్షించియాజగదేకసాధ్వి । లోకముననగలపుణ్యదేశములు
సకలంబునేవించిపరిణాముచుపుడు । తనవాసినపురుషునితోడుకొనియు
నెంతసావాసినరియెంతియామినొప్పి । యెంతయతిపవిత్రయాముని సౌగసి
కడువేగపుత్రునికౌగిటజేర్చి । యిపతేండ్రవేదనాయెటగౌగలించి
అతిసంతసంబంది యావేళమరియు । హితులతో మిత్రపురోహితులతో చూచి
దొరలుమంత్రాంగమునితోడుకొనుచు । పురవరంబునకేగి పాలుపొందివేగ
కొడుకుకోడలను దోడ్కొనుచునావేళ । తనమహవంశ సంతసించెంటవంటి
పరువడిచతురంగ బలముగొలువ । వసుపతోడుతసాగు వాక్యములెల్లగ
కరిబృంహితములుమత్కటరథధ్వనులు । తురగహేషితములుసుభటావభూరి
భేరీరవంబులు వ్యతిశంఖములును । ధారాధరంబులు ధరణియూగాడ
రయమున తనమందిరమునకునేగి । నయమొప్పమేడల నందరముంచి
సుతునితోతాను నాసుందరితోను । సతికిరవకేతెంచి సకలంబుచెప్పి
మనపుత్రుడితడని మరిమాపవంత । కనిసంభ్రమించియా కమలాక్షిపలికె
పుట్టిపతివ్రతయాపుణ్యసాధ్వి । యిట్టిగుణములుగలిగి హితనాచరింప
పుడమిలోనింతటిపుణ్యంబుగలదె । యొనపకయావేళల నిల్లుద్ధరించె
అనినంతకోడలు అత్తమామలకు । గొనకొనిమ్రొక్కగ కోడలివప్రుడు
మెండసికౌగిటజేరిమన్ననచేసి । ముచ్చటపేరంగ మోదంబుతోను

## పురిజనము వచ్చి చూచుట.

యిచ్చలో మెచ్చి తానింటిలో దుతను । ముచ్చటాడుచునుండె మదిలోన దాన
యీవార్త పురజనుల్ యెరుఁగంగ వినియు । భావించి చూడను పరిపరివచ్చి
కన్నులనిండను కనగొని మెచ్చి । వన్నెగా బాగడేటి వారుకొందరును
కొందరు తత్క్షణ నమ్రమై కృవారు । కొందరు పోకలాకులు దెచ్చువారు
తెగఁతోకట్నములిచ్చెడివారు । పొగడొందగా జూచి పాదొక్కిడివారు
తగినట్టి వారసందడి నిల్చువారు । నగతింబుగ వెల్లవారలు మెచ్చ
తనపుత్రినప్పుడు ధర్మాంగదుండు । పసిఁడిపీటవించి పాటించిచూచి
ఘనమైనభక్తితో కాగిటఁజేర్చి । వనమునవాపిలుచి మరివరిమెచ్చి
హితవాచరించితా నిట్లనిపలికె । మతివంతుడౌదొడ్డ మంత్రివినీవు
మరినీవు సేయంగ మాయిల్లునిలిచె । ఆరయంగనిన్నవయ్య ఆదిరొయిట్టులనిన
ఉరగంబుబుట్టిన నాగిపుత్రుడనుచు । కరవధిధరలోన ఖ్యాతిబుట్టించి
తరువాతవేడ్కరత్నాంగదునింట । పరమపతివ్రత భాగ్యగంభీర
సత్యంతగుణవతి నతినీతిశాలి । సత్యాత్మురాలైన సఖియదెచ్చితివి
తెచ్చియుండగ గదా తేజంబుతోను । హెచ్చుగా సత్కీర్తి యిటుమాకుగలిగె
ఈకీర్తి యీధనము విదిసీదసొమ్ము । నాకు మంత్రివిగావు నాకుదేవుడవు
కోరకొని రత్నాంగదుడ వచ్చెనన్న । వెరపించిపుత్రుని వేగదెవ్వనిన
అప్పుడు దోచక ననఘాత్మ విన్న । నొప్పని యులుకులు నుచితంబుదప్పి
యేమేమియంటినో యప్పుడు నీవు । ఆమాటలెల్లను అత్మలోనుంచ
వలదని భూషణాంబులు నశ్వములు । పరమైనపురములు పల్లకీనిచ్చి
రహింపించి కనకాంబరాదులనిచ్చి । బహుమానములచేసి బహుభంగినపుడు
వింతగా భోజన వేళయైనంత । సంతసలబందుచు జనపతివేగ
వియ్యంకుడును దాను వివిధబాంధవులు । పయ్యన వంక్తిని చక్కగా గూర్చుండి
వచ్చినవారిని వరుసకొక్కొర । హెచ్చుగా బిలిపించి హితవుతో దుతను
బహువిధన్నంబులు వడ్డన పూర్ణ । మహితమై యుప్పుకప్పురపు కందిపప్పు
చల్లవడెంబులు చక్కిలంబులను । కొల్లలుగా మంచి కూరగాయలును
అతిరసంబులు మంచి అప్పాలట్ల । మిరలేనిఫలరసము ధుర్యములను
అధికమౌ పచ్చళ్ళు ఆట్లపాంగళ్లు । దధితోడ గూడి రుచులయౌ సౌఖ్యముగను
తినవారలంతమున తిగినంసంబు । తనవొందభుజియించి యటుతేయిపుడు
పొసగ కర్పూర తాంబూలందలిచ్చి । రుయగసంతోషించె నిష్టమైనట్లు
తెలివిమై కంచరత్నములు దేవరిర్ణ । పలనొప్పయా బంధు వరులు ముందరను

అవనిలో బ్రాహ్మణులందరు తాము । సవరణ మంగళాష్టకములు జదువ
అభివసింహుతో యమ్ములనప్పు । డభిషేక మొనరించి యప్పుడిట్లనిరి
ఎందాక కులగిరు లెందాక సూర్యు । డెందాక చంద్రుడు నెందాక ధరణి
యెందాక దిక్కులు నెందాక నుండు । నందాక వేడ్క రాజ్యము సేయుమనుట
భూసురోత్తములును బుధులును వేడ్క । నాశీర్వదించుచు నవని కంతటను
పట్టంబు కట్టిరి భాసురంబుగను । గట్టిగా పట్టంబు గట్టినంతటను
భూనాయకుడు వేడ్క భూసురులకును । దానంబులిచ్చి యాదరమున బంపె
కవులకు భట్లకు కట్నంబులిచ్చి । నవమోహనాంగుడై నాట్యకాంతలకు
అడిగిన త్యాగంబులందరికిచ్చి । తడయక వేడ్కనందరిని పంపించి
అరయాంగదత్మాంగదాది బంధువుల । పరువడి భక్తి తాత్పర్యంబుతోడ
కనకాంబరాదులు ఘనభూషణములు । వినయవిధేయుడై వేర్వేరనుయు
పూజించి బహుమానమున బంపెనపుడు । తేజంబుతో తమ దేశంబులకును
అరిగిరి వారంత హర్షంబుతోడ । స్థిరతర నీతితో చిత్రాంగదుండు
పరమహర్షంబున ప్రజలమన్నించి । అరయగా తలిదండ్రులామోదమంద
చిరవైభవంబున క్షితియేలుచుండె । ఆనుచు గౌతమముని యాహల్యతోను
పొలుపు మీరంగ జెప్పిన సంతసించె । ఆనిరమాధీశుడా నబ్జాక్షు పేర
ఘనముగ శ్రీబొమ్మకంటివంశజుడ । నను మందకృష్ణున కవితంబగును
రచియించి చెప్పితి రమ్యంబుగాను । ఉచితార్థయుతముగా నొనరిన యట్టి
యీ పుణ్యకథ భువి నెవ్వరు భక్తి । నేర్పుతో జదివిన యిష్టమై వినిన
వరుసతో వ్రాసిన వారలకెల్ల । సిరియును నాయువు గల్గి చెలగుచుందురు
పరువడి సతులతో బంధువులతోడ । వరుస పుత్రులతోడ వలనొప్ప నెపుడు
కామితార్థంబులు గలిగి హర్షించి । తామరతంపరై తనరుచుందురు

# 51 నోముల కథలు.

## 1 గాజులగౌరి నోము కథ.

ఓ బ్రాహ్మణ చిన్నది గాజుల గౌరీదేవి నోముపట్టి ఉద్యాపన చేసుకోకుండా ఉన్నది. ఉంటే ఆవిడను చూస్తే వీధిలో ఇరుగు పొరుగు అంతా చిట చిటలాడేవారు. ఇంట్లోకివస్తే మొగుడు అత్తా మామలు వదినెలు అంతా చిట చిటలాడేవారు ఇలావుంటే పడలేక ప్రాణం విసిగి చివరకు యేమైనాసరే అని తెంపుచేసి అడవిలోకి వెళ్ళి యేమీ తోచక యేడుస్తూ కూర్చుంటే లోక పరిపాలనార్థమై పార్వతీ పరమేశ్వరులు బయలుదేరి వెడుతూవుండగా యీ విన దీనాలాపములు వినబడ్డాయి. వినబడితే పార్వతీదేవి యేమిటిది స్త్రీ కంఠములాగ వున్నదని అడిగితే ఆయన నవ్వి అవును, గాజులగౌరి నోముపట్టి ఉద్యాపనచేయక ఉల్లంఘనచేసింది అందుకని యిలాఅయింది అంటే పార్వతి జాలిపడి దగ్గరకు పోయి అమ్మాయి ఏం ఇలా ఒంటరిగావున్నావంటే ఏం చెయ్యను నన్ను చూస్తే అంతా చిటచిటలాడుతుంటారు అన్నది. అప్పుడు పార్వతీదేవి నవ్వి ఓ పిచ్చి తల్లీ! నీవు గాజులగౌరి నోముపట్టేవుగదా, ఉద్యాపనం చేసుకున్నావా అంటే లేదన్నది. అలాయితే యింటికివెళ్ళి ఉద్యాపనం చేసుకో అంతా నిన్ను గౌరవిస్తారని వారంతర్ధానమైనారు. ఈ చిన్నది యింటికి వెళ్ళి ఉద్యాపనం చేసుకొంది. అప్పటినుంచి అంతా యీ చిన్నదాన్ని చూస్తే సంతోషపడేవారు.

ఉద్యాపనము.—ఓ మంచి ముత్తయిదువను పిలుచుకొని తలంటి నీళ్ళుపోసి చీర రవిక యిచ్చి పిండివంటలతో భోజనం పెట్టి తాంబూలం యిచ్చి ఆవిడ కోరుకొన్న గాజులు తొడిగించి దణ్ణంపెట్టవలెను. భక్తితప్పినా ఫలంతప్పదు. కథలోపమయినా వ్రతలోపం కారాదు.

## 2 కుంకుమగౌరి నోముకథ.

ఒకవూళ్ళోవున్న సోమయాజులగారి అమ్మాయి కుంకుమగౌరి నోముపట్టి సరిగా ఉద్యాపన చేసికొన్నదికాదు. అందుకని విధవాత్వంవచ్చింది. అమట్టున ఆసోమయాజులు లేకలేక పుట్టిన యీబిడ్డ యిలా అయిందే మాయని దుఃఖపడి కుటుంబసహితముగా కాశీయాత్రకువెళ్ళి అక్కడ గంగ

ఒద్దున బ్రహ్మాండమైన తపస్సుచేస్తుండేవాడు. ఇంతలో కొన్నాళ్ళు జరుగగా జరుగగా కాశీవిశ్వేశ్వరుడు ప్రత్యక్షమై నీకేమికావాలి కోరుకో మనగా అయ్యా నా పుత్రికకు విధవాత్వము మాన్పించే వరమియ్యమనగా ఆయన అన్నాడుగదా యీ చిన్నది కుంకుమగౌరీదేవి నోముపట్టి ఉద్యాపన చేయక ఉల్లంఘన చేసింది. అందుకని యీలా అయింది. ఇప్పుడా నోము ఉద్యాపన చేయించు శుభము కలుగుతుంది అని చెప్పి అంతర్థానమైనాడు. ఆయన వచ్చి సంతోషముతో యీ చిన్నదానిచేత ఆ ఉద్యాపన చేయించాడు ఆమెకు విధవాత్వం పోయింది.

ఉద్యాపనము.—పదముగ్గురు ముత్తయిదువులకు పదముగు బరిణెలకుంకుముపోసి, పదముగ్గురికి పదమూడు లక్కజోళ్ళు, నల్లపూసలు పెట్టి తాంబూలమియ్యవలెను.

## 3 తవిటి గౌరినోముకథ.

ఒక యిల్లాలకు తల్లి తండ్రి అత్తమామా యెప్పుడు యెడబాయకుండేవారు. ఏమమ్మా నీకీ యదృష్టం అంటే ఆమె అన్నదిగదా మా అమ్మ క్రిందటి జన్మాన తవిటి గౌరీనోము వాయనము అందుకున్నా దాని ఫలమిది అనే టప్పటికి అంతా అనుకున్నారుగదా ఏమి వాయనముపట్టితేనే యింతఫలమైతే యిక ఆనోము నోచుకుంటే యెంతమంచిదో అని అందరు ఆనోము నోచటము ఆరంభించేరు.

ఉద్యాపన.—తవ్వనిండా బియ్యముపోసి శక్తికొద్దీ చీర శక్తిలేని వారు రవికెలగుడ్డ పసుపు కుంకుమ తాంబూలం ఒక ముత్తయిదువకిస్తే సరి భక్తితప్పినా ఫలంతప్పదు వ్రతలోపమైనా కథలోపంకారాదు.

## 4 చిక్కుళ్ళగౌరిదేవి నోముకథ.

చిక్కులులేకుండా వుండాలంటే చిక్కుళ్ళగౌరిదేవి నోముపట్టవలెను రథసప్తమినాడు ఎత్తుకున్నబిడ్డను యెడబాయకుండా పక్కలో బిడ్డను పాలుమారకుండా కంటికాటుక కదలకుండా చంకనున్నబిడ్డ సడలకుండా చేతిగాజులు చెదరకుండా కాలిమట్టెలు కదలకుండా కట్టినబట్ట కదలకుండా వెంటపురుషుడు యెడబాయకుండా ఒంటిసొమ్ములు వదలకుండా యీ నోము నాడు దీక్షగా వుండాలి. వెండిచిక్కుడుపూలు పయిడిచిక్కుడుపూలునే పంచిపెట్టినా చిక్కుళ్ళగౌరీదేవి తల్లి చిక్కచింతలేకుండా సిరిసంపదయిచ్చి కాపాడుమని కథచెప్పి అక్షింతలు వేసుకొనవలెను.

ఉద్యాపనము.—ఓబంగారపు చిక్కుడుపూవు గాని అంతకు శక్తి లేకపోతే వెండిచిక్కుడుపూవుగాని చేయించి ఒకముత్తైదువును పిలిచిభోజనం పెట్టి చిక్కుడుపువ్వు చీర రవికెలుగుడ్డ పెట్టి దక్షిణతాంబూలంయిచ్చి నమస్కరించవలెను.

## 5 రేగులగౌరిదేవి నోముకధ.

ఓరాజుగారిభార్య రేగులగౌరిదేవినోముపట్టి ఉద్యాపనం చేయుటకు మరిచిపోయి ఉల్లంఘనం చేసింది. ఆవెడ ఆమాటే మరిచిపోయింది ఆవెడకెన్నాళ్లున్నా సంతానం కలిగిందిగాదు. చూచిచూచి ప్రాణంవిసిగి ఆవిడె తలగట్టుకొని దుఃఖమ్మాపడుతుంది. అనిదరిలో శ్రీవిష్ణుమూర్తి వచ్చి ఏం ఆమ్మాయి అలావిచారపడుతున్నావు అని అడిగితే నాకు సంతానం లేదు ఎందుకజన్మ అని విచారిస్తున్నానని అంది అంటే సరేనీవు రేగులగౌరిదేవి నోముపట్టి మరచిపోయి ఉద్యాపనం చేయకుండా విడిచిపెట్టేవు అందుకని యీలాఆయింది. కాబట్టి తవ్వెడునరసోలెడు బంగారు రేగుపండ్లు చేయించి ఒక మంచిబ్రాహ్మణునకు వాయనమిస్తివా నీకుసంతానం కలుగుతుంది అలాచెయ్యమనేగానే ఆవెడలేచి బ్రహ్మాండమయిన సంతోషముతో అలాచేసింది ఆమెకు సంతానం కలిగింది ఇరుగు పొరుగు వారంతావచ్చి ఏమమ్మా నీయదృష్టం నీకిలాసంతానంగలిగింది అంటే ఆవిడె అన్నదిగదా నేనుచిన్నవాడు రేగులగౌరినోముపట్టి ఉద్యాపనమరచిపోయినాను అప్పుడు దుఃఖిస్తే శ్రీవిష్ణుమూర్తి ప్రత్యక్షమై వ్రతం ఉద్యాపనం చేసుకోమన్నారు. ఆప్రకారంచేసేను. ఈలాకలిగింది అన్నది. ఆమటున అచ్చటివారంతా యీవ్రతంచెయ్యడం ఆరంభించేరు.

ఉద్యాపనము.—కుంచెడు తవ్వెడు మంచిరేగుపండ్లుతెచ్చి అందులో ఒకరేగిపండు బంగారంతో చేయించివేసి ఒక బ్రాహ్మణునకు పంచలచాపుయిచ్చి భోజనముపెట్టి యీరేగుపండ్లు ఆబంగారపు రేగిపండు తాంబూలముతో వాయినముయ్యవలెను. భక్తిలోపమైనా ఫలంతప్పదు వ్రతలోపమైనా కధలోపము కారాదు.

## 6 గ్రహణగౌరి నోముకధ.

ఒకవూళ్లో ఒక బ్రాహ్మణుడుండేవాడు ఆయనకు యోగ్యురాలైన భార్య ఉండేది వారికి నలుగురు కుమాళ్ళు ఒక కుమార్తెగలిగినది ఈకుమార్తె కడసారిది అయితే ఈబిడ్డపుట్టినప్పటినుండి పగలు మనిషిగాను, రాత్రి

ళ్ళు పురుగులుగాను అయిపోతుండేది. తల్లి చాలాకించపడి, రాత్రిళ్లు నిద్ర మానుకొని ఆపురుగులన్నీ చెదరిపోకుండ ఒక గుంటచేసి అందులోకి పోగుచేస్తూ వుండేది. ఇలావుండగా ఆవిడ అన్నగారువచ్చి అమ్మాయి పిల్లకు యేడాది వెళ్ళవచ్చింది పురుటిమంచము చూచి వస్తువు గాని రమ్మంటే అన్నయ్యా ఇప్పుడుగాదు యింకోమాటు వస్తానన్నది. ఇలా ఇలాపిల్లతో బాధపడుతోనే వుంది పిల్లకు రెండోయేడు వచ్చిన తరువాత అన్నగారువచ్చి మళ్ళీ పుట్టింటికిరమ్మని చెప్పేడు ఇప్పుడుగాద న్నయ్యా ఇంకోసారివస్తాను అని చెప్పిపంపించింది ఈపిల్లపగలల్లా చక్కగా మనిషిలాగనే వుండడం రాత్రిళ్లు పురుగులు కావడం అలాగేవున్నది. ఇలాపిల్లకు 8 యేడువచ్చింది మళ్లీ అన్నవారు వచ్చి అమ్మాయిరా ఇప్పుడు రాకపోతే ఇక మీరుమీరే మామేమే అని నిష్ఠూరముగా మాట్లాడితే అప్పుడు పెద్దకోడలిని పిలిచి ఏమే యీబిడ్డను నాలుగురోజులపాటు కాపాడుతావే అంటే అమ్మా నావల్లకాదన్నది. రెండోకోడలిని అడిగితే ఆవిడా అసలేవల్లగాదన్నది. మూడోకోడలిని అడిగింది ఆవిడ నాపిల్లల తోటే చేయలేకుండా వున్నాను. ఈబిడ్డతో నావల్లకాదు అన్నది సరే ఇక నాలుగోకోడలున్నది అని ఆ అమ్మాయిని అడిగింది ఆవిడసరే వెళ్ళి రండి నానికేంభాగ్యం అలాగే చూస్తాను ఎవళ్ళకైనాపుట్టింటి ఆశవుంటుంది అన్నది. అనుట్లున ఆవిడ ఆకోడలనుపిలిచి ఓసీ యిది పగలుపిల్ల రాత్రిళ్లు పురుగులైపోతుంది ఇవన్నీ చెదరకుండా పోగుచేసి ఈగుంటలో ఉంచాలి మళ్ళీ తెల్లవారేవరకు పిల్లయిలేస్తుంది. ఒక్కపురుగూ చెదరకూడదు అన్నది సరేఅని ఒప్పుకుంది అత్తగారు పుట్టింటికి వెళ్ళింది. ఈకోడలుమాట అన్నది గాని ఆరాత్రిచాలా కష్టమనిపించింది సరే ఒప్పుకున్నాము ఎలాగో చెయ్యాలని చేస్తూవుంది ఇలా మూడురాత్రిళ్లు జరిగింది. ఆచిన్నవాని పెనిమిటి ఏమా యిది రాత్రిళ్ళు గదిలో పడుకు రావడములేదని యీరాత్రి కనిపెట్టి వుందామని వున్నాడు ఆరాత్రిగోడమీద కూర్చుని యిది అంతా చూచి జాలిపడి మరువాడుభార్యను అడిగితే వున్నయథార్థమంతా చెప్పింది అతడు సంసారము విడిచి అప్పుడే అడవిలోకిపోయి ఆకుమీద ఆకు పోక మీదపోక వేసుకొని నిరాహారుడై తపస్సుఆరంభించేడు. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు లోకపరిపాలనార్థము బయలుదేరి వస్తూవుంటే పార్వతి, పరమేశ్వరా ఎవరయ్యా యీతపస్సుచేసేవారు అన్నది అంటే అతనొక బ్రాహ్మణుడు అని చెప్పితే అలా వాడు ఎందుకా తపస్సు కనుగొందామని వచ్చి అడిగితే అతడు "అయ్యా నాచెల్లెలు పుట్టినప్పటినుండి పగలల్లామని

షిగానేవుంటుంది. రాత్రిళ్లు పురుగైపోతుంది ఆదుఃఖముపట్టలేక యిలావచ్చి తపస్సుచేస్తున్నానంటే అప్పుడు పరమేశ్వరుడు జాలిపడి ఓయీ నీచెల్లెలు క్రిందటిజన్మలో రజస్వలయి యింట్లోకలిపింది ఆదోషముచేతయిలాఅయింది అంటే మహానుభావా మరి ఆపి పోయ్యేసాధనమేమంటే గ్రహణగౌరీ వ్రతముపట్టి ఉద్యాపనచేస్తే ఆపురుగులు కావడంపోయి సకలారోగ్యములు కలిగి పిల్ల జేదీప్యమానముగా వుంది. తరువాత తల్లివచ్చి పిల్లనుచూచి కొడుకును కోడలను దీవించి నాయనా నాకష్టములుగట్టెక్కినవి అనిచెప్పింది.

ఉద్యాపనము—అమావాస్యనాడేగాని సూర్యగ్రహణము రాదుగనుక అగ్రహణము పట్టగానే పసుపు కుంకుమ పిండి బియ్యము ప్రత్తి బెల్లము ఆకు పోక దక్షిణలతో ఒకచోటపెట్టి గ్రహణము విడిచి విడువగానే స్నానముచేసి పైకథ చెప్పుకొని అక్షింతలు వేసుకొని తొమ్మిది కోజాలు తొమ్మిది పద్మములు తొమ్మిది వత్తులు దీపములు తొమ్మిది అట్లు వాయినాలు తొమ్మిది అట్లు నైవేద్యము కొత్తచల్లెడలోపెట్టి పాతజల్లెడ వానిపైన మూతవేసి చీర రవిక పెట్టి యిదిఒక పెద్దముత్తయిదువుకువాయన మివ్వవలెను.

## 7 శాకదానము నోముకథ.

ఒక పట్నములో ఒకరాజు ఒక మంత్రి ఉన్నారు వారి భార్యలు యిద్దరు శాకదానమునోము పట్టేరు. రాజభార్య ద్రవ్యము కలదిగనుక ఎప్పుడుబడితే అప్పుడే చేసికోవచ్చునని తలంచి శాకదానమునోము మాట అలక్ష్యంచేసింది. మంత్రిభార్య భక్తితో ప్రతిదినము ఒక తోటకూరకట్ట ఒకదబ్బు ఎవరో ఒక బ్రాహ్మణునకు యిస్తూ యిలా యేడాదివ్రతం చెడకుండా జరిపింది. రాజు భార్యకు ఏదో గబులువలె రాను ఏడుస్తు కూర్చోను ఇలా అయింది, ఎన్నాళ్ళు చూచినా యీలాగేవుందని అడివిలోకిపోయి అక్కడ యేడుస్తూ కూర్చుంటే ఆ దారిని పార్వతీపరమేశ్వరులు పోవుచు యీచిన్నదాని ఏడుపాలకించి, దగ్గిరకువచ్చి ఏమిటమ్మా! అలాఏడుస్తున్నావు ఎందుకని అడిగితే ఎందుకో నాకుతెలియదు ఎప్పుడూ ఏడవాలని ఉంటుంది అన్నది. ఆమాట విని పరమేశ్వరులు నీవు శాకదానముపట్టి ఆవ్రతం ఉద్యాపన ఉల్లంఘించావు అందుకని యిలా అయింది ఆ వ్రతంచేస్తే యీదిగులు పోతుందని అంతర్ధానమైనారు. ఆరాజు భార్య యింటికివచ్చి అతిభక్తితో ఒకటికి పదిగా ఏడాదిదాకా శాకము బ్రాహ్మణునకు దక్షిణతో దానముయిచ్చింది. ఈశోకము పోయింది. చూచినవా

తంరా ఆశ్చర్యపడి ఏమమ్మా ఎలాపోయిందంటే వారంతా కూడా నోచెరు.

ఉద్యాపన.—రోట్లో తోటకూరమడిచల్లి ఆ తోటకూరకోసి, బ్రాహ్మణునికి భోజనంపెట్టి వస్త్రమిచ్చి పదపదిమూడుడబ్బులు దక్షిణ తాంబూలంయిచ్చి తోటకూర వాయనం యియ్యవలెను. భక్తితప్పినను ఫలము తప్పదు వ్రతలోపమైనను కథ లోపముకారాదు.

## 8 మునికార్తిక దీపముల నోముకథ.

ఒకబ్రాహ్మణుని భార్య కార్తికదీపముల నోముపట్టి వ్రతసమాప్తి చేయకుండా ఉల్లంఘనచేసింది అప్పటినుండి ఆవిడెకు దరిద్రంపట్టుకొనడమే కాకుండా కడుపు శోకముకూడా కలిగింది. ఆవిడె చాలా పరాకాష్ట గలది. అందువల్ల నేనుపోయి బ్రహ్మనడిగి వరం తెచ్చుకుందునని బయలు దేరి పోతున్నది పోతుండగా దారిలో ఒకబ్రాహ్మణు డగుపించి ఎక్కడికి పోతున్నావమ్మా అన్నాడు. నాయనా బ్రహ్మదగ్గిర వరము తెచ్చుకోడాకి వెళ్ళుతున్నానన్నది, నామాటకూడా కొంచెము చెప్పవూ అనగా ఏమిటి నీమాట అన్నది. నేనిక్కడికి 18 జన్మాలనుండి అన్నము నీళ్లు లేకుండా వున్నాను ఈసంగతికూడా కనుక్కొని నాకుగూడ వరము తెమ్మన్నాడు సరేఅని ఆవిడ వెళ్లుతూవుండి దారిలో ఫలభరితమైన కడిమామిడిచెట్టు కని పించి ఎక్కడికి వెళ్లుతున్నావమ్మా అన్నది. అంటే బ్రహ్మ నడిగి వరము తెచ్చుకోటానికి వెళ్ళుచున్నాననగా నామాటకూడా కొంచెము మనవి చెయ్యమన్నది ఏమిటంటే నాచెట్టుకావలసినన్ని పండ్లున్నవి పక్షి నరుడు యెవరూ ముట్టరు కారణమడిగి, యివియాన్నుకొ నేవరము తెచ్చిపెట్టవమ్మా అని బ్రతిమాలుకొన్నది. సరే అని దాటిని పోతుంటే ఒక బురదగుంటలో ఆవు దూడా వున్నవి చుట్టు నోటిదగ్గిరకు అందేటట్టు గడ్డివున్నది. ఒక్క పరకైనా కొరుకవు అవి యీమెనుచూచి ఎక్కడికి వెళ్ళుచున్నావు అని అడుగగా బ్రహ్మదగ్గిరకని ఆమె చెప్పగానే మేమిలావున్నాము మాగతి కొంచెము మనవి చేయుమని చెప్పగా నామె సరే యని ముందు పోవుచుండ గా పూచిన మల్లెపూల చెట్టగుపించి అమ్మా యెక్కడికి వెళ్లుచున్నావనగా బ్రహ్మదగ్గిరకని ఆమె చెప్పగానే నేనిలావున్నాను ఒక్కరు నాపువ్వులు కొనుకోరు ఏమిపాపము బద్ధలయినదో తెలియదు నాసంగతికూడా కొంచె ము మనవిచేసి రాఅమ్మా అని బ్రతిమాలుకొనెను సరే అని ఆవిడ ముందు నకు పోతుండగా ఒకరింట్లో వెదురు దణ్ణెమున వేసినచీరలు ఎప్పటికప్పుడే జారిపోతుంటవి, వారిమెతో అమ్మా ఎక్కడికి వెళ్లుచున్నావని యడుగగా

నామె బ్రహ్మ దగ్గిర వరము తెచ్చుకోటానికని చెప్పగా మా మాటకూడా కొంచెము చెప్పి యీదిక్కు తప్పింపుమమ్మా అని బ్రతిమాలుకొనిరి ఆ వెడ వెడుతూంగా ఒకచోట రెండు పెనములు కాలుచున్నవి ఎప్పుడూ చల్లారవు అమ్మా మామాటకూడా చెప్పండి అని బ్రతిమాలుకోగా సరే అని బయలుదేరింది ఆవిడే వెళ్ళగా వెళ్ళగా బ్రహ్మలోకము కనుపించినది. అప్పుడామె వెళ్ళి బ్రహ్మ కెదురుగా నిలవబడగా బ్రహ్మ మాది ఏమమ్మా యింతదూరము వచ్చినావనగా ఆమె నమస్కరించి "నాకు గర్భదరిద్రము కడుపుశోకము కలిగింది, అది భరింపలేక నీకోసమువచ్చితిని కరుణింపుమనగా నాకను నవ్వి" ఓ అమ్మాయీ నీవు ఆటకోటికనముగా ముని కార్తిక దీపములనోముపట్టి ఉద్యాపనలేకుండా ఉల్లంఘన చేసినావు. అందుకని నీకిలాశిక్షించినది. యిప్పుడుతిరిగి ఆనోముపట్టి మూడు కార్తీకమాసములుసరిగా వెలిగించుకుంటే యీదోషముపోతుంది అనిచెప్పగా నామె పరమేష్ఠీ మహానుభావా దారిలో ఒకబ్రాహ్మణుడున్నాడు 18 జన్మములనుండి అన్నపానముచేసట. అనగా ఆబ్రాహ్మణుడు వేదము బాగాచదువుకొని అది తన సొత్తుగాని నెవ్వరికిచెప్పలేదు అందుకని అలాగైనాడు. నీవు పోయేటప్పుడు "గాను" అని ఆయనతో చెప్పివెళ్ళితివా అతనికాదిక్కు పోతుందనగా అమ్మా దారిలో జీడిమామిడిచెట్టు ఫలపరితమైయున్నది.

ఎవ్వరూ ఒక్కపండు కోసుకోరు అనగా ఆపెడ క్రిందటిజన్మమున కడిపెనుపిల్లలనుగన్న తల్లి ఒకరు వంశము నిలుపుకొనుటకై ఒక్కబిడ్డను పెంపు డివ్యమంటే యిచ్చినదిగాదు కాబట్టి యిలా అయింది నీవొక పండుకోసుకొని తింటివా యిక అందరూ తింటారు అదే శాపవిమోచనం అనగా సురజ్యేష్ఠా! దారిలో నొక ఆవు దూడ మెడలలోతు బురదగడ్డిలో నున్నా మేతమేయవనగా వారు క్రిందటిజన్మమున అత్తాకోడలు వారి యింట్లోనున్న ఆవుదూడకు వంతులుపోయి మేతవేయలేదు నీవు పోయేటప్పుడు గినెతితో గడ్డికోసిపెట్టితే అవిమేస్తవికొంచెము నీరుపెట్టితే త్రాగుతవి అక్కడనుండి వానికి శాపవిముక్తి అనగా పితామహా! దారిలో పూచిన మల్లెచెట్టుండి ఒక్కరు పుష్పములుకోయరనగా అది క్రిందటి జన్మమునబోగముది పూచినపుష్ప లెవ్వరికీయక తానే పెట్టుకుంది నీవు వెళ్ళేటప్పుడు ఒక పువ్వుకోసి పెట్టుకుంటే ఇక అంతా కోసుకుంటారు అనగా ధాతా! నేను పోయ్యేదారిలో ఒకరింట్లో దణ్ణెముమీద చీరలు ఎప్పుడు కాలిపోతుంటవనగా వారు పుట్టింటి ఆడబడుచులకు నెప్పుడు చీరపెట్టలేదు నీవు వెళ్ళేటప్పుడొక చీరదీసికట్టుకుంటివా ఇక అలా జరుగదనగా నో సృష్టికర్తా

ఒకచోట అట్లపెనములు యెప్పుడూ మండుతూనే వున్నవేమనగా వారు ఆ తకోడళ్లు ఎదురు వాయనా లందుకున్నారు అందుకని అలా అయింది నీవు కొంచెము నీళ్ళు చిలకరించి వెళ్ళుమనగా సరే ఇవన్నీ చేస్తాను నాకేమి ఫలితమనగా నీవు 360 వత్తులు వేసి పిడ్డెడు నూనెపోసి దీపాలు వెలిగించి నావు వెలుగించునందు కావత్తుల ఫలము మనికేసి ఒలికిన ఫలమిచ్చెదాను వెళ్ళి నోముపట్టి ఉద్యాపన చేసికొమ్మని బ్రహ్మ చెప్పగా సరే అని ఆమె వచ్చుచు దారిలో పెనములమీద నీళ్ళుచల్లగా పెనముల మంట చల్లారెను. తరువాతపోయి ఒక్కిన చీరదీసి కట్టుకొనగా చీరెలు తగులబడుటమానెను. మల్లెపూవుల కోసి కొప్పున పెట్టుకొనగా అందఱు కోసుకో మొదలుపెట్టిరి తరువాత కొంతదూరము సాగి అవ్వల దూడకు మేతవేసి నీళ్లు పెట్టగా నవి వానియంతట యవి తినసాగెను. తరువాత బయలుదేరి తీడిమామిడి చెట్టు పండు కోసికొని తినగా నందఱు తిన మొదలుపెట్టిరి. తరువాత పోవుచూ బ్రాహ్మణునియింటికివచ్చి పరమాన్నమువండించి "రామరామ" అని చెప్పి తినుమనగా నాతడు తినుటకారంభించెను, తరువాత యీమె శివరాత్రినాడు మనికార్తీకదీపముల నోముపట్టి మూడుమూర్ల అరువది వత్తులు పిడ్డెడు నూనెపోసి వెలుగించగా వత్తి ఫలమకండె ఒలికిన ఫలము యొక్కవనమక యిల్లంతా సిరిసంపదలతో నిండింది. అప్పుడంతా ఆశ్చర్య పడి ఏమి నోము నోచినావమ్మా అని అడుగగా ఆమె మనికార్తీక దీపముల నోము పట్టెను. అప్పటినుండి అనోము అందఱుపట్టి ఉద్యాపనము చేసుకొనిరి.

ఉద్యాపనము.—అయిదు మూళ్ళ అంగవస్త్రములో అరుశేర్ల బియ్యము మండపములోసి దక్షిణ తాంబూలం బెట్టి, వెండి ప్రమిదలో పయిడివత్తివేసి దీపము వెలిగించి ఒక బ్రాహ్మణునకు వాయన మియ్యవలెను. భక్తిలోపమయినా ఫలములోపముకారాదు. ప్రీతిలోపమయినా కథలోపముకారాదు.

## 9 కార్తీక దీపాలనోము కథ.

ఓవూళ్లో ఒక చాకలిది ఉన్నది దానికి నలుగురు కొడుకులున్నారు వారి నలుగురికి పెండ్లిండ్లు అయినవి. కోడండ్రు యింటికి కాపురానికి వచ్చినాగు ఆచాకలిది మొదటి ముగ్గురు కోడండ్రితో ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని ఉదయముకాకుండా స్నానము చేసి దీపాలు పెట్టుకునేవారు. వెల్లాళ్ళు అలా పెట్టుకున్నారు. కార్తీక బహుళ అమా

వాస్యనాడు నాలుగోకోడలును బిలిచి యిల్లు జాగ్రత మేము స్నానానికి వెళ్ళి వస్తామని చెప్పి వెళ్లేరు. ఈ నాలుగోకోడలు లేచి చల్ల చేసిన కవ్వమున అంటివున్న వెన్నతీసి ప్రత్తిచెట్టుకింద పడియున్న ఒక కాడ తీసి నూతివద్ద స్నానముచేసి యీకాడ కావెన్నరాచి దీపం వెలిగించి దేవుడికి దణ్ణంబెట్టింది. అప్పుడు భగవంతుడు దాని నిష్కళంకపు భక్తికిమెచ్చి ఆకాశముమీదనుండి విమానము పంపేడు. పోలి అదియెక్కి వెళ్లుతుంటే వూళ్ళో వాళ్ళంతా చాకలి పోలి స్వర్గానికి పోతున్నదని అనిరి. అత్త విని మా పోలిఏమిటి స్వర్గానికి పోవడమేమిటని దాని ముగ్గురు కోడండ్రు అది చూచి దాని కాళ్ళు పట్టుకొని విమానముమీదికి యెక్కబోతే శ్రీ విష్ణుమూర్తి వచ్చి మీకు వీలులేదు. అది భక్తితో వెలిగించింది. మీరు ఆడంబరముకోసం చేసేరు. దానికి బొందితో కైలాసం యిచ్చాను. మీరింకా భక్తి గుదిరేవరకు యీకథజెప్పి అక్షంతలు వేసికొండని చెప్పి అంతర్ధానమొందిరి. కానీ విష్ణుదర్శనమైనా అయిందని యీకథచెప్పుకుంటూ అంతా కార్తీక దీపాలు పెట్టుకునేవారు దీనికి ఉద్యాపన లేదు.

## 10. పోలాల అమావాస్య నోముకథ.

ఒకవూళ్ళో ఒక బ్రాహ్మణునకు ఏడుగురు కొడుకులువున్నారు. ఆ ఏడుగురికి పెండ్లిండ్లై వారి భార్యలు కాపురానికివచ్చిరి. ఆ ఏడుగురు కోడండ్రు పోలాల అమావాస్యరాగా నోము నోచుకుందామని ప్రయత్నం జేసిరి అయితే యేడవకోడలుకు పుట్టిన చంటిపిల్ల ఆరోజునే చనిపోయింది అందుకని అంతా ఆయేటికి మానివేశేరు తిరువాత మళ్ళీ పోలాల అమావాస్యవచ్చింది ఆనాడు నోము నోచుకుందామని అనుకుంటే మళ్ళీ కడసారి కోడలు పిల్ల చచ్చిపోయినది ఈసారి సాగలేదు ఇట్లే ఆరేళ్లు కడసారి కోడలు చంటిపిల్ల చచ్చిపోవుటచేత ఆనోము సాగిందికాదు ఏడో యేడు వచ్చింది సరే యత్నించేదాము. మళ్ళీ చావువస్తుంది మానివేతామని తిట్టుకొంటూ కోడళ్ళంతా మళ్లు గట్టుకొనిరి. ఏడోకోడలుపిల్ల చచ్చిపోయింది పోయినాసరే నామూలాన అందరినోములు పాడయి పోతున్నవని చచ్చిపోయినపిల్లలు గదిలోపెట్టి తాళమువేసి అందఱు కోడండ్రతోపాటు యీ కోడలుకూడా వెళ్ళి పనిపాటలలో తోటివారికి సాయంచేసి ఒకరింట్లో తలంటి నీళ్ళుపోసుకొని ఒకరింట్లో యింతపిండి బెల్లము వడపప్పు తెచ్చుకొని తానుకూడా నోము నోచుకొనెను. తరువాత రాత్రిదాకా వుండి చీకటిపడ్డ తరువాత యింటికివచ్చి చచ్చిపోయిన పిల్లను బుజానవేసికొని

పోలేరమ్మగుడివద్దకు వెళ్ళి ఆ పిల్ల నక్కడవుంచి యేడ్చుచుండెను. అమ్మ వారప్పుడు సంచారముచేసి గుళ్ళోకివస్తూ యీ చిన్నదానినిజూచి ఏం అలా యేడుస్తున్నావు. అని యడిగెను. అంటే ఆచిన్నది యివాళ యేడుస్తున్నానా పదేండ్లనుంచి యిలాపిల్లపుట్టా చావా పుట్టాచావా అందరిని యీ అమ్మవారికే అర్పిస్తున్నాను ఈయేడుకూడా నావ్రతఫలం అంతే అయింది అయితే పాపంనావల్ల నాతోడికోడండ్ర నోము పాడవుతుందని పగలల్లాదాచి యిప్పుడే చచ్చిన బిడ్డను తెచ్చేను అని బావురని యేడువగా పోలేరమ్మ కరుణించి నీపిల్లలకు మరేమీ భయములేదు నేనందరిని తీసికొనివచ్చి యిస్తాను అక్షతలు ఆ చిన్నదానిచేతిలోపెట్టి యీఅక్షింతలు నీపిల్లలను పెట్టినచోట చల్లి పిలు పిలిస్తే వారే వస్తారనగానే ఆవిడె ఆ ప్రకారమే అక్షింతలుచల్లి పిలిచింది. అంతట నవ్వుకొంటూ యేడుగురు వచ్చేరు ఆమెకు పట్టరాని సంతోషమువచ్చి వారందరినీ వెంటబెట్టుకొని యింటికి వెళ్ళింది. ఈ యాశ్చర్యమేమిటి అని యింటిలోనివారు బైటివారు విరగబడ్డారు చూడడానికి అప్పుడు ఆవిడె వారందరితో పోలేరమ్మ మహాత్మ్యము తాను చేసినపని చెప్పింది. అనుట్లు నప్పటినుంచి అందరు అమావాస్యనాడు పోలేరమ్మకు పెట్టుకొని నోము నోచుకొని సంతానవంతులగుచున్నారు. దీనికి ఉద్యాపనములేదు.

## 11 నిత్యశృంగారము నోముకథ.

ఒకవూళ్ళో రాజుభార్య మంత్రిభార్య యిద్దరు నిత్యశృంగారము నోము పట్టేరు మంత్రిభార్య అందరికీ బొట్టుపెట్టి తాంబూలము చేతికిచ్చేది ఇలావుండగా మంత్రిభార్యకు సకలైశ్వర్యములు వచ్చినవి రాజభార్యకు దరిద్రము సంభవించింది. ఆమెకు చాలా విచారముకలిగి ఓనాడు దేవుడుగుళ్ళోకిపోయి అక్కడ దుఃఖించుచున్నది. పార్వతీపరమేశ్వరులు ఆచాయల తిరుగుచున్నారు వారువృద్ధదంపతులవలె కానుపించి ఏమమ్మా ఎందుకేడుస్తావు అని అడిగెరు. అర్చేవారా, తీర్చేవారా మీకెందుకు నా గొడవన్నది అంటేవారు అర్చేవారము మేమే, తీర్చేవారము మేము అక్కరవస్తే యేమేలైనా చేసేవారమూ మేమే పరవాలేదు చెప్పమంటే మంత్రిభార్యానేను నోముపట్టేము. ఆమెకు భాగ్యమువచ్చించి నాకు దరిద్రమువచ్చింది. అంటేవారన్నారుగదా నీవు నిర్లక్ష్యముగా నౌకరులచేత బొట్టుపెట్టించి తాంబూలమిప్పించావు. మంత్రిభార్య భక్తిశ్రద్ధలతో తానే స్వయముగా యిచ్చింది అందుకని ఇలాజరిగింది. నీవుమళ్లీ ఈనోముపట్టి స్వయ

ము గానీవే యేటికేడాది కధచెప్పుకొని అక్షింతలువేసుకొని శ్రద్ధగా నోము నోస్తే కావలసినంతభాగ్యము వస్తుందిఅని చెప్పి వారు అంతర్ధానమైనది. ఈ వెడయానోము శ్రద్ధగా జరిపి అక్షింతలువేసుకొని రోజూ ఒక ముత్తయిదు నకు బొట్టుపెట్టి అద్దము దువ్వెన చూపించి యిలా యేటికేడాది చేసి భాగ్య వంతురాలయింది.

ఉద్యాపనము.—ఒక ముత్తయిదువుకు తలంటినీళ్ళుపోసి చీరరవిక యిచ్చి భోజనంబెట్టి బొట్టుపెట్టి అద్దము, దువ్వెన కాటుకకాయ, కుంకంభరిణె, సవరము గంధపుచెక్కయిచ్చి ఉద్యాపనం చేసికోవలెను.

## 12 చద్దికూటి మంగళవారముల నోముకధ.

ఒక రాజుకూతురు బ్రాహ్మణునికూతురు చద్దికూటిమంగళవారముల నోముపట్టేరు రాజుకూతురు రోజూ ఎప్పటికప్పుడే నోము నోచుకుందామనుచు చివరకు అలక్ష్యంగా ఉల్లంఘనచేసింది బ్రాహ్మణునికూతురు క్రిందటిరాత్రి వండివుంచుకొనిన అన్నము కూర చారు మూతపెట్టుకొని ప్రొద్దున్నే లేచి నంటిమీదస్నానంచేసి, అదిపెట్టుకొనితిని ముత్తయిదుకుపెట్టి యిలా వారంవారం జరిపింది. అలా యేటికేడాది అయినతరువాత ఉద్యాపనంచేసికొంది. సకలైశ్వర్యాలువచ్చినవి. రాజుకూతురికి అష్టకష్టాలు సకల దరిద్రములువచ్చి చుట్టుకొన్నవి. ఆవెత తీరనిదుఃఖముతో నుండగా పార్వతీపరమేశ్వరులు విప్రవేషముల కనుపించి యేమమ్మా యిలావున్నావు అంటే దరిద్రంతో బాధపడలేక యేడ్చుచున్నాననగా వారు దయవచ్చి అన్నారు కదా నీవు చద్దికూటి మంగళవారాలనోము పట్టి ఉల్లంఘనచేసేవు అందుకని యిలాగైయింది. ఇప్పుడు మళ్ళీ ఆనోముపట్టి యధావిధిగా ఉద్యాపనం చేసుకొంటే సకలైశ్వర్యములు వచ్చును అని చెప్పి అంతర్ధానమైనారు అప్పుడావిడె అతిభక్తితో నోముపట్టియేడాది యధావిధిగా నోచుకునేసరికి దరిద్రంపోయి సకలైశ్వర్యములు వచ్చినవి

ఉద్యాపనము — 13 ముత్తయిదువులకు తలంటి నీళ్ళుపోసి రాత్రి వండియుంచినఅన్నము కూరలు ప్రొద్దున్నే భోజనముపెట్టి 13 మూకుళ్ళలో యీచద్దిపెట్టి 13 వాయనములు దక్షిణతాంబూలం యియ్యవలెను భక్తి తప్పినను ఫలము తప్పదు వ్రతలోపమైనను కధలోపము కారాదు.

## 13 పండుతాంబూలాల నోముకధ.

రాజుభార్య మంత్రిభార్య పండుతాంబూలం నోముపట్టేరు. మంత్రిభార్య ఎనాటితాంబూలము పండు అనాడు యిస్తూవుండేది. రాజుభార్య

ధనవంతురాలు గనుక అన్నీ యెప్పుడో ఒకమాటే యిస్తానని నిర్లక్ష్యము చేత ఉల్లంఘన చేసింది. మంత్రి భార్యకు చక్కని సంతానము కలిగింది. రాజు భార్యకు సంతానము కలుగలేదు. ఈ విచారముతో ఆవిడ అడవికి వెళ్ళి అక్కడ భగవంతుని ధ్యానిస్తు కూర్చుండగా ఆదారిని వెళ్ళుతూ పార్వతీ పరమేశ్వరులు వీరా చిన్నదానిని చూచి యెందుకిలావు న్నావు అనిఅడిగితే మంత్రిభార్యకు సంతానంగలిగింది నాకుగలిగిందికాదు. అని అన్నది. అంటేవారన్నారుగదా మంత్రిభార్యానీవు పండుతాంబూలం నోముపట్టి తిరిగిదా. ఆవిడే యథావిధిగా నోమునోచుకొని ఉద్యాపనచేసింది నీవు నిర్లక్ష్యముచేత నోము నోచలేదు అందుకని యిలా అయింది. నీవిప్ప డింటికి వెళ్ళి సలక్షణముగా నోము నోచి ఉద్యాపన చేసితే అన్నీ కలుగు తవి అని చెప్పి వారు అంతర్ధాన మైనారు. అప్పుడా రాచకూతురు నోము పట్టి ఉద్యాపన చేసుకొని సంతాన వంతురాలైంది.

ఉద్యాపన — ఒక ముత్తయిదువునకు తలంటి నీళ్లుపోసి పిండివంట లతో భోజనముపెట్టి చీర రవికయిచ్చి పాతికపండ్లకు తక్కువలేకుండా ఒక పళ్ళెములో ఆ పండ్లుబెట్టి ఆ ముత్తయిదువునకు దక్షిణ తాంబూలము తో వాయన మియ్యవలెను. ప్రతిలోభమైన కథ లోపంకాదు భక్తితప్పినా ఫలం తప్పదు.

## 14 కన్నెతులసినోము కథ.

ఒకాయనకు ప్రథమ భార్యవలన ఒక కూతురుండెను. ఆమె పోతే తిరిగీ రెండవ చిన్నదానిని వివాహము చేసుకొనెను. సవతి వచ్చినప్పటి నుండి ఆపిల్లకు సవతిపోరెక్కువయై పడలేక చివరకా అమ్మాయి తాతగా రింటికి వెళ్ళి సౌఖ్యపడుచుండెను. ఇలావుండగా ఆసవతి మగనితో మన అమ్మాయిని తీసుకొనిరండని పోరుటకు మొదలుపెట్టితే ఆయన అన్నాడు గదా అది ఉన్నన్నాళ్లు తల దువ్వక నీళ్ళు పోయక నానాశ్రమలుపెట్టేవు అది యిప్పుడు సౌఖ్యపడుతూవున్నది. నేను యేమొగము పెట్టుకొని వెళ్ళి అడగను. అడిగినా పంపరు. కావలిస్తే నీవే వెళ్ళి తీసుకురమ్మంటే సరే అని ఆమె వెళ్ళి తాతగారితో "అమ్మాయిని పంపండి" అంటే ఆయన మా మనుమరాలికి పెండ్లి యీడు వచ్చింది. పెండ్లి చేయవలెనంటే మా పిల్లకు మేమే పెండ్లిచేసుకుంటాము పంపమంటే పంపేరు. ఆపిల్ల వచ్చిన తరువాత యీవిడ తన చంటిపిల్లను యీపిల్ల చేతికిచ్చి ఒక అరిసె ముక్క పెట్టి తాను వెళ్ళి గొడ్లో తులసెమ్మకు పూజ చేసుకొనేది ఈ పిల్ల ఆవిడ

రాగానే తాను దొడ్లోకి వెళ్ళి తులసి పూజచేసికొని యీ అరిసె ముక్క నైవే
ద్యంపెట్టి వస్తూవుండేది ఇలావుండగా తులసమ్మకు దయవచ్చి అన్నదిగదా
నీవు బాల్యంలో కన్నె తులసినోము పట్టి ఉల్లంఘన చేసేవు. అందుకని మీ
అమ్మ చనిపోయింది అందుకనే యీ చిక్కులు కలిగినవి ఇప్పుడు యథా
క్రమంగా నోమనో అనగా ఆ పిల్ల యేటి కేడాది భక్తి శ్రద్ధలతో నోము
నోచుకోగా సవతి తల్లికికూడా తల్లికుండే ప్రేమకలిగింది.

ఉద్యాపనము.—ఒక కన్నెపిల్లను పిలుచుకొని వచ్చి తలంటి నీళ్లు
పోసి పరికిణీ, రవికలగుడ్డ యిచ్చి 13 బోడాలు అరిసెలు వాయనము
యియ్యవలెను ఇంకో 13 బోడాలు నైవేద్యం పెట్టవలెను. వ్రతలోపమై
నను కథ లోపంకారాదు భక్తి తప్పరాదు.

## 15 కాటుకగౌరి నోముకథ.

ఒక వూళ్లో ఒకచోట ఇరుగుగ్రుడ్డి పొరుగు గ్రుడ్డి ఇంట్లో యిల్లాలు
గ్రుడ్డి యింటి యజమాని గ్రుడ్డి యిలా వుండగా యేమాత్రమైనా కంతుడా యని
ఆ యిల్లాలు యేడుస్తుండగా పార్వతీ పరమేశ్వరులు ఆ దారిని పోవుచూ
యీ గోడు ఆలకించి అవిడే నడుగగా ఏమిచెప్పను, ఇరుగు పొరుగుయింట్లో
ఆయన, నేను అంతా గ్రుడ్డి అందుకని యేడుస్తున్నా ననగా ఆయన నవ్వి
ఫరవాలేదు నీవు కాటుకగౌరినోము పట్టి ఉల్లంఘన చేసేవు అందుకని యిలా
అయింది కాబట్టి యిప్పుడు మళ్ళీ ఆ నోము పట్టి ఏటి కేడాది భక్తితో
ప్రతిదినము ఒక ముత్తయిదువకు కాటుక యిస్తివా నీ చిక్కులన్ని పోతవని
చెప్పి అంతర్ధానమైనారు. భక్తిశ్రద్ధలతో అలాగే చేయగా నేత్రములు వచ్చి
అంతా సుఖముగా నున్నారు.

ఉద్యాపనము.—నోముపట్టి యేడాది కథచెప్పుకొని అక్షింతలు
వేసుకొన్నతరువాత ఒక ముత్తయిదువను పిలిచి తలంటి నీళ్లుపోసి చీర
రవికె యిచ్చి ఒక కాటుక భరిణ యిచ్చి దక్షిణ తాంబూలము యియ్యవలెను.
కథ లోపము కారాదు వ్రతలోపంకారాదు.

## 16 బొమ్మల నోముకథ.

ఇదే సావిత్రి గౌరిదేవి కథ యని వాడుక.

సంక్రాంతి పండుగ కనుము వెళ్ళిన తరువాత ముక్కనుమునాడు
పార్వతీదేవి, పరమశివుణ్ణి అడిగిందిగదా. నాథా! భూలోకంమీద స్త్రీలు
అష్టయిశ్వర్యములు పొందేటటువంటి నోము ఏదైనా ఉంటే చెప్పండి "
అనెను. శివుడన్నాడుగదా సరే యీ పండుగకు పేరంటాళ్ళంతా జేరియుం

టూరుగమక సకే దివ్యమైన నోము చెపుతాను వినుమని చెప్పుచున్నాడు మూడుదోస్లపేడ పోగచేసుకొని మూడు కదుళ్ళనులుపోసుకొని పదిమంది పేరంటాండ్రను కూర్చుకొని యీవ్రతముచెయ్యాలి సావిత్రీగారిదేవిని నిలిపి పుట్టినరోజున పులగం నైవేద్యంపెట్టి భూచక్రం గిలింది. రెండవనాడు చలిమిడి నైవేద్యంపెట్టి చల్లని చంద్రుడు తోడబుట్టింది. మూడోనాడు మట్టెలు నైవేద్యంపెట్టి ముద్దులగురియుచూ పెరిగింది. నాలుగోరోజున నాన బియ్యం నైవేద్యంపెట్టి నాగస్వామినియైయుంది. ఐదవరోజున పరమాన్నం నైవేద్యంబెట్టి గౌరి బద్దుడుతోడ బుట్టింది ఏడోనాడు అట్లు నైవేద్యంబెట్టి పట్టెకత్తెయయింది. ఎనిదోదినమున బూరెలు నైవేద్యంబెట్టి భూమిఅంతా ఏలింది. తొమ్మిదవనాడు పెరుగుపేన నెయ్యి నైవేద్యంబెట్టి పతాళంయేలింది. కథలోపము కారాదు. వ్రతలోపము కారాదు. భక్తితప్పినా ఫలంతప్పదు.

ఉద్యాపనము.—9చేటలు తెచ్చి ప్రతిచేటలోను 9 బిళ్ళకుడుములు 9 లక్కతోళ్లు, 9 నల్లపూసల కోళ్లు, 9 అటలు, 9 పోకచెక్కలు, పెట్టి 9 ముత్తైయిదుల కియ్యవలెను. ఈవాయనాలిచ్చి నమస్కరించి పంపవలెను.

## 17 బచ్చలగౌరి నోముకథ.

ఒక వూళ్ళో బ్రాహ్మణచిన్నది కాపురంజేస్తువుంటే ఆచిన్నదానిఅన్నగారు చూడడానికి వచ్చేడట. అన్నాచెల్లెలు యిష్టాగోష్ఠి మాట్లాడుతున్నారు, ఆచిన్నది వంటచేస్తూ పులుసులోకి కరివేపాకుకావాలి అన్నయ్యా దొడ్లోకరివేపచెట్టున్నది కోసితీసుకొనిరా అంటే అన్నగారు దొడ్లోకివెళ్ళి కరివేపఆకు కోస్తుండగా పెద్దపాము కరచింది క్రిందపడిపోయినాడు. ఈచిన్నది పులుసుకాగింది ఇంకా అన్నయ్యరాలేదని పిలిచిపిలిచి విసిగి తుదకు తానేలేచి దొడ్లోకివచ్చేసరికి, అన్నపడియున్నాడు. ఇంకేముంది. ఏడుస్తూ కూర్చుంది. ఆవట్టున చట్టపట్టాలేవారంతా పోగయినారు. అప్పుడోముసలమ్మవచ్చి పూలు, కాయలతోనున్న బచ్చలచెట్టు తీసుకొనివచ్చి దీనికిపూజచేయి, నీఅన్నలేచివస్తాడనిచెప్పి దగ్గరవుండి చేయించింది, తరువాత అన్ననుపిలిస్తే లేచివచ్చేడు. ఆముసలిఅవిడ చూస్తేలేదు ఆవిడే పార్వతి సీభక్తికిమెచ్చి ప్రత్యక్షమైనదని అంతా అన్నారు. అప్పటినుండి కడుపుచలువ తోడుచలువ, పుట్టింటచలువ, అయిదవతనము చలువ అని బచ్చలగౌరిపూజ అందరు చేస్తున్నారు. ఈపూజచేసేవాండ్ల అయిదోతనం కలుగుతుంది.

ఉద్యాపనము.—ఏడాదిపాటు బచ్చలకూర తినకుండా వారంవారం

పూజచేస్తూ వెండిబచ్చలకాయ, బంగరపు బచ్చలకాయ చేయించి ఒకము
త్తయిదువను పిలిచి తలంటినీళ్ళుపోసి భోజనంపెట్టి బచ్చలికిపూజచేసి వెండిబ
చ్చలికాయ చీర రవికెయిచ్చి తాంబూలం దక్షిణయిచ్చి గౌరీదేవిపేరుచెప్పి
ముత్తయిదువుకు వాయన మియ్యవలెను.

## 18 అట్లమీద ఆనపువ్వునోముకధ.

ఒకబ్రాహ్మణచిన్నది అట్లమీద ఆనపువ్వు నోముపట్టి ఆచరితముచే
యకుండా ఉల్లంఘన చేసింది. అందుచే విధవయై పుట్టినపిల్లలుపోయినారు.
ఈదుఃఖము భరించలేక యింకనేనెందుకీపుట్టుక యీ సంసారమని విరక్తిచేత
నడవులపాలైపోయి అక్కడ దుఃఖించుచుండగా పార్వతీ పరమేశ్వరులు
వృద్ధదంపతులవలెవచ్చి "ఏమమ్మా ఎందుకు దుఃఖించుచున్నావని అడు
గగా నాకర్మమువాడి మీదానని మీరుపొందవని వదలించితే నీవెకర్మమిం
కయు గడువలేదని వారు వెడలిరి. ఆమె ఆప్రకారము రోదనముతోనే
కాలముగడుపుచున్నది. మళ్లీపార్వతీ పరమేశ్వరులు సంచారమునకు వచ్చి
నారు. తిరిగి ఆమెనువెనుకటి ప్రకారమే అడుగగా నాగోలి మీకెందుకు
పొమ్మన్నది. ఇదికాయిమెను కర్మపరిపాకముకాలేదు మనకెందుకనివారు
వెడలిపోయినారు. ఆవిడె అలాగేయేడుస్తున్నది. అప్పుడు పార్వతీ పరమే
శ్వరులు వృద్ధదంపతులవలె వచ్చినారు. ఈసారి ఏమమ్మా ఎందుకిలా దుః
ఖించుచున్నావని యడుగగా" ఏడుపుగాక నాకేముంది నాయనా తలమీ
దగొడుగు తర్లిపోయింది. పుట్టినబిడ్డలు బుగ్గయిపోయినారు. అంటే "చిన్న
దానా నీవుమునుపు అట్లమీద ఆనపువ్వునోముపట్టి ఉల్లంఘన చేసినావు
అందుకని యిలా అయింది. ఇప్పుడింటికివెళ్ళి యీ నోములు యధావిధిగాపట్టి
కధచెప్పి అక్షింతలు వేసికొని ఏటికేడాది నోము నోచిన తర్వాత ఉద్యాప
నచేసుకొమ్మని చెప్పి అదృశ్యులైనారు. ఆమెఆప్రకారము చేసి సుఖపడ్డది.

ఉద్యాపనము — ఒకముత్తయిదువును రవికలగుడ్డ దక్షిణతాంబూ
లం యిచ్చి 12 అట్లు, పూత కాపుతో నున్న అనపకొమ్మతెచ్చి పేరునెయ్యి
బెల్లముతో పెట్టి ఆముత్తయిదువకు వాయనమియ్యవలెను. కధలోపమైనా
వ్రతలోపముకారాదు శక్తితప్పినా భక్తితప్పరాదు. సకలసౌఖ్యములు
కలుగును.

## 19 కార్తికచలిమిడి నోముకధ.

ఒకపూర్వరాజకూతురు మంత్రికూతురు కార్తీకపూర్ణిమనాడు
కార్తీకచలిమిడినోముపట్టేరు. మంత్రికూతురు నోముపట్టినయేడు వాయి

నము నీలాటిరేవున యిచ్చినది. నీలాటిరేవున వాయన మిచ్చినందుకై ఆవెడకు పరమేశ్వరుడు నిధినిక్షేపమనుగ్రహించేడు. రెండో సంవత్సరము వాయనము చెట్టుకొమ్మక్రింద యిచ్చినది. కొమ్మకింద యిచ్చినందుకు కొమ్మరేటునుగులవంటి కొడుకులామెకు పరమేశ్వరుడనుగ్రహించేడు. మూడవయేడు వాయనము శివాలయములో యిచ్చినది. శివాలయములో నిచ్చినందుకు శివమైన ఐశ్వర్యము పరమేశ్వరుడనుగ్రహించేడు. ఈలా యీచిన్నది నోము నోయగా రాజకూతురు గర్విష్టినోముపట్టినది, నోచకుండా ఉల్లంఘించింది. అందువలన ఆమె పెనిమిటికి ఆరోగ్యము చెడ్డది. ఎప్పుడుతీసుకుంటూ నుండేవాడు. మంత్రికూతురు అష్టయిశ్వర్యములు అనుభవిస్తూ ఉంటేనమున్నా తానీవిధముగా దుఃఖము లనుభవిస్తూ ఉండవమున్నా సహించలేక అడవికి వెళ్ళి అక్కడ యేడుస్తుండగా పార్వతీ పరమేశ్వరులు వనసంచారము చేయుచు ఈవెడ యేడుపువిని జాలినొంది పురాణదంపతులవలె అగుపించి ఏమమ్మా ఎందుకిలా దుఃఖిస్తావనగా ఆవెడ నాకర్మమిలాఉన్నది పెద్దలు మీకుమాత్రము తెలిగాదా అంటే అప్పుడు పార్వతీదేవి అన్నదిగదా ఈపిల్ల కార్తీకచలిమిడినోముపట్టి అది నెరవేర్చకుండా ఉల్లంఘన చేసింది. అందుకని యిలాఅయింది. మంత్రికూతురు పట్టి చక్కగా నెరవేర్చింది. అందుకని ఆలా వుందని చెప్పి "అమ్మాయి నీవు యింటికివెళ్ళి కార్తీకచలిమిడినోము పట్టి యధావిధిగా నుద్యాపన చేసుకొంటివి. నీవు సకలైశ్వర్యములును కలుగుతవి అనిచెప్పి వారు అంతర్ధానముయినది. ఆప్రకారముగా ఆమెవచ్చి ఆనోము నోచుకొని సకలైశ్వర్యములతో తులదూగుచుండెను. అప్పుడామె పట్టిననోమూ లోకమంతా పట్టేరు భక్తితప్పినా ఫలంతప్పదు.

ఉద్యాపనము.—మొదటిసంవత్సరము 5 మానికల బియ్యము 2 వ యేడు పదిమానికల బియ్యము చలిమిడి ముద్దలుచేసి నోముపట్టినయేడు 5 గురుముత్తయిదువులకు మరుచటియేడు 10 పదిమంది ముత్తయివులకు వాయనాలీయవలెను.

## 20 గుమ్మడిగౌరి నోముకథ.

ఒకవూళ్లో ఒక జ్యోతిషపండితునకు ఒక్కడేకొడుకు ఆకొడుకును అతిగారాబారాలా పెంచుచుండెను గాని అతడికి పెండ్లి అయినతరువాత గండమున్నదని ఆయనకు తెలుసునుగనుక లోలోన కుమిలిపోతుండేవారు. ఇలావుండగా ఒకరుపిల్ల నిస్తామని యింటికి వచ్చినారు. ఈయన అర్థాంగీకారముగా నున్నప్పటి వారుపిల్లనిచ్చి పెండ్లిచేసేను పెండ్లాము కాపురానికి

